# వరాహపురాణము

(నంది మల్లయ - ఘంట సింగయ)

సంపాదకుడు :

కళాప్రపూర్ణ

డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యులు




ప్రచురణ :

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవన్, సైఫాబాద్, హైదరాబాద్-500 004.

# తొలి పలుకు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగుభాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి, ప్రకటింపవలెనని నిశ్చయించినది. చాలకాలము నుండి ప్రాచీనాంధ్ర గ్రంథములు ముద్రితమయ్యును సాహితీ పరులకు లభించుట లేదు.

అట్టిగ్రంథములలో నంది మల్లయ - ఘంట సింగయ కవులు రచించిన ప్రబోధ చంద్రోదయమును, వరాహపురాణమును సాహిత్యఅకాడమీ పునర్ముద్రించుటకు తీర్మానించినది. ప్రబోధచంద్రోదయ మిదివరకే అకాడమీ ముద్రించినది. ప్రస్తుతము వరాహ పురాణమును గూడ ఆంధ్ర మహాజనులకు అందించుచున్నది.

ఈ గ్రంథమునకు సంపాదకత్వము వహించిన కళాప్రపూర్ణ డాక్టర్ పుట్టపర్తి నారాయణాచార్యుల వారికి అకాడమీ పక్షాన ధన్యవాదములు.

హైదరాబాద్,
26-1-78.

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# వరాహ పురాణము

## విషయ సూచిక

| విషయము | పుట సంఖ్య |
|---|---|

( ప్రథమాశ్వాసము )


| | |
|---|---|
| అవతారిక | 1 |
| కథా ప్రారంభము | 13 |
| ఆదిసృష్టి విధము | 14 |
| పురాణ లక్షణము | |
| నారాయణ శబ్దనిర్వచనము | 17 |
| సర్గముల వివరణ | 19 |
| నవసర్గములు | |
| నవబ్రహ్మలు | 20 |
| యుగచతుష్టయ స్థితి | 21 |
| సావిత్రీ నారదుల సంవాదము | 24 |
| నారద చరిత్రము | 26 |
| అవతారములు | 30 |
| అశ్వశిరుని వృత్తాంతము | 31 |

సుద్యుమ్న కుమారుని జననము 83
దుర్జయ నృపాలుని దండయాత్ర 85
దుర్జయుని అమరావతి దండయాత్ర 89
వసంత ఋతువు 97
సుకేశి మిత్రకేశుల పుష్పాపచయము 100
కాసారకేళి 104
మన్మథపూజ 107
సుకేశి దుర్జయుల సమావేశము 109
మిత్రకేశి వర్ణనము 110

( చతుర్థాశ్వాసము )

చంద్రోదయము 116
మన్మథోపాలంబనము 119
చంద్రోపాలంబనము 120
శిశిరోపచారములు 122
దుర్జయ నృపాల వివాహము 129
దుర్జయుడు వేటకు వెడలుట 132
దుర్జయుడు గౌరముఖుని ఆశ్రయమునకు చేరుట 137
దుర్జయునికి విందు బెట్టుటకు
గౌరముఖుడు శ్రీహరి బ్రార్థించుట 141
శ్రీహరి గౌరముఖునికి మణి యిచ్చుట 143
గౌరముఖుని విందు 148
చీకటి 151

( ద్వితీయాశ్వాసము )


| | |
|---|---|
| మోక్ష సంపద కర్మమున, విజ్ఞానమున దేనియందు కలదను దానికి ప్రత్యుత్తరము | 37 |
| పుండరీకాక్షపార స్తవము | 45 |
| వసునృపాలునికి బ్రహ్మహత్య వచ్చిన విధము | 46 |
| రైభ్యుని తీర్థయాత్ర | 53 |
| రైభ్యునికి సనత్కుమారుండు ప్రత్యక్షమగుట | 55 |
| విశాలనరేశ్వరుని చరిత్ర | 56 |
| రైభ్యునకు గదాధరుడు ప్రత్యక్షమగుట | 59 |
| అర్జునకి సౌందర్యవర్ణనము | 61 |
| అర్జునకి ప్రసన్నుల వివాహము | 62 |
| అర్జునకి అత్తమామలకు పరిచర్య చేయుట | 64 |
| అత్తగారు గొట్టుటచే అర్జునకి పుట్టినింటి కేగుట | 66 |
| అర్జునకిని వెంటబెట్టుకొని ధర్మవ్యాధుడు వియ్యంకు నింటికి వచ్చుట | 67 |
| మతంగ ధర్మవ్యాధుల సంభాషణ | 69 |
| విష్ణునామ స్తవము | 70 |
| ప్రణవ స్వరూప నిర్వచనము | 72 |
| సుప్రతీకరాజు చరిత్ర | 76 |


( తృతీయాశ్వాసము )


| | |
|---|---|
| సుప్రతీకుని భార్య విద్యుత్ప్రభాదేవి గర్భధారణ | 80 |
| దుర్జయాఖ్యుని జననము | 82 |

గౌరీ కల్యాణము - గౌరి తదియ 207
వినాయక చవితి 210
నాగ పంచమి 215
షణ్ముక షష్ఠి 217
భాస్కర సప్తమి 224
మాతృకాష్టమి 225
నంద నవమి 229

( సప్తమాశ్వాసము )

దిశా దశమి 235
ధనదైకాదశి
విష్ణు ద్వాదశి 237
ధర్మ త్రయోదశి 239
రుద్ర చతుర్దశి 244
సోమ పౌర్ణమి 247
రత్నోద్భవుల చరిత్ర 252

( అష్టమాశ్వాసము )

సకల వర్ణ మోక్షణ నిరూపణము 266
మార్గశిర శుద్ధ దశమి వ్రతము 267
పుష్య శుద్ధ దశమి 269
మాఘ శుద్ధ దశమి 270
ఫాల్గుణ శుద్ధ దశమి (నరసింహ వ్రతము) 274

తారకలు 151
చంద్రోదయము 152
రత్నాకర వర్ణన 154
సూర్యోదయము 157

( పంచమాశ్వాసము )

గౌరముఖుని కడనున్న మణిని
సంగ్రహించుటకు దుర్జయు ప్రయత్నము 161
మంత్రి విరోచనుని బంపుట 162
నీలుని బంపుట 164
మార్కండేయ గౌరముఖుల సంవాదము 174
శ్రాద్ధ యోగ్యాయోగ్యులు 176
విద్యుత్ సువిద్యుత్తుల చరిత్ర 178
సుప్రభు చరిత్ర 180
విష్ణుని విభవాతి ప్రసంగము 185
ఆశ్వినేయుల వృత్తాంతము 186
వాక్కు గౌరియైన విధము 189

( షష్ఠాశ్వాసము )

గౌరి తపస్సు 199
గౌరీ కపట శివుల సమావేశము 202
శివుడు ప్రత్యక్షమగుట 205

( దశమాశ్వాసము )


| | |
|---|---|
| హరి సమారాధన విధానము | 337 |
| గౌతముని చరిత్ర | 344 |
| నమశ్శివాయ పంచాక్షరి సీసము | 351 |
| ఏకాక్షర కందము | 359 |
| భూగోళ ప్రపంచము | 361 |
| భారతులు | 363 |
| తీర్థ, గిరి, వన, నదీ వారధి వర్ణనము | 364 |
| పర్వతములు | 368 |
| కైలాసాచల రగడ | 377 |
| భారతవర్ష వర్ణనము | 383 |


( ఏకాదశాశ్వాసము )


| | |
|---|---|
| త్రిమూర్తి తత్త్వము | 390 |
| త్రికళా స్తవ రగడ | 397 |
| నారాయణి స్వరూపము | 398 |
| మహిషాసుర యుద్ధము | 406 |
| మహిషాసుర మర్దనము | 420 |
| మాత్రా సమక తాళము | 427 |

చైత్ర శుద్ధ దశమి (వారుణ వ్రతము) 275
వైశాఖ శుద్ధ దశమి (పరశురామ వ్రతము) 277
జ్యేష్ఠ శుద్ధ ఏకాదశి (శ్రీరామ వ్రతము) 278
ఆషాఢ శుద్ధ ఏకాదశి (వాసుదేవ వ్రతము) 279
శ్రావణ శుద్ధ ద్వాదశి (బుద్ధ వ్రతము) 283
భాద్రపద శుద్ధ ఏకాదశి (కల్కి వ్రతము) 286
ఆశ్వయుజ శుద్ధ ఏకాదశి (పద్మనాభ వ్రతము) 288
కార్తీక శుద్ధ ఏకాదశి (నారాయణ వ్రతము) 293
ధరణీ వ్రతము 294

( నవమాశ్వాసము )

పశుపాలోపాఖ్యానము 298
నారదుడు 303
అనంత ద్వాదశీ వ్రతము 304
ధన్య వ్రతము 309
కుమార వ్రతము 314
ఆరోగ్య వ్రతము 315
పుత్ర వ్రతము 317
శౌర్య వ్రతము 319
సార్వభౌమ, ధనద, వైష్ణవి, ధర్మ,
రుద్ర, సోమ, పైతృక వ్రతములు 320
చారుమతి 321
దండకము 324
కలికాల వర్తనములు 328

# పీఠిక

'వరాహ పురాణ' కర్తలు, నందిమల్లయ్య - ఘంటసింగయ్య అనువారు. ఇది వీరి ఉమ్మడి కావ్యమన్న మాట; ఇదేకాదు, 'భాగవత షష్ఠస్కంధము'ను గూడ నాంధ్రీకరించిరి. వీరేగాక, మరికొందరును; షష్ఠస్కంధ రచయితలందరించుమించు సమకాలికులు; ఇన్ని యనువాదము లున్నను యేర్చూరు సింగన కృతియే పోతన భాగవతములో జేరినది; హరిభట్టు రచించిన కొన్ని పద్యములు సింగనలోఁ జోటుచేసికొన్నవి; ఈ జంటకవుల రచనమునకు 'కవుల షష్ఠ' మనియుఁబేరు. కవు లిర్వురగుటచేనేమో! 'శృంగారషష్ఠ' మని మరియొక నామము. 'అజామిళ చరిత్ర' 'చిత్రకేతూపాఖ్యానము' యిట్టి వానిలో ప్రబంధ రీతుల స్వకపోల కల్పన లొనర్చిరేమో! మన మెఱిఁగినంత వఱకు ఆంధ్ర భాషలో తొలి జంటకవులు వీరే. వీరిలో, నందిమల్లయ్య స్వతంత్రముగ 'మదనసేన'మను కావ్యమును గూడ రచించినట్లున్నది; వానిలోని నాల్గుపద్యములు ప్రబంధరత్నావళిలో నుదాహృతములు; ఈ జంటకవులను 'రాచమల్లు' కవులనియుఁ బిలిచిరి. మరి యీ పేరెట్లు సార్థకమో! రాయలసీమలో 'రాచమల్లు' వారని కొన్ని రెడ్లకుటుంబము లున్నవి. కడపజిల్లాలోని 'రాయచోటి'కి - 'రాచవీఁడ'ని ప్రాచీన నామము. విజయనగరరాజు లక్కడికుటుంబములనే అంగరక్షకులుగా నుంచి కొనుచుండెడి వారట! తమ ప్రాణములకుఁ దెగించి, ప్రభువుల రక్షించు-'జవాబ్దారీ' వారిదన్న మాట! ఈ కవుల పూర్వులెవరైన నా యుద్యోగములందుండిరేమో తెలియదు; విజయనగరకాలములో కలమును, ఖడ్గమును బట్టిన నియోగు లెందరో యున్నారు. 'విద్యారణ్యు'లే, బ్రహ్మ క్షత్ర జాతిని బ్రోత్సహించిరి, "ప్రబోధ చంద్రోదయము" సంస్కృతమున 'కృష్ణ మిశ్రుఁడు' రచించిన యొక నాటకము; కామక్రోధాది భావములకు రూపచిత్రణ మొసఁగిన రచన యగుటచే నిది సర్వసమాదరణీయమయ్యెను. ఈ రచన కద్వైతమత ప్రతిష్ఠాపనము ఫలము; శాంతము ప్రధాన రసము; అద్వైతమే సిద్ధాంతమైనను కాపాలికాద్యన్యమతములును పూర్వపక్షింపఁబడినవి. దీని

( ద్వాదశాశ్వాసము )

| | |
|---|---|
| రుద్రవ్రతావిర్భావము | 430 |
| రుద్రుని బ్రహ్మహత్య | 431 |
| సత్యతపుని వృత్తాంతము | 435 |
| భద్రవట మహాత్మ్యము | 439 |
| వారాహయాగము | 443 |
| శ్వేతుని కథ | 447 |
| వరాహ పురాణ పఠన ఫలము | 450 |
| గ్రంథ సమాప్తి | 451 |

– అని నాందీలోఁ బేర్కొన్నారు; 'ప్రబోధ చంద్రోదయ'ము నీ జంటకవు లనువదించిరి. అనువదించుటయనఁగా స్వేచ్ఛానువాదము; సంస్కృతనాటకము వీరిచేతిలోఁ బ్రబంధమైనది. తెలుఁగులో రూపకరచనము నాటికి లేదు గనుక. అప్రహత మార్గము నమరించు వైయక్తిక సాహసము. ఆదరించి గౌరవించు సామాజికపరిస్థితి నాడరుదు గనుక; నాటకమును ప్రబంధీకరింపఁ బూనుకొన్న రచయితలకు దానికిఁదగిన మార్పులు గొన్ని చేయక తప్పినదిగాదు. ఈ జమళి కవులు చాల దగ్గరి బంధువులు; నంది మల్లయకు-ఘంట సింగన మేనల్లుఁడు. అట్లే ఘంట సింగయ్యకు 'పారిజాతా పహరణము'ను రచించిన ముక్కు తిమ్మన మేనయల్లుఁడు. నంది మల్లయ తండ్రి సింగన. "సారస్వతాభినంది" అంతే గాదు 'సంగీతనంది'యు; అతఁడు సంగీత సాహిత్య మర్మజ్ఞుఁడే-మో! సింగన "వామన పురాణము"ను "బలరామ విజయము"ను రచించెనట. ఈరెండు గ్రంథములలోని కొన్ని పద్యములు 'ఆనందరంగరాట్ఛందము'లో నుదాహరింప బడినవి. ఘంట సింగయ్యకు 'మలయమారుత కవి' యని యొక బిరుదుండెడిది. అనఁగా శబ్దలాలిత్యముతో అర్థసౌభాగ్యముతో చల్లగాఁ గవిత లల్లు వాఁడని భావము. ఇప్పటికి లభించిన రెండు గ్రంథము లుమ్మడి సొత్తే గనుక – అందు ప్రత్యేకముగా మలయమారుతము. నానందింప వీలులేదు. వారి రచనాక్రమ మెట్టిదో యెఱుఁగము; తిరుపతి వెంకటకవుల వలె చెరియొక చరణమును జెప్పు చుండిరో లేక చెఱియొక పద్యము నీడ్చి వేయుచుండిరో దెలియదు; వీరి కొన్ని వివ రములు వరాహపురాణములోని యీ క్రింది పద్యములో నున్నవి —

సీ॥ అపుడు సభా వేదికాగ్రస్థితులమైన
మమ్ము - వాగీశ్వరీ మంత్రరాజ
సిద్ధి పారగులఁ గౌశిక భరద్వాజ గో
త్రుల - మహా దేవాంఘ్రిజలజ భక్తి
పరతంత్ర మతుల - నాపస్తంబసూత్రుల
గురుదక్షిణామూర్త్యఘోరశివుల
శిష్యుల - నతిశాంతచిత్తులఁ దనకు నా
శ్రితుల - భాషాద్వయ కృతి నిరూఢ

ప్రశస్తి 'సర్వతంత్ర స్వతంత్రు'ల నాకర్షించెను. వారు 'సంకల్ప సూర్యోదయము'ను గ్రంథించిరి, 'చంద్రోదయ-సూర్యోదయ'ములు పరస్పరమందు కన్పట్టున్నవి గదా! అద్వైతమునకు సదుత్తరముగా దేశికులు తమ నాటకమున విశిష్టాద్వైతమును బ్రతిపాదించినారు; పైగా నాందిలో తమ విషయమును గూర్చి పెద్ద కోలాహలము —

"ఘంటా హారే స్సమ జనిష్ట యదాత్మ నేతి"—

వరకును బోయినది; సాధారణముగా దేశికులు "సూతే సూకర యువతి" వంటి పరమ విసీతులు. ఒకప్పుడు శ్రీరంగములోఁ బ్రత్యర్థులు వారి మార్గమున చెప్పుల వరుసలు వ్రేలాడదీసినారు; వారు వచ్చునప్పు, డవివారి తలకుఁ దగులగాఁ దాము నవ్వవలెనని; దానిని గమనించి దేశికులు —

"కర్మావలంబినః కేచి, త్కేచి జ్ఞానావలంబినః
వయంతు హరిభక్తానాం పాదరక్షావలంబినః"

—అని, ప్రతి దానిని కండ్ల కద్దుకొనుచు నడచిరట; మరియట్టి వారికీ హడావుడి యేమి?, అంతేగాదు. సంకల్పసూర్యోదయములో —

"యే లోకానిహ వంచయంతి విరళోదంచన్మహాత్మ్యంచుకాః
తే తిష్ఠంతు. మహద్గుణేషు మణయః కింతైరిదంచింత్యతాం
శ్రీవత్స ప్రతివేశ దీపరుచినా సార్ధంకి మాభాష్యతే
పద్మోల్లాసన దర్పణేన మణినా ప్రత్నేషు రత్నేష్వపి"

అన్నారు- పై శ్లోకములో, కృష్ణమిశ్రుని మనసులో పెట్టికొన్నారా! యని నా యనుమానము. కాని మిశ్రు లనుసరించిన నాటకీయమార్గము మాత్రము కవి తార్కికసింహులకును మెప్పైనది; దానిని సమర్థించుట కన్నట్లు -

"నతచ్ఛాస్త్రం, నసావిద్యా, నతచ్ఛిల్పం నతాః కలాః
నాఽసౌ యోగో నతజ్ఞానం నాటకే యన్న దృశ్యతే॥

కం॥ మీరిరువురు నెప్పుడును శ
రీర ప్రాణముల క్రియఁ జరింతురు, మివులన్
కూరిమి గృతి బ్రతి పద్యము
చారుఫణితి చెప్పఁగలరు చాటువుగాఁగన్॥

—అని పొగడెనట! "వరాహ పురాణ"ము పంద్రెండాశ్వాసముల గ్రంథము; దాదాపు రెండు వేల పద్యములు; దీని కృతి భర్త–సాహితీ సమరాంగణ సార్వభౌముఁడైన కృష్ణదేవరాయల తండ్రి నరసనాయకుఁడు. సాళ్వ నరసింహుని దండనాథుఁడు. సాళ్వ నరసింహుడు కడప జిల్లాలోని టంగుటూరినుండి చంద్రగిరికి, అటనుండి పెనుకొండకు కడకు విజయనగరమునకు "అంతంతై వటుడింతయై"గాఁ బ్రాకినాఁడు. ఈ కార్యములలో నాతనికి, వాదోడు చేదోడుగాఁ బనిచేసినవాఁడు తుళువ నరసఁడు. కడకీ మంత్రమునే తుళువ నరసయ్య సాళ్వ నరసయ్యకుఁ బ్రత్యుపదేశ మిచ్చెను. సాళువ వంశాంకురములకు పెన్గొండ చెఱసాలలు గతియైనవి; అక్కడే వారు మరణించిరి; తుళువ నరసనాయకుఁడు విద్యానగరసింహాసన మాక్రమించినాఁడు; "అంభోధివసన విశ్వంభరా వలయ"మేయతని బాహుపురికి మరకతమైనది; వరాహ పురాణ రచనమునాటికి వీరనరసింహరాయలు నరసయ్యయే. అప్పటి కింకను కృష్ణరాయలు జన్మించినట్లు లేదు; వైభవములు, భయము భయముగా నెదుగుచున్నవి; నాటికే నరసనాయకున కొక "పేరోలగము" కద్దు; అందులో నష్టభాషా కవితాబ్జసంభవులైన సుకవిపుంగవులు; వింజామరములు వేసెడి కలకంకణ క్వాణ కరసరోరుహలైన రమణులు యిత్యాదులు. ఇవన్నియు "దేవకీ పురము" లోని ముచ్చటలే. అది యుత్తరార్కాటు జిల్లాలోని యొక గ్రామము. అందు నరసనాయకుఁ డుండెను. ఆయూరా తఁడే గట్టించెనేమో!. అక్కడి "బృహదంబదేవళము"నకు సాళువ–తుళువ వంశ రాజు లెన్నియో దానము లిచ్చినారు. నంది మల్లయ్య, ఘంట సింగయ్యలు దేవకీ పురముననే దండనాయకుని దరిసించికొనియుందురు. ఈ కవులు దమ తొలి రచనయైన "ప్రబోధ చంద్రోదయము"ను బసవభూపాలుని యమాత్యుఁడైన "గంగ మంత్రి"కిఁ గృతి యిచ్చిరి; బసవరాజుదయగిరిలో గజపతుల సామంతుఁడుగా నుండెను; "ఉదయగిరి" గజపతుల దక్షిణపుటెల్ల. అంతకు ముందది

గీ॥ శేముషీభూషణుల - నంది సింగనార్య
తనయు, మల్లయ కవికులోత్తముని - ఘంట
నాగధీమణి కూర్మినందనుని - మలయ
మారుతాంకితు, సింగయ మంత్రిఁ జూచి॥

—రెండు భాషల యందునుఁ గవిత లల్లఁగలవారట !. ఆ కాలమున సంస్కృతము లేనిది తెనుఁగు లేదు. శాస్త్ర మర్యాద లెఱుఁగనిది సాహిత్యము లేదు. 'వరాహ పురాణము'న తెన్నాలి వానిలోవలె తర్కమర్యాదలు గన్పింపవు. సూరన్న ప్రభావతీప్రద్యుమ్నమునవలె 'మీమాంస' తలసూపదు; వారొనర్చిన కొన్ని ప్రౌఢ ప్రయోగములను బట్టి సాహిత్యమున కావశ్యకమైన వ్యాకరణమును నేర్చి యుందురు; ఘంట సింగనను తిమ్మన 'కవి' విద్యావివేకచతురుఁ డనెను. కొంతయాతనికి లౌకిక మెక్కువేమో !. రాజాశ్రయాదులలో ముందునకుఁ జొచ్చుకొనిపోవు వాఁడై యుండును. "వరాహ పురాణ"రచనమునకు ముందే వీరు నరసరాజునాశ్రయములో నున్నట్లున్నది. వీరి యూరు కోలారు జిల్లా "నందిగ్రామ" మని కోదండ రామయ్య గారన్నారు. నేటికి నా ప్రాంతములలో "నందివార"ను నింటి పేరఁ గొన్ని కుటుంబము లున్నవట ! కర్నూలు మండలములోని "మహానంది" యై యుండ వచ్చునని నిడదవోలు వెంకటరావుగారు; కవు లఘోర శివాచార్యుల శిష్యులు. ఆ గురువులు పుష్పగిరి యందుండిరి. కనుక జంటకవులు కర్నూలు జిల్లా వారనుట పొసఁగునని యొక యుపపత్తి. అఘోరశివాచార్యుల కితరులును శిష్యు లున్నారు. వారును బ్రసిద్ధులు; మరియింత, యిట్టి శిష్య సంపత్తి గలిగిన యఘోరశివుల కీర్తి నొకటి రెండు మండలములకే సంకుచీకరించు టెందుకు !. కవులు కోలారు ప్రాంతముల వారైనంత మాత్రమున అఘోర శివాచార్యుల శిష్యులై యుండరాదా ! పోనిండు !. మలయ మారుత కవి "ఘంట" యెక్కడున్నట్లు ? ఇవన్నియు నాకాశ ఖడ్గచాలనములు. గత దశాబ్దులలో నిట్టి విమర్శలు ప్రధానములై ప్రాంతీయములైన "హుమ్మస్సు" లకే బనికి వచ్చినవి. వాని దుర్వాసనయే విశాలాంధ్రలోఁ గూడ రచయితలను బ్రాంతీయ దృష్టితోఁ జూచి ఆదరానాదరములఁ బెంచి కొనుట!. నరసనాయకుఁడు వీరిని గూర్చి —

యొకసారి యీ కవులు తుళువ నరసనాయకుని దర్శించి కొరిని; 'తుళువ నరసయ్య" వరాహ పురాణమును గృతిఁ దీసికొను నాటికి, అతని తండ్రి యీశ్వర రాజు జీవించి యున్నట్లే యున్నది. కనుక తుళువ నరసయ్య కృతిపతియైనను ఆకు మరుగు పిందెయే; కావ్య దృష్టితో చూచినపుడు "వరాహ పురాణ"ము చాలా బల్హీనమైన పదార్థము. దాని నిండ శ్రాద్ధ ప్రక్రియలు, వ్రతములు, మాహాత్మ్యములు; శుక్ల కృష్ణ పక్షములలో వ్రతము విధింపని దినమే లేదు; దిన మొక్క-వ్రతమైనచో గృహస్థు దట్టు కొనుటెట్లు ?. వాఁడు కడుపు నిండ అన్నము దినుటెప్పుడు ?. ఈ చింత మన పురాణములకు గాబట్టదు; ప్రతివ్రతములోను, స్వర్గనరకములు తిష్ఠ వేసికొని కూర్చుండును; ప్రతి వ్రతమునను దానిని సమర్థించుటకు చిన్నదో, పెద్దదో యొక కథ వచ్చును. ఈ పురాణములోఁ గొంత "లివ" గల పదార్థ మా కథలే; వరాహ పురాణ మన్నారే గాని, యిందులో నాయనకు ప్రథమతాంబూల మేమియు లేదు; ఆయన వక్త; అతఁడు చెప్పఁగా సమస్త కథలను విన్నది భూదేవి; దుర్వాసుఁడు, సత్యతపోమునీంద్రునకు వరాహవ్రత కథఁ జెప్పెను; ఈ వ్రతమును దొల్లి భూదేవి యొనర్చినదని యుదాహరణము; ఆ దుర్వాస స్సత్యతపో వృత్తాంతము నాది వరాహమే జెప్పుచున్నాఁడు. మరల యథాప్రకారము భూదేవి దృష్టాంతమే; ఆమె బెల్లము గొట్టిన రాయి వలె, మౌనముగా వినుచున్నదేగాని, 'ఈ వ్రతము నేను జేసినదేలే. వర్ణింపవలసిన యవసరములేదు. పైనజెప్పు" మనదు. ఆ వినుటతో వచ్చెడు పుణ్యము జమ రానిమ్మని; ఇంతకును మాహాత్మ్యములకు కావ్యత్వ మిచ్చిన గొప్ప రసవాది తెనాలి రామకృష్ణుఁడే; వరాహ పురాణ కృతి భర్త కృష్ణ రాయల తండ్రియగుటచేఁ దరువాతి కవులు దీనినిఁ గొంతశ్రద్ధతోఁ జదివి యుందురు; ప్రభుభక్తి గదా ! రాయలు గూడ నప్పుడప్పుడు దానినిఁ జూచి యుండుటలో నాశ్చర్యము లేదు; పైఁగా నా జనులకు, వ్రతములు, వారము లన్నచో ప్రత్యేక శ్రద్ధ; ఒక గ్రంథమును గొన్ని సారులు జదివి నప్పుడు, వానిలోని భావములో వాని ఛాయలో పఠయిత నాకర్షించిన యొక సమాసమో, శైలియో, శబ్దమో యాతని రచలో రావచ్చు. అంత మాత్రముతోఁ గొంప మునిఁగిన దేమియులేదు; అట్లువాడుకొన్న కవి యసమర్థుఁడనియు భావము గాదు; వాని రచన తావన్మాత్రమే కాదు గదా! భావ సంవాదముగల యొకనినే పలుమారు జదువుటచే "తద్ర

విజయనగర రాజులది; కపిలేశ్వర గజపతి దానిని జయించి తన రాజ్యములోఁ గలుపు కొన్నాఁడు; దానిని మఱల గెల్చికొనుటకు విజయనగరాధిపతులు రెండు మూఁడు సారులు యత్నించిరి; కలిసి రాలేదు; కడకు కృష్ణరాయల "బాహు ప్రతాప జాగ్రన్మహాగ్ని" ఉదయాద్రిశిలదాకి తీఁడించినది; అతని కుమారత కది 'క్రౌంచాచలరాజ' మయ్యెను; కపిలేశ్వరుఁడు, గతించినదే సాళ్వ నరసింహుఁడు, మరల యుదయగిరి పైనెత్తెను; పురుషోత్తమ గజపతితోఁ బెద్ద పోరైనది. సాళ్వ నరసింహుఁడు జీవగ్రాహముగాఁ జిక్కినాఁడు; ఈ రగడలో గంగమంత్రి "నయ విద్య" ప్రకాశించి యుండును. "ప్రబోధ చంద్రోదయము"లోఁ గవు లాతనిని, "నరసింహనృప వశీకర నయవిద్యాకరణ!" యని సంబోధించి నాఁడు. సాళ్వ నరసింహ గజపతులకు సంధి యొనర్చుటకు గంగమంత్రి యత్నించి, నరసింహునిఁ గొన్ని షరతుల నొప్పించెనేమో! లేక పట్టువడినవాఁడు తుళువ నరసఁడేనో!. ఎట్లయినను వరాహ పురాణ కవులు, తుళువ నరసరాజు నాశ్రయించుటలో గొంత గంగనమంత్రి 'నయ విద్య' యుండి యుండును; పెద్దన్నగారు నరసరాయలను గూర్చి, "అశ్రాంత విశ్రాణ నాసారలక్ష్మికి - గవి కదంబము చాతకములఁజేసె" నన్నారు. వరాహ పురాణములో "చతుర కూపార పరీత ధరణీపాల సభా భవన కవి నివహ సందోహుండును"యని గలదు. ఇతని విశ్రాణనము శత్రురాజుల యాస్థాన కవులను గూడ నాకర్షించుచుండెనేమో! లేక దానిపై నాతనికిఁ బ్రత్యేక శ్రద్ధయే యుండెనో దెలియదు; ఆనాటి రాజులు విద్య లకును, రాజకీయ స్పర్ధలకును యెక్కువగా ముడిపెట్టికొన్నవారు గారు;

విజయనగర రాజులు వసంతోత్సవములు చాలా వేడుకగా నొనర్చుచుండిరి అప్పుడు "కర్ణకుండలిత రసాఖండ కవి కావ్య"ములనుఁ గృతి గొనుటలు; పణిన సూను కణాద బాదరాయణ సూత్ర ఫక్కికలు; నటవిట గాయక కోలాహలములు ఆ సమయములలో సామంతు లందఱును, రాజధానికిఁ దరలి వచ్చెడివారు; రాచ కార్యములలో రాలేనివారు తమ గ్రామములందే చిన్న చిన్న వసంతోత్సవములు జరపించి కొనుట వాడుక; రాజధానికి వచ్చిన సామంతులును, వారి వారి భవన ములలో వసంతోత్సవములు నిర్వహించుచు, తమ్మాశ్రయించిన కవి గాయకాదు లకుఁ ద్రుణమో పణమో ముట్టఁ జెప్పెడి వారు; సాళువ నరసింహ రాయలును "వర వసంత త్యాగ వైభవుఁడు". అట్టి వసంతోత్సవ సమయములలో నెప్పుడో

ప్రతిరోధి వరణ వర్గము ద్రోచి తన్మహా
భోగ శాలిక్షేత్రములు హరించు
వలగొన్న బహురాజ వంశ గుల్మంబుల
పలుతెలుంగుల గ్రుచ్చి పారవైచు
వడిజొచ్చి కలచి యావనరాసుల సమగ్ర
జీవనం బెల్ల దుష్కీర్తి గలుపు
గీ॥ అవని నసహాయ శూరత నధిగమించు
ననఘ! తిరుమలరాయ నందన సమిద్ధ
ధీర రఘునాథ భుజపీఠి బీటవెట్టు
సాహసోదగ్ర బిరుద వరాహమూర్తి॥

—పై పద్యము తిరుమలరాయల కుమారుఁడైన రఘునాథరాయల పరాక్రమమును వర్ణించునది; ఇతని భుజముల యందుఁ బీటవెట్టిన ధరణీవరాహమూర్తి విజృంభణమే పై సీసపద్యమంతయు; విజయనగరరాజ్యమును బరిపాలించినవి నాలుగు వంశములును గేవల భిన్నములు గావు; వానికిఁ బరస్పరము రక్త సంబంధము లున్నవి; అంతయు బీరకాయ పీచువంటిది; కనుక యొకరిబిరుదము మరియొక్కరు సమానమైన యభినివేశముతోనే వాడుకొనుచుండెడి వారు; ఈ జంటకవులు వరాహపురాణమును వ్రాయుచున్న విషయమును గర్ణాకర్ణిగా తుళువ నరసరాజు విన్నాఁడు; అది యొకరీతిగా దమయింటి దేవుని కథ. దానికి దాను కృతి భర్తయైన బాగుండు"నన్న తలఁపాతనికిఁ బుట్టినది; కవులను బిలిపించి "వీడ్యము కప్పుర" మిచ్చినాఁడు; జాంబూనదాగ్రహారములు లేవు. అప్పుడు కృతిభర్తకే యంత విచ్చలవిడిగా నుండెనో లేదో! కవులు తుళువ నరసరాయ వంశ వర్ణనము నారంభించినారు. కాని తుళువవారు సాళువ నరసరాయని క్రింది యుద్యోగులు; సాళ్వ నరసనికిఁ గూడ మెప్పుగా నుండవలెను గదా! వారి యింటి వర్ణనము గూడఁ జేయవలసి వచ్చినది; వరాహ పురాణమును గ్రహించు నాటికి "మండువ బెడంద కోట మాహురము" మొదలగు గొన్ని యుద్ధముల యందు మాత్రమే యీశ్వర నరసరాజు పాల్గొన్నట్లున్నది. అందుకే అతని విజయములను పెద్దగా వర్ణింపక ఒక స్రగ్ధరా వృత్తమును గాలిలో వదలినారు.

చనయకా" దలపించెడి యనేక సన్నివేశములు వచ్చినపుడు యీ కవి వానికిఁ బ్రియమందుము; రాజశేఖరుఁడు తన 'సాహిత్య మీమాంస'లోఁ గవుల చౌర్యములను 'పిచ్చిగా' వింగడించెను; సాధారణముగా నిట్టివానిలో 'తాయేవ పదవిన్యాసా' యనునదే సరసమైన దృష్టి; ఈ రీతిగా వరాహ పురాణములోని కొన్ని ఛాయలు మను-వసు చరిత్రాదులలో నున్నవి. అంతమాత్రముతో వా రసమర్థులు గారు; వీరు వారికంటె సమర్థులును గాదు; మరి యిట్టి బల్బుజమైన పదార్థము నీ కవులు కథావస్తువుగా నెందుకు స్వీకరించిరి? నరసరాయని నాకర్షించుటకు; సాళ్వ వంశస్థులకు 'ధరణీ వరాహ'యని బిరుదు; వారు వరాహధ్వజులు, 'పంచఘంటా నినాదములు-ప్రధానాయుధ కఠారి' మొదలగు కొన్ని యధికారములు వారికుండెడివి; వారి "ధరణీ వరాహ" బిరుదమునే వారి సామంతులును తరువాత వచ్చిన విజయనగర రాజులును విశంకటముగ వాడుకొన్నారు. విజయనగర శాసనములలోఁ బ్రతి దానియందును పైన వరాహాంక ముద్ర యుండును. వారు శాసనములలో సామాన్యముగా వాడు శ్లోకము లీ క్రిందివి ;—

"హారేర్లీలావతారస్య, దంష్ట్రాదండ స్సపాతువః
హేమాద్రి కలశాయత్ర ధాత్రీచ్ఛత్రశ్రియం దధౌ
"పాతు క్షోణి జగంతి సంతత మకూపారాద్ధరాముద్ధరన్
క్రీడాక్రోడ కలేబర, స్స భగవాన్ యస్యైక దంష్ట్రాంకురే
కూర్మః కందతి, నాళ తిద్విరసనః, పత్రంతి దిగ్దంతినో
మేరుః కోశతి, మేదినీ జలజతి, వ్యోమాఽపి రోలంబతి"

—పైవానిలో నేదియో యొకటి వారి శాసనముల మొదటిలో నుండును. తరువాత వచ్చిన ఆరవీటి రాజులు గూడ 'ధరణీ వరాహ' బిరుదమును వాడుకొనుచు వచ్చినారు.

వసుచరిత్రలో నీ క్రింది పద్యమున్నది—

సీ॥ బలువాహినులమించు మలకల ఘననామ
కంబులు దూల మూలంబులెత్తు

అమరుకాదు లోకతెగ. కాళిదాస భాస అశ్వఘోష దిఙ్నాగాదులొక కోవ; ఇక్కడ ఆ విచారమంత జెంచ వలిసినది గాదు; సంస్కృతములో బాణుఁడు తెనుఁగున శ్రీనాథుఁడు, పెద్ద మఱ్ఱిచెట్లు వంటివారు; ఆ నీడలో నితర తరువులు బెరుగవు; బాణుని తర్వాత సంస్కృతమునఁ జాలమంది యాతని ప్రతిధ్వనులే; తెనుఁగులో నా యాకర్షణకుఁ దప్పి నిల్చిన స్వతంత్రులు 'సోమయాజి, నన్నెచోడుని వంటి కొందరే; తెనుఁగులో 'శ్రీనాథుని' పద ప్రసిద్ధధారా శుద్ధి కెందరో యమ్ముడు వోయిరి; ఆంధ్రసాహిత్యములో శ్రీనాథుఁ డొకయుప్పెన; అతఁడు తాను 'శ్రీ హర్షుఁడ'ను కొన్నను బాణుని యంశావతారము గూడ; ఈ యురవడి కెదురు నిలిచిన 'పింగళి సూరన్నవి' పిల్లిమొగ్గ లైపోయినవి; పోతన్నగారికిని 'బాణుని' పై మమత గద్దు; ఆ శబ్దవిన్యాస చాతుర్యము బాణుఁడు నేర్పినదే. వరాహపురాణ మందును బాణుఁ డున్నాఁడు.

"గంధసిందురంబు చందంబున మదాందోళిత పుష్కరంబై
పుష్కరస్థలంబు చందంబున సంసక్తరాజహంసంబై
రాజహంసమండల విధంబున నుద్దండ పుండరీకంబై"

—శ్వేతద్వీపమును వర్ణించు వచనమిది; ఈ వచన మింకను గొంత యిట్లే సాఁగును; పై వన్నియు బాణుఁడు గొట్టిన పట్టీలే; తెనుఁగులో నన్నయ్య, తిక్కన్న-యెఱ్ఱన-శ్రీనాథుఁడు, వీరి నల్గురిని ప్రశంసించినారు, నన్నయ ఛాయలు కొంత ధారలో సేకరించు కొన్నను ఆతని 'హితమిత భాషలు' వీరి కంటలేదు. వీరికే గాదు ప్రబంధ కవులకును ఆ గుణమునకును ఆమడల దూరము; ఋషిప్రహితమైన యతని సంయమన మనన్యసామాన్యము; తిక్కనను వీరువలఁచుట చెల్లించిన మ్రొక్కుబడి; వీరేమి? సోమయాజిని బొగడిన తరువాతి వారికెందరికో యతఁడు 'ఉద్బాహురివ వామనరి' అంతే.

నాచన సోముఁడు తాను తిక్కయజ్వ శిష్యుఁడనని యెంత బడాయి కొట్టు కొన్నాను ఆ సంయమనము ఆ శైలి రానేలేదు; నిజముగా వరాహపురాణ కవు లాదరించిన వాఁడు అనుసరించిన వాఁడు శ్రీనాథుఁడొక్కఁడే; అతఁడొక ఘట్ట మును ధడియమెచ్చు తక్కువగా 'జెప్పినను ఆ భాషా సౌరభ్య ప్రవాహములోఁ గొట్టుకొని పోదుము; వీరును నట్టివారే; పోతన్న నాచన సోమనాథులును యీ

వరాహపురాణములో పూర్వకవుల స్తుతి యీ క్రింది రీతిగా నున్నది.

సీ॥ నిరవద్య రఘురామ నృప కథారామ కే
లీమత్త కేకి వాల్మీకిఁ దలఁచి
ధర్మ నిర్మిత కర్మ తన్వంత రాదినా
రాయణు బాదరాయణు భజించి
వాసంతికా మంజరీ సమంజస కవి
త్వ నివాసు కవికాళిదాసుఁగొలిచి
గంభీర పదహృద్య గద్యప్రబంధ వి
భ్రమ రమాపారీణు బాణు దడవి

గీ॥ నన్నపాచార్యునకు వందనమ్ము చేసి
తిక్కయజ్వ కుమ్రొక్కి, కీర్తితములయిన
శంభుదాసుని వాగ్విలాసములు నెమ్మ
నంబులోపల నిలిపి శ్రీనాథుఁ బొగడి॥——

—వాల్మీకిని కోకిలతోఁ బోల్చిన శ్లోకము ప్రసిద్ధమైనదే. వీరు కేకి తోఁబోల్చినారు. ఆదికవిని గూర్చి వీరుచెప్పిన మాటలు ఆయన కవితా స్వభావమును దెలుపునవి గావు; వ్రాసినది రామకథ; మరియీ షడ్జం మయూరోవదతి'లో నందమేదో. వారే చెప్పవలె. శరన్నది వంటి యొడుదుడుకులు లేని భాష లలితమనో హర మైన ధ్వని వాల్మీకి సాహితీమూర్తి. 'వ్యాసోనారాయణో హరిః' యనునది పండిత ప్రసిద్ధమైనది. కాళిదాసు' వాసంతికా మంజరీ సమంజస 'మైన' కవిత్వ విలాసము' గూడ సార్థకము గాదు: ఈ విశేషణమే కవి కైనను దగిలింప వచ్చును; "మరి, యైనచో వీరాగ్రంథములను జదువలేదని నీయభిప్రాయమా." అని యందురేమో! నా తలఁప గాదు; ఆ కవులు వారి హృదయములకు దగ్గరి వారు గారు" అనునంత వరకే నేను జెప్పఁదలఁచినది; కాగా బాణునిఁ గూర్చి చెప్పినది మాత్రమే సమంజసము; ఇది చాల పెద్దగొడవ; సంస్కృత సాహిత్య మందే రెండు సంప్రదాయములు కొట్టవచ్చినట్లు గనుపించును; బాణ మయూర

"గరుడులన్ గూలిచి, గంధర్వులన్ మాలిచి, కిన్నరు లన్గొట్టి, కింపురుషులన్ బొడుదల వట్టి, సారణుల వెంటాడించి, సాధ్యుల నూటాడించి." ఇట్టివి కోక్తొల్లలు; ఒక చంద్రోదయ మిట్లున్నది.

ఉ॥ యామవతీవిలాసినికి నైదువ(త్రాడు సమస్తనిర్జర
స్తోమముగూడు, లక్ష్మిసయిదోడు, నభోమణిజోడు, పాంథకాం
తామృగహింసకు న్వేడలు దర్పకలుబ్ధకు దివ్వెగూడు, నె
త్తామర సూడు, రాగరసధాముఁడు సోముఁడు దోచెఁ
దూర్పునన్.
(4-13)

—పై శబ్దముల జోడింపు నాచన సోమునిదే; పోతన్నగారి దస్నను నాయాక్షేపణ లేదు; అతఁ డెరవు దెచ్చి కొన్నది నాచన సోముని నుండియే గనుక;

నన్నయ్యగారి ధారాశుద్ధి యొక ప్రత్యేకమైనది ఆయనది సీలి రాగము. ఎట్టి పరిస్థితి యందును తొణకని మహర్షివంటి దాతని రచన; వివిధ రసములను వర్ణించినను అన్నిటియందును సంయమనము రక్షాకవచముగ నుండును; పద్యములు పాదములకు విఱుగవు శరన్నది వలె సాఁగి పోవుచునే యుండును; ఎందుకు?. ఒక ప్రధాన భావమును విస్తృతీకరింప వలిసి వచ్చినపుడు, సీస పాదములను సాధారణముగా త్రుంచి త్రుంచి నడపింతురు. కడకీ గీతము లేక, ఆటవెలఁదిలోని ప్రధాన భావముతోనే ముడివెట్టి ముగింతురు; మరి నన్నయ్యకు భావ విస్తృతి పనికిరాదు; ఒకటి రెండు చోటుల విస్తృతి యవసరమైనప్పుడు త్రుంచుటయే జరగినది; ఈ పద్ధతికి తిక్కన యెదురు దిరిగెను, కాని, యతని పదములు మొగ్గలు గూర్చి పెట్టినటులుండును; ఎఱ్ఱనయు నన్నెచోడుఁడును సీసపద్య గ్రథనములోఁ దిక్కననే యొరవడిగా నుంచికొన్నారు; ఇంతలోఁ గవిసార్వభౌముఁడు ప్రవేశించినాఁడు; ఇతని రచన కుసుంభరాగము, శబ్దములు విన్నవెంటనే విచ్చిన పూలవలె గుబాళించును. సాధారణముగా విమర్శకులు పూర్వకవులను 'ధారా శుద్ధి గలవార'ని యొకటే గాటిలోఁ గట్టి వేయుట గద్దు. కాని, వారు వారు సాధించిన 'ధారాశుద్ధు'లలోఁ దేడాలున్నవి.

కవుల కిష్టమైన వారు; రచనలో నాచన సోముఁడు చమత్కారప్రియుఁడు; వరాహపురాణములో కావ్యము మొదటితోనే 'సంకగుణసనాథుఁ'డిట్లు సాక్షాత్కరించు చున్నాఁడు.

ఒకసారి నారదుఁడు, శ్వేతద్వీపమునకు వెళ్లెను; పెద్దచూర్ణిక వంటి సరస్సు; దాని దగ్గర సావిత్రీదేవి యాతనికి సాక్షాత్కరించినవి.—

సీ॥ తనకొప్పు శైవాలమును బోల్పఁ, దననిడు
వాలుగన్నులు గండు మీలఁబోల్ప
దనమోము నీరజమ్మును బోల్ప దనముద్దు
వాతెఱ బంధుజీవకము బోల్ప
దన కంధరము శంఖమును బోల్పఁ, దనబాహు
లతికలు నవమృణాళములఁ బోల్ప
దనచన్నుఁగవ చక్ర దంపతులను బోల్ప
దన కటీరము సైకతమును బోల్ప
విని, మనంబున నమ్మిక, వీని వాని
వాసి దెలియంగ వలెనని వచ్చె ననఁగ
నెంతయును సౌకుమార్యంబు వింత గొలుప
నొంటి విహరించు నొక మచ్చెకంటి గంటి"

—పై యుపమాద్రవ్యము లన్నియు సరస్సులోనివే. బాగుగనే యున్నది; కాని, నారదుని యీ యభ్యూహాలలో నే మున్నది; ప్రధానముగాఁ జమత్కారము; ఈ వర్ణనలో మనము లీనము గాము; గట్టుపై నిలిచి, యెంత బాగున్నదని యబ్బురపడుదుము; ఈ రచనా ధర్మము తరువాతి వారిలో యింకను బారా కాష్ఠ నందికొని కవిత్వము కేవల బౌద్ధికము కుత్సిత బౌద్ధికమను వరకును దిగ జారినది; ఇక వచనములలో నన్నియు నాచన సోముని ఖత్తులే. ఒక యుద్ధ వర్ణన మీ క్రిందిది—

నన్నయ్యగారిది శ్రోత్రపేయమైన ధార; 'దీని తెఱఁగిట్టిది' యని నిర్ధరింపరాని సంగీతము; తిక్కన్నది. ఎండకాలపు వాగు; నిలిచి నిలిచి ప్రవహించును; శ్రీనాథునిది నాద శుద్ధిపై ప్రత్యేక దృష్టిలేని వర్షాకాలపు ప్రవాహపు హోరు; పెద్దన్నగారిది వీణానిక్వాణములు ఆనుషంగికముగా వెంట రాసాఁగిన ధార. రాయలు, రామకృష్ణుఁడు వీరిర్వురిది డొంక తిరుగుడు ధార, ప్రవాహములో నెక్కడ సుడులున్నవో తెలియదు; తలలెత్తిన గుండ్లెక్కడున్నవో యెఱుఁగలేము; నారదుని మహతినే, కనకాద్రి కూట గర్జత్కాళిక'తోఁ బోల్చిన రసికుఁడు వాఁడు; రామరాజ భూషణుఁడు సాధించినది, మాధురీధుర్యమైన తానామృతముల ధార; సంగీతములోఁ జెవిగలిగిన సాహిత్యకారుల కీవింగడింపులంత కష్టసాధ్యముగాదు; కాగా, వరాహపురాణకవు లాదరించినది, శ్రీనాథుని పద ప్రసిద్ధ ధారాశుద్ధి; కవిసార్వభౌముఁ డందరితోను 'భేష'నిపించికొనుట కతఁడు నేర్చిన మరియొక విద్యయున్నది; ఎక్కడ బట్టినను దెప్పలఁ దేలెడు లాక్షణిక ప్రయోగములు; ఇవి నిజముగా, రచనకు, గొప్ప యందము నిచ్చు సామగ్రి; ఈ రహస్యమును శ్రీనాథునివలె తెనుఁగులో గమనించిన వారెందరో లేరు. "చిన్నారి పొన్నారి చిఱుత కూకటినాఁడు, శిఖల నెన్నడుములు, నిరుపేద వదనము, పరువంపు పుప్పొడులు నిద్ర మేల్కాంచిన నెత్తమ్మి, కొమరుప్రాయంపు నూనూగు గొదమయెండ" ఇట్టివి కోకొల్లలు లభించును; ఈ జంట కవులు గూడ నాయందమును గమనించినారు. చీకటితప్పు, సోమరిగాలి, చిన్నారి పొన్నారి చెమట, పంచబంగాళము మొదలైన వాయంగడిలోని సరుకులే; సీస పద్యములు కట్టుటలో, శ్రీనాథునిలో నొక నేర్పున్నది. మొదటిపాదము క్రియతో నారంభమైన అన్నియు నట్లే సాఁగును; ఎట్లుంతమయిన నట్లే యుండును; అతని కావ్యములలో నీ నియమమెక్కడో తప్పు-తప్పదు; శ్రీనాథుని తరువాత కవులందరా పద్ధతినే యవలంభించిరి; వికసిత కుసుమముల వంటి శబ్ద సంచయమునే వాడఁ జొచ్చిరి; నన్నయ సీసముల యొరవడి రాలేదు; కారణము రచనలో సర్వాంగీణమైన సంయమన శక్తి లేక పోవుట; దుర్వాస మహర్షి నింద్రుఁ డవమానించెను. అతనికిఁ గోపము వచ్చినది. అమరేంద్రునిపై నిట్లు విఱచికొని పడినాఁడు.

సీ॥ అనుకంప లేక బ్రాహ్మణుని నమ్మించి, గొం
తుక గోసి పోయిన దోసకారి!

గౌతమఋషి కులాంగన నహల్యాదేవి
చీకటితప్పు చేసిన దురాత్మ ;
పరసతి బిడ్డని హరకోపహుత వహో
ర్చులలోన ద్రోచిన క్రూరకర్మ !
సగరక్షమాపాల సప్త తంతువిముక్త
హరి ప్రముచ్చిలించిన పరమధూర్త !
ఆ॥ యోరి ! గోత్రవిఘాతి ! న న్నొక తపస్వి
మాత్రుగాఁ జూచి యిపుడు నమస్కరింప
నైతి గావున దేవరా జ్యాధి పత్య
మునకు బెడబాసి భువిఁగూలు మని శపించె॥

—పై పద్యములోని పాదము లన్నియు, వరుసగా సంబోధనాంతములే. మొదటి దానిలో దధీచి వృత్తాంతము. రెండవ దానిలో నహల్యా జారత్వము; వేదకాలము నుండి దేవేంద్రుఁ డీ బిరుదము నిట్లే దగిలించికొనుచు వచ్చుచున్నాఁడు; ఈ బిరుదుపై వానికి, స్వర్గ ధామముపై నున్నంత మక్కువ; దాని నీ కవులు శ్రీనాథుని సొమ్ముతోపాటు దగిలించినారు; మూఁడవది మన్మథుని కత, నాల్గవది సగరుని యజ్ఞము; సంబోధనము లాయా కార్యములకుఁ దగినవై శోభ గూర్చుచున్నవి. దుర్వాసుని వర్ణింపుచు ——

సీ॥ అనుభావశక్తి బ్రహ్మాదుల నొకపూరి
పుడకకు గైకోని పొతరీఁడు ;
ఘనకోప వాణిజ్యమునఁ దపోవిత్త జా
లము గూడఁబెట్టెడు లాబగాఁడు,
తన రథంబునకు మాధవ సత్యభామల
గుర్రాలఁ జేసిన కోడిగీఁడు ;
యతి సతీ కులరత్న మనసూయ కడుపున
మునుమునఁ బుట్టిన ముద్దులాఁడు

గీ॥ సకలకల్యాణ కరుఁడు, సాక్షాదనంగ
హరుఁడు, నిర్మలతత్త్వ విద్యావిచార
ణా విలాసుఁడు, దుర్వాసుఁ డావసుంధ
రాధిపతికి వరంబు లీ నలుగుఁ దెంచె॥

—ఈ సీసములోఁ గడపట నన్నియు నామవాచకములే; 'పోతరీఁడు' దుర్వాసునకు వేయఁదగని విశేషణము గాదు. కృష్ణ సత్య భామల వృత్తాంత మున్నది. పై కథలలో 'నేది ముందు ? యేది వెనుక ?' అను విచారము చేయరాదు. "యః కల్పస్స కల్ప పూర్వః" అను వాక్య మిట్టి వానికి గల్ప వృక్షము. గీతములోఁజెప్పిన విశేషణములను, పోతరీఁడు,లాబగాఁడు,కోడిగీఁడు అను పదములు వెక్కిరించుచున్నవి; ఇట్టి పట్టులలో శ్రీనాథుఁ డొనర్చు రసవాద విద్య వీరికి రాలేదు; జంటకవులు వినాయకుని జన్మప్రకార మారంభించినారు. పార్వతీ పరమేశ్వరుల కల్యాణము ముగిసినది; కైలాసముపై నాస్థానమైనారు; ఇంతలో దేవతలు "స్వామీ ! సజ్జను లొనర్చు పనులు నిర్విఘ్నముగ ఫలించునట్లును, దుర్జనుల కార్యములు నడుమనే వీఁగి పోవునట్లును యుపాయము వెదకుమని యొక లేగోల; పరమేశ్వరునకు వారల ననుగ్రహింప బుద్ధి పుట్టినది. ఎదుట పార్వతి "చంచలత లేని తొలకరి చంచల" వలె నున్నది. అప్పుడు —

సీ॥ పలుమారు సోమరి చలిగాలి సోకున
కదలెడు నీలాలకములు జూచి-
తొలుకారు క్రొమ్మెఱుంగుల వంటి రుచులుముం
దట వెదజల్లు నేత్రములు జూచి-
చిన్నారి పొన్నారి చెమటచిత్తడి దోచు
వికచ కపోలపాళికలు జూచి-
పచ్చి కస్తూరికా పంకమ్ము దాల్చి క్రి
క్కిరిసిన గుబ్బ పాలిండ్లు జూచి

గీ॥ కౌను జూడంగ నాత్మ నాకసము దోప
వాయుతేజోంబు భూమి తత్త్వములు నాల్గు
మూర్తులు వహించి మింటికి మూర్తి లేమి
యేమి కారణమంచు యూహించి నవ్వె॥

—ఇది యొక మంచి పద్యము. పై మెఱుఁగులే గాకఁ గొంత యాలోచనకుఁ జోటిచ్చునది. సోమరిగాలి సోకుతో నీలాలకలు గదలుచున్నవి. కనుక గాలి కాకాసమున్నట్లే. తొలుకారు క్రొమ్మెఱుంగులతో తేజస్సు ప్రత్యక్షమే. చెమట చిత్తడి యను పంకము, కొండలు, భూమి దోఁచినవి. కౌను జూచినాఁడు. దీనికి మాత్రము మూర్తిమత్త్వ మెందుకు లేదు ? అనుకొని నవ్వినాఁడు. వసు చరిత్ర కారుఁడైనచో దీని నింకను జమత్కరించి యుండును; ఒక "చైత్ర యాత్ర" వర్ణన మిది —

సీ॥ ఘన ఘనా ఘన సన్నహన కుహనాఘోణి
ఘోణా కుటీగుట గుటలతోడ- (3-26)

—ఇక సన్నివేశముల యందును 'తోడ' రావలసినదే. ఇట్లు శ్రీనాథుని రచన యొక్క బాహ్య శరీరమును బట్టికొన్నను, అతని మూర్తి పూర్తిగా వీరి సముగ్రహింపలేదు. ముందు చెప్పినట్లు లాక్షణికము లాతని మూర్తి; శైవ పారమ్యము గల వాఁడగుటచే తన్నుదమునుండి గిల్లుకొన్న క్రియలు మొదలైన పదము లాతని మూర్తి; సహజముగా బుట్టిన వక్రోక్తి యాతని మూర్తి; ఇట్టి 'తోడ'ల పద్యమే కాశీఖండములో నున్నది (8-138). అక్కడ మనకు విసుగనిపించదు; 'తోడ' లతో నందమే వచ్చినది. ఇక్కడ విసుగనిపించును.

సీ॥ చర్చించి చూచిన సర్వజ్ఞతాపటు
ప్రౌఢిమ మరువంబు పరిమళంబు
పరికించి చూచిన, నిరుపమ త్యాగ ల
క్ష్మీ విలాసము దేవతావరంబు-

భావించి చూచిన బహుమాన సమ్యగ్ద
యా విశేషోక్తి శిలాతురంబు-
తర్కించి చూచిన ధర్మసంపాదన
క్రీడా వివేకంబు తోడునీడ"

—దీనిలోఁ 'చర్చించి చూచిన' పరికించి చూచిన మొదలగు పదము లన్నియు "చ. వై. తు. హి" చిట్టాలలోనివి. ఆర్థికముగ, శాబ్దికముగ తోడుపడని పిచ్చి మాటలు.

సుప్రతీకునకు, దుర్జయుఁడను కుమారుఁడు. వారిది రాక్షస వంశము; దుర్జయునకు పట్టాభిషేక మొనర్చి, తండ్రి తపస్సునకుఁ బోయెను. దుర్జయు డొక్కనాఁడు కొలువు దీర్చినాఁడు. ఈ క్రిందివి వాని వీరాలాపములు.

సీ॥ భారతవర్ష ధాత్రీరమణులు మన
నొల్లరో కొలువు రాకుంట యెట్లు ?
హరివర్షకువల యాధ్యతులు బ్రదుకంగ
నొల్లరో ! కొలువ రాకుంట యెట్లు ?
భద్రాస్య వర్షభూభర్తలు ప్రాణంబు
లొల్లరో ! కొలువ రాకుంట యెట్లు ?
రమ్యావర్ష వసుంధరావల్లభులు తల
లొల్లరో ! కొలువ రాకుంట యెట్లు॥

—ఇంకపై నేమోయున్నది; ఇట్టి రచనలేల సేతురో ! తెలియదు. పోనీ, దుర్జ యుఁ డల్లరివాఁడు గదా ! యనుకొన్నచో పైన వాఁడే చాల చాల యుత్ప్రేక్ష కవిత్వము లల్లును; నారదుఁడు శ్వేతదీపములోని యొక సరస్సు దగ్గరకుఁ బోయినాఁడు. అక్కడాయనకు దర్శన మిచ్చినది సావిత్రీదేవి; అతనినిఁ జూచి యామె నవ్వినది. ఆ నవ్వుతో నితని బ్రహ్మ విజ్ఞానము వకావకలైనది. వేద శాస్త్ర పఠన ప్రతిభా విభవంబు పరిభవం బందినది. గాన విద్యా నిపుణత్వము,

తపము-ధర్మ విజ్ఞత, వివేకము అన్నియు నొకేసారి మాటాడుకొని పరారైనవట ! అప్పు డాతఁడు సావిత్రితో నిట్లన్నాఁడు —

సీ॥ పడతి ! నా వేదసంపద యేల పసదప్పె
యింతి ! నా శాస్త్రంబు లేల తూలె-
నలినాక్షి ! నా పురాణము లేల నశియించె
యెలనాఁగ ! నా గానమేల చెడియె-
వనిత ! నా మంత్రవాసన యేల యుడివోయె
లోలాక్షి ! నా యోగమేలఁ బొలిసె-
నాతి ! నా తత్త్వవిజ్ఞాన మేల తొలంగె
బాల ! నా వైదుష్యమేల సమసె-

—"తెలియ విసిపింపు" మన్నాఁడు. పై దానిలో "పడతి, యింతి, నలినాక్షి" యీ పదములన్నియు నాయా పాదముల మెడలకుఁ దగుల వేసిన "గంతెల"వలె నున్నవి. శ్రీనాథుని దిట్టిదే, కాశీఖండములో నొక పద్యమున్నది. లక్ష్మీశ్వరుఁడు యిందిరాదేవికి శివుని వర్ణించుచున్నాఁడు.

సీ॥ జలజాక్షి ! యితఁడు వో సకలయోగీంద్రులు
భావవీధులఁ గాంచు పరమతత్త్వ-
మలివేణి ! యితఁడువో ! యఖిల భూతములకు
నాధారమగుచు నింపారు వేల్పు-
కలకంఠి యితఁడువో ! విలయ కాలమునందు
నుడివోని శుభమూర్తి నుండు పెద్ద-
లలితాంగి యితఁడువో ! యలఘు తేజంబున
విశ్వంబు వెలిగించు విశ్వనాథుఁ
గీ॥ డబ్ధిసంభవ ! యితఁడువో ! హాలహలపు
విసము పుక్కిటఁ దాల్చిన వెంగలీఁడు
పాటలీగంధి ! యితఁడువో ! భక్తతతికి
శాశ్వతానంద కరుఁడగు నీశ్వరుండు. (5-116)

—దీనిలోని "జలజాక్షి, అలివేణి, లలితాంగి" అన్నియు సమానగణములు; పాదముల కొక యందము నొదిగించుచున్నవి; చేతులల్లార్చి, సభలలోఁ జదువఁ దగిన కవి సార్వభౌముని 'తోజు'వలెనే నిడుపైనవి; కలకంఠి కాముని ధనుష్టం కారము; పాటలీగంధి కవితాసనాథుని పాండిత్యము; తక్కిన 'వక్రోక్తు'లు పరమ శివు నుబ్బించి వేసినవి. ఈ మైకములో "వెంగలీఁడు" అతనికి విన్పింపక తప్పించి కొని పోయినది. మరియిట్టి శాంబరీవిద్య నీ జంటకవులు గమనించినట్టే లేదు; శ్రీనాథుని "జలజాక్షి" మొదలైన వన్నియు నూత పదములు, కాని యట్లనిపిం పవు; అదే సొగసు; వాస్తవమునకు పదములను పరమ సార్థకముగా వాడ గల రచనా శూరుఁడు, తెనుఁగులో రామరాజభూషణుఁ డొక్కఁడే; అతని కాలము నాటికి భాషా శాస్త్రమే యెఱుఁగరు; సంస్కృతముదే పెద్ద పెత్తనము; నిజముగా వసుచరిత్ర కారునికీ 'భాషా శాస్త్రపు వాసన' యంటి యున్నచోఁ దెనుఁగు పద ముల నింకెంత సార్థకముగా వాడి యుండెడివాఁడో!

ఒకనాఁడు బ్రహ్మదేవుని కొలువున కింద్రాదులు వచ్చినారు.

సీ॥ నడచె నింద్రుండు కిన్నరకాహళులు మ్రోయఁ
గమనించె శిఖి డిండిమములు మ్రోయ!
జనియె దండధరుండు జయదుందుభులు మ్రోయ
వెళ్లె దైత్యుఁడు గిడిగిళ్లు మ్రోయ
బోయె నంబుధిరాజు బూరగొమ్ములు మ్రోయ
జరగె వాయువు మురజములు మ్రోయ
నరిగె యక్షుండు కిన్నెర వీణియలు మ్రోయ
కదలె రుద్రుండు శంఖములు మ్రోయ-

—ఇంద్రునితో మురజము లెందుకు రాలేదు ?. అంబుధిరాజునకు కాహళు లెం దుకు లేవు ? దండధరునకు జయదుందుభులే యెందుకు ? ఈ మొదలైన ప్రశ్న లకు కవులే జవాబులు చెప్పవలెను; శాబ్దికమైన శాంబరీ విద్యలలో నందె వేసిన వాఁడు శ్రీనాథుఁడంటిని; శాబ్దికప్రపంచములో ఉచితానుచితములు దెలియక,

మనమును గొట్టుకొని పోదుము; ఎంతో దూరము పోయి, వెనుదిరిగి చూచినగాని యా మలకలు మనకు గనుపింపవు; దూరము పోయి తరువాత నాలోచించు కొన్నపుడింత కోలాహల మెందుకుఁ జేసినాఁడు ? వ్యర్థము గదా ! యనిపించును. ఇది యెప్పుడో తరువాత పుట్టు జ్ఞానము; వీరుగూఁడ నా మార్గమునే యనుసరింపఁ జూచినారు. కాని యా "ప్రౌఢ వాక్పాటవములు" రాలేదు.

ఈ క్రింది పద్యములో భాగీరథిని వర్ణించుచున్నారు. సంయమనుఁడు తీర్థయాత్ర లొనర్చు సందర్భము.

మ॥ ఘనుఁడా సంయమనుండు తీర్థములు ద్రొక్కన్
బోవఁ బో, ధర్మకా
నన మధ్యమ్మున వీచికాపవన సన్నాహంబు దేహంబు ముం
ప, నిజ స్వాంతము పల్లవింపఁ గనియెన్ భాగీరథిన్ నర్మకో
పనిరాసార్థ పదద్వయీ వినతి కృతాంభోజ భూసారథిన్॥

—భాగీరథికి వేసిన యీ విశేషణము సందర్భ శుద్ధి కలిగినది కాదు; ఏదో పాద పూరణమునకు దగిలించినట్లున్నది. మరియొక చోట 'నిర్ధారించి' అని పద్యము నెత్తికొన్నారు. అందుచే "చంద్రార్ధోత్తంసుని మామ" అని హిమాలయమునకు వేయవలసి వచ్చినది; ఇట్టి యెత్తుగడలన్నియు నిట్లే ఫలించును; మరియొక చోట కీర్తిని వర్ణించుచు, "లలాటాక్ష కిరీట నాకతటినీ రంగత్తరంగాభ తుండిల కీర్తి ప్రభ" అన్నారు. లలాటక్ష కిరీటము చంద్రుఁడు; ఇక్కడ లలాటాక్షుఁడు యీశ్వరుఁ డెందుకు కావలెను ? ప్రాస కొరకు; ఆంధ్ర సారస్వతములో 'వీణా ముని' 'వర్ణద్రాక్షా ఫలకీరి' 'గాన కళాతుంబురుఁడు' గోకర్ణ కుండలుఁడు' యిట్టి పన్నాగములలోఁ దెన్నాలి రామకృష్ణుఁడు ఘటికుఁడు; తక్కినవారు వాని వలె పల్టీలు కొట్టవలె నన్నచో నడుములు విఱుగు నంతే !

వీరు పీఠికలో కవిత్వముపైఁ దమకుఁగల యభిప్రాయములను గొన్నిటిని జెప్పినారు. తప్పులు, నొప్పులును లేని కావ్యము సామాన్య దార వంటిది; తప్పొప్పులు రెండును గల్గినది యొప్పని జాతి లతాంగి; తప్పులు లేక యొప్పులు మాత్రమే గల్గినది. వంశ విలాస రేఖలతోడి యుత్తమ నాయిక; "అల్పాక్షరం

బుల నధికార్థంబు గుదియించి, పద్య పూరణంబుల కాది కారణంబు లయిన సంస్కృతాంధ్ర భాషలంగల జల్లులు విసర్జించి, రసపోషణ శబ్దంబు లుపార్జించి రచన సాఁగించినాఁరట !" అల్ప శబ్దములతో నధికార్థము గుదియించు శక్తి సంస్కృతాంధ్ర భాషలలో నెంతమందికో లేదు; ఆ తపస్సును సంపూర్ణముగా సాధించినవాఁడు, సంస్కృతములో నాది కవియైన వాల్మీకి యొకఁడే; తెనుఁగులో భట్టారకుఁడు; ఆ శక్తి 'నాలోఁగల'దని పాల్కురికి సోమనాథుఁడు జబ్బలు చఱచెను; అతఁడు మతావేశపు ముద్ద; అతనికిని సంయమునకును జాలదూరము; ఎన్నుకొన్నది ద్విపద యగుటచే అందందు శ్రుతి స్మృతులు దూర్చుటచే సోమనాథుఁడా యభిప్రాయమునకు వచ్చినట్లున్నది; జల్లులు విసర్జించితిమని యొక మాట; ఎందుకు లేవు ? వారు చెప్పిన 'వదరు మాటలు, పూదె మాటలు, పూత మాటలు, జల్లి మాటలు' సర్వముండనే యున్నవి; రసపోషణమునకు శబ్దములు మాత్రమే ఎన్నుకొన్నారు; వీరి రచన శాబ్దికమనుటందులోనే యున్నది; చాపల్యములతోఁ జేయలేదుగాని పద్యము కుదించి, కట్టు నేర్పుగూడ వీరికున్నది.

ఒక నిషాద నాయకుఁడుండెను. వానికి 'కర్జునకి'యను గూతురు గల్గినది. దానికి యవ్వనోదయమైనది. ఆ వర్ణన మీ క్రిందిది.

గీ॥ హరిణ కరి హరి చమరంబు లక్షి కుంభ<br>
మధ్య వాలాకృతులు దెచ్చి మనుపు కొఱకు<br>
భిల్ల పతియింట గిరవులు వెట్టె ననఁగ<br>
దృక్కుచ వలగ్న చికుర చారిమల నొప్పు -

—జింకలు, కరులు, హరులు, చమరములు, అక్షికుంభవాలాకృతులను భిల్లపతి యింటిలోఁ గుదువ యుంచినవి. అవి, యీమె, దృక్కుచ వలగ్న చికుర చారిమలైనవి. ఈ యంగములు వానితో సమానములని తాత్పర్యము. పద్యము ప్రవాహ వేగముగాఁ గాక కొంత యాగి కట్టుకొన్నారు కాని, వాస్తవమున కిది విస్తృతీకరింపవలసిన భావము. క్రమాలంకారము, గీతములో నిరికికొని 'తుస్స'ని పోయినది. ఒక్కొక్కసారి వారి యురవడిలో చాల పలుచని రచనలుగూడ అర్థమాక లేక దొరలును.

... ... ... ... ... ... ...హే
మాహేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాతృ
లీసాము తే
లా ! హీ నాధిక భావముల్ తడవరాదంచున్ వితా
కుండనై —

—పై రచన యేదో యవధాని చెప్పవలసినది. వారి దృష్టి యతి ప్రాసలపైననే దప్ప దక్కిన వానిపై నుండదు. కావ్యములలో నీ యల్లిక చాల దౌర్భాగ్యము. 'వితాకుఁడు' వితాకు గలవాఁడు; ఈ ప్రయోగమునకు వారి విశంకట వృత్తియే శరణ్యము.

వరాహపురాణములోఁ జక్కని జాతీయములు గూర్చిన శైలి చాలా చోటులఁ గలదు. "నిడుపులు పైడిగాఁగ విత్త మార్జించి" "నోరి మాట నోరనే యుంత" "మూపును, మూపునఁ దొలఁగ ద్రోయరాని సందడి" "పిస వెట్టి విప్ర ! యీ చీకటుల్ ద్రవ్వింపంబనిలేదు, నట్టేటికి నెదురేగెడి గతి" "రోళ్లన్ రోకళ్లన్ బాడ, గాదములోని దోసకాయల వలె" "ఈనిన పులుల వంటి రాచ బిడ్డలు, యెంగిలి చేత కాకి నేయఁ జాలఁడు" ఇట్టివి వీరి కందుకున్నట్లు, చేతికిఁ జిక్కును; "చెట్టెక్కి చేతులు విడిచినట్లు" "అలి నొల్లని వాఁడు దానల కూర కుప్పు చాల లేదన్నట్లు" వంటి సామెతలు గూడ జంట కవుల శైలి కొక యందము; ఒక్కొక్కసారి యీ శక్తి వెట్టి తలలు వేయుటయు గద్దు; అశ్వశిరస్సు డను నొక రాజుండెను. అతని కడకు కపిలుఁడు, జైగీషవ్యుఁడు యిర్వురు మునులు వచ్చినారు. వారిని రాజు "యే రీతి నారాయణు నుపాసించినచో విధే యుఁడ"గునని ప్రశ్నించెను. వారు "మేమే నారాయణుల" మన్నారు. వారికిని అతనికిని వాదము పెరిగినది. ఆ మునులు యోగ విద్యా చాతుర్యముతోఁ గొన్ని వింత లొనర్చిరి. క్షణములో 'మయూర, కీర, కోకిల, మరాళములేగాక, కాక ఘూకమశక మత్కుణాదులు'ను బుట్టినవి. అప్పుడా రాజు 'భవదీయమైన యీ నైపుణి చాలు చాల'ని గోల పెట్టినాఁడు. వీరు 'జా పరమేశ్వరా !' యని చిటికె వేసినారు. సృష్టించిన జంతువులు వచ్చినవి వచ్చినట్లే మాయమైనవి. ఈ మునుల వాలక మేదో పసిపిల్లల యాటగా నున్నది. చాలని దానికి 'జా పరమేశ్వరా !'

యనుట మరింత పనికిరాని మాట. నాటి సాంఘికాచారములు గూడ వీరు కొన్ని తమ కావ్యములోఁ జొప్పించినారు. ఈ క్రింది దొకటి –

చం॥ సమత సమస్తచిత్తముల సంతతము న్విహరించు గాన, దై
వము మదనుండె తథ్యమని, వంచన యించుక లేక యెండచేఁ
గమలపుటీ కటాహములఁ గ్రాగెడి తేనియ నూనె తప్తమా
షము దొడికెన్ మదభ్రమర జాలము కేలి సరోవరంబులన్॥

—మదనుఁడే ప్రధాన దైవమని, మదభ్రమర జాలము వాదించినది; దానిని స్థిరీకరించుటకుఁ గమల పుటీకటాహముల యందలి తేనియ నూనెలోని తప్త మాషమును గడ్డకుఁ దీసినదట! మరి యొకటి!

కం॥ సుమ వికసనమున లతికా
రమణులు మెరసిరి గళన్మరందమ్మను తై
లమునఁ బరాగమ్మను కుం
కుమ దోఁగి సమర్త పెండ్లి కూఁతుల మాడ్కిన్॥

—ప్రాచీన కావ్య సాహిత్యములు జెప్పెడి కొన్ని యాచారములు మనకర్థమేగావు. జీవన విధానమే మారిపోయినది కదా! నాచనసోముఁడు మొదలైన వారు యిట్టి ప్రయోగము లెన్నిటినో చేసినారు; కీర్తిశేషులు సురవరం ప్రతాపరెడ్డిగారు వేటూరి ప్రభాకరశాస్త్రి గారివంటి విద్వాంసు లెంతయో శ్రమ కోర్చి కొన్నింటి యర్థములను వివరించిరి. కాని, యింకను దెలియని వెన్నోగలవు; అన్నమయ్య లోనిట్టివి వేలకు; నలుగురు చెప్పని రీతిగాఁ జెప్పవలె ననునాస "వరాహ పురాణము''లో నెక్కువ; ఈ గుణము హర్షింప దగ్గదే. కాని, సాధించుట కష్టము.

ఆంధ్ర సాహిత్యములో నీ "మురారే స్తృతీయః పంథా''ను సమర్థముగా నెగ్గించి కొన్న వారిద్దరే. రాయలు, తెనాలి రామకృష్ణుడు.

ఈ క్రిందిది వీరి వసంత వర్ణనములో నొకటి.

కం॥ తన పగతు కంఠమును బో
లె నటించు రతీశ్వరుండలిగి కత్తుల బో

నునఁ బెట్టిన మూల్గెడి విధ
మున పికము ప్రవాళ మధ్యమున నెలుఁగించెన్॥

—వసంత కాలములో కోకిల కూసిన స్వారస్యమిది. మన కవులు కోకిల స్వర మును పంచమ స్వరముతోఁ బోల్చి యెంతయో మురిసిరి; దాని కషాయ కంఠ మున కేమేమో మేతలు; వీరి కోయిల మూల్గినదట; నాకుఁ దెలిసిన యొక యమ్మాయి యుండెడిది; ఆమె కడ నాకెంతయో చనవు; ఒకసారి యావిడతోఁ "పెండ్లియైన తరువాత నీవు మొట్ట మొదటి సారిగా భర్తతో మాట్లాడిన మాట ఏమిటి ?" అని ప్రశ్నించినాను. ఆవిడ దీర్ఘముగా నాలోచించి, "ఒకనాడు కడుపు నొస్తూంది అన్నాను" అన్నది. దాంపత్య జీవనము "భలే"గా నారంభమైనదను కున్నాను. ఈ పద్య మట్లున్నది.

వరాహ పురాణమును కావ్య వస్తువుగా నెన్నికొనుట యీకవుల దురదృష్ట మనియే చెప్పవలె. దాని నిండ పూర్వాఽపరక్రియలు అంటిమి. వీరు వ్రాసిన "ప్రబోధ చంద్రోదయము" గూడ నిట్టిదే పాపము; కృతిపతియే, కావ్య వస్తువును నిర్ణయించి యుండవచ్చును; కాని యీ పురాణములో నక్కడక్కడ కొన్ని కథలు వచ్చును. అవే వీరి వర్ణనా విశృంఖల భూములు. ఆ వర్ణనముల కక్కడ అవసర మున్నదా ! లేదా; ఉన్న నెంత మాత్రము ! యీ ప్రశ్నలతో వారికి నిమిత్తము లేదు; వీరేకాదు ప్రబంధ కవులకా ప్రశ్నలు రానేరావు. వారి "నాలుక త్రుప్పు డుల్లుట" కేదో సాకుఁ గావలెను; అట్లయిన నౌచిత్యము చెడదా ! ఇది చాల పెద్ద ప్రశ్న; ఔచిత్యమునకు లోకమే ప్రమాణము; 'కావ్య పరిశీలనా పరిణత బుద్ధు'లను మాటయు గ్రుడ్డి గుఱుతే. దేనితో హృదయ సంవాదమున్న, వాఁడు దానినిఁ జదివి యానందించును; "వరాహ పురాణము"లోని యొక కథ యిది. వసురాజను వాఁడొకఁడు, వానికి బ్రహ్మ హత్య యంటినది. వసురాజు తపస్సు చేసెను. కిరాత రూపమున బ్రహ్మ హత్య గడ్డకు వచ్చినది. "నీవు నాకెట్లంటుకున్నా"వని రాజు ప్రశ్న; దానికి బ్రహ్మహత్య యిట్లు సమాధాన మిచ్చినది; "నీవు పూర్వ జన్మమున వేటకుఁబోయి యొకానొక మునిని జంపితివి, అతఁడపుడు మృగరూప ధరుఁడై యుండెను. నాటి నుండి నీ యందు నేను వసించుచున్నాను." దానితో వసువునకుఁ బూర్వజన్మ స్మృతి వచ్చినది. ఇఁకబైదంతయు పురాజన్మ గాథ.

తన బాణముచే ముని మరణించినాఁడు. ఇది రాజునకుఁ బెద్ద దుఃఖ కారణ మయ్యెను; సుఖముల వదలి పెట్టినాఁడు; హరి ప్రీతికై వ్రతములు చేయుచుండెను; ఇంతలో నెండకాలము వచ్చినది; ఒక్క యేకాదశినాఁడు రాజు నిర్జలోపవాసము చేసి పారణ జేయఁ బోవుచు మణి కుట్టిమ స్థలమ్మున నడుగు వెట్టి, ఉదర శూల పుట్టి చచ్చిపోయినాఁడు; ఎంతకాలమునకుఁ గథతోఁగల సంబంధ మింతే; ఏకాదశి నాటి ప్రభాతము. "పూర్వ పర్వత శిఖర భూమి. సామి సముదిత మిహిరకిరణ కిసలయ వ్రాతంబులకు బాల చూతముగా "నుండినదట! ఇట్టి చోటుల కేదారి ప్రతిభ;. బ్రహ్మహత్య వ సురాజు దీవనతో ధర్మ వ్యాధుఁడు నిషాదుఁడైనాఁడు అర్జునకి వాని పుత్రి; దాని యవ్వనోదయమును గవులు వర్ణించిరి. సుప్రతీకుఁ డను రాజు. వాని భార్య విద్యుత్ప్రభ; ఆమెకు దుర్జయుఁడను కుమారుఁడు గల్గి నాఁడు; వీఁడు గల్గుటకు ముందు యథాప్రకారము గర్భిణీ వర్ణనముగావలసి వచ్చినది; దుర్జయుఁడు పెద్దవాఁడైనాఁడు; జైత్రయాత్రకు వెళ్లెను; గంధమాదన మున నున్నాఁడు; ఆ పర్వతములో వసంతము వచ్చినది; వసంతముతోఁబాటు శుకపికాదులు, పల్లవములు, పూలు, మొగ్గలు మలయ మారుతము యీ సరంజామా!, కవుల యిన్నాళ్ళ యేకాదశి కిది పారణయైనది. ఆ సమయమున నక్కడ హేతి ప్రహేతి పుత్రిక లిర్వురు వారి చెలికత్తెలును మన విహార మొనర్చుచున్నారు; ఆ పిదప జలకేళి, దోహదక్రియలు, ఈ వనకేళిలో నొక పెద్ద "రగడ"ను బెట్టినారు. ప్రబంధములలో మొట్టమొదలు 'రగడ' ను వాడిన వారు వీరే! తరువాతి వారికిది యొరవడి యైనది; జలకేళి వర్ణనలో నొక పద్యమిది,

గీ॥ మచ్చరంబున నిద్దరు మానవతులు
పెడ మరలి చల్లులాడంగ నడుమ గూడి
జడలు గనుపట్టె; కాంచన స్తంభ కీలి
తాంగ భవ నీల డోలికా యంత్ర మనఁగ॥

—జలకేళిలో నిర్వురు యువతులు పెడమరలి పరస్పరము నీరు జల్లికొను చున్నారు. వారి వ్రేలాడుచున్న జడలు నీటిపైఁదేలుచు నొకదానితో నొకటి పెనవేసికొన్నవి. అది యంగభవునకు నీలడోలికా యంత్రమువలె నున్నదట,

ఆ యిర్వురు స్త్రీలును కాంచన స్తంభములవలె నున్నారట! ఇంతలో దుర్జయుఁ డక్కడ కేవలము విజయ నగరము రాజువలెనే సాక్షాత్కరించినాఁడు. వాని వాలకమిది.

సీ॥ వలపులు గొలుపు చెంగలువ క్రొవ్విరులరే
కులుగానరా సేసకొప్పు ముడిచి
మంచి పన్నీట మేదించిన సారంగ
నాభి పంకంబున నాభి దీర్చి
కుడివంక గోణము కొంగురింగులు వార
నిండు చెంద్రికలచే దిండుగట్టి
కొమరువెన్నెల వెల్లిగొలుపు కట్టాణీ మౌ
క్తికములఁ గంఠమాలికలు వైచి

గీ॥ పసిడి సింగిణి ధరియించి రసికజన స
మేతుఁడై దుర్జయక్ష్మాతలేశ్వరుండు
వచ్చె నెదుటికి నారాజ వదన గొలుచు
నించు విలుకాఁడు సాక్షాత్కరించె ననఁగ॥

—హేతి ప్రహేతి పుత్రిక లిర్వురంటిమి. ఆ యిద్దరిపై నొకేసారి దుర్జయునకు ప్రేమపిచ్చి యెత్తినది, వారినింతలోఁ జెలికత్తెలు బిలుచుకొని పోయినారుఁ దుర్జయుఁడు వారిని నఖ శిఖ పర్యంతము వర్ణించి కొనుచు గాలము గడుపు చున్నాఁడు, అంత నక్కడ చంద్రోదయము. వాఁడు గ్రుమ్మరించిన వెన్నెలలు, దుర్జయుఁడు వచ్చుననియు. హేతి ప్రహేతి పుత్రికలు వత్తురనియు గంధమాదనమునకు రాలేదు. వాఁడు వచ్చెను యివియు సంఘటిల్లినవి నేటి సినిమాలలోని సన్నివేశములవలె, దుర్జయునివలెనే హేతిప్రహేతి పుత్రికలను గూడ మన్మథుఁడు తాం, తామ్మని మోదినాఁడు, సఖుల శిశిరోపచారములు. చంద్ర మలయమారుతాదులను మనసు వచ్చినట్లు దిట్టుట అన్ని ప్రబంధములలోని యలవాటు నింతే. జంటకవులే కోలాహలమునకు శ్రీనాథ గురువునకు నమస్కరించి మొక్కలు

నాటినారు. నాయికలకు దుర్జయునితో వివాహమైనది. చాలకాలము గడచెను. దుర్జయునకు సంతానమైనది. తరువాత నొకనాఁడు వాఁడు వేటకు వెళ్ళెను. ఈ వేట వర్ణనము గొంత దీర్ఘముగనే సాఁగినది. పెద్దనగారికిఁగూడ దీని ననుసరింప బుద్ధి పుట్టినది. వేటలాడుచు దుర్జయుఁడొకానొక యాశ్రమమునకుఁ బోయెను. అందులో గౌర ముఖుఁడను ముని ఆతిథ్యముగొమ్మని ముని పట్టు బట్టి నాఁడు. ఆశ్రమములో నేమియులేదు. సైన్యమా విస్తారముగ నున్నది. "ఇత డెట్లు మా కాతిథ్యమొసర్చును?", మీరు శ్రమ పెట్టికొనవలదు, మరలి పోయెద" మని దుర్జయుఁ డనెను. ముని నిర్బంధించినాఁడు. అతని దగ్గర నొకమణి యున్నది. ఆ మణి ప్రభావముతో నన్ని హంగులును సమకూరినవి. ఆ దిన మంతయు దుర్జయుఁ డచటనే గడపినాఁడు. సంధ్యాకాలము వచ్చినది. అందు లోని పద్యమిది.

కం॥ అకరువు మచ్చుల గుది, క
ర్ణికా సువర్ణంబు, మధుపనికషము గల త
మ్మి కవిల సంచి, దివస వై
శ్య కులాగ్రణి వాయిగట్టె సంధ్యా వేళన్॥

—సాయంకాలమునఁ బద్మములు ముకుళించినవి. దివసమనెడు వైశ్యుఁడు బగ లంతయు వ్యాపారము చేసినాఁడు సంధ్యయగుటతోనే 'తమ్మి యనెడు' కవిల సంచి'ని బిగించినాఁడు. వ్యాపారము రాత్రి సాఁగదు గదా! ఆ కవిల సంచిలో నేమేమున్నది! అకరువనెడు మచ్చులగుది, కర్ణికయను సువర్ణము, తుమ్మెద యనెడు ఒఱపిడి రాయి. రాత్రి, తుమ్మెద పద్మములోనే యున్నదన్నమాట! ఇట్టి చోటులనే పీనెప్రతిభ గొప్పగా భాసించునంటిని. ఒక పద్మము ముకుళించు చున్నది. దానిలోని తుమ్మెదలేచి పోవుచుండెను. అప్పుడే ముకుళించుచున్న కమలములో తేటిరెక్కయంచు దగులుకొన్నది. దానిని విడిపించు కొనుటకు తుమ్మెద తనుకులాట. దాని నీ కవు లిట్లుపమించిరి.

చం॥ ఎడపని కూర్మితోడ రమియించి, వృధా కలహించి పాసిపో
యెడు తటిఁ గామినీ కర గృహీత పటాంచలుఁడైన భర్తకై

వడి మునిమాపుదాక మధువారి యథేష్టముగాఁగనాని వె
ల్వడుచు బెనంగె దేటి ముకుళత్క్రమల గ్రసితాగ్రపత్రమై॥

—పై నాయక వర్ణన యెంతయో ముచ్చటగానున్నది. చంద్రబింబము వొలిచి నది. అది యిట్లున్నది.

సీ॥ ఉపసుధర్మాస్థాని నున్న వేలుపు గ త్త
ళానికిఁ బట్టు తలాట మనఁగ
యామిని శయనించు నాకాశనీల త
ల్పము మీదఁ జెంగావి బటువనంగ
సాము చేయుచు దివస్పతి కుమారుఁడు భుజా
ర్గళి నెత్తు కెంపు సంగడి యనంగ
గై సేసి కొనుచు బ్రాక్తరుణి సొమ్ములకునై
పట్టిన బచ్చన బరణి యనఁగ

గీ॥ పాలి తోత్పలినీ కదంబమ్ము, చకిత
చక్రవాక కుటుంబమ్ము, సమధి కాంధ
కార పర్వత శంబమ్ము, కాంతి విజిత
పక్వ బింబమ్ము, చంద్ర బింబమ్ము వొలిచె॥

—శబ్దముల కూర్పునందును, అర్థముల చేర్పునందును చాల మనోహరమైన పద్య మిది; గీతములోని బహువ్రీహి తత్పురుషలు చాల ముచ్చటగ నున్నవి. "సంగడి" మనుచరిత్రలోని కెక్కినది, రాయల యుగమునందలి కవులు 'వరాహ పురాణము'లోని పదములను అర్థములను అక్కడక్కడ దీసికొన్నారు, తన తండ్రికి గృతియిచ్చిన కావ్యము గనుక రాయలు గూడ కొన్నిసారులు జదివి యుండును, అతనిలోఁ గూడ నలఁతియలఁతి యనుకరింపులున్నవి, రాయల ముఖోల్లాసమునకై బెద్దనాదులు దీని నొఱవడిగాఁ బెట్టికొని కొన్ని కల్పనలు చేసిరి. ముక్కు తిమ్మనకు వీరు బంధువులే యైరి, అతని వెన్నెల

వర్ణనము యిక్కడ చూర్ణిక పరస్పరము సంవదించి నట్లున్నవి, రాచనగరులో వలెనె దుర్జయున కన్ని యుపచారములును సాఁగినవి, విజయనగర ప్రభువులు నగళ్ల లోని వెక్కసమైన రసికత యంతెయు నక్కడనున్నది, ఆ రాత్రి రాజునకే గాక సైనికులకును, ఒక్కొక్కరి కొక్కొక్క 'ఫస్టురేటు' నాయికను 'మణి' సప్లై చేసినదట! ఇంతలోఁ దెల్లవారెను. కోళ్లు గూసినవి —

కం॥ జక్కవలకు రవి యిఁక రా
గ్దిక్కు ధరం బెక్కు ననుచుఁ దెలియఁ ద్రివాచన్
నిక్కము సేసిన తెఱఁగునఁ
గొక్కొక్కొక్కొరుతులఁ గోడి కూయఁ దొడంగెన్॥

—పై పద్యమునకు వ్యాఖ్యాన ప్రాయమే పెద్దన్నగారి యీ క్రింది పద్యము —

మ॥ సకలాశారతి నర్మకోప విరతి ప్రశాంత క్రియారంభణా
త్మక వర్గత్రయికిన్ మదుచ్చరిత శబ్ద జ్ఞానమే మూల మిం
తకుఁ బోలన్విను మంచుఁ దెల్పుగతి, చెంతన్ గొండపై పల్లెలన్
గృకవాకుల్ మొరసెన్ గృహోపరి త్రిభంగిన్ భుగ్నకంఠ ధ్వనిన్।
(3-55)

—పెద్దన్నతో రామరాజభూషణుకుఁ బందెము.

మ॥ ఒకనాఁ డింద్రుని యంత వేలుపు మదీయోక్తిన్ విడంచించి తా
నొక కాలం బెటఁగింప వచ్చి మునిశాపోద్వృత్తి పాలయ్యో మా
మక శబ్దం బిది యల్పమే; త్రిముని సంభావ్య త్రికాలావిబో
ధకమన్ రీతిఁ ద్రిభంగిగా మొఱఁసె జెంతన్ తామ్రచూడౌఘముల్॥

—పెద్దనామాత్యుల మనుచరిత్రలో వరాహపురాణములోని యనేక పదములు దొర్లిపోయినవి, పారిజాతాపహరణము కడకు తెనాలివాడు గూడ నంతయో యింతయో వరాహ పురాణమున కప్పు వడియున్నారు, రామరాజభూషణుఁడు వీరువాడిన శ్లేష పదముల నక్కడక్కడ త్రుంచి కొని తన కావ్యశోభకు మూల పదార్థములుగా వాడికొన్నాడు. రాయల కాలములోని కవులు వరాహపురాణ మను పునాదిపై మేడను గట్టిరనుమాట కొంత విడ్డూరముగ నున్నను సత్యదూరము మాత్రము గాదు.

సంగీత నాట్యములలో వీరికిఁ గొంత యభినివేశమున్నది. దుర్జయునకు గౌరముఖుని యాశ్రములలో గౌరవము జరిగినదంటివి గదా! అక్కడనొక నాట్య ప్రదర్శనము నేర్పాటు చేసినారు. ఆ వర్ణన మీ క్రిందిది.

సీ॥ సరసిజ ద్వయముపై నెరయు తుమ్మెద పిండు
వలెఁ గాళ్లఁ గజ్జెలు గులకరింప
కంతుని బాణమ్ము గడి చందమున బింజె
విడిచి గట్టిన చీర గుడుసు వడగ
హిమము గప్పిన రథాంగముల చందమున గం
చెలలోని మెఱుఁగు జన్నులు చలింప
చదల బ్రాకిన యఱ సంజ భావమున క్రొ
మ్ముడి మీద జెంగావి ముసుఁగు నిలువ

గీ॥ నంగముల గీత మర్థంబు హస్తముల దృ
గంచలమ్ముల నా కూత మంఘ్రి పల్ల
వముల దాళమ్ము దెలియ మార్గమున దెలిసి
ముద్దియలు గొంద రాడిరి మోహనముగ॥

—వారు ధరించినవి వెలిపట్టు రవికెలు, క్రొమ్ముడిపైఁ జెంగావిముసుఁగు నిలిపినారు. నాట్యములలో నప్పటికే కొంత మహమ్మదీయ సంప్రదాయము తొంగి చూచుచుండినవి. భరతముని యీ క్రింది శ్లోకమును జెప్పినాఁడు.—

శ్లో॥ కంఠేనాలంబ యేద్గీతం - హ స్తేనార్థం ప్రదర్శయేత్
చక్షుర్భ్యాం దర్శ యేద్భావం-పాదాభ్యాం తాళమాచరేత్॥

— పై శ్లోకార్థమే గీతపాదములలో నిబంధించినారు. "అంగములు" యీ శబ్దము నెట్లన్వయించి కొనవలెనో తెలియదు. కొందరా రగడలో పాటకచ్చేరీలు కూడ చేసినారట! ఆ పద్ధతి యిట్లున్నది.

కం॥ నాళీకముఖులు గొందరు
సాళగ సంకీర్ణ శుద్ధ సరణి మెఱయఁగా
నాళతులు సేసి పాడిరి
తాళగతులు మంద్ర మధ్య తార శ్రుతులన్॥

—సాధారణముగా మేళకర్తరాగములను శుద్ధరాగములన వచ్చును. కాని యీ మేళకర్తల నిర్ణయము 'వరాహ పురాణము'నకుఁ దరువాత వచ్చినదే. మతంగుఁడు వ్రాసిన "బృహద్దేశి" గ్రంథములో రాగములను శుద్ధ, ఛాయాలగ సంకీర్ణములుగా విభాగించినాఁడు. నేఁడు ఉపాంగ, భాషాంగ క్రియాంగ రాగాంగము లన్నారు. ఛాయాలగమే సాళగము. ఒక రాగములో నన్యరాగ చ్ఛాయ వచ్చినచో నది సాళగము. బిలహరి రాగమునకుఁ గాకలీ నిషాదము. కాని "పదని 'పదప' యిత్యాది ప్రయోగములలో కైశికీ నిషాదమై యన్యరాగము ఛాయా మాత్రముగ గన్పించును. సంకీర్ణ రాగమునకు నేటి "కాపీ" బేహాగ్ మొదలగు వానిని ఉదాహరణములుగా దీసికొన వచ్చును. "కాపీ" రాగములో "రిమ పనిసా" అనుచోట కాకలీ నిషాదము. 'సనిదనిప' 'మపగారీ' అను ప్రయోగములో సాధారణ గాంధారము. 'గాగామనిపగారీ' అనుచోట అంతర గాంధారము. "గారీ" అనునది 'సాధారణ గాంధారము' 'సగమపదా' యిక్కడ శుద్ధ దైవతము. 'మగారీ' యిచ్చట సాధారణ గాంధారము. నిసా కాకలీ నిషాదము. ఈ రాగ స్వరూపములలో నన్యరాగచ్ఛాయలు కోకొల్లలుగాఁ జూపింతురు:ఇట్టివే సంకీర్ణరాగములు. ఏవో ప్రసక్తి వచ్చి తడవితినంతే. ఈ కవులు జూపించిన వ్రేలితో, దరువాతి విజయనగర కవులు హస్తమంతయు మ్రింగినారు సంగీత పరిష్కృతములైన వీరి కొన్ని 'బాణీ'లను వసుచరిత్రకారుఁడనుసరించెను.

మొత్తము పైన శృంగారరసము యొక్క పాలు - యీ పురాణములో గూడ నెక్కువే. తపస్సులకుఁ బోయినను "ముక్తికాంత కుచ పాళిక పజ్జల పత్ర భంగముల్" వ్రాయుటయందే వారి చూపు.

గర్భ కవిత్వములు తెనుఁగులో మొదట మొదలు పెట్టిన వారు వీరేనని పించును. ఈ యంటు జాడ్యము ముక్కు తిమ్మనకు గూడ వ్యాపించినది. ఇంత వఱకు నా శక్తి కొలఁది 'వరాహ పురాణ'మును సమీక్షించితిని. ఇంకను విశేష ములు, నా కన్న వయస్సులో, విజ్ఞానములోఁ బెద్దవారు వింగడింప సమర్థులు. ఈ గ్రంథమును బర్యవేక్షించుటకు నా కవకాశ మిచ్చిన వారు మాన్య మిత్రులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు; గోపాలరెడ్డిగారి వాక్యము దాని కుపశ్రుతి, వారిరువురకు నా మనఃపూర్వకమైన నమస్కారములు. నా దగ్గఱనున్న ప్రతిలో ఖిలములైన గొన్ని పద్యములను నిడుదవోలు సుందరేశ్వరరావుగారు నా కంద జేసిరి. వారి యుపకారము లేనిది యీ గ్రంథము పూర్తియై యుండెడిది గాదు. వారికి నమస్కారము, మిత్రుఁడు వై. సి. వి. రెడ్డి తనవద్ద నున్న పురాతన ప్రతి "వరాహ పురాణము" ను నా కొసఁగి యుపకరించెను. ఆ సాహిత్య పిపాసికి నా యాశీర్వాదము. కుం. సౌ. నా భార్య ఓర్పుతో నీ వ్రాత ప్రతి నంతయుఁ దయారు చేసినది. ఆమెకు నా యాశీర్వాదము. సహృద యులకు నమస్కారము.

— పుట్టపర్తి నారాయణాచార్యులు

శ్రీ

# వరాహ పురాణము

## ప్రథమాశ్వాసము

—*—

శ్రీలీలాస్పదమైన కొమ్మన, ధరిత్రీకాంతఁ గారుణ్య ల
క్ష్మీలోలాత్మక నెత్తి లీల జలదాశ్లేషైక శృంగోన్నమ.
త్కైలాసంబును బోలె నున్న జగదేకస్వామి వారాహ దే
హాలంకారుఁడు ప్రోచు నీశ్వరనృసింహక్ష్మావధూవల్లభున్. 1

శా. తా నానందముతోడఁ గుంకుమపసంతం బాడెనో నాఁగ, సం
ధ్యానాట్యావసర భ్రమీ గళిత మస్తన్యస్త నాకస్రవం
తీ నీరేరుహ రేణువుల్ తనువుపై నిండగ, దీపించు గౌ
రీనాథుం డొసఁగున్ గృప, న్నరస ధాత్రీభర్త కైశ్వర్యముల్. 2

ఉ. కూలము డిగ్గి, స్నానమునకున్ సురవాహిని సొచ్చి నిల్వఁగా
నాలుగు నీరజంబు లొకనాళమునం బ్రభవించె నెట్టి చో
ద్యాలని ముగ్ధ నాకవనితల్ తనమోములు చూడ నవ్వ భా
షా లలనేశ్వరుండు నరసక్షితిజానికి నాయు వీవుతన్. 3

చ. స్మరసమరంబునం బరవశత్వము నొంది, మహేంద్ర నీలభా
స్వరమగు దానవాంతకుని వక్షముపై, నొరగంటఁ జక్కఁగా
నొరసిన హేమరేఖవలె నున్న రమారమణీ లలామ యీ
శ్వరునరసింహభూపతి నివాసమునన్ వసియించు గావుతన్. 4

సీ. కొలని కెందమ్మిపూవులు వినోదార్థంబు
పయ్యెదకొంగు లోపల వహించి
మందిరాంతర చంద్రమణి శిలాకుట్టిమా
వని మీఁదఁ దావచ్చి వచ్చి మెలఁగి
తన సయావక పాదతలములఁ ద్రొక్కిన
చోటులు దప్పక చూచి నిలిచి
యోహో! సరోజంబు, లొడివిడి పడియె, నే
రకొనంగ వలె నని సకులఁ బిలిచి

గీ॥ ముద్దరాలు తుషారాద్రి ముద్దుపట్టి
శ్రీసదాశివదేహ భద్రాసనస్థ
సమరవిజయంబు లొసఁగు నీశ్వరనృపాలు
నారసింహ వసుంధరానాయకునకు. 5

శా. లావణ్యంబులు నాభి కూపమున వెళ్ళందోడి, ముద్బ్రజవ
ద్భావక్షేత్రము నందు వంచు ఘటయంత్రంబో యనంగా, జప
వ్యావృత్త స్ఫటికాక్షదామకము, హస్తాబ్జంబునం దాల్చు వా
ణీవామేక్షణ, నారసింహునికి సంధించున్ వచోవైఖరుల్. 6

చ. పెనిమిటితోడ శీత మహిభృత్పతి కన్యక జూదమాడి గె
ల్చిన హిమరశ్మిరేఖఁ దనచేతికి నిచ్చిన బాల్యచాపలం
బునఁ గబళింపఁగా విఱిగిపోయినకొమ్ము మను వచ్చినట్లు మిం
చిన కరివక్త్రుఁ డీశ్వరనృసింహునకున్ వరదుండు గావుతన్. 7

వ. అని యాశీర్వదించి వచనరచనా చాతుర్యంబున నల్పాక్షరంబుల నధి
కార్థంబు గుదియించి పద్యపూరణంబులకు నాదికారణంబులైన సంస్కృ
తాంధ్ర భాషలంగల జల్లులు విసర్జించి రస పోషణ ప్రధాన శబ్దంబు లు
పార్జించి భక్తజనమనోరథ నిర్వాహక మహావరాహదేవ చరణ స్మరణా
యత్త చిత్తులమై. 8

సీ. అతి పవిత్రంబైన యమునాతరంగిణి
సైకతం బెవ్వాని జన్మభూమి
ప్రామినుకులు సూత్రపఱచి లోకహితంబు
గా నిర్వహించె నెవ్వాని బుద్ధి
కలుషంబు విదళింపఁగల ధర్మశాస్త్ర ప్ర
పంచంబు లెవ్వాని పలుకుఁబళ్లు
కొదవడ్డ కౌరవక్షోణిపాలవతంస
వంశంబు నిలిచె నెవ్వాని వలన

గీ. నట్టి సాత్యవతేయు మహామునీంద్రుఁ
డను సుధాబ్ధికిఁ గల్పకం బనఁగఁ వెలయు
శ్రీవరాహపురాణంబుఁ జెప్పఁ గడఁగి
తిమి తెనుంగున గవికులోత్తములు పొగడ. 9

వ. ఈ కృతిప్రారంభంబు కర్ణాకర్ణికవశంబున విని సంతత సత్యభాషా హరిశ్చంద్రుండును, తళవకుల దుగ్ధాబ్ధి చంద్రుండును, నిరాఘాట ధాటీ చటుల ఘోట్టాణ ఘోటక పుంఖానుపుంఖ రింఖా ఘురట్టఘట్టిత క్షమాధూళి రింఛోళి సంఛాదితాదిత్యుండును, చతుర కూపార పరీత ధరణీపాల సభా భవన కవినివహ సందోహుండును, విద్యాపరాయణుండును, చాళుక్య నారాయణుండును విశ్వ విశ్వంభరా భరణ స్తంభ సంభావిత కుంభి కుం భీనసకుహనా వరాహుండును, బర్బరబాహుండును, నుద్భట ప్రతిభట భయంకర విక్రమక్రమాధరీ కృతేశ్వర కుమారుండును, నగు నవ్వసుధా ధీశ్వరుం డొక్కనాఁడు. 10

సీ. అష్టభాషా కవి తాబ్జ సంభవులైన
సుకవి పుంగవులు సంస్తుతులు సేయ
సంకీర్ణ రాగ రంజకులైన గాణల
గములు గీతప్రబంధములు పాడ

కల కంకణ క్వాణ కర సరోరుహలైన
రమణులు వింజామరములు వీవ
వర బలాధికులైన శరణాగతా రాతి
సామంతు లుభయ పార్శ్వముల( గొలువ

గీ. కూర్మి తనయు(డు నరసయ్య గుణ నిధాన
మంతికంబున సేవింప, నల(ది కొన్న
సురభి కాశ్మీర గంధంబు సోడు ముట్ట
నుండె( బేరోలగము నయనోత్సవముగ. 11

సీ. అపుడు సభావేది కాగ్రస్థితులమైన
మమ్ము, వాగీశ్వరీ మంత్రరాజ
సిద్ధి పారగుల(, గౌశిక భరద్వాజ గో
త్రుల, మహాదే వాంఘ్రిజలజ భక్తి
పరతంత్రమతుల, నాపస్తంబసూత్రుల,
గురు దక్షిణామూర్త్యఘోరశివుల
శిష్యుల, నతి శాంత చిత్తుల( దనకు నా
శ్రితుల, భాషాద్వయకృతి నిరూఢ

గీ. శేముషీభూషణుల, నంది సింగనార్య
తనయు, మల్లయకవి కులోత్తముని, ఘంట
నాగధీమణి కూర్మి నందనుని మలయ
మారుతాంకితు, సింగయమంత్రి( జూచి. 12

కం. మీరిరువురు నెప్పుడును శ
రీర ప్రాణముల క్రియ( జరింతురు మిగులం
గూరిమి( గృతి( బ్రతిపద్యము(
జారుఫణితి( జెప్ప( గలరు చాటువు గా(గన్. 13

కం. కావున మీరు దలంచిన
శ్రీవారాహంబు మంచికృతి మా పేరం
గావింపుఁ డనుచు సుముఖుం
డై వీడ్యముఁ గప్పురమ్ము నర్పించుటయున్. 14

ఉ. దేవరవంటి పుణ్యునిఁ గృతిప్రభుఁగా నిలుపంగఁ గల్గుటం
బావనమై ప్రసిద్ధిగను మా కవితావిభవంబు, దిక్కులన్
శ్రీవరు పాదపంకజముఁ జెందిన జాహ్నవి ముజ్జగంబులం
బావనతం బ్రసిద్ధిగనుబాగున శ్రీ నరసింహభూవరా !. 15

ఉ. తప్పును నొప్పులేని కృతి దారకులంబుగ వింటిఁ గొంత త
ప్పొప్పులు రెంతు గల్గు కృతి యొప్పని జాతి లతాంగి, తప్పులే
కొప్పులె గల్గు సత్కృతి గుణోన్నతివంశ విలాస రేఖలం
జెప్పఁగ సాటిలేని సరసీరుహలోచన గాదె చూడఁగన్. 16

వ. అని నాయకప్రశంసయు, మధ్యమాధమోత్తమ కవిత్వంబుల తార
తమ్యంబులు వర్ణించి యుత్తమమార్గంబున నేతత్ప్రబంధంబు రచియింప
నుద్యుక్తులమై. 17

సీ. నిరవద్య రఘురామనృపకథారామ కే
లీ మత్తకేకి వాల్మీకిఁ దలఁచి
ధర్మ నిర్మిత కర్మ తన్వంత రాదినా
రాయణ బాదరాయణు భజించి
వాసంతికా మంజరీ సమంజస కవి
త్వ నివాసుఁ గవి కాళిదాసుఁ గొలిచి
గంభీర పదహృద్య గద్యప్రబంధ వి
భ్రమ రమాపారీణు బాణుఁ దడవి

గీ. సన్నుపాచార్యునకు వందనంబు చేసి
తిక్కయజ్వకు మొక్కి కీర్తితములైన
శంభుదాసుని వాగ్విలాసములు నెమ్మ
నంబులోపల నిలిపి శ్రీనాథుఁ బొగడి. 18

కం. నెలకొన్న భక్తి సద్గురు
కుల చూడారత్నమగు నఘోరశివా చా
ర్యుల దివ్య పాదపద్మం
బులకు నమస్కృతి ఘటించి పూతాత్ములమై. 19

వ. తదనంతరంబు, కృతిపతికిం బతియైన సాళువ నరసింగరాజ రాజమౌళి పావనాన్వయంబు మొదల వర్ణింతము. చింతా రత్న కామగవి కల్పవృక్ష లక్ష్మీ పక్ష్మలాక్షుల తోడంబుట్టి మిన్నుముట్టిన పాలమున్నీటిపట్టి సాయంతనసమయ సంఫుల్ల మల్లీ మతల్లికా గుళుచ్ఛ స్వచ్ఛ కాంతి నిస్తంద్రుండు చంద్రుండు వంశకర్తగా, సకలకలికలుషాపహర్త వంకి దేవ మహీభర్త కీర్తికార్తికా ప్రభావంబులు వినిర్మించి దశదిశాం చలంబులుముంచెఁ దత్తనూజుండు చతుష్షష్టి విద్యా వినూతన భోజుండు గుండ్రాజు దుండగపురాచతండంబులఁ జెండాడి మండలాగ్రావంబు కెలంకుల గెలుపుఁగంబంబులు నిలిపెఁ దత్సూనుండు గాండివధన్వసమానుండు సాళువరాజు ఘోరాహవ హట్టంబునం బారశీక-తురగ ఘట్టంబులం గనుపుగొట్టి ధరావరారోహ బాహుపీఠంబునం గుదురు పఱచె, దత్పుత్రుండు నిరాంతక ప్రతాప కమలమిత్రుండు గౌతరాజు రాజ సంబున గుణలతా వితానంబులు సేతు శీతాచల మధ్య పృథ్వీమండలంబున మెండు గొలిపెఁ, దత్సుతుండు వీరలక్ష్మీ సమన్వితుండు గుండరాజు విరోధి రథినీ విఖండన ప్రచండ దోర్దండ మండలాగ్రుండును, సముద్దండ సాహసక్రియా సమగ్రుండును నై, నిరవధిక ప్రభావ ధుంధుమారులం దిమ్మనాథ నరసింగ పార్థివులం గాంచె వారిలోన. 20

సీ. తుహినాంశు వంశ పాథోరాశి మాణిక్య
మష్టదిగ్గాజ భయంకరుండు
కర్ణాట రాజ్య రక్షణదక్ష బాహాసి
వర వసంత త్యాగ వైభవుండు
శివరాత్రి సమయ సంశీలతా గుణశాలి
ధరణీ సుపర్వ నిస్తారకుండు
విరచితాతుల తులాపురుషదాన విభూతి
సమదరాయకటారి సాళువంబు

గీ. గుండవిభు నారసింహ భూమండలేశ్వ
రుఁడు గణుతింప రాజమాత్రుండు గాడు
కిన్నర స్త్రీసమూహ జేగీయమాన
వర్తనంబులుగల చక్రవర్తి గాని. 21

మహాస్రగ్ధర. నరసింగస్వామి రంగన్నగ నిభ గజగంధర్వ పాదాత సైన్య
స్ఫురణా సంపత్తి విద్విట్పురఘులు బలిమిం బూని కాల్పంగ ధూమో
త్కరముల్ కాదంబినీమార్గము నిబిడముగాఁ గప్పి మందాకినీ పు
ష్కరముల్, భానూద్భవా పుష్కరముల కరణిం గానిపింపంగఁ జేయున్.

శా. పోలున్ భార్గవరాముతోడ ననుచున్ భూషింప వేలాపరీ
తేలామండల మాధరాధరముగా నేకాతపత్రంబుగా
నేలున్ సాళువ నారసింహుఁడు భుజంగేంద్రాద్రిపై నున్న ల
క్ష్మీ లావణ్యా సరోమరాళము, చిర శ్రీవృద్ధి గావింపఁగన్.

వ. అట్టి నరసింగ రాజరత్నంబుచేత మన్ననవడసి, సైన్య నాయక
పట్టభద్రత్వంబున, నిర్నిద్ర విజయలక్ష్మీ మహత్వంబున మదవద
భియాతి భయదసత్వంబున దీర్ఘాయు రైశ్వర్యధుర్యుండైన యీశ్వర
నాయకునకుం బ్రియతనూభవుండు నరస వసుధా ధ్యక్షుండు
నిర్వంచితానుగ్రహంబునం బరిగ్రహించి యిమ్మహా

ప్రబంధంబునకు శృంగారవిభూషణంబుగాఁ దదీయ వంశావ
తారంబు రచియింతు మది యెట్టిదనిన. 24

ఉ. మిన్నుల మోచి భాగ్యముల మీఱిన కోటల, రమ్య హర్మ్య సం
పన్నత సస్యవాటగరిమంబులఁ దోఁటల, వాహవరణా
భ్యున్నతిఁ గేళిదీర్ఘికల, నుగ్రభటావలి వన్నెకెక్కి వా
రాన్నిధికాంచిపైఁ దుళువరాజ్యము సంతతవీరభోజ్యమై.

కం. ఆ తుళువ రాజ్యమున వి
ఖ్యాతి వహించిరి, దిగంత కరికట తట సం
భూత మద క్షాళన వి
ద్యా తత్పర కీర్తిఁ బెండ్లియాడిన రాజుల్. 26

ఉ. వారల కగ్రగణ్యుఁడు నివారిత వైరి వరూధినీధవ
శ్రీరమణీ విలాసుఁడు, విచిత్ర కళా కుశలుండు. తిమ్మధా
త్రీ రమణుండు సంపద వరించె మరాట వరాట లాట గాం
ధార యుగంధరాధిప సదః ప్రకటీకృత బాహువీర్యుఁడై. 27

చ. అతనికులాంగ నాతిలకమైన పవిత్రచరిత్ర దేవకీ
సతి కృతపుణ్యులం గనియె శాంతివతంసుల సజ్జనావన
వ్రత పరిపాలనా గుణపరాయణచిత్తుల దుర్మదోద్ధతా
హితవనదావపావకుల నీశ్వర తిమ్మధరాతలేంద్రులన్. 28

కం. అందగ్రజుండు కవిజన
మందారము, పతిహితైకమతి, మానవతీ
కందర్పుఁడు తేజోమ
ధ్యందిన మార్తాండుఁ డీశ్వరాధిపుఁ డుర్విన్. 29

సీ. ఉదయాద్రి భేదించె హుత్తరి నిర్జించె
గండికోటపురంబుఁ గదల ద్రవ్వె

పెనుగొండ సాధించె బెంగుళూరు హరించెఁ
గోవెల నెల్లూరు గుంటుపఱిచె
కుందాణి విదళించె గొడుగుచింత జయించె
బాగూరు పంచము పాడుచేసె
నరుగొండ వెకలించె నామూరు మర్దించె
సీరంగపట్నంబు బారిసమరె

గీ. రాయచౌహత్త మల్లధరావరాహు
మోహన మురారి బర్బరబాహు సాళ్వ
నారసింహ ప్రతాప సన్నహనుఁ డగుచు
విశ్వహితకారి తిమ్మయ యీశ్వరుండు. 30

మ. నరసింగక్షితిపాలు పంపు నుడుగౌనాఁ జేసి దండెత్తి యీ
శ్వర భూభర్త బెడంద కోట యవనాశ్వ వ్రాతముఙ్ భీమసం
గర రంగంబునఁ గొల్లవట్టుకొని, వీఁకం గందుకూరీపురాం
తరసీమంబునఁ జక్కఁగా నఱకె దుర్దాంతారి సంతానమున్. 30

సీ. కనుగొన్న మొదలు తక్కిన మాట లాలింప
బుద్ధిపుట్టని పుట్టుభోగి విడచి
వాలిచ్చి నడవడి వర్ణింపఁ దగిన లా
వరి, దిగ్గజమువంటివాని విడిచి
తన లోతుపాతు సైతము గానరాఁ గూర్మిఁ
గలసిన మొగమాటకాని వదలి
నిలుకడగల కూటములఁ బాయఁజాలక
మరగిన కొండంతదొర దొఱంగి

గీ. వలచి వచ్చిన నిల్లాలి బలె భరించి
పసలఁ జిక్కించి విలసన ప్రౌఢ నిజభు

జాపరీరంభ సుఖముల చవులు చూపె
విశ్వధాత్రికిఁ దిమ్మయ యీశ్వరుండు. 32

కం. సరివచ్చు నీతిభూతి వి
తరణంబులఁ దిమ్మధరణిధవనందనుఁ డీ
శ్వరుఁడు యుగంధర శిబికం
ధరకంధరములకు నని జనంబు నుతింపన్. 33

కం. ఆ బాంధవనిధి గౌరాం
బా బుక్కాంబల వరించెఁ బరమ వివేక
ప్రాబల్యంబున భూల
క్ష్మీ బాలలఁ బెండ్లియైన శ్రీహరి వోలెన్. 34

కం. అదితికి నింద్రోపేంద్రులు
విదిత ప్రాభవులు సంభవించిన పగిదిన్
సదమల పతివ్రతాసం
పద వెలసిన తత్సరోజపత్రాక్షులలోన్. 35

కం. బుక్కాంబకు జన్మించిరి
చక్కని రూపములఁ బంచసాయకులనఁ బెం
పెక్కిన భుజాజలంబున
దిక్కరులన నారసింహ తిమ్మకుమారుల్. 36

గీ. ఇట్లు తుళువాన్వయాగ్రణి యీశ్వరుండు
పూర్వ జన్మ తపఃఫలంబునఁ గులంబు
ధన్యత వహింపఁ గన్నపుత్రకులలోనఁ
బ్రభుత గైకొని నరసింహ పార్థివుండు. 37

కం. భువనంబులు మెచ్చఁగ శై
శవ యౌవనసంధి సప్త సంతానములున్

సవరించె, వానికెవ్వరు
సవతు, సుధాంధసులు దక్క సర్వంసహపైన్. 38

సీ. చర్చించి చూచిన సర్వజ్ఞతాపటు
ప్రౌఢిమ మరువంబు పరిమళంబు
పరికించి చూచిన నిరుపమ త్యాగ ల
క్ష్మీ విలాసము దేవతావరంబు
భావించి చూచిన బహుమాన సమ్యగ్ధ
యా విశేషోక్తి శిలాక్షరంబు
తర్కించి చూచిన ధర్మ సంపాదన
క్రీడావివేకంబు తోడునీడ

గీ. దుర్మదారాతి హరణ చాతుర్య ధైర్య
వీర్య గాంభీర్య గుణములు వెన్నతోడఁ
బెట్టినవి సాటిచెప్పుట యెట్టు నృపుల
నీశ్వర ప్రభు నరస పృథ్వీశ్వరునకు. 39

స్రగ్ధర. ఉద్ఘాటించున్ సమిత్సంయుత రిపున్నృపతి వ్యూహకల్పాంత కాలో
ద్యద్ఘర్మాంశు ప్రభాళీ ధళధళ నిభముల్ తాంతకాంతార భూభృ
ద్య ద్ఘోరాగ్నిచ్ఛటా శ్రీధగధగ సరముల్ దర్ప సంపత్కళా భా
స్వద్ఘోటీ ఘోట ధాటీశ్వర నరసనరేశ ప్రతాపాతపంబుల్. 40

సీ. వివిధ చిహ్నంబులు వేర్వేర పూనంగ
విష్ణు శంకరుల భావింప వచ్చె
సూచికా ముఖమునఁ జూడంగ హరినీల
హీరోపలంబుల నెఱుగఁ వచ్చె
జిహ్వాగ్రమునఁ బరీక్షింపంగ లవణాబ్ధి
కలశార్ణవంబులు దెలియవచ్చె

వలపున భేదంబు గలుగంగ మృగనాభి
హిమ వాలుకల నిర్ణయింపవచ్చెఁ

గీ. గాని, లేకున్న నేకప్రకారమై, స
మస్తమును సంతత భ్రాంతి నావహించు
ననఁగ నీశ్వర నారసింహ క్షమాధి
పతియశశ్చంద్రికా కదంబములు నిగిడె. 41

చ. పుడమి హిరణ్య శూన్యదశఁ బొందఁగఁ జేయక విక్రయంబు, జూ,
పెడు సమయాన మార్గ్మగము వెట్టక. పట్టక దేవతార్థ మె
య్యెడ, దయమాలి పుణ్యజన హింసకుఁ బోవక, సంచరించినం
గడిమి నృసింహమూర్తి సరిగాఁ దగు నీశ్వరనారసింహుతోన్. 42

## షష్ఠ్యంతములు

కం. ఏతాదృశ విశదగుణా
న్వీతునకు, నిరంతరాయ వితరణ జితజీ
మూతునకు, పార్థివేష్టిత
భూతల రక్షావతీర్ణ పురుహూతునకున్. 43

కం. దంభసరః కరటికి, దో
స్తంభనిశాతాసినటికి, సకలధరిత్రీ
సంభారభరణ ధిక్కృత
కుంభీనసకుంభి కూర్మకుహనా కిటికిన్. 44

కం. పౌరుషనాభాగునకు, ది
నారంభణ భాస్కర ప్రభాభోగునకున్
ఘోరాజి విజయభేరీ
ధీరధ్వని దళిత నిఖిల దిగ్భాగునకున్. 45

కం. వాణీ కరవీణా ని
క్వాణ రతికి, వినయమతికి, వరలక్ష్మీక
శ్యాణ నరసింహవిజయ పు
రాణ కథారమణతానురాగ స్థితికిన్. 46

కం. పరిచితబోధునకు, నిరం
తర కాంత ఘృణా సనాథునకు, సాళ్వశ్రీ
నరసింగ విభు చమూపే
శ్వరనృపతి కూమార నరస జననాథునకున్. 47

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా మా రచియింపంబూనిన వరాహపురాణం
బునకుం గథా ప్రారంభం బెట్టిదనిన. 48

సీ. సకల పుణ్యారణ్య సస్యవాటములు ద
ట్టములైన పులకాంకురములు గాఁగ
సరసీనదీ నవసలిలపూరము శరీ
రమునఁ గ్రమ్మిన కమ్మఁజెమట గాఁగ
జాత సంభ్రమ జంతు సంతాన కోలాహ
లములు గద్గద భాషణములు గాఁగ
కకుబంత హరిదంత కాండ కాంతి ప్రసా
రంబు వివర్ణభావంబు గాఁగ

గీ. జలధి కాంచీ వరారోహ, సాత్త్వికోద
యములఁ బొదలంగ, నిజదంష్ట్రి కాగ్రబాహఁ
గౌఁగిలించె, నిశాచర గంధకరటి
పాకలంబు మహాకుహనైకలంబు. 49

కం. ఈ చందంబున జలనిధి
వీచులఁ దనుఁ మునుఁగ నీక వెడలించిన ధా

త్రిచపలేక్షణ. వినయ
శ్రీ చతురతఁ బలికె హరి కిరిప్రభుతోడన్. 50

గీ. ఏ మహాత్మ్యంబవో ! నిర్ణయింపరాదు
నీవ ప్రతికల్పమున నన్ను నిర్వహింతు
సకలలోకైక నాథ ! నీ జన్మ విధము
నాది సృష్టియుఁ దెలియంగ నానతిమ్ము. 51

సీ. పాఠీనమూర్తివై పగవాని ద్రచ్చి, వే
దములు దెచ్చితి రసాతలము చొచ్చి
కచ్ఛపరూపివై కలశాబ్ధి వసియించి
గిరి వహించితి ధురంధరత మించి
కిటివేషివై నన్నుఁ గృపఁ జూచి కాచితి
కఠిన దంష్ట్రా విటంకమున మోచి
నరమృగాకృతివై జనశ్లాఘ ప్రాలి, ప్ర
హ్లాదు నేలితి పలలాశిఁ ద్రోలి

గీ. వామనుఁడవై బలీంద్రు గర్వంబు చెఱచి
భార్గవుఁడవై నమస్త భూపతుల నులిచి
రాఘవుఁడవై దశాస్యు వక్త్రములు డులిచి
నిలచినాఁడవు నీ మాయఁ దెలియవశమె ! 52

వ. దేవా ! యీ వారిధి మునింగి కలంగి మిగుల నా పన్నవైన నన్నుద్ధ
రించితి; దురవగాహంబులైన భవదీయ గుణసమూహంబులు చతుర్ముఖ
ప్రముఖ నిఖిల బృందారకులకు వితర్కింప నలవి గాదనిన, నేనెంతటి
దాన; మానరాని కృత్యంబులు దుష్ట నిగ్రహ శిష్ట పరిగ్రహంబులు నీకు;
నిటమీఁద నీవు సృష్టి గల్పించు విధంబును, మదీయ సృష్టికారణ
ప్రమాణంబులు, నాద్యవసానంబులును, యుగ చతుష్టయ సంఖ్యా నామ
ధేయంబులును, యుగ విశేషంబులం బుట్టు నవస్థా భేదంబులును, మదవ

దరాతి నరాధిపతుల నిర్జించి, దోషంబుల విసర్జించి రాజసూయ హయమేధాది మహాధ్వర విధానంబుల సుకృతంబు లార్జించి, ఖచరచకోర లోచనా కుచ లికుచ పరిరంభ సంభావనా విరాజులైన రాజుల చందంబును, నిన్నుఁ బ్రసన్నునిం జేయు తెఱంగు, నెఱింగింపుమని విన్నవించిన. 53

కం. ఆ వాక్యంబులు విని కప
టావనిదారంబు, దంష్ట్రికాంకూర విభా
ధావళ్యంబులు దిక్కుల
పై వెన్నెల వెదలుచల్లఁ బకపక నగినన్. 54

ఉ. కానఁగవచ్చె నివ్విభుని గర్భకటాహములోన దేవతా
దానవ యక్ష కింపురుష తారక శీత కరార్క వహ్నిరు
ద్రానిల సిద్ధ సాధ్య విపినాద్రి సముద్ర సరస్తరంగిణీ
మౌని భుజంగ విశ్వ వసు మానవ ముఖ్య జనప్రపంచముల్. 55

కం. అవి చూచి మానసంబునఁ
గవిసిన భయ విస్మయముల గాత్రంబునఁ గం
పవికారము దలకొనఁగా
నవనివరారోహ నిలువ నంతటిలోనన్. 56

సీ. శ్రీవత్స కౌస్తుభశ్రీ వైజయంతులు
గనుపట్టు విపులవక్షంబు తోడ
శార్ఙ్గకౌమోదకీ శంఖచక్రంబులు
గల భుజార్గళ చతుష్కంబు తోడ
శ్రుతి పాఠ పరతంత్ర మతికి బ్రహ్మకు నివా
సంబైన నాభి పద్మంబు తోడ
బాలార్క బింబ ప్రభాడంబరంబు వి
డంబించు పీతాంబరంబు తోడ.

గీ. శరధి లోపల ఫణి మణి కిరణపటలి
కాతరింగిత శేషశయ్యా తలమునఁ
బవ్వళించిన మూర్తి యేర్పడఁగఁ దాల్చె
సూకరాకృతి పీడ్గాని లోకభర్త. 57

కం. ఆ లక్ష్మీపతిఁ గని శై
వాలస్థలి నడుమ నున్న వనరుహ కళికం
బోలఁగఁ దలపై నంజలి
గీలుకొలిపి సవినయమతి క్షితి నుతి సేసెన్. 58

ఉ. నీరజనేత్ర ! వందనము నీకు, రమారమణీ పతీ ! నమ
స్కారము నీకు, భక్తజన కల్పక ! దండము నీకు, రక్షణో
దార ! జొహారు నీకు, మహిమాంబునిధీ ! నతి నీకు, నీకు జే
జే ! రజనీచరాన్వయ విజిత్వర సత్వరబాహు విక్రమా ! 59

మ. మును నీ చూపిన సూకరాకృతి విధంబున్, గర్భగోళ స్థలో
కని కాయంబునుఁ జూచి యే నతి భయాక్రాంతాత్మ నైతిన్ జనా
ర్దన ! కాంతన్ శరణాగతన్ నిరపరాధ న్నన్ను మన్నించి, తె
ల్పు నిరాఘాట కృపాసుధారసమయాంభోరాశి పూరంబునన్. 60

వ. అని వినయపూర్వకంబు బహుప్రకారంబులం బ్రశంసించి మదీయ పదంబులు కేశవుండును జంఘలు నారాయణుండును నితంబంబు మాధవుండును గుహ్యంబు గోవిందుండును నాభి విష్ణుండును జఠరంబు మధుసూదనుండును వక్షంబు త్రివిక్రముండును హృదయంబు వామనుండును గంఠంబు శ్రీధరుండును వదనంబు హృషీకేశుండును నేత్రంబులు పద్మనాభుండును మస్తకంబు దామోదరుండును రక్షింతురుగాకని వాసుదేవు ద్వాదశనామంబుల నంగన్యాసంబు చేసి వసుమతీసతి పునః ప్రణామంబు గావించి నిలిచినఁ బ్రసన్నుండై వెండియు నప్పుండరీకాక్షుండు దాక్షిణ్యలక్ష్మికి నాకరంబైన సూకరాకారంబు వహించి రత్నాకర కాంచిం గాంచి యిట్లనియె. 61

గీ. అవనికామిని ! నీవు నన్నడగినట్టి
ప్రశ్న మత్యుత్తమంబు దుర్లభము, నిఖిల
వేద శాస్త్రార్థ సారంబు వినుము, సావ
ధానమతివై వచింతు విస్తరము గాఁగ. 62

కం. క్రమమున సర్గప్రతిస
ర్గములును మన్వంతర ప్రకారంబులు వం
శములును వంశానుచరి
త్రములును లక్షణము లివి పురాణంబునకున్. 63

వ. అందనాది సర్గం బెట్టిదనిన మొదల నాకాశంబునుంబోలె నాతతంబై నిలుతు, నట్టి నా వలన నణురూపంబున నొక్క బుద్ధి జనియించె, నది సత్వరజస్తమో గుణంబులఁ ద్రివిధంబై వేర్వేర తత్వరూపంబులు వహించె, నందు సృష్టికిం బ్రధానంబైన మహత్తత్త్వంబు గల్పించితి, నా తత్త్వంబున క్షేత్రజ్ఞుండు గలిగె, నతని బుద్ధిని మానసంబు పుట్టె, మానసంబున శ్రవణాది హేతువులగు నర్థంబులు సంభవించె. నర్థంబుల వలన నింద్రియంబు లవతరించె, నివి సకలంబును బిండాకారంబయ్యె, నప్పిండంబు మాయ. మాయ నా చేతం బ్రతిష్ఠితాత్మయై శూన్యంబై తోఁచె, శూన్యంబున శబ్దంబును. శబ్దంబున గగనంబును, గగనంబున సమీరంబును. సమీరంబునఁ దేజంబును, దేజంబున సలిలంబును, సలిలంబున భూతధాత్రియు, నిర్మించితి. 64

గీ. నెలఁత భూమ్యాదులైన యిన్నియును గూడఁ
గా నొక సబుద్బుదంబైన కలల మయ్యె
నక్కలల మందమై వొల్చె నది ప్రవృద్ధిఁ.
బొంద జనియించె నీ చందమున జగంబు 65

గీ. ఆది మద్రూపమగు జలం బాత్మనైన
యే రచించితి సలిలంబు నార మనఁగ
సంజ్ఞ వహియించె నందులో సంతతంబు
నుండు కతమున నారాయణుండనైతి. 66

కం. సారెకుఁ గల్పంబుల న
న్నారంబులఁ బవ్వడింప, నా బొడ్డునసీ
రేరుహము పుట్టె. నజుఁడవ
తారంబునఁ బొందె నందుఁ దత్కమలభవున్. 67

కం. కనుఁగొని కల్పింపుము జగ
మనుచు నదృశ్యుండనైన, నటుచేయఁగ నె
య్యనువును బొడగానమి నా
తనికిం గోపంబు పుట్టెఁ. దత్కోపంబున్. 68

ఉ. బాలకుఁడై, విరించి తొడపై వసియించి దృగంబుపూరముల్
జాలుకొనంగ నేడ్చుటయు, సాంత్వన భాషల నేడ్పు మాన్ప, స
బ్బాలుఁడు పేరు వెట్టుమని పల్కిన, రుద్రసమాఖ్య యిచ్చి భా
షాలలనామనోహరుఁడు సర్వము నీవు సృజింపు నావుడున్. 69

కం. తా లోక వినిర్మితికిం
జాలక రుద్రుండు కాండ సలిలమునఁ దప
శ్శీలుండై నిలిచిన, నా
వేళ సరోజాసనుఁడు వివేకము కలిమిన్. 70

కం. తన దక్షిణ వామాంఘ్రుల
పెనువ్రేళ్ళను దక్షునతని ప్రియసతి నిర్మిం
చిన, వారికి స్వాయంభువ
మనువు కలిగె మనువుచే సమస్తము పుట్టెన్. 71

గీ. అనుచు నద్దేవుఁడాన తిచ్చిన విధంబు
తెలియఁగా విని భూతధాత్రీ వధూటి
సకలలోకైకనాథ ! విస్తరము గాఁగఁ
బ్రథమ కల్పంబు నాకుఁ జెప్పంగ వలయు. 72

మ. అని ధాత్రీసతి పల్క నిట్లను వరాహస్వామి, నారాయణుండను
సీ బ్రహ్మ, సమస్తభూతములఁ గల్పాదిన్ వినిర్మించె నం

గన ! తన్నిర్మితి నీకు నేర్పడఁగ వక్కాణింతు నాలింపు, పోయిన
కల్పావధి రేయి నిద్రితుఁడనై యే మేలుకో నత్తఱిన్. 73

కం. నిరవధికుఁడు షడ్గుణసం
భరితుఁడు నారాయణుండుఁ బరపూర్వజుఁడున్
బరమాత్ముఁడు నిఖిలచరా
చరజనకుఁడునైన బ్రహ్మ సత్వాధికుఁడై. 74

గీ. కల్పనాబుద్ధి శూన్యలోకంబు లెల్ల
గని జగత్సృష్టి సంహార కర్తనింది
రాసతీ భర్తఁ గూర్చి నారాయణాత్మ
కంబు హృద్యంబు పద్య మొక్కటి పఠించె. 75

శ్లోకము :—ఆపో నార ఇతి ప్రోక్తా ఆపోవై నరసూనవః ।
అయనం తస్యతాః ప్రోక్తా స్తేన నారాయణః స్మృతః ॥ 76

వ. అని పఠించి. 77

కం. ప్రమదంబున గత కల్పాం
తము నాడును బోలె సృష్టి దాఁ దలఁపఁగ న
క్కమలజుని వలన నొక స
ర్గము పుట్టె, నబుద్ధి పూర్వకము దామసమై. 78

వ. అట్లు పుట్టిన సృష్టి పంచవర్షయగు నవిద్య; యిదియ ప్రపంచ ప్రకారంబును నజ్ఞానమయంబును నగు ముఖసర్గంబన బరంగె, మఱియు నుత్తమసర్గం బొకటి చింతింపఁ దిర్యక్స్రోతో మయంబగు సర్గంబు జనియించె, నది యుత్పథ గ్రాహులైన పశ్వాదు లగుట. నసాధకం బని, వెండియు నొక్క సర్గంబు విచారింప, నూర్ధ్వ స్రోతో మయంబగు సర్గం బవతరించె, నది నూర్ధ్వచారులు సాత్త్విక స్వభావులు నైన దేవత లగుట నసాధకంబని, యర్వాక్స్రోతో మయంబగు సర్గంబు నిర్మించె, నందు

సాధకులు నత్యంత ప్రకాశులు రజోధికులుఁ దమోతిరిక్తులు దుఃఖసం సక్తులుఁ బునః పునః ప్రవర్తకులు నైన మనుష్యు లుద్భవించిరి, ప్రథ మంబగు మహత్సర్గంబును, ద్వితీయంబగు తన్మాత్ర సర్గంబును, దృతీ యంబగు వైకారికంబును నగు నింద్రియ సర్గంబును బుద్ధి పూర్వకంబు లగు ప్రాకృతసర్గంబులు స్థావరాత్మకంబగు ముఖ్యసర్గంబును పశు ప్రధానంబగు తిర్యక్స్రోతో సర్గంబును, దేవభూయిష్ఠ బగు నూర్ధ్వస్రోతో సర్గంబును, మనుష్యప్రచారంబగు నర్వాక్స్రోతో సర్గంబును, సత్వతమో మయంబగు నసుగ్రాహ సర్గంబును వైకృతసర్గంబులు, ప్రాకృత సర్గం బులు మూఁడును వైకృత సర్గంబు లైదును బ్రాకృతంబును వైకృతం బును నగు కుమార సర్గంబు నుంగూడఁ దొమ్మిది సర్గంబు, లివి జగం బులకు మూల హేతువు లింక నేమేమి వినవలయు నడుగు మనిన. 79

గీ. జగతి యిట్లను నవ్యక్త జన్ముఁడైన
జలజభవుచే జనించిన సర్గనవక
మెవ్విధంబున వర్ధిల్లె నెఱుఁగఁ జెప్పు
త్రిభువనావన సన్నాహ శ్రీ వరాహ ! 80

కం. అనవుడు విని ధాత్రికి ని
ట్లని చెప్పె వరాహదేవుఁ డాది న్వనజా
సనుఁడు సృజియించె రుద్రుని
వెనుకన్ సనకాది మౌని వితతి సృజించెన్. 81

వ. ఆ తరువాత మరీచ్యత్రుల, నంగిరః పులహులం, గ్రతుపులస్త్యులం, బ్రచేతో భృగువుల, నారద వసిష్ఠుల సృజించి, వీరిలోన నారదుండు తక్కఁ దక్కిన తొమ్మండ్రం బ్రవృత్తి ధర్మంబునకు నియోగించి, సన కాదుల నివృత్తి ధర్మంబునకు నియోగించె. 82

గీ. విధి పదాంగుష్ఠమున సంభవించె నెవ్వఁ
డట్టి దక్షుని కూర్మి కన్యలకుఁ బుట్టె
సుర నిశాచర గరుడ కింపురుష కిన్న
రాదికంబైన సకల చరాచరంబు. 88

సీ. వెనుకకు నాగ్రహించిన వేళ, నర్తిత
భ్రూలతా భయదాత్మ ఫాలభూమి
నవతరించిన రుద్రు, నర్ధనారీ నరా
కారుని వీక్షించి కమలభవుఁడు
నీ విగ్రహము రెండుగా విభజింపుమ
టంచు నంతర్ధానమైన, నతఁడు
నారీవిభాగంబు నరవిభాగంబును
నేర్పున వేర్వేర నేర్పఱించి

గీ. వానిలోపల నరభాగ మానుపూర్విఁ
బదునొకండు విధంబులఁ బంచివైచె
నదె కద పదునొకండవ దనఁగఁ బరఁగు
రుద్రసర్గంబు ధాత్రీ నరోజనేత్ర. 84

క. ఈ పగిడి సృష్టి గణ్యం
బై వొదలిన యుగచతుష్టయస్థితి వినుమా
రూపింతుఁ గృతత్రేతా
ద్వాపర కలి నామకములు దాలుచు యుగముల్. 85

కం. ఆ యుగములు జనవినుత
న్యాయపరాయణులు మనుజనంధులు సురదై
తేయులు చేసిన ధర్మ
ప్రాయచరిత్రములు తత్పరత నిను మనుచున్ 86

సీ. ఆనతి యిచ్చె మాయా వరాహస్వామి
ప్రథమ కల్పంబునఁ బ్రభవమైన
మనువు స్వాయంభువుం డనువాఁడు గనియె నం
దనులఁ బ్రియవ్రతోత్తానపాద

నామధేయుల, వారిలో మదారాతి సం
హరణ వ్రతుండు ప్రియవ్రతుండు
హయమేధ రాజసూయంబులు మొదలైన
క్రతువులు సాంగంబుఁ గాఁగఁ జేసి

గీ. వసుమతీ చక్రమేకోష్ణవారణముగ
నేలి, భరతాది సుతులకు నేడుదీవు
లును విభాగించి యిచ్చి తాఁజనియెఁ బిదప
బదరికారణ్యమునకుఁ దపంబు సలుప. 87

కం. ఈ విధమునఁ జని భస్మజ
టా వల్కల ధారియై ధృఢవ్రతనియతిన్
భావములోఁ బరతత్వము
భావింపుచు మోహపాశబంధచ్యుతుఁడై. 88

శా. అచ్చోటం దపమాచరింపఁగఁ దదీక్షాయత్త చిత్తంబునన్
విచ్చేసెన్ సురమౌని నారదుఁడు పాణి, న్వీణ తంత్రు, ల్నభ
స్వచ్ఛాంబరంబున, మూర్ఛనాస్వర విశేషంబుల్ వెదల్చల్లగా
నిచ్చన్మెచ్చుచు దేహచంద్రికలు రాకేందుచ్ఛవి న్మీఱఁగాన్. 89

ఉ. అప్పుడు దానెదుర్కొని కృతాంజలియై నృపుఁ డర్ఘ్య పాద్యముల్
దప్పక యిచ్చి మౌనికుశలం బడుగన్ వినిపించి యిట్లనున్
జెప్పుము నిర్వికార ! సరసీరుహగర్భకుమార; యేమియుం
గప్పక నాకు నీ కృతయుగంబున నీ కనుగొన్న చిత్రముల్. 90

మ. అనినన్ సంయమి చెప్పఁగా దొడఁగె వాక్యప్రౌఢి నిన్నుం బగల్
చనియెన్, గంటి నిరస్త భక్త జనతా సంతాపమున్ విశ్వమో
హన కృత్కిన్నర కామినీ మధుర గానాలాపమున్, శార్ఙ్గసా
ధన కారుణ్య గుణాను రూపమును, శ్వేతదేపమున్ భూవరా ! 91

వ. అందు నందూయమిత గంధసింధురంబు చందంబున మందాందోళిత పుష్కరంబై - పుష్కర స్థలంబు తెఱంగున సంసక్త రాజహంసంబై రాజహంస మండల విధంబున నుద్దండ పుండరీకంబై - పుండరీకాది గజవ్రజంబు లాగున ధృతాఖిల చక్రంబై - చక్రవర్తి సభా భవనంబున కైవడి సదాధిష్ఠిత కవియై, కవిమందిరాంగణంబు భంగిసమాసన్న పుణ్యజనంబై, పుణ్యజనేశ్వరు భాండాగారంబు వోలికఁ బరిస్థాపిత శంఖంబై శంఖసంఖ్యానంబు లేవ సత్యధికంబై, పరస్పర ఘట్టనంబులం దరంగంబులు నాఁగఁ దరంగింబుల మరాళంబు లుయ్యేల లూఁగ మకరంద నిష్యందంబుల నరవిందంబులు విఱ్ఱవీగ నరవిందంబుల నిదిందిరంబులు మూఁగఁ మంధరగంధవాహ విహారంబుల శీకరంబులు రేఁగ శీకరంబులంటఁ దీరావనిరుహంబులు దొప్పదోఁగ జలపక్షి పక్ష విక్షేపంబులఁ బద్మినీ పత్రంబులు వెఱపిగాఁగ బద్మినీ పత్రంబుల క్రిందఁ గందర్ప కేలికం జక్రవాక మిథునంబులు డాఁగ మనోహరంబై సిరి దొలంకు కొలంకు కెలంకున. 92

సీ. తన కొప్పు శైవాలమును బోల్పదన నిడు
వాలుగన్నులు గండుమీలఁ బోల్పఁ
దనమోము నీరజంబును బోల్పఁ దనముద్దు
వాతెఱ బంధు జీవకముఁబోల్పఁ
దనకంధరము శంఖమును బోల్పఁ దన బాహు
లతికలు నవమృణాలములఁ బోల్పఁ
దన చన్నుఁగవ చక్రదంపతులను బోల్పఁ
దన కటీరము సైకతమును బోల్పఁ

గీ. విని, మనంబున నమ్మక వీని వాని
వాసి దెలియంగ వలెనని వచ్చెననఁగ
నెంతయును సౌకుమార్యంబు వింతగొలుప
నొంటి విహరించు నొక మచ్చె కంటిఁ గంటి. 93

కం. కని, యెవ్వతెవు ! జగన్మో
హిని నీ నామంబు చెప్పు మిచ్చోటికి వ
చ్చిన కార్యమేమి యనవుడు
విని తప్పక చూచి తరుణి వికవిక నవ్వెన్. 94

ఉ. ఆ నలినాక్షి నవ్వుటయు నంతట నా మహిమంబు దూలెనో
కాని వసుంధరాధిప ! వకావకలై చెడిపోయె బ్రహ్మ వి
జ్ఞానము, వేదశాస్త్ర పఠన ప్రతిభా విభవంబు, గానవి
ద్యా నిపుణత్వమున్, దపము, ధర్మవిధిజ్ఞతయు, న్వివేకమున్. 95

గీ. ఇవ్విధంబున నా విద్యలెల్ల మోటు
పడినఁ జెట్టెక్కి చేతులు విడిచినట్లు
శోక చింతా నిమగ్నుండనై కురంగ
నయన కృపఁజూచి రక్షించు నన్నటంచు. 96

సీ. శరణంబువేడ నా చంద్రాస్య తనువునఁ
బొడమె గ్రక్కున దివ్యపురుషుఁ డొకఁడు
తద్దేహమున నవతారమయ్యె నొకండు
వాని శరీరంబులోన నొకఁడు
రక్తారవిందపత్ర విశాలనేత్రుండు
శతకోటి మార్తాండసముఁడు పుట్టె
నివ్విధంబున జనియించిన మువ్వురు
మాయమై పోవ నబ్జాయతాక్షి

గీ. వాలుఁగన్నులఁ దళుకులు జాలువాఱఁ
జిగురువాతెఱ ముసిముసి నగవుదేఱ
గుబ్బచన్నులఁ బయ్యెద కొంగుజాఱఁ
దాను నిలిచిన డాయంగ నేనుబోయి. 97

సీ. వదతి! నా వేదసంపద యేల పసదప్పె
నింతి ! నా శాస్త్రంబు లేలతూలె
నలినాక్షి ! నా పురాణము లేల నశియించె
నెలనాఁగ ! నాగానమేల చెడియె
వనిత ! నా మంత్రవాసన యేల యుడివోయె
లోలాక్షి నా యోగ మేల పొలిసె
నాతి ! నా తత్త్వవిజ్ఞాన మేల తొలంగె
బాల నా వైదుష్య కుల సమసెఁ

గీ. దెలియ వినిపింపు మనిన నా దేవి సరస
కిసలయాస్వాద మత్తకోకిల కలాప
కలకుహూకార గర్వంబు గెలువఁ జాలు
కలికి పలుకులఁ దేనియ లొలుకఁ బలికె. 98

వ. ఓయి నారద ! బ్రహ్మవిద్యా విశారద ! నన్ను సకలశ్రుతి కన్యకాజన జననపాత్రినైన సావిత్రింగా నెఱుంగుము. మదీయ ప్రభావంబుఁ జూప వలసి నీ విద్య లపహరించితి నింతియ కాని యే నిమిత్తంబును లేదు; నాదు శరీరంబునం బ్రాదుర్భవించిన శృంగార కళాధురంధరుండైన పురుషుండు ఋగ్వేదంబని పేర్కొనందగిన నారాయణుం, డతండు సముచ్చారణ మాత్రంబున నింధనంబుల గంధవహసఖుండునుంబోలె దురితంబుల దహించు, నన్నారాయణు వలన జనియించిన మనోహరాకారుండైన పురుషుండు యజుర్వేదంబని పేర్కొనందగిన బ్రహ్మ, యతండు తూలంబుల వాతూలంబునుంబోలె దుష్కృతంబులం దూలించు, నా బ్రహ్మవలన సంభవించిన దివ్య తేజోమయుండైన పురుషుండు సామ వేదంబ పేర్కొనందగిన రుద్రుం, డతండు తిమిరంబుల మిహిరుండునుంబోలె గలుషంబుల విరియించు, వీరు ముమ్మూరు నగ్నిత్రయంబును, వేదత్రయంబును, సవనత్రయంబును, వర్ణత్రయంబును; వారి, నీకు దేట పడం బలికితినని వేదాదివిద్యలు నాకుం గ్రమ్మఱ నిచ్చి మఱియును—99

కం. ఈ సరసిలోన స్నానము
చేసిన గత జన్మముల విశేషములు నిరా
యాసముగఁ గానవచ్చు మ
హాసంయమి తిలక! స్నానమాడుము దీనన్. 100

కం. అని తానంతర్ధానం
బున బొందె సుధాంశు బింబముఖి, కాసారం
బునఁ దానమాడి యేనుం
జనుదెంచితి నిన్నుఁ జూడ, జలపాలమణీ! 101

చ. అనవుడు నా ప్రియవ్రత నరాధిపుఁ డిట్లనియెన్ మహాతపో
ధనునకు నీకుఁ దత్సరసిఁ దానము సేయఁగ నాత్మఁ గానవ
చ్చిన తొలి జన్మజాలముల చేష్టితము ల్వినిపింపు నాకు నో
మునికులసార్వభౌమ! మనముం జెవులుం బరితృప్తిఁ
బొందఁగన్. 102

కం. నావుడు నారదుఁ డిట్లను
సావిత్రీభాషణాను శాసనమున నే
నా వేద సరసిఁ గ్రుంకిన
భూవల్లభ! వేయి జన్మములు దోచె మదిన్. 103

సీ. విను వానిలో నొక్క జనన ప్రకారంబు
మును చన్న కృతయుగంబున నవంతి
నా నొప్పు పుటభేదనంబున సారస్వ
తాఖ్యుండనైన బ్రాహ్మణుఁడ నేను
సకలవేదంబులు శాస్త్రంబులును పురా
ణంబులు, భిన్నప్రాయంబునందుఁ
గరతలామలకంబుగా నభ్యసించి వి
ఖ్యాతుల సుతులఁ బెక్కండ్రఁ బడసి

గీ. నాఁడునాఁటికి నీతువులు పైఁడిగాఁగ
చిత్తమార్జించి సంసారవృత్తి వలన
రోసి జీవన ధరణ ప్రయాసమెల్ల
నాత్మజుల మీఁద బెట్టి మోక్షాభిరతిని. 104

వ. తపంబు సలుప నూహించి కర్మకాండంబునం బుండరీకాక్షు నారాధించి యథోచిత క్రియావిశేషంబునం బితృగణంబులఁ దృప్తిఁ బొందించి వివిధాధ్వర విధానంబులఁ బురందర ప్రముఖ నిఖిల దైత్యారాతులం బ్రీతులం గావించి పవిత్రాన్నదానంబులం దక్షిణాన జనంబుల వశీకరించి ఋష్యుఁడు నీకుం జెప్పిన సారస్వతంబను సరోవరంబునకుఁ జని. 105

ఉ. తత్సరసీ సమీప వసుధాస్థలి నే వసియించి, యిందిరా
వత్సుని, భక్తవత్సలుని, వారిజనాభుని గూర్చి ధైర్యభూ
భృత్సను బ్రహ్మపారము జపించెడుచో, బదివేలవేల సం
వత్సరముల్ పలాశఫల పాత జలాభ్యవహార లీలలన్. 106

స్రగ్ధర. సాక్షాత్కారంబు నొందెన్, సకల సురగణస్వామి విష్ణుండు లక్ష్మీ
వక్షోజ స్వర్ణకుంభ ద్వయమృగ మదసం వాసి తాంగంబు తోడం
బక్ష ప్రక్షేపజాత భ్రమిత నిఖిల దిక్పక్షివాహంబుతో దక్ష
రక్షః కంఠీక్షణా విభ్రమ లయ రయ నిర్వక్ర చక్రంబు తోడన్. 107

గీ. ఇట్లు ప్రత్యక్షమైన లక్ష్మీశ్వరునకు
హరికి దండ ప్రణామంబు లాచరించి
మస్తకంబున ముకుళిత హస్తయుగళి
చేర్చి యిట్లని సంస్తుతించితి మహీశ ! 108

కం. పారావారశయాన ! ద
యారస పరిపూర్ణలోచనాంచల ! శ్రీమ
న్నారాయణ ! భువనావన
పారాయణ ! పరమ పురుష పరపారగతా ! 109

కం. అత్యంత వీర్య! నిర్గుణ
సత్య విశుద్ధ ప్రభావ! శాశ్వత! నిఖిలా
దిత్య విరోధి శిరోధి
క్షత్యారంభోపలంభ చక్రాసికరా ! 110

గీ. సూర్య శీతాంశునయన! త్రిశుక్ర సంస్థ
ధరణి ధారణ దక్ష! త్రితత్వలక్ష్య!
వాగ్వధూనాథ జనక ! త్రివహ్ని భేద!
విదళితాఖిల కలుష! త్రివేద గమ్య ! 111

కం. నిరవధి సంసారార్ణవ
తరణీ భూతాంఘ్రి యుగ! కృతత్రేతాద్వా
పర కలియుగములఁ దాల్తువు
నిరతము సితరక్త పీత నీలాకృతులున్. 112

గీ. సరవి బుట్టించితివి ముఖాబ్జమున భూసు
రాన్వయంబును, బాహుల నవనిపాల
వంశముఁ దొడల వైశ్యాన్వవాయమును, బ
దముల శూద్రకులంబును గమలనేత్ర ! 113

వ. కావున నీ మహానుభావంబులు వారిజాసనాదులకు వాఙ్మనస గోచరం
బులు గావు, మావంటి వారికి గోచరించుట యెట్లు! భవన్నామస్మరణైక
శరణ్యుండనైన నన్ను ధన్యుంగా ననుగ్రహింపుమని విన్నవించినఁ
బ్రసన్నుండై సకల ప్రపంచ సంచరిష్ణుండు విష్ణుండు ఘనాఘన స్తనిత
గంభీర స్వరంబున వరంబు వేడుమనిన. 114

కం. పూజ్యంబైన భవత్సా
యుజ్యము కృపసేయు నాకు నుద్భట రథినీ
రజ్యత్పర మారణమం
త్రజ్యాటంకార శార్జ్గధను రుగ్రకరా ! 115

గీ. అనిన విని దేవుఁ డిట్లని యవధరించె ।
నలినభవుని దినావసానంబుదాఁక నిలుము,
తరువాత నాతని వలన, మహిమ ।
నెగడ జన్మింపగలవు జన్మించి పిదప ॥ 116

కం. నారము పానీయమునకు
బే, రా నారంబు నీవు పితృగణములకుం
దాసక యిచ్చు కతంబున
నారద నామంబు నీకు నలువ ఘటించున్. 117

సీ. ఆ జన్మమున భూసురాన్వయ తిలక! నా
యుజ్జ్వ మిచ్చెదనంచు సురగణాయి
చనినఁ దపఃక్రియా సంసక్తిఁ గొంత కా
లంబు వర్తించి దేహంబు విడిచి
కలిసితి బ్రహ్మ విగ్రహమున, సంతనా
నలువ దినావసానమున లేచి
మానస పుత్రులతో నన్నుఁ బుట్టించె
నా దిన ప్రారంభ మాది నరల

గీ. భూతసృష్టికి, నిదినా పురాతనోద్భ
వప్రకారంబు నాకు దేవత్వ సిద్ధి
గలిగె హరిఁగొల్వ, నీవును గొలువు మీ నృ
పాల! శ్రీహరి దురిత షండాల హరిని. 118

చ. అని పరమేష్ఠిసూనుఁడు ప్రియవ్రతరాజవరేణ్యుతోడఁ జె
ప్పిన కథ కోలభర్త వినిపించిన భూరమణీ లలామ యి
ట్లనియె, పురాతనుండు పరమాత్ముఁడు సర్వగుఁ డబ్జనాభుఁ డే
యనువున భావనీయుఁడగు నట్టిలఁ గెల్ల నెఱుంగఁ జెప్పుమా. 119

వ. అనవుడు నప్పరాహదేవుండు ధరావరారోహ నాలోకించి. 120

గీ. మీన కమఠ కోల మానవ మృగ కుబ్జ
జామదగ్న్య రామ కామపాల
కృష్ణ కల్కు లనుచు నెన్ను నీ పది రాజ
సావతారములు రమాధిపతికి. 121

కం. పాపార్ధిఁ గడచువారికిఁ
దేపలు వైకుంఠ రమణ దివ్యాకృతి వీ
క్షాపేక్ష నడచువారికిఁ
దాపలు ధరణి ! దశావతారములె సుమీ ! 122

కం. తమ దృష్టికిఁ బరమము
నాద్యము భవ్యమున వ్యయంబునైన తదాకా
రము గానరామి నెప్పుడు
నమరులు సేవింతు రర్చనాదుల మూర్తుల్. 123

వ. మఱియు, రజస్తమోగుణప్రధానంబులు సమస్త లోకస్థితి పాల
నాధీనంబులు, వసుమతీ వారి వహ్ని వలాహకవర్త్మ వానరాధిప వనజ
వైరి క్షేత్రజ్ఞాభిదానంబులునైన మూర్తుల నమ్మహానుభావుండు విశ్వ
ప్రపంచంబు నిండి విహరించు నిది నీవు నన్నడిగిన ప్రశ్నంబునకు
నుత్తరంబు : 124

కం. నావుడు విని, ముదితాత్మక
యైవసుమతి వెనుక నా ప్రియవ్రతుఁడు సుధాం
ధోవాచంయమవచనము
దావిని యెవ్విధిఁ జరించె, దంభ కిరీంద్రా. 125

ఉ. ఆనతి యిమ్మటన్న, వసుధా! వసుధామనిభ! ప్రభాధికుం
డైన ప్రియవ్రతుండు మునినంతట వీడ్కొని పోయి దేవపూ
జాని యమావ సక్త యతి సంతతి సంతత వాద్యమాన ఘం
టానిబిడ కృతాత్మ నికటంబగు వేద సరస్తటంబునన్. 126

కం. యోగిప్రవరులు కపిలుఁడు
జైగీషవ్యుండు సభకుఁ జనుదెంచుటయున్
జాగిలి నరనాయకుఁ డ
భ్యాగతపూజనముసేసి పలికెం బ్రీతిన్. 132

గీ. యోగి వరులార ! సందేహ మొకటి మిమ్ము
నడుగ వచ్చెద, ననఁగ. మీయంత నేగు
దెంచినా రాడబోయిన తీర్థమెదురు
గాఁగ వచ్చిన కరణి భాగ్యంబుకతన. 133

కం. మాయా వివర్జితుఁడు నా
రాయణుఁడు పురాణ పురుషుఁ డనవద్యుఁడు దా
నే యే విధములఁ గొలువ వి
ధేయుండగు నానతిండు తెలియఁగ ననుడున్.

కం. నానాభువనంబుల మే
మే నారాయణుల మనుచు మెలగుదు మీ పా
టేని వివేకదశం గన
వో! నారాయణుఁ డనంగ నొక్కఁడు కలఁడే.

కం. మఱచియు నిట్లాడకు పుడ
మిఱేడ! ప్రత్యక్షమైతి మిప్పుడ మమ్మి
ద్దఱ నారాయణులం గా
నెఱుంగుము విచికిత్సఁ బొంద నేటికి నీకున్. 136

వ. అనిన. వారాడిన తుటారంబులు కర్ణ కఠోరంబులగుటయు, నశ్వశిరుఁ
డవనతశిరుండై కొంకొకవడి విచారించి సవినయంబుగా నిట్లనియె. 137

కం. మీరెఱింగి నంత యెఱుంగుదు
నేరాజీవాక్షు మహిమ ఋషులారా! వినం
గారాదిది వో! శ్రీమ
న్నారాయణు నడుగ వచ్చునా యెవ్వరికిన్. 138

మ. హరితో గౌస్తుభవక్షుతో గరుడవాహారూఢుతో శంఖ శా
ర్ఙ్గ రథాంగాది విభాసమానకరుతో రాజీవపత్రాక్షుతో
దొరయంగా నరుఁడెట్టివాఁడును సమర్థుండే! మహేంద్రాది ని
ర్జరు లాదేవుని పాదసేవకులు గారా! మీరె చర్చింపుడీ. 139

కం. అనవుడు విని సెలవులు వా
ఱ నగచుఁ, దమ శపము పోతరంబున నైనం
గనుగొనుమీ నారాయణు
నని పలికి సభాజనంబు లాశ్చర్యపడన్. 140

శా. తత్షణమాత్రము లోపలన్ గపిల యోగీంద్రుండు నీలాంబుదో
న్మేషంబు న్నిరసింపఁజాలు తనుకాంతిశ్రీలు దిగ్భాగములన్
భూషింపంగ నిజాలకుం బరమవిష్ణుండైన, వేవేగ జై
గీషవ్యుండు వహించె సద్విభువిఁ బక్షిస్వామియై మూపునన్.

కం. అప్పుడు భయవిస్మయములు
ముప్పిరిగొన నశ్వశిరుఁడు ముందట పై పై
నుప్పరము లెగయ గరుడుని
కొప్పరమున నున్న కపట గోవిందునకున్. 142

గీ. మ్రొక్కి యిదిగాదు విష్ణుని మూర్తి; నాభి
నుండవలె బుండరీకంబు, పుండరీక
భవనమున నుండవలె బ్రహ్మ, బ్రహ్మ తొడల
నుండవలె రుద్రుం డట్లు గాకున్న మిథ్య.

మ. వెడమాయల్ విడువుండు మీకనవుడున్ విద్యాప్రభావంబునన్
బొడసూపెం గపిలుండు పంకరుహనాభుండై : మరందంబు చి
ల్కెడు నత్తామరనుంచి బ్రహ్మ, నలజైగీషవుఁడు న్వాని పెం
దొడ నిల్చెన్ బసిబిడ్డ చందమున రుద్రుం డర్కకోటి ప్రభన్. 144

గీ. అరి కనుంగొని యిదియు మాయాబలంబు
విశ్వరూపధరుండు శ్రీ విష్ణుఁ డనుచు
తాపసీభక్త పలికిన నోరి మాట
నోరనే యుండఁ దత్సభాగారమునను. 145

సీ. కనుపట్టె నొక చోట గండ భేరుండంబు
లొక వంక శరభంబు లుద్భవించె
నావిర్భవించె సింహము లొక్క దిక్కున
నొక చాయ బెబ్బులు లుప్పతిల్లెఁ
దలచూపె నొక చక్కి దంతావళంబులు
జనియించె నొకమూల సైంధవములు
పొడకట్టె నొకపక్క భూమిదారంబులు
మహిషంబు లొకగొంది మందగూడె

గీ. నొక్కపట్టునఁ బుట్టె మయూర కీర
కోకిల మరాళ కుక్కుట ఘూకకాక
మశక మత్కుణ మక్షికా మధుప శలభ
దంశకాది జంతు కదంబకంబు. 146

కం. అంతట సర్వేశ్వరుఁ డా
శాంతుఁడు సంయముల మహిమగా మనమున సి
ద్ధాంతీకరించి నిటల
ప్రాంత పరిన్యస్త హస్త పంకేరుహుఁడై. 147

ఉ. ఓ పరమాత్ములారా! కరుణోదధులారా! నితాంత యోగ వి
ద్యా పరతంత్రులారా! తెలియన్ వశమే, భవదీయమైన యీ
నైపుణి, చాలుఁ జాలు ననినన్ నిజమూర్తులు దాల్చి తాపసుల్
జా పరమేశ్వరా! యనిన జంతువులన్నియుఁ బోయె మాయమై. 148

వ. ఇట్లు మహేశ్వరత్వంబైన యోగ విద్యాచాతుర్యంబునం బెక్కు పోకల
బోయి నిల్చిన మహామునులం గాంచి కలగాంచి మేలు కాంచిన చంద

బున వెంటంబు నరింప నిలింప వల్లభనిభుం డమ్మహీవిభుండు దండ ప్రణామంబు లాచరించి మీరు నాకుం జూపిన బహురూపంబుల మొఱంగు తెఱంగు మఱువంగు పెట్టక యుల్లంగింపుం డనిన, జగజ్జన సంసేవ్యులైన కపిల బ్రైగీషవ్యులు మందస్మితంబు వదనారవిందంబులం గందళింప నర నాయక ! నీవు నారాయణుం డెవ్విధంబునం గొలువ విధేయుం డగునని మమ్ము నడిగితివి; నారాయణుండు సమస్తంబునుం దన్నకా భావించి కొలిచినంగాని విధేయుండు గాఁడు. సమస్తంబు నతండగుట నీకుందెలుప వలసి నారాయణ గుణవిలాసములు చూపితిమి; యిది మాయగా విచారింప వలవదు. నారాయణుండు సమస్త పరిపూర్ణుండని భావంబున దృఢీకరించి నానావిధోపచారంబుల; వైదికాచారంబుల, ననుదిన స్నాన దాన జప హోమాది పుణ్యకర్మ సమర్పణంబుల, బ్రాహ్మణ సంతర్పణంబుల నారా ధింపుము, విధేయుం డయ్యెడు నూ చెప్పిన పరమ జ్ఞాన సద్భావంబు వదలక వెండియు నడుగవలసిన సందేహంబు లడుగుము. 149

కం. అనవుడుఁ గపిలుం గనుగొని
జనపాలుఁ డడిగె, మోక్ష సంపద కర్మం
బునఁ గలదో ! విజ్ఞా
బునఁ గలదో ! యెఱుఁగఁ జెప్పు మునికుల తిలకా ! 150

వ. అని కపిలమునీశ్వరు నశ్వశిరుం డడిగెనని వరాహదేవుండు చెప్పిన మహీసుత కాశిని మీఁదటి వృత్తాంతం బాన తిమ్మని విన్నవించిన. 151

మ. మణి మంజీర విలంబమాన బలపన్మత్తాహిత వ్యూహ భీ
షణ సంగ్రామ ! ధరాధనంజయ విభాసంపన్న ! నీరేరుహే
క్షణ పూజా పరతంత్ర ! సాళ్వ నరసింగ శ్రీ క్షమాధ్యక్ష ద
క్షిణ దోర్దండ నిరంతరాయ కరుణాశ్లేష ప్రియుంభావుకా ! 152

౧౦. భూసుర సహకార వనీ
వాసంత విలాస ! విబుధ వత్సల ! సకలా

శాసందర్శిత గుణహ
ళ్లీసక ! మద వైరి మండలీ ఫణిగరుడా ! 153

ఉత్సాహ. మండువా బెడంద కోట మాహురాది మేది నీ
మండలేశ్వర స్తుతాసమాన మానుషోదయా
ఖండనాజిత ప్రచండ పటహనిస్వ నార్భటీ
హిండితాష్ట దిక్కుడుంగ ! యీశ్వరాత్మ సంభవా ! 154

గద్యము. ఇది శ్రీ మదుమామహేశ్వర ప్రసాదలబ్ధసార సారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీ షిమల్ల మలయమారుతాభి
ధాన ఘంట నాగయ ప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీ వరాహ పురాణంబను మహా
ప్రబంధంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ

# వరాహ పురాణము

## ద్వితీయాశ్వాసము

—*—

శ్రీ వేంకటాద్రిపతి సం
సేవా హేవాక నిపుణ! శేషాహి ఫణా
శ్రీ వినమన కర కరిసే
నా విభ్రమ! యీశ్వరేంద్రు నరసింహ నృపా! 1

వ. అవధరింపు మవ్వరాహదేవుండు ధాత్రి కిట్లనియె. 2

గీ. అట్లు దన్ను మహీకాంతుఁ డడుగఁ దపసి
పలికె నరపాల మున్ను గీష్పతి నడిగిరి
బ్రహ్మ సుతుఁడైన రైభ్యుండు రాజవర్యుఁ
డైన వసువును నీవు నన్నడిగి నట్లు. 3

సీ. అది విను చాక్షుషంబైన మన్వంతరం
బున బ్రహ్మవంశవర్ధనుఁడు వసువు
నృపరత్న మొకనాఁడు నీరజాసనుఁ గొల్వ
నేగుచోఁ దెరువున నెదురుపడ్డ
సకల విద్యాధర స్వామి చైత్రరథుండు
విబుధవర్గంబు సేవింప నలువ
గొలువయి యున్నాఁడు గొబ్బునఁ బొమ్మని
చెప్ప హుటాహుటిఁ జేర నరిగి

గీ. నిలిచె మూపున మూపున దొలఁగఁ ద్రోవ
రాని సందడి గని పద్మరాగ రత్న
ఖచిత హాటకమయ కుంభ రుచి పరంప
రా నిరాఘాట మగు హజారంబు కడకు. 4

కం. ఆ సమయంబున రైభ్య మ
హా సంయమి యేగుదేర నర్ఘ్యాది విధుల్
చేసి వసునృపతి యెటు వి
చ్చేసెదవు మునీంద్ర ! నాకుఁ జెప్పు మటన్నన్. 5

కం. అనిమిషగురుండు చతురా
నను సేవింపంగ వచ్చినాఁ డని వినియేఁ
బనివడి చనుదెంచితి నా
తని నొక సందేహ మడుగఁ దలఁచి నృపాలా ! 6

కం. అని రైభ్యుఁడు వసు నరపా
లునకుం జెప్పంగ నంతలో నంబురుహా
సనుఁ దనిపినఁ దమ తమకే
తనములఁ గరి తురగ రథ పదాతులు మెఱయన్

సీ. నడిచె నింద్రుడు కిన్నరకాహళులు మ్రోయ
గమనించె శిఖి డిండిమములు మ్రోయఁ
జనియె దండధరుండు జయ దుందుభులు మ్రోయ
వెళ్లె దైత్యుఁడు గిడిగిళ్లు మ్రోయఁ
బోయె నంబుధిరాజు బూరగొమ్ములు మ్రోయ
జరగె వాయువు మురజములు మ్రోయ
నరిగె యక్షుండు కిన్నెర వీణియలు మ్రోయ
గదలె రుద్రుండు శంఖములు మ్రోయ

గీ. నిట్లు దివికి సుధాంధసు లెల్ల నేగఁ
గొంత తడవుకు బ్రహ్మ పీఠొక్కలుప శిష్య
సముదయముఁ దాను గక్ష్యాంతరములు గడచి
వచ్చె సురదేశికుఁడు బహిర్ద్వారమునకు. 8

కం. ఆ వేళ రైభ్య వసు వసు
ధావరు లాంగిరసుచే యథాసముచిత పూ
జా విధులు వడసి వందితు
లై వెంటం జనిరి దివికి నఘగిరి పవికిన్. 9

మ. చనినన్ వారును దాను జీవుఁడు నిజాస్థానీ నివాసాంతరం
బున లీలా పరికల్పి తైందవ శిలాభూమిన్ సుఖాసీనుఁడై
మునికంఠీరవ ! భూమిభృ త్తిలక ! మమ్ముం గూర్చి మీరేగు దెం
చిన కార్యంబులు చెప్పుఁడా తెలిపి నిశ్చింతాత్ములం జేసెదన్. 10

వ. అనవుడు. 11

కం. అమరేంద్రమంత్రితో రై
భ్యమహాముని పలికె ముదితుఁడై మోక్షము క
ర్మమునం గలదో ! సుజ్ఞా
నమునం గలదో ! వచింపు నావుడు గురుడున్. 12

కం. నలినీ పత్రము సలిలంబులఁ
బొరయని రీతి నుత్తముఁడు సత్కర్మం
బులు గానీ దుష్కర్మం
బులు గానీ హరికి నిచ్చి పొరయఁడు వానిన్. 13

గీ. ఏత దర్థంబుగాఁగ మునీంద్ర ! తొల్లి
విష్టరక నామ కీకటవిభునితోడ
నత్రిగోత్ర సముద్భవుఁడైన సంయ
మనుఁడు చేసిన తర్కంబు వినుము నీవు ! 14

మ. ఘనుఁడా సంయమనుండు తీర్థములు ద్రొక్కం బోవుచో, ధర్మకా
నన మధ్యంబున వీచికా పవన సన్నాహంబు దేహంబు ముం
ప నిజస్వాంతము పల్లవింపఁ గనియెన్ భాగీరథిన్, నర్మకో
పనిరాసార్థ పదద్వయీ వినతి కృత్వాధోజ భూసారథిన్. 15

మ. కని తత్తీరవనాంతరంబునఁ గురంగశ్రేణి వెంటన్ గృతాం
తుని రీతిన్ బఱతెంచు విష్టరకు ధానుష్కుం గుణారోపితా
స్త్రుని రక్తాక్షుని జుంజురుందల కిరాతున్ ముందరం జూచి చే
త నివారించుచుఁ బల్కెఁ బెద్దరొద నత్యంతాను కంపాత్ముఁడై. 16

కం. ఓయి ! నిషాదకులేశ్వర !
యేయకు మేయకుము, జీవహింసకు నేలా
రోయవు ! చెల్లంబో ! నీ
కే యపకారంబు చేసె నీలే ళ్లనినన్. 17

శా. ఆ వాక్యంబు నిరాకరించి దిశలల్లాడం గఠోరంబుగా
నవ్వెన్ నవ్వి నిషాదభర్త మృగసంతానంబు జంపంగ నే
నెవ్వాఁడం బరమాత్మగాక, పిసవెట్టి ! విప్ర ! యీ చీకటుల్
దర్శింపఁ బనిలేదు సుమ్ము మము బోంట్లన్ వీరి వారిం బలెన్. 18

ఆ. శిశువు మంట నెద్దు జేయుచుఁ జెలుచుచు
నాడు నట్ల పోలె నఖిలభూత
సృష్టిఁ దాన చేయుఁ జెలుచు నప్పరమాత్మ
యిది నిజంబు సంశయింప వలదు. 19

గీ. విశ్వ మాత్మ ప్రణీతమై వికృతిఁ బొందు
నందులోన నహంభావ మనుచితంబు
గానెఱింగి వివేకులు మాని రనిన
విని మహాశ్చర్యమున సంయమనుఁడు పలికె. 20

కం. లుబ్ధక ! దూర్వా చర్వణ
లబ్ధి నిజ స్వాంత సమ్మిశ్రత్వరమానం
దాబ్ధి నిమజ్జన్మృగ వధ
లుబ్ధుండవు నీకు నీ పలుకులుం దగునే. 21

సీ. అనిన లుబ్ధకుఁడు వీపున నున్న లోహపు
వల దెచ్చి ముందర వైచి దీని
లో వహ్ని దరికొల్పు నావుఁడు ధరణీని
లింపోత్తముండు మండింప లేక
దేశస్థ మయ్యు హుతాశి గన్నుల వెంట
వేర్వేర కీలలు వేయుఁ జూప
జాలంబు, కాదంబగోళంబు వలె నొప్పె
నప్పుడు బోయ సంయమునుఁ జూచి

గీ. యోయి ! సంయమి వీనిలో నొక్క కీలఁ
గైకొనుము నీవు గ్రక్కునఁ గడమ కీల
లార్ప వలెనన్న నాతఁడు నట్ల చేయ
నీరు మిన్నంటు జ్వాలల నాఱఁ జల్లె. 22

గీ. ఇవ్విధంబున వలలోని యింగలంబు
చల్లగా నార్చి కీకట స్వామి పలికె
ఋషికులోత్తమ ! యిఁక నాకు నిమ్ము నీవు
కైకొనిన కీలఁ గఱకుట్లు గాల్ప వలయు. 23

వ. అనిన విని మునిశ్రేష్ఠుం డాయసానాయంబు డాయం బోయి తదంతరాళం బున నిజ గృహీత జ్వాలంబ యేల మొదలికి దహన లేశంబునుంగానక, హీన కళాస్యంబు తోడ నపహాస్యంబునకు నాస్పదంబై రిచ్చవడి వెచ్చ నూర్చినం గనుంగొని విష్టరకుండు మహాత్మా ! హుతాశనుండు మూల నాశనంబునం బొందిన బహుముఖ శిఖానికాయంబు మాయంబైన చందం బునఁ, బరమాత్ముండు ప్రకృతి స్థితుండైన భూతంబులు సంక్షయా

భూతంబులగు నతండు వికృతుండైన వెండియుఁ బ్రభూతంబులగు నిది
సకల ప్రపంచ స్థితి శరీరగ్రహణ ధర్మంబున నెవ్వనికి నెద్ది విహితం,
బక్కర్మంబు చేసి పరమాత్మునికి సమర్పించె నేని వాఁడు ఫలంబులం
బొరయండని చెప్పె నప్పుడు. 24

కం. పరతత్త్వవిదుం డగు వి
ష్టరకుని మస్తకముపై దిశాభాగములం
బరిమళము సోఁకుముట్టఁగ
సుర భూరుహ పుష్పవృష్టి జోరునఁ గురిసెన్. 25

మానిని. మా తరుణీసతి మన్నన బంప విమానము లంబరమార్గ సమా
యాతము లయ్యె దదంతర సీమల నన్నిట యోగ బలాతిశయ
ద్యోతక మూర్తులతో విహరించుచుఁ దోఁచె గృపారస ధూర్ధరుఁడ
ద్వైత వివేక నిధానము, చెంచు, శతక్రతు ముఖ్యులు దన్నుఁ గనన్. 26

చ. తదవసరంబునన్, బరమ తత్త్వము విష్ణు ననేకమూర్తిగా
హృదయములో నెఱుంగు కొనుమీ! కను మీవని, యట్ల యోగ సం
పద మహిమన్ విమానములపై శబరాగ్రిణి పెక్కు రూపులై
చదలఁ జరింప వానిఁగని సమ్మద నీరధి నోలలాడుచున్. 27

కం. విష్టరక ! నిన్నుఁ బోలఁద్రి
విష్టపమున లేరు తత్త్వవిదు లని లబ్ధా
భీష్టత సంయమన మహా
ముష్టింపచపతి నివాసమునకుం జనియెన్. 28

సీ. నేకావున తత్ప్రకార సుజ్ఞానంబు
గలిగి స్వజాతీయ కర్మ తత్ప
రుండైన వాడు ముక్తుండని గీష్పతి
బోధింపఁ దెలిసి రైభ్యుండు వసువు

నాత్మగేహములకు నరిగిరి, నీవు న
ద్వైత మార్గంబున వాసుదేవు
సేవింపు మశ్వశిరోవసుధాధీశ !
కలుగు మోక్షంబని కపిల మౌని

గీ. చెప్పనాతఁడు గడుసంతసిల్లు భూవ
ధూలలామకుఁ దనపుత్రు స్థూలశిరుని
భర్తఁగాఁ జేసి చనియెఁ దపస్వి జన శ
రణ్యమునకును నైమిశారణ్యమునకును. 29

కం. నని తత్కాననమధ్యం
బున భూపాలుండు యజ్ఞమూర్తి స్తుతి య
జ్ఞనరున్ గురునారాధిం
చెనని వరాహంబు చెప్పెఁ జెప్పిన మరియున్. 30

గీ. పృథివి యిట్లను యజ్ఞమూర్తి స్తుతి ప్ర
కార మానతి యిమ్ము భూచారవర్య !
వినఁగ వలెనన్న దేవుండు ఘనఘనాఘ
నార్భటీవిస్ఫుటోక్తి నిట్లని వచించె. 31

సీ. బ్రహ్మ రుద్ర మహేంద్ర పావక పవమాన
విధు విభాకర ముఖ్య విబుధయాజ్య
శశి సూర్యనేత్ర భాస్వర దంష్ట్రవత్సరాం
శాయనకుక్షి దర్భాంగరోమ
యిధ్మసక్థి జగత్త్రయీ దిశాభ్యంతర
వ్యాప్త శరీర! విశ్వప్రసూతి!
సకల దేవాసుర జయనిమిత్తాను యు
గాంగీ కృతైక నరావతార

గీ. యజ్ఞమూర్తి ! కుభృత్సన్ని భాంగ! యీశ!
యిజ్య! పరమాణుతుల్య! యోగీంద్రపూజ్య!
హరి జనార్దన మూర్ధ సహస్ర పరమ
వేదవేదాంగ వేదాంత వేద్య! నిత్య! 32

కం. ఈ సకలము చతురాస్యుండ
వై సృజియింపుదువు, చక్రివై కాతువు లీ
లా సంపన్నత, రుద్రుడ
వై సమయింపుదువు నీవ యజ్ఞనరేంద్రా! 33

వ. సంసార చక్ర చంక్రమణ సంక్షయ కాంక్షులైన మహానుభావులకు సేవ్యుండవు నీవ. దేవా! నీ మానసంబున మానసంబును నీ నేత్రంబుల నేత్రంబులు నీ శరీరంబున శరీరంబును సమర్పించిన వాడ నన్యథా శరణంబు లేనివాడ నన్నుం గృతార్థునిం జేయుమని యజ్ఞమూర్తి స్తోత్రంబునం బ్రార్థించినం బ్రసన్నుండై సహస్రకర సహస్రదుస్సహ మహామహో నివహంబై తన పురోభాగంబున వెలుంగ నందు నశ్వశిరో నరేశ్వరుండు లయంబునం బొందెనని చెప్పిన వరాహస్వామికి భూమికి యిట్లనియె. 34

కం. దైత్యుడు వసుభూపతియు సు
ధాభ్యవహార గురుతోడ నద్వైత జ్ఞా
నాభ్యాసము చేసి తదీ
యాభ్యున్నతి నేమి యైరి హరికరివర్యా! 35

చ. అనవుడు దేవు డిట్లనియె నట్లు బృహస్పతిచేత బోధమున్
విని వసు భూవిభుండు దన వీటికి నేగి జగజ్జనానురం
జనకరుడై వసుంధర భుజాభుజగంబునం దాల్చి శాత్రవా
వనిపులం గూల్చి విష్ణుని వివర్జిత భేదమునం భజింపుచున్. 36

ఉ. చేసె ననేక యాగములు, జీవన సౌఖ్యము నెమ్మనంబునన్
రోసె, వివస్వ దాహ్వయ తనూజునిపై నిజరాజ్య భారమున్

వేసె, వివేక నిష్ఠుర లవిత్రముచే నఘపాశ బంధముల్
గోసె, ఋరీనివాసమునకుం బెడఁబాసె బుధుల్ సుతింపగ౯ 37

వ. ఇట్లు సంగపరిత్యాగంబు గావించి తపోవనంబునకుం జని కాశ్మీర వల్లభుండు పుండరీకాక్ష పారస్తవంబు జపించుచు నియతాత్ముండై. 38

కం. పుష్కర తీర్థ తటంబున
దుష్కర తపమాచరించి తుది ముందట నా
విష్కారంబునఁ బొందిన
పుష్కర పత్రాక్షుదేహమున లయమయ్యెన్. 39

గీ. నావుడు మహా వరాహంబునకు ధరిత్రి
దేవ నీ భక్తురాలికిఁ దెలియఁ జెప్పు
పరమనుతిఁ బుండరీకాక్ష పారమును వ
సుక్షమాపాలనాథుని మోక్షగతియు. 40

వ. అనిన నద్దేవుండు సవిస్తర భాషా విశేషంబున. 41

గీ. అఖిల వేదాంత వేద్య మహం భజామి
సంభవక్షయ రహిత మహం భజామి
సాస్థి చక్రాబ్జశార్ఙ్గ మహం భవామి
కుంభ సాగరశయన మహం భజామి. 42

పృథ్వీ. నమామి మధుసూదనం నవపయోద నీలత్విషం
నమామి పరమేశ్వరం నఖర భిన్నరాత్రిం చరం
నమామి పురుషోత్తమం నలిన గేహినీ నాయకం
నమామి కరుణాస్పదం నగధురీణతా దక్షిణం. 43

వ. అని వసుమహేశ్వరుండు సంస్తుతించె నిది పుండరీకాక్ష పారస్తవంబు వెండియు నతండు పుండరీకాక్షు నుద్దేశించి మహాత్మా! చరాచరప్రపంచం

బున నెద్దియు భవద్వ్యతిరిక్తంబు లేదు. సర్వంబును భవన్మయంబగా నెఱింగిన వాఁడ నని పలుకు నవసరంబున వాని కిరాతకుం డిట్లనె

సీ. గిరికొన్న పల్లె జుంజురు వెంట్రుకలవాఁడు
మినమినమను మిట్ట నొసలవాఁడు
కోలచూపుల యెఱ్ఱ జీరు గ్రుడ్లవాఁడు
బైసి మాలిన ముక్కు సణకవాఁడు
కాడవంటి పంకల గొగ్గిపండ్లవాఁడు
దుమ్ముపట్టిన బొక్కి బొమ్మువాఁడు
గాటంబుగా నిర్లు గవియు దేహము వాఁడు
కడుసక్కళించిన కడుపు వాఁడు 44

గీ. వైపుదప్పిన చేతులవాఁడు, మొద్దు
వ్రేళ్ళ పంకర కొంకర కాళ్ళవాఁడు
కురుచవాఁడు, వికారపు గూని వీఁపు
వాఁడు, రాలిన కొండు భీషణము పెరఁగ. 45

గీ. వెడలి సాంజలియై వసూర్వీశ కళత్ర
నన్నుఁ బనిగొమ్ము నాపుడు, నిన్ను బనిఁ గొ
నంగ నేటికి? నాకు! నీ నామమేమి?
యే కతాసను వచ్చితిరా! కిరాత. 46

గీ. అనినఁ గాశ్మీరపతికి నిట్లనియె వాఁడు
తొంటి జననము నుండి నీ వెంట వెంట
నంటువాయని నీ బ్రహ్మ హత్యఁగాని
యేఁ గిరాతుండఁగా జుమీ! నృపవరేణ్య! 47

సీ. అది యెట్టిదనిన నీవ వధరింపుము! గత
కలియుగంబునఁ బౌండ్ర కులమునందు
జనియించి యామ్యదిశావధూ చరణ ను
జీ నూపురము జనస్థానపురము

పరధరి శ్రీనాధు లరిగాపులై భజిం
పఁగ నేలి దోరి ప్రతాపమున వ్రాలి
కరులు వాజులు శతాంగములు పదాతులు
వెంటరా నొకనాఁడు వేఁట వెడలి

గీ. కాననము చొచ్చి, శార్దూల ఖడ్గ సూక
ర ప్రముఖ జంతు సంతతి వ్రచ్చి, నచ్చు
నారసంబున మృగవేష ధారియైన
యతికులస్వామిఁ గూల నేసితివి నీవు. 48

గీ. ఏయుటయుఁ గొంత దూరంబు పోయి మృగము
ప్రస్రవణశైల కందరాభ్యంతరమునఁ
బరమతాపసవేషియై పడియెఁ బడిన
నది నిజాలకు సారంగ మనుచు డాసి. 49

కం. కృతక హరిశాత నఖర
ప్రతిభట శాతాంబక ప్రపాతాంగ విని
ర్గత రక్త సిక్త మునికుల
పతి వీక్షించితివి, గుండె బగ్గునఁ బగులన్. 50

మ. ముని చూడామణి నట్లుచూచి భయసం పూర్ణాంతరంగుండవై
కనుగెందమ్ముల జాటి మేన వఱదల్ గట్టంగ బాష్పాంబువుల్
వనికావాటికి వేఁట రారె! హరిణవ్రాతంబులం జంపరే!
కనరే! పాతకినైన నేను బలె దుష్కర్మంబు ధాత్రీపతుల్. 51

సీ. అక్కటా పరమసంయమిఁ జంపి క్రమ్మఱఁ
బురికి నేనేమని పోవు వాఁడ
నాసరి మేదినీనాథులలోన నే
నే చందమునఁ దలయెత్తు వాఁడ

నే తరంబున లేని యియ్యపకీర్తిపం
కంబు నేనేమిటఁ గడుగువాఁడ
దరిదాపు లేని దుస్తరపాతకాంబుని
ధానంబు నేనెట్టు దాటువాఁడ

గీ. ననుఁ బెక్కువిధంబుల నడలి బడలి
వేదనానలశిఖలచే వెచ్చి నొచ్చి
కారణము లేక తగిలిన కల్మషంబు
బయలు పడనీక మనసునఁ బదిలపఱచి. 52

కం. మాటికి నిఁక సంసారం
బేటికి నను బుద్ధి పుట్టఁ బృథ్వీశ్వర! న
ట్టేటికి నెదురీదినగతి
వీటికి వచ్చితివి మరల విన్నదనముతోన్. 53

శా. ఆవేళ న్నినుఁజూచి బాంధవ చమూపామాత్యవర్గంబు చిం
తా వైకల్యముతోడ భూపతికి మౌనంబేల వాటిల్లె నే
లా వాడె న్వదనంబు, నేత్రముల నేలా తొట్టె బాష్పంబు, లే
లా వైవర్ణ్యము దోఁచె దేహమున నేలా పుట్టె నిట్టూరుపుల్. 54

కం. అని సంశయింప బాంధవ
జనముల సేనాధిపతుల సచివులఁ జేస
న్నసె పొందని సిద్ధాంతం
బునకుం జని బ్రహ్మహత్య మొగమున వ్రేలన్. 55

సీ. ఉబుసుపోకకునైన నొల్లవు, చెవిఁ జేర్ప
వైణిక వల్లకీ వాదనములు
క్రీగంటనైన వీక్షింపవు శుద్ధాంత
కామినీమణుల శృంగారకళలు

పెనుబండువున నైన, బెట్టనూల్కొనవు క
ట్టాణి ముత్యంబుల హారలతలు
కలనైన నునుమేన నలఁదవు పన్నీటఁ
గలపిన కాశ్మీర కర్దమములు

గీ. మఱచియైన విహార రమ్యస్థలంబు
చేర నరుగవు సుకృతలక్ష్మీవియోగ
వేదనా దూయమాన మనోదురంత
చింతఁ జీకాకు పడి మహీకాంత నీవు! 56

వ. ఇవ్విధంబున శరీర సౌఖ్యంబువలన వైముఖ్యంబును, సకలసామ్రా జ్యోపకరణంబు వలన నిరాకరణంబును, మృగయావినోదంబువలన ఖేదంబును, వహించి సహించి నిలుపరాని బ్రహ్మహత్యా పాతకంబు నివర్తింప విచారించి, శ్రీహరి ప్రీతిగా సువ్రతంబులు సలుప నుద్యోగించు నవసరంబున. 57

ఉ. పిట్టల వాతులెండ, నలి బృందముపాట లవారినిండ, ని
ట్టట్టు చనంగరాక ఫణు లాఁకటనుండఁ గభస్తిమచ్ఛిలా
పట్టికలన్ హుతాశనుఁడు భగ్గున మండ ధరిత్రిమీఁదఁ జూ
పట్టి రసాలసాలములు పండ నిదాఘము వచ్చె నుగ్రమై. 58

క. ఆ సమయంబున శైలగు
హా సీమలయందు వనహుతాశనము నృపా
లా! సతతము నీ హృదయము
లో సంతాపాన్ని వోలె లోలార్చులచేన్. 59

చ. సమత, సమస్త చిత్తముల సంతతమున్ విహరించుగాన దై
వము మదనుండె తథ్యమని. వంచన యించుక లేక, యెండచేఁ
గమల పుటీ కటాహములఁ గ్రాగెడు తేనియ నూనె దప్తమా
షము దొడికెన్, మదభ్రమరజాలము గేలిసరోవరంబులన్. 60

కం. పెనుగాలి చఱచి కొట్టిన
వినువీధికి నెగసి, ధూళి విలసిల్లె, మహీ
వనజేక్షణ తీవ్రతప
మ్మునకు వెఱచి, పెట్టుకొన్న ముసుఁగును బోలెన్. 61

గీ. నీరనిధిరాజు కరుణించి నిష్ఠురాత
పంబుచే నొచ్చెనని భూతలంబు శీత
లంబు సేయఁగఁ బంపిన లహరులనఁగఁ
నెండమావులు గనుపట్టె నెల్ల కడల. 62

కం. ఎండకు నోర్వఁగఁజాలక
కొండలు మొఱపెట్టెననఁగ, గ్రోల్పులులు గుహా
మండలములనుండి మహో
తుండంబులు దెఱచి ఖాంకృతులు గావించెన్. 63

సీ. జిలిబిలిమంచు కించిన్మాత్రమును లేక
పంచబంగాళమై పారిపోవ
చల్లదనంబెల్లఁ బల్లవాధరల ని
బ్బర పుబ్బుపాలిండ్ల పంచనొదుగ
నుదకంబు తెకతెక నుడుక మీదికి రాక
మడుగుల మీనంబు లడుగు చేర
దశదిశాంతరములఁ దఱచుగా విస్ఫులిం
గములు గ్రక్కుచు వడగాలి సుడియ

గీ. నధ్వసీమల గుండియలవియ వాఁడి
చూపె మల్లీల తావల దీపరాగ
ధూసరంబులు, దప్త ముక్తాసరములు
మాసరంబులు నైదాఘవాసరములు. 64

వ. అట్టి వాసరంబులు గల శుక్రమాసంబున శుక్లపక్షంబున నేకాదశీదినంబున హరిప్రీతిగా నీవు నిర్జలోపవాసంబు చేసి, నిజరాజధానియైన జనస్థానపురంబున విష్ణుదేవాలయంబున మహోత్సవంబు గావించి శ్రీ మహాభాగవతాది పురాణ శ్రవణంబున నా రాత్రి జాగరణంబు సల్పి, మఱునాడు పూర్వ పర్వత శిఖరభూమి సామి సముదిత మిహిరకిరణ కిసలయవ్రాతంబునకు బాలచూతంబైన ప్రభాతంబునం గృతస్నానసందవై సాలంకారగవి సహస్రంబు మహీసురవర్యులకు దానంబిచ్చి, పారణకుం బోవ నమకట్టి, మణికుట్టిమ స్థలంబున నడుగువెట్టు సమయంబున నెట్టంబడి నుదరశూలంబు పుట్టి జగబెట్టి వైద్యులచేత భేద్యంబుగాక మిగుల నుద్రేకించినం బ్రాణంబు కంఠకోణంబులం బెట్టుకొని కూర్మిరాణియైన నారాయణిం గటాక్షించి హీనస్వరంబున. 65

కం ఓ నారాయణి! నిన్నుం
ప్రాణముగాం జూచు నాకు వట్టు దలంచి పా
పానకు నొడిగట్టు కొనెం
గా నేడు విధాత, యేదిగతి యుంక నీకున్. 66

మ. అది ప్రాణానిలముల్ తొలంగు తరి, భార్యా నామధేయచ్ఛలం
బున నారాయణ వర్ణముల్ తడవి తత్పుణ్యప్రభావోదయం
బున వైకుంఠపురప్రవేశమునకుం బోవంగ రోషించి ని
న్ను నిరోధింపంగ, బ్రహ్మహత్యనగు నేను న్వెంట నేతెంచితిన్. 67

వ. అప్పుడు నిప్పులురాలు కటాక్షంబున నన్ను వీక్షించి, విష్ణుభక్తుని వెంబడించి యిది యెక్కడి పిశాచంబు వచ్చెనని సంభ్రమంబున 68

కం. పదములం బడి మొఱవెట్టంగ
నదయతం బెడకేలు గట్టి హరివీరభటుల్
చదియంగ మోదిరి పెదపెద
గుదియలుగొని యెముక లెల్ల గుల్లలు గాంగన్. 69

గీ. మోదుటయు సూక్ష్మరూపివై మేదినీశ!
తావకములైన రోమరంధ్రములనుండిఁ
గాని, వైకుంఠవిభుని కింకరుల చేత
నంతనొచ్చియు విడువలేనైతి నిన్నుఁ. 70

ఉ. ఆ గతి మత్ప్రవిష్ట సకలాంగరుహంబులతోడ ముక్తిల
క్ష్మీగృహమైన విష్ణుపురికిం జని భోగపరంపరైక దీ
క్షాగుణయుక్తి నందునొక కల్పము నీవు వసింప, నేనుఁ దే
జోగరిమంబు నన్నిడువఁజూ! నిను పోఁకిన నాటనుండియున్. 71

సీ. అంతట దివసాంత మగుటయు బ్రహ్మని
ద్రా సమన్వితుఁడై రాత్రిగడపి
మఱునాఁడు సృష్టి నిర్మాణంబు సేయుచో
మేదినీశ్వరఁ నిన్ను నాది సృష్టిఁ
గృతయుగంబున వినిర్మించెఁ గాశ్మీరాధి
పతి సుమనో నరపాలు వలన
నిర్మింప నేనును నీతనూరుహముల
తోన పుట్టితి శశిలోని కందు

గీ. పగిది నావిధంబునను శ్రీపతి పదాబ్జ
పూజ వెలిగాఁగ నీ జన్మమున ననేక
యజ్ఞ దానాది పుణ్యకృత్యములు నియమ
పరతఁ జేసితి చేసినఁ బాయనైతి. 72

మ.కో. అక్షయ ప్రతిబంధరూపమ నైన నన్ను వసుంధరా
ధ్యక్ష! యిప్పుడు విష్ణుభక్తుఁడవై పఠించిన పుండరీ
కాక్షపారము తావకాంగరుహంబులం బెడఁబాపుటన్
మోక్షసంపద చేరెడున్ మనమున్ సుకర్మము గోరెడున్. 23.

వ. అని చెప్పిన వసునృపాలవర్యుం డాశ్చర్యంబునం బొంది ముందటం గిరాతరూపంబున నున్న పురాతన బ్రహ్మహత్యా పాతకంబు నవలోకించి నాకు నీ కతంబునం బూర్వజన్మ సంస్మరణంబు గలిగె నీవుమ మత్ప్రసాదంబున ధర్మవ్యాధుండవు గమ్మని వరంబిచ్చి, ప్రత్యక్షంబైన పరతత్వంబునుం దానుమ దివ్యవిమానం బెక్కి చనియె, నప్పుండరీకాక్ష పారస్త్రవంబు పఠించిన నాకర్ణించినం బుష్కరతీర్థయాత్రా ఫలంబు సిద్ధించునని చెప్పిన విశ్వంభరావధూటి దేవా! వసునరేశ్వరుండు ముక్తుం డగుట యెఱింగి రైభ్యుండేమి చేసె నానతిమ్మనిన వరాహదేవుం డిట్లనియె- 74

గీ. ధరణి! కాశ్మీరాధీ
శ్వరుడు వసువు ముక్తికాంత వరియించుట భూ
సురకోటి చెప్ప, రైభ్యుఁడు
హరిపూజాపరుఁడు తీర్థయాత్రోన్ముఖుఁడై. 75

సీ. చేదోయి నొసలఁ జేర్చి ననంతశాయికి
రంగధామునకు సాష్టాంగ మెఱఁగె
ప్రణమిల్లెఁ గాంచి వరదరాజునకు, నమ
స్కృతి చేసె వేంకటాద్రీశునకును
మ్రొక్కె నహోబలేంద్రునకు సింహాచల
నాయకునకు వందనము ఘటించె
నతి సల్పె శ్రీ కూర్మపతికి దండంబు స
మర్పించెఁ బురుషోత్తమాధిపునకు

గీ సరవి నీ వైష్ణవస్థాన పరిసరముల
గల నదీ సరసీవాపికా తటాక
ముల మునుంగుచుఁ దత్తీర పుణ్యగహన
కుసుమ సౌరభ్య సంపద కొల్లగొనుచు. 76

కం. భాగీరథికిం బోయి ప్ర
యాగమునకు నేగి పిదప నా రైభ్య మహా
యోగి చనియెఁ బితరుల ఋణ
మీగి కొనఁగ దురిత హరిణ మృగయకు గయకున్. 77

సీ. చని ఫల్గుణీనదీ సలిల పూరమునఁ గృ
తస్నానుఁడై గదాధరునిఁ గొలిచి
పితృపర్వతము చేరి పేరెలుంగన గుల
గోత్రనామములు వ్రాక్రుచ్చి సత్తు
సత్తుగాఁ జల్లె హస్తములు మీఁదికి నెత్తి
పితృగణంబులను బేర్వేర బిలిచి
క్షేత్రోపవాసంబు చేసి తద్దివసంబు
గడపి సూర్యోదయకాలమునకు

గీ. నిత్యనైమిత్తికములైన నియమవిధులు
దీర్చి పిండప్రదాన విధిని సదర్భ
మాషగోధూమ యవ చూర్ణమధుతిలాది
సముచిత ద్రవ్యములు చాల సంతరించి. 78

కం, తా వచ్చె వెంటఁ గొల్చి గ
యావాసులు రా యతాత్ముఁడై పితరులకుం
గైవల్య పదము చేరఁగ
నా వటమన నొప్పు నక్షయవటంబునకున్. 79

శా. ఈ చందంబున వచ్చి తద్వట మహీజేంద్రంబు క్రింద న్విశి
ష్టాచారోచిత కృత్యముల్ జరపి కంజాప్తుండు మధ్యాహ్న లీ
లా చాతుర్యము చూపఁ జూపఁదగు కాలానం బితృవ్రాతముఁ
చేచాపంగ మహామునీశ్వరుఁడు చేసెన్ బిండదానక్రియల్. 80

కం. హరిహర విధిగుహ వైశ్వా
నర త్రయాదిత్య శశిగణపతి క్రౌంచా
మరవర కుంభజకశ్యప
చరణంబులమీఁదఁ బండషండము నిలిపెన్.

వ. మఱియు జిహ్వాలోల రామగయాది విశేషంబులం బైతృకక్రియా కలాపంబులు నిర్వర్తించి కృతకృత్యుండై కొండొకకాలంబు ఘోరతపం బాచరింప నొక్కనాఁడు త్రసరేణు పరిమాణంబును మధ్యందిన మార్తాండమండల ప్రభావిభాసమానంబులనునైనవిమానంబెక్కి పరమాణు సమానదేహుండు దివ్యపురుషుండు ముందఱఁ బ్రత్యక్షంబై. 82

గీ. బ్రహ్మ విజ్ఞాన సూన సౌరభ్య రైభ్య!
యిట్టి ఘోర తపోనిష్ఠ నేమి కార
ణంబునకు నున్నవాఁడవు నాకుఁ జెప్పు
మనుచు నాశ్చర్యకరముగా నంతలోన. 83

మ. అతి సూక్ష్మాకృతి మాని కైకొనె మహీ యశ్వంబు సప్తాబ్ధివే
ష్టిత విశ్వంభరనిండె నంబరము దాఁటెన్, సర్వ దిక్కుంభికుం
భతట ప్రాంతము లాక్రమించె నిఖిల బ్రహ్మాండము ల్మీఱె నా
త్మతనూదీప్తులు క్రొమ్మెఱుంగుల హసింపం దద్విమానంబుతోన్. 84

కం. అతనికి వినయాన్వితమతి
యతిపతి నతిచేసి పలికె నప్పటి నీ సూ
క్ష్మత, యిప్పటి నీ సంపూ
ర్ణత చూడఁగ, విస్మయంబు నా మదిఁ బొడమెన్. 85

గీ. ఏ మహాపురుషుఁడవో యెఱుగరాదు
మామకస్వాంత విచికిత్స మాన్పుమనిన
వనరుహాసన వంశవర్ధన కృతార్థ!
వత్స! నిన్నుఁజూచు వేడుక వచ్చినాఁడ. 86

కం. జనలోకనివాసుఁడ, రు
ద్రుని గాదిలితమ్ముఁడన్ సరోరుహసంజా
తుని మానసపుత్రుఁడ నే
సనత్కుమారుండ నన సంయమి పల్కెన్. 87

చ. యతిజన సేవ్యమాన మహిమాంబునిధాన! సనత్కుమార! సం
తత నియమ ప్రచార! కృప నన్నుఁ గృతార్థుఁడ వంచు నానతి
చ్చితి, రెటుగాఁ గృతార్థుఁడ! రచించితినో జపముల్ తపంబులున్
గ్రతువులు, గాక మీరుబలెఁ గాంచితినో పరతత్త్వబోధమున్. 88

సీ. నావుడు బ్రహ్మమానసకుమారుండు స
నత్కుమారుండు సన్మార్గనిరత
వినుము గయాక్షేత్రమున నెవ్వరికి నొక్క
నాఁడు పిండప్రదానంబు సేయ
నబ్బదు నిచ్చలు నట్టి యాగయ నీకు
నబ్బెఁ బిండప్రదా నాగ్నిహోత్ర
జపతపంబులఁ బితృసంతృప్తి గావింప
సాక్షాద్గదాపాణి శౌరిఁ గొలువ

గీ. విమల వీచీ ఘటా ఘుమ ఘుమ నినాద
బధిరి తాఖల దిక్చక్ర ఫల్గుసీన
దీపవిత్రోదకంబులఁ దీర్థమాడ
నింతకంటెఁ గృతార్థత్వ మెద్ది చెపుమ. 89

ఉ. అద్భుత మింక నొక్కయితి హాసము చెప్పెద, మున్ను దోఃప్రతా
పోద్భటుఁడై విశాలపురినుండి విశాలనరేశ్వరుండు పు
త్రోద్భవ కౌతుకానుభవ మొక్కటి లేమికి వేఁగి వాక్య సం
పద్భుజగేంద్ర సన్నిభుల బ్రాహ్మణులం బిలిపించి వారితోన్. 90

ఉ. ఓ సరసీరుహాసన కులోద్భవులార! సుతాభిలాష నేఁ
జేసితిఁ యాగముల్, విపిన సీమల ఘోరతపంబులు చేసితిన్
జేసితిఁ గన్యకా కనక సింధుర ధేను రథాశ్వదానముల్
చేసిన నా మనోరథము చెందదు, కారణమేమి చెప్పుఁడా! 92

మ. అనినన్ సంపద లెన్ని గల్గిన నరేశా! యింద్ర సంకాశనం
దను డొక్కండును లేమి నీనగరు చిన్నంబోయె వేయేల వే
చని భక్తిం బితృకోటి నెల్ల గయలోనం దృప్తి పొందింపు, నం
దనుఁ డంభోనిధి వేష్టితాఖలధరాధౌరేయుఁడై పుట్టెడున్, 92

కం. అని చెప్పి సజ్జనానం
దను, నందనుఁ గనుమటంచుఁ దన మకుటతటం
బున నక్షత లిడి దీవిం
చి నివాసములకు విప్రసింహులు చనినన్. 93

కం. క్షణమాత్రము నిలువక వా
రణ రథ హయ భటులు వెంటరా భేరిదణం
ధణ మనఁగ నమోఘ బ్రా
హ్మణ శిష యనుచును విశాలుఁ డరిగెన్ గయకున్. 95

చ. అరిగిన కనత్తరంగ శిశిరానిల వల్గన ఫల్గునీ తటాం
తరమున సైన్యము ల్విడియఁ దా గయలోఁ బితృతర్పణైక త
త్పరమతి పిండదానము యథావిధి జేయుచు నుండి చూచె ము
వ్వుర సితరక్త కృష్ణ తనువుల్ గలవారల నంబరంబునన్. 95

గీ. ఇట్లు చూచి విశాల నరేశ్వరుండు
మీకు నామంబులెవ్వి! యేమిటికి మీరు
వచ్చితిరి నాకుఁ జెప్పంగ వలయు ననినఁ
జెప్పె నిట్లని వారిలో సితతనుండు. 96

కం. నను సితుఁ డందురు ధాత్రీ
జనులు శరత్కాలచంద్ర సన్నిభవర్ణం
బున సత్కర్మంబున వ
ర్తనమున నే నిన్నుగన్న తండ్రిం దండ్రీ. 97

శా. కూపెట్టంగ మహీసుపర్వుల మెడల్ గోసెం, బరస్త్రీ రతం
బ్రాపించెన్, సుకృతంబు త్రోవకుఁ బెడం బాసెం, ధనాదానసం
ధా పారుష్యము తోడ సాధుజనులన్ బాధించె, రక్తాంగకుం
డీ పాపాత్ముఁడు నీ పితామహుఁడు సుమ్మీ! వంశవిస్తారకా! 98

గీ. వెఱపు లేక నఱికి నదికి దోర్దండ కృ
పాణి మీఁద శత్రు శోణితంబు
చాయ నిలిపి తాఁ దదీయకాళిమ దాల్చె
ననఁగఁ గృష్ణ వర్ణుఁడయ్యెఁ బుత్ర! 99

వ. ఆధీశ్వర నామధేయుం డితండు. భవత్ప్రపితామహుండని క్రమంబున దమ మువ్వుర సంబంధ రూపవర్తనంబులు దెలియం బలికి సితుండు వెండియుం దన పితృ పితామహుల నుద్దేశించి వీరలిద్దరు దారు చేసిన దుష్కర్మంబునఁ బెద్దకాలంబు వీచీనామ ఘోరనరకంబునం గూలిరి. నా చేసిన సుకర్మఫలంబున నేను దుర్లభంబైన శక్రాసనంబున నుండితి· మహాత్మా! సకల మంత్ర సంవేదినైన నీవు గయాక్షేత్రంబున నిప్పుడు పిండప్రదాన సముచితోదక తర్పణ సమయంబునం బితృపితామహ ప్రపితామహులు తృప్తు లగుదురు గాక యని పలికిన పలుకు మహత్వంబున నరకవిముక్తులైన వీరును శక్రాసనస్థుండనైన యేనునుం పితృలోకంబునకుఁ బోవ నుద్యోగించి నిన్నుం జూడ నిక్కడ గూడితిమి యిది మదీయ వృత్తాంతంబు 100

చ. కలసిరి ముక్తి కల్మష వికార వివర్ణులు ఘోరనారక
స్థులు నగు వీరు సైతమును సువ్రత! నీవు మదన్వయంబునం

గలిగితి గాన సత్సుతులఁ గాంచిన వారల భాగ్యముల్ గయా
స్థల కృత పిండదాన ఫలసంపదయుక్తి వినుతింప శక్యమే. 101[1]

గీ. అని ప్రశంసించి వారుఁ దానును సితుండు
వోయె ధన్యాత్ములార! విచ్చేయుఁ డనుచుఁ
బలుకు నందను తియ్యనిపలుకు చెవులు
సోక నతిలోకమగు పితృలోకమునకు. 102

కం. కావునఁ బితరులఁ గూర్చి య
థావిధి జపహోమ పిండదానతపంబు
ల్గావించితి గయ ననిశము
నీవు గృతార్థుఁడవు గావె నిర్మలచరితా. 103

కం. సారంబు నీ తవస్సం
భారము. నిజమని సనత్కుమారుఁ డదృశ్యా
కారుం డగుటయు రైభ్యుఁడు
చేరి గదాధరుని వినుతిఁ జేయం దొడఁగెన్. 104

సీ. ఘోరపాతక నీరసారణ్య పటలంబు
గాల్పంగ నే వేల్పు గారుచిచ్చు
యామినీచర పిశాచాచల వ్రాతంబుఁ
బొడిసేయ నేవేల్పు పిడుగుతునక
భవజరామరణ కార్పాస కదంబంబుఁ
దూలింప నే వేల్పు రోలుగాలి.
భయ రోగదుఃఖ విపద్విహంగ శ్రేణిఁ
దవుల నేవేల్పు సాళువము కూన

గీ. తన పదాంభోరుహములు తత్పరతఁ గొలువఁ
గడఁగు వారికి నే వేల్పు కల్పవృక్ష
మట్టి వేల్పు గదాధరు నాశ్రయింతు
ననిన సాక్షాత్కరించి, నారాయణుండు. 105

మ. జనలోక స్తుత! నిన్ను మెచ్చితి, నభీష్టం బిచ్చెద న్నేఁడు, నా
విని, సంతోషముతోడ రైభ్యుఁడు, శిరోవిన్యస్తహస్తాబ్జుఁడై.
సనకాదు ల్వసియించు లోకము కృపా సంపన్నతన్నాకు ని
మ్మని ప్రార్థించిన, నిచ్చి మాధవుఁ డదృశ్యంబైన. నా రైభ్యుఁడున్ 106

గీ. శౌరివరమున నొక నిమేషంబులోన
తత్త్వవిజ్ఞాన ఘంటాపథంబు వెంట
నరిగెఁ గైవల్య కోకిలోద్యానమునకు
సనకముఖ్యమహాముని స్థానమునకు. 107

కం. అని చెప్పిన విని ధాత్రీ
వనిత వసుక్షోణిపాలు వలనం బ్రభవిం
చి, నిషాదాకారము దా
ల్చిన, పురుషం దేమిచేసె లీలాదంష్ట్రి! 108

సీ. అనవుడు దేవుఁడిట్లని చెప్పె నా చెంచు
మిథిలాపురీ బహిర్మేదినీస్థ
లంబున నుండి కుటుంబసంరక్షణా
ర్థంబు గానకుఁ బోయి ప్రతిదినంబు
నొకమృగంబు వధించి హుతవహాతిథులకు
సగము సమర్పించి సగము విక్ర
యించి, సంసార ప్రపంచంబు నడుపుచుఁ
బర్వపర్వంబునఁ బైతృకంబు

గీ. తన కులాచార ధర్మంబు దప్పనీక
సలుప నీభంగిఁ బెక్కు వర్షములు చనియె
నంత వానికి నర్జున కాఖ్యుఁడైన
సుతుఁడు జనియించె నియతుండు సుగుణయుతుఁడు. 109

గీ. వ్యాధభర్తకు మరికొన్ని వర్షములకు
బుట్టె నర్జునకీ నామపుత్రి మెఱుఁగు!
దీఁగెకైవడి, రతిరాజు తియ్యవింటి
చేగవోలిక. వెన్నెలసోగ పగిది. 110

కం. ఈచందంబున జననం
బై చాంద్రమాస కళభంగి ననుదినవృద్ధి
శ్రీ చాతురి గల చెంచుల
రాచూలితికి యవ్వనంబు రాఁ గడఁగుటయున్. 111

సీ. నాభికా వాలమండలమున మొలచిన
తా పించవల్లిమ తల్లియనఁగఁ
దను మనోభవ పుష్పధనుదంతరంబునఁ
గట్టిన బంగారు కట్టులనఁగ
సౌందర్య కేళికాసారంబులోపల
మొనసిన నెత్తమ్మి మొగడ లనఁగ
నిటల స్తనంధయ నీహారకరునిపైఁ
గవిసిన గాఢాంధకారమనఁగ

గీ. నాఁడు నాటికి నారు గానంగఁ బడియె
వళులు దోచెఁ గుచంబులు వచ్చెఁ గురులు
వ్రాలె సంతట నాభిల్లవంశవల్ల
భాత్మ సంభవ సంపూర్ణ యవ్వనమున. 112

గీ. హరిణ కరి హరి చమరంబు లక్ష్మి కుంభ
మధ్య వాలాకృతులు దెచ్చి మనుపు కొఱకు
భిల్లపతి యింట గిఱవులు పెట్టెననఁగ
దృక్కుచవలగ్న చికుర చారిమల నొప్పు. 113

గీ. పట్టెదేసి కుచంబులపై ధరించి
కందుకక్రీడగావించు ఘర్మవారి
గరఁగి దిగ జాఱు, నవగైరికద్రవంబు
గిరులఁ బ్రవహించు ధాతునిర్ఝరము లనఁగ. 114

గీ. చన్నుగుబ్బల పోరాటఁ జక్కఁబెట్ట
బోయి, మధ్యస్థభావంబు బొందలేని
కతన లజ్జించెననఁగ, మోగాలు నల్లఁ
బారు గురువింద పూసల పేరు వైచు. 115

కం. క్రిక్కిఱిసిన బింకపుఁజను
జక్కవకవ తెక్కలనఁగ సకియలు దనకున్
మక్కువ నీకొక్కొకమరి
పెక్కులు మెడఁదాల్చు మంచి పింఛెపుదండల్. 116

గీ. గ్రహణ భయమున రవిసుధాకరులు హీను
లై చికురబంధ రాహుగ్రహంబు కడకు
శరణు వేడంగ వచ్చిన చాడ్పు దోఁప
బెట్టు సిందూరమునఁ జుక్క బొట్టు నొసల. 117

వ. ఇవ్విధంబున, నారూఢయౌవన విజృంభణంబున దృక్కరంభంబైన నిజతనూజ నర్జునకిం జూచి దూరీకృతవిరోధుండు ధర్మవ్యాధుండు దీనికిం దగిన వరుం డెవ్వండు గలుగునో యని చింతించుచు మాతంగ ముని కుమారుండు ప్రసన్నుం డనువాఁడు సకలవిద్యా ప్రసన్నుండని విని వానికి వివాహంబు సేయు నీవ నక్షీణ పుణ్య లక్షణ గేహనవ్వరా రోహఁ గొంచు దుష్కృతంబులకుం గొంచు చెంచులు వెంటరా నిరాయా సంబునం జని లవంగ నారంగపూగ పున్నాగ వకుళ కురువక ప్రియాళు రసాల ప్రముఖ సాలవికాసమాన సూనవాసనా సనాథగంధ పవమాన నిరస్త సమస్త పాంథ శ్రమంబగు నాశ్రమంబు దరిసి, ముందట సరో వరతీరంబున బహుశిష్యగణంబుల తోడ నాహ్నికక్రియాకలాపం

బులు దీర్చి వేదాంత శాస్త్ర వ్యాఖ్యాన గోష్ఠి నున్నమతంగుని గనుంగొని
యిట్లనియె. 118

మ. అనఘస్వాంత! మతంగ సంయమి వరేణ్యా! నా తనూజాతన
ర్జున కీ కన్యకఁ దెచ్చినాఁడ; రమణీ చూడామణిఁ, మీ ప్రస
న్ననకుం జేయుదమా వివాహ మిఁక నెందుం జూచినంగల్గరా
యన దక్కన్మునిరాజనందనులు, కన్యాదాన యోగ్యుల్ వరుల్ 119

చ. అనవుడు నట్లకాక తగునాటవికాన్వయ సార్వభౌమ! నీ
తనయ మదీయపుత్రునకు ధర్మకళత్రముగా నటంచు నా
తని దన పర్ణశాలకు మతంగమహామునిపుంగవుండు తో
డ్కొని చని, చూపెఁ బెండ్లికొడుకు న్మితభాషణు వంశభూషణున్ .120

వ. తత్సమయంబున. 121

క. సతి చూచెను యతిసుతునిన్
యతిసుతుఁడున్ సతినిఁజూచె నంగజుఁడు సతీ
యతి సుతుల నేసెఁ గొసరఁగ
లతాంత శరజాలముల హళాహళి గాఁగన్ 122

సీ. ఇట్లు పరస్పర వీక్షానురాగార్ణ
వమునఁ దేలెడు వధూవరులఁ జూచి
తగు వీరలకు సంచు దమలోన నుభయప
క్షముల బాంధవులెల్ల సంతసిల్ల
భిల్లనాథుఁడు తన బిడ్డనర్జునకీ వి
లాసిని నొక శుభలగ్నమునకు
నవరూపసంపన్ననకుఁ బ్రసన్ననకు వి
వాహంబు చేసి తద్వైభవంబు

గీ. సంపరిల్లిన పిమ్మట దంపతులకుఁ
గట్టనిచ్చి మతంగుండు గౌరవమునఁ
దన్ను ననుపంగ నరుగుబోఁ దనయతోడ
బుద్ధి చెప్పంగ నేకాంతమునకుఁ బిలిచి. 123

సీ. అత్తమామలు చెప్పినట్ల చేయుముగాని
యెదిరి మారుత్తర మీకు మమ్మ!
వలయు వేళలఁ బెద్దవారు పంపక యెంత
వనికిఁ బోనిండ్లకుఁ జనకు మమ్మ!
సకలబంధులకుఁ బూసల లోనివారంబు
వలె సరాగంబున మెలఁగు మమ్మ!
తోడికోడండ్రు వంతులకుఁ బట్టినచోట
నుదరక తాలిమి నుండు మమ్మ!

గీ. మానసంబున ధర్మమే మఱకు మమ్మ
నుతికి నెక్కిన నీ సరిసతులలోను
వాసిగను మమ్మ! కులశీల వర్తనములు
కొంచె పఱపక మము విచారించు మమ్మ! 124

క. కసరకుమీ కోపించిన
విసువకుమీ సేవచేయు వేళల నీగుల్
గొసరకుమీ ! నీ పాలికి
బిసరుహముఖి ! యేడుగడయు బెనిమిటిఁ సుమ్మీ ! 125

వ. అని బోధించి బాష్పాంబుధారాసిక్త కుచకుంభయైన కూతుం గనుంగొని
గద్గదభాషణంబుల బుజ్జగింప నెట్టకేలకుం బోయి రమ్మని పలికిన, 126

కం. దిగులుపడు బిడ్డ నచ్చో
డిగవిడిచి చనం గలంగుడెందముతో నే
పగిదిఁ జనువాఁడ దైవమ!
పగవారికి నైన నాఁడుబడుచుల నీకే ! 127

మ. అని చింతించుచు బంధువర్గసహితుండై చొచ్చె సౌభాగ్యకే
తన ఝుంపా పవమాన కంపిత వియద్గంగా స్రవంతీచిరం
తన పానీయ మనంగ నొప్పు మిథిలా స్థానీయమున్ సంతసిం
ప నెఱింగించె వివాహవైభవము ధర్మవ్యాధుఁడి ల్లాలికిన్. 128

గీ. అంత నక్కడఁ దండ్రివాక్యములు దలఁచి
మగనిపట్టున నత్తమామల యెడాట
మున సదాసన్నయై చేయుఁబనులు చెంచు
రాకొమరి శతాసిధారావ్రతమున. 129

సీ. ,మలషండములు మేలొ్కనకమున్నె మే
ల్కని శుచిభూతయై దినదినంబు
నుటజ నివాసాంగణోర్విపై గోమయ
జలములఁ గలయంపిఁ గలయఁ జల్లి
నభ్యంతరస్థలు లలికి ముగ్గులు వెట్టు
నగ్నిహోత్రములకు నను వు పఱచు
దేవపూజావితర్దికల నర్చనకు గం
ధాక్షత ప్రసవ మాల్యములు నిలుపు

గీ. ప్రొద్దుపాటున బహుభక్ష్య భోజ్య లేహ్య
చోష్య పానీయములు పాకశుద్ధి గాఁగ
నాయితము చేయు గృహభర్త లతిథి యుక్తు
లై భుజింపఁగ భుజయించు నత్త మొదల. 130

కం. బిందియలఁ దెచ్చి జలముల
బృందావనమునకుఁ బోయుఁ బెంచిన హరిణీ
బృందమునకు ధేనువులకు
దుండంబులు నిండ, మేపు దూర్వాంకురముల్. 131

క. ఈనియతిఁ గొంతకాలము
పో, నొకదివసమునఁ గొంచెపుం దప్పునకుం
గా నత్త ముగ్ధ నర్జున
కీనారిం జూచి పండ్లుగీటుచుఁ బలికెన్. 132

ఉ. ఓసి దురాత్మురాల! మృగయాధములన్ మొఱవెట్టఁగా మెడల్
గోసి వధించు పాతకునికూతుర ! బుద్ధులు చెప్పి చెప్పి నే
వేసరితిన్ మహాముని వివేకవిహీనుఁడు గాక, యెట్టుగా
జేసె నినుం బ్రసన్నునకు శిష్టవిధిజ్ఞత లేని రక్కసన్. 133

కం. పనిలేదు నా నివాసం
బున నుండఁగ నిఁకఁ బొకాలి పొమ్మని నినుఁ జె
క్కున నెత్తురుట్టిపడ వీ
డని రోషావేశమునఁ జటాలునఁ గొట్టెన్. 134

గీ. ఇట్లు గొట్టిన కొట్టున నెఱ్ఱవారి
పుష్పకోమలి ధవళకపోలతలముఁ
గరుణ పుట్టించె, రాహువు గఱచి విడువ
దొరఁగు నెత్తురు తోడిచందురుని పగిది. 135

చ. మఱియు బహుప్రకారముల మర్మము లెత్తుచు నత్త దిట్ట ని
వ్వెఱఁగున నాశ్రమస్థలము వెల్వడి సత్వరయానలీలఁ గ్రి
క్కిఱిసిన చన్నుదోయి చలియింపఁగ వచ్చె, దృగంబుపూరముల్
వఱదలు గట్ట నేడ్చుచు విలాసవతీమణి పుట్టినింటికిన్. 136

వ. అప్పుడు భయసంభ్రమాశ్చర్యంబులు మానసంబున ముప్పిరిగొన ధర్మ వ్యాధుండు భార్యాసహితుండై బహిర్గేహదేహళి పర్యంతంబు చని, వచ్చి తన పదంబుల మీఁదంబడి యేడ్చు కూఁతు నెత్తి గ్రుచ్చి కౌఁగిటం జేర్చి కరంబునం గన్నీరు దుడుచుచు నూరార్చి లోనికిం దోడ్కొని పోయి, నాతల్లి! పల్లెవాసంబు విడిచి పురపురం బొక్కుచు నొక్కతెవు

నేమికారణంబున నరుగుదెంచితి విట్లు దురవస్థం బొందుటకు నుల్లంబు దల్లడిల్లెడుం జెప్పుమనిన నర్జునికి తండ్రి నాలోకించి- 137

కం. పిలిచెనఁట నన్ను, నేలినఁ
బిలుచుట నీ పాదమాన, పిలిచిన నేలా
పలుకననుచు నిప్పులు గనుఁ
గొలకుల రాలంగ, నత్త కోపముతోడన్. 138

ఉ. ఓసి! దురాత్మురాల! మృగయూథములన్ మొఱవెట్టఁగా మెడల్
గోసి వధించు పాతకునికూఁతుర! బుద్ధులు చెప్పి చెప్పి నే
వేసరితిన్ మహాముని వివేకవిహీనుఁడుగాక యెట్టుగా
జేసె నినుం బ్రసన్నునకు శిష్టవిధిజ్ఞత లేని రక్కెసన్. 139

కం. అని కర్ణకఠోరము లా
డి నలుగురుం జూడఁ గట్టిఁడి తనంబునఁ గొ
ట్టి నివాసంబున నుండక
చనుమన వచ్చితి నటన్న సక్రోధుండై. 140

శా. ఎట్టెట్టా! మునిభార్య నన్ను వినదే యీ మాట నిన్నాడఁగా
నట్టేకాక యెఱింగి వత్తము తదీయాహింసకత్వ స్థితుల్
పట్టీ! రమ్మని వెంటఁ బెట్టుకొని భిల్లస్వామి దట్టంబుగా
నిట్టూర్పు ల్నిగుడంగ వచ్చి కనియెన్ వియ్యంపువాచంయమున్. 141

పృథ్వి. మతంగుఁడును జాతసంభ్రమముతోడ సర్ఘ్యాది స
త్క్రృతుల్ సరవిఁ జేసి నాయెకకుఁ గికటగ్రామణీ
వతంస! చనుదేరఁగా వలసె నేల! నీకున్ సమీ
హితంబు వినిపింపు నా ఋషి మొగంబు వీక్షించుచున్. 142

కం. మనమున మఱియేయీహిత
మును లేదు భవన్నివాసమున నిర్జీవా
శనము భుజియింప వచ్చితి
నని ధర్మవ్యాధుఁ డాడ యతి సమ్మతుఁడై. 143

గీ. కడు రయంబున మాధ్యాహ్నిక క్రియా క
కలాపములు దీర్చి భుక్తి శాలా వితర్ది
సీమమున నుండి వ్రీహి గోధూమ యవల
నాయితం బయ్యె నాహార మని పిలిచిన. 144

సీ. ఆవ్రీహి గోధూమ యవలెటు వంటివి
చూడంగి వలె నాకుఁ జూపుఁ డనిన
చేటలఁ ద్రవ్వి తెచ్చినఁ జూచి ఖిల్లవం
శాగ్రణి హరి హరి! యనుచు లేచి
పోవంగ, వెనువెంటఁ బోయి యోయి మహాత్ముఁ
డా! భుజింపక పోవుటకు నిమిత్త
మేమి! నావుడు, నమ్మహామునితో నసం
ఖ్యములైన జీవుల ననుదినంబు

గీ. గనికరము లేక ప్రాణాలు గొని భుజించు
ఘాతుకుని యింట గుడువంగఁ గాదు గానఁ
దొలఁగి పోవుచు నున్నాఁడ గలిగె నేని
ప్రియమున భుజింతుఁ బెట్టు నిర్జీవభుక్తి. 145

సీ. వనజీవి నొక్కటి ననువాసరము చంపి
దాన నే నతిథుల దనిపి కొంత
శేషింపఁ బరిజనశ్రేణికి సంతృప్తి
గావింతు నడుపుదు జీవనంబు
కటకటా! యేఁట నొక్కటి సహస్రంబులై
ఫలియించు జీవులఁ బ్రతిదినంబు
సంఖ్యమాలిన వానిఁ జంపి పొట్టలు నిండ
నాలుబిడ్డలు నీవు నారగింతు

గీ. పాతకుఁడ కాన నెంగిలి చేతఁ గాకి
నేయఁజాలవు; తలఁప మదీయ వర్త
నంబునకును భవద్వర్తనంబునకును
హస్తి మశకాంతరము సంశయఁబు లేదు. 146

వ. అది యట్లుండె, నింకనొక్క వేద రహస్యంబు వినుము. తొల్లి చతుర్ముఖుండు దైవ భౌత పైత్ర మానుష బ్రహ్మంబులను పంచ మహా యజ్ఞంబుల బ్రాహ్మణ హితార్థంబు నిర్మించె. నా యజ్ఞంబుల నితర వర్ణంబుల వారు దారు చేయక బ్రాహ్మణుల వలనం జేయింపవలయు నిట్టి పంచ మహా యజ్ఞంబుల కొఱకు నోషధి సఫలతలు సంపాదితంబు లయ్యెంగాని కేవలంబు భక్షింపఁ గాదు. దీని నెఱింగి వ్రీహి గోధూమ పక్షి మృగాది స్థావర జంగమాన్నంబులు యజ్ఞ నిమిత్తంబు గావింతు మనిమిత్తంబు గావించినఁ బవిత్రంబులు గావు. బహుప్రకారఁబు లవివేకించి చూచితి నేఁడు వంటి పెనుబండుగున నీ యింట దేవ పూజా విధానంబు గగన ప్రసూనంబు; వైశ్వదేవ బలిహరణంబులన్న సున్న; దీన జన పరిత్రాణ పరాయణత్వంబు శశవిషాణంబు. పైత్ృకాది ప్రముఖ విశిష్టాచారంబులెల్ల నిట్ల గావున భవదీయాన్నంబ భోజ్యంబని దూరం బలికి వెండియు, నధిక క్రోధుండైన ధర్మవ్యాధుఁడు మతంగునిం గటాక్షించి. 147

కం. ఇలువడిగల నా కూఁతురు
కొలఁది యెఱిఁగి జీవఘాతి కూఁతుర ! యనుచుం
బలుకఁగ నోయి మునీ ! నీ
కులకామిని యే విశిష్టకూతురు చెపుమా ! 148

గీ. హింసకుండనైన యిట్టి నా కూఁతురు
హింసకుఁడవు గాని యిట్టి నీకుఁ
గోడలయ్యెఁ జేసికొనుము ప్రాయశ్చిత్త
మనుచు నుల్లసంబు లాడి నవ్వి ! 149

మ. కకు బంతాంతర ధాత్రిపై నిడి మొదల్గా సార్వకాలంబు న
త్తకుఁ గోవంద్రకు నొంట కుంపెడును ముగ్ధ న్నాతనూజాత నూ
రక భర్జింపక యేలుకొండు మునివర్యా ! నేఁడు మా యింటఁ బై
త్రిక మంచు న్విశాలాపురంబునకుఁ బోయె న్వర్జితక్రోధుఁడై. 150

ఉ. పోయి, పితృక్రియ ల్నెరపి పుత్రుని జీవన చక్ర భార ధౌ
రేయునిఁ జేసి కీకటవరేణ్యుఁడు దానరిగెన్ విరక్తుఁడై
పాయక ముక్తి కాంత కుచ పాళిక పజ్జలఁ బత్ర భంగముల్
వ్రాయఁగ లోహదండ వనవాటికి సన్ముని రత్నపేటికిన్. 151

వ. ఇవ్విధంబున లోహదండ మహా గహనం బవగాహించి, బహు సహస్ర హాయనంబులు తపంబు సలిపి విష్ణునామంబను పుణ్యస్తవంబున వెన్నునిం బ్రసన్నునిం జేసి తదీయ దివ్యదేహంబున లయం బయ్యె నని చెప్పిన మహాత్మా ! ధర్మవ్యాధుండు పఠించిన విష్ణు నామస్తవంబు విన వలయు నాన తిమ్మనిన మహీమహిళకు వరాహదేవుం డిట్లనియె. 152

సీ. విష్ణు దేవునకు శ్రీ విపుల వక్షునకు వి
శ్వ ప్రభునకు షట్పద ప్రభునకు
దామోదరునకు భూధరునకు దైత్యసం
హారకారికి నృకంఠీరవునకు
చక్రహస్తునకుఁ ద్రివిక్రమునకు మధు
కైటభారికి భక్తకామ గవికి
శుభవక్త్రునకుఁ బురుష్టుతునకుఁ బురుషోత్త
మునకు నిశ్శ్రేయసాఖ్యునకు హరికి

గీ. గగన పవనాత్మ రవి సుధాకర ధరాగ్ని
సలిలమూర్తికి గురునకు జలధివాసు
నకు జనార్దనునకు నరునకు సనాత
నునకు నచ్యుతునకు వరాహునకుఁ బ్రణతి. 153

మ. అని ఫౌలస్థల కీలితాంజలిపుటుండై విష్ణు నామ స్తవం
బునఁ దన్నుం గొనియాడఁగా నిజకరంబుల్ శంఖ చక్రాది సా
ధన దీప్తిచ్ఛటలన్ వెలుంగ విహగాధ్యక్షాంస పీఠాగ్ర మె
క్కి నిషాధాగ్రణి ముందట న్నిలిచి లక్ష్మీ భర్త లేనవ్వుతోన్. 154

కం. కనుగొని కరుణా రస వా
హిని మనమున వెల్లి విరియ నిచ్చెద వరముల్
గొనుము వలసినవి నీ వ
ర్తనమునకు న్మెచ్చినాఁడ ధర్మవ్యాధా. 155

సీ. అనిన శ్రీహరికి నిట్లని విన్నవించెఁ బు
ణిందుండు నాకు నానందనులకు
దయ చేయు మాత్మ విద్యాయుక్త సకల క
ళావత్కవిత్వంబు దేవ దేవ !
వసుమతిపై నథవా నన్నుఁ బుట్టింప
నూహ గల్గిన ధర్మయుగము నంద
పుట్టింపు, మద్వంశమున జనించిన వారి
విజ్ఞానపరులఁ గావింపు మంత

గీ. మీఁద నీ మేన లయముగా నాదరింపు
మనుచుఁ బ్రార్థింప నోయి మహాశవీంద్ర !
వరము లన్నియు నిచ్చితి వచ్చి నన్నుఁ
గూడు మిప్పుడు నావుడుఁ గూడె నతఁడు. 156

వ. కావున ధర్మవ్యాధుడు పఠించిన యీ విష్ణునామస్తవంబు వైష్ణవంబులైన వాసరంబుల నుపవసించి మురారి నారాధించి, తాత్పర్యంబునం జదివిన విన్న మానవులకు వైకుంఠంబున సప్తతి మన్వంతరంబులు వసింపఁ గలుగు నని చెప్పిన విని విశ్వమూర్తియైన నారాయణుం డాదికృతయుగంబున నేమి చేసె నానతిమ్మనిన విశ్వంభరకు దంభకుంభినీదారం బిట్లనియె. 157

సీ. స్వచ్ఛంద కర్మానుసంధాత, నారాయ
ణుండు పూర్వమున నొకండ నిలిచి
నిమిషంబు నుబుసు పోవమికి వేసరి ద్వితీ
యాన్వేషణము చేయ నతని వలన
బుద్ధ్యాత్మికయుఁ బరిస్ఫుర దహస్కర రూపి
ణియు నైన చింత జన్మించె నదియ
తలఁప నకారంబు తదకారమున రెండు
చింతలు పుట్టఁ జర్చింపఁగాను

గీ. కారము మకార మనునవి కంబుకంఠి!
క్రమముతో నట్టి మూఁడు వర్ణములుఁ గూడి
యేకవర్ణత్వమునఁ బొంది, లోకజనన
రక్షణ క్షయకరమైన ప్రణవమయ్యె. 158

వ. ఆ ప్రణవంబున భూర్లోకంబును, భూర్లోకంబున భువర్లోకంబును, భువ ర్లోకంబున సువర్లోకంబును, సువర్లోకంబున మహర్లోకంబును, మహర్లో కంబున జనలోకంబును, జనలోకంబునఁ దపోలోకంబును, దపోలోకం బున సత్యలోకంబును సంభవించె ఇట్లు సంభవించి సూత్రంబున మణి గణంబులుం బోలె నున్న శూన్యలోకంబులు విలోకించి - ప్రణవస్వరూపి యుందిమూర్తి స్వరూపియునైన నారాయణుండు వరేణ్యమూర్తి నొక్కటి నుత్పాదింప నూహించి తన మనంబు సంక్షోభింపం జేసిన నందు బ్రహ్మాండంబు పుట్టె, నది రెండు ప్రక్కలైన నడుమ భూలో కంబు గానం బడియె, భాస్కర సన్నిభుండునుం గమలకోశ వ్యవస్థితుం డును బ్రమాణచక్రస్థుండును నగు నన్నారాయణుండు ప్రాజాపత్య తేజంబునం గడమలోకంబులు నిర్మించె నయ్యకారం బన్యస్వరంబుల హల్లుల సృడియించె నవ్వర్ణంబులు సాధనంబులు గాన మూర్తసృష్టి మొదల వేదాంగంబులు శాస్త్రాంగంబులుం గలిగించె వెండియు నారా యణుండు. 159

గీ. సంస్మరింపగ సవ్యాపసవ్యలోచ,
నాంచలంబులఁ బుట్టె నీహారవహ్ని
సన్నిభములైన దివ్యతేజములు రెండు
వానిఁ గొని చేసి, రాజదివాకరులను. 160

గీ. నాసికారంధ్రములఁ బవనంబు, వదన
సరసిజంబునఁ బావక ధరణి దేవ
తల, భుజంబులఁ దొడలఁ బాదముల క్షత్ర
వైశ్య శూద్రుల నిర్మించె వరుస తోడ. 161

కం. వనజముఖీ ! తదనంతర
మున యక్షో రక్ష నివహముల సంజననం
బునఁ బొందించెఁ బయోజా
సనాండ భాండాంతరాళ జలపూరమునన్. 162

వ. మఱి చతుర్విధ భూతంబుల చేత భూర్లోకంబును, వియచ్చరుల చేత భువ
ర్లోకంబును, వైమానికులచేత సువర్లోకంబును స్వాంగభూతులుం గల్పోప
వాసులైన సనకాదుల చేత జనలోకంబునుం, వైరాజుల చేతఁ దపోలోకం
బును బునరావృత్తికులైన గీర్వాణుల చేత సత్యలోకంబును నిండించె నిం
డించి మహానుభావుం డతండు జాగ్రదవస్థం బొంది వినోదింప భూర్భు
వస్సువర్లోకంబులు జాగ్రదవస్థం బొందె నంతటం గల్పాంత నిశా సమ
యంబున సుప్తుండైన నతని దేహంబున లయంబై త్రైలోక్యంబును సుప్తిం
బొందె. మఱునాఁడు మేల్కాని నిద్రా జ్ఞాన మోహితుండైన తనకు వేద
మాతయు వేదంబులు దేవతలుం బొడ గానరామి జగత్స్వామి చింతించి
నిజ శరీరంబగు నీరంబున నడంగుట యెఱింగి క్రమ్మఱ నిర్మించు
కొఱకు జలావగాహంబు గావింప నూహించి. 163

ఉ. వాలుగు మీను రూపమున వాలి గుబాలు నినాద మష్ట ది
క్పాలిక లాక్రమింప నుదకంబులపై నుఱకంగ, బిందువు
లూలె నభ స్థలంబునకు లోపల నున్న ధరావధూటి యి
ల్లాలు విభుండు వచ్చిన శుభార్థము లాజలు చల్లెనోయనన్. 164

కం. ఈ లీల మొదలి వేలుపు
వాలుగు రథసమున నంతికి వసుమతిఁ గరుణా
లోలమతి నుద్ధరించి ప
యోలినత మాన్యుఁగని మహాలోకస్థుల్. 165

ఉ. అస్థ లలాట సంఘటిత హస్త సరోరుహులై, జలాంత వి
శ్వ స్థితి కారి దేహ రవిచంద్ర మయద్గ నాత్మరూప! వ
క్ష స్థల పీఠికా ఖచిత కౌస్తుభ రత్న వినూత్న రోచి రూ
ర్థ్వ స్థగి తాష్ట దిక్తట! తిమింగల గాత్ర ధరాధురంధరా! 166

శా. స్వామీ! నన్ను ననుగ్రహింపుము జగజ్జాలంబు లెల్లన్ భవ
త్సామర్థ్యంబునఁ బుట్టు నుండు నడఁగున్ సంత్రా సదంబైన నీ
యీ మీనాకృతి మాను, మాదిమ తనూపేతుండవై శాంతి ల
క్ష్మీ మాధుర్యము చూపుమంచు వినుతుల్ సేయంగ మోదంబుతోన్. 167

ఉ. ఆ పరమస్తుతుల్ వినుచు, నంబు నిమగ్నములైన వేద శా
స్త్రోపనిషత్ప్రపంచముల నున్నత శక్తి నను(గ్రహించి ల
క్ష్మీపతి లోక భీకర తిమింగిల రూపము మాని తాల్చె నా
నా పురుషార్థదాయక మనంగ వెలింగెడు పూర్వరూపమున్. 168

గీ. కావున మహాత్ముఁ డతఁడు సాకారుఁ డగుచు
నిలుచు నెంతాక నిందాక నిలుచు నీ స
మస్త జగములు కూటస్థుఁడైన నతఁగు
వికృతి గతుఁడైన మగుడ నావిర్భవించు. 169

సీ. మేదిని నీ రీతి నాదిదేవుండు క
ల్పించి కల్పనము చాలింప, జగము
వృద్ధిఁ బొందుచు నుండ, నింద్రాది విబుధులు
హవి గూర్చి బహుకాల మధ్వరములు

మొదలుగాఁ గల ధర్మములు సప్త సాగర
వేలా పరీత పృథ్వీ తలమునఁ
గావించుచో, ననేక సహస్ర వక్త్ర నే
త్రోదర బాహుఁడై రోదసీక

గీ. టాహ మధ్యంబు నిండిన దేహ యష్టి
మెఱయ, సాక్షాత్కరించి, లక్ష్మీ మనోహ
రుండు, "దేవతలార ! కోరుండు మీకు
నే వరంబులు వలసిన నిత్తు" ననిన. 170

గీ. దేవ ! నినుఁ గాని మమ్ము ధాత్రీతలంబు
వారు పూజింప నొల్లరు వారి చేతఁ
బూజఁ గొన మాకు వరమిమ్ము తేజ మిదియ
నాగ, "నిచ్చితి" నంచు నంతర్థి నొందె. 171

గీ. అంత సంతోషమున మహేంద్రాది విబుధ
వర్గములు పోయె నాత్మ నివాసములకు
శార్ఙ్గపాణియు సత్వ రజస్తమో గు
ణములఁ ద్రివిధంబులైన భావములఁ దాల్చె. 172

వ. సాత్వికంబైన భావంబున నిజావయవ భూత పురుహూత ప్రముఖ లేఖుల నారాధించె, రాజసంబైన భావంబున, మమకార స్వరూపియు నాత్మీయ రజోమూర్తియు నగు శూలపాణి భక్తిం బూజించెఁ దామసంబైన భావంబున రాక్షసులం బ్రవేశించె, నిత్తెఱంగున జగత్కర్త మూఁడు విధంబులం బొందిన నది మొదలుగా లోకంబును మూఁడు విధంబులం బొందె, వెండియుఁ ద్రిమూర్త్యాత్మకంబైన దేవుండు కృతయుగంబున నారాయణుండును, త్రేతాయుగంబున రుద్రాకారుండును, ద్వాపరయుగంబున యజ్ఞమూర్తియుఁ గలియుగంబున బహురూపధరుండును నయ్యె, నట్టి విష్ణుని మహత్త్వంబును విష్ణుభక్తుల చరితంబును విచిత్రంబుగా వచియింతు నాకర్ణింపుము. 173

కం. కృత యుగమున వేలా పరి
వృత నిఖిల క్షోణి వలయ భృతి లీలా ధి
కృత సుప్రతీకుఁ డను సు
ప్రతీకుఁ డను రాజు గలఁడు రాకేందుముఖీ ! 174

కం. బుధవిభునిభుఁ, డా భూవ
ల్లభుఁడు నిజాంగనలు, తనువలగ్నలు, విద్యు
త్ప్రభయుం గాంతిమతియు నను
శుభలక్షణవతులు సతులు సుతులం గనమిన్. 175

కం. పట్టె ననేక వ్రతములు
పెట్టె మహీదేవులకు నభీష్టాన్నంబుల్
కట్టె నుపవాసములచే
మెట్టెం బుణ్యస్థలములు మెలఁతలు దానున్. 176

కం. ఈభంగి నడుపఁ డనకుఁ ద
నూభవసంప్రాప్తి లేమి నొచ్చి తపశ్చ
ర్యాభిరతిన్ సచివులపై
భూభారము నిలిపి కదలి పోవుచు నెదురన్. 177

ఉ. నాటిన భక్తి పాటవమునం గనియెన్ చిత్రకూటమున్ గుహా
కోటర కుంజ పుంజగత కుంజర ఘాటము, శాబరీకృతా
ఖేటము, నిష్ఠ రాఘు శరఖేటము, దివ్యమణి ప్రభా నిరా
ఘాటము, నిర్ఝరీలహరి కంకణ కోరకితార్క ఘోటమున్. 178

కం. కని తద్గిరి గహనాంతర
మున దుర్వాసుని సమస్తమునిలోక వతం
సునిఁ గూర్చి సుప్రతీకా
వనిపాలుఁడు దపము సల్పె వాత్సల్యమునన్. 179

సీ. అనుభావశక్తి బ్రహ్మాదుల నొక పూరి
పుడకకుఁ గైకొని పోతరీఁడు
ఘనకోపవాణిజ్యమునఁ దపోవిత్తజా
లముఁ గూడఁ బెట్టెడు లాబగాఁడు
తన రథంబునకు మాధవ సత్యభామల
గుఱ్ఱాలఁ జేసిన కోడిగీఁడు
యతిసతీకులరత్న మనసూయ కడుపున
మునుమునఁ బుట్టిన ముద్దులాఁడు

గీ. సకలకల్యాణకరుఁడు సాక్షాదనంగ
హరుఁడు నిర్మల తత్త్వవిద్యా విచార
ణావిలాసుఁడు దుర్వాసుఁ డా వసుంధ
రాధిపతికి వరంబు లీ నలుగు దెంచె. 180

వ. తదనంతరంబున, 181

ఉ. లేఖులు రెండు వంకల బళీబళి శబ్ద పరంపరల్ మహా
మౌఖరి నుచ్చరింప, మదమత్త నిశాట విపాటనైక వి
ద్యాఖర దంత కుంత భయదాభ్రము వల్లభునెక్కి దేవతా
శేఖరుఁ డింద్రుఁడున్ వనవిశేషము చూచుచు వచ్చి ముందటన్. 182

కం. అనవద్యుని దుర్వాసో
మునిఁ గని యేనుంగు డిగక మ్రొక్కక ప్రార్శ్వం
బున నిలిచె నగుచు నూరక
తనుఁ జెఱుపఁగ నెత్తుకొన్న దర్పము కతనన్. 183

కం. ఆమఘవంతుని రాజ్య
శ్రీమద గర్వంబు చూచి ఘృతధారలఁ బై
పై మండు నగ్ని వోలె మ
హాముని హర్యక్షుఁ డాగ్రహవ్యగ్రుండై. 184

కం. నిటలంబునఁ గుటిల భ్రూ
కుటి నటియింపంగ మొగ మిగుర్పఁగ మేనం
జొటచొట చెమటలు గాఱఁగ
గటమర లదరంగ, నౌదు గఱచుచుఁ బలికెన్. 185

సీ. అనుకంప లేక బ్రాహ్మణుని నమ్మించి గొం
తుకఁ గోసి పోయిన దోసకారి !
గౌతమఋషికులాంగన నహల్యాదేవిఁ
జీకటి తప్పు జేసిన దురాత్మ !
పరసతిబిడ్డని హరకోప హుత వహా
ర్చులలోనఁ ద్రోచిన క్రూరకర్మ !
సగరక్షమాపాల సప్తతంతు విముక్త
హరి ముచ్చిలించిన పరమధూర్త !

గీ. యోరి గోత్రవిఘాతి ! నన్నొక తపస్వి
మాత్రుగాఁ జూచి యిపుడు నమస్కరింప
వైతిఁ గావున దేవరాజ్యాధిపత్య
మునకుఁ బెడఁబాసి భువిఁ గూలు మని శపించి. 186

శా. అంతన్ శాంతి వహించి, సస్మితముఖుండై సుప్రతీక క్షమా
కాంతుం జూచి పులోమజి ద్విజయ దీక్షాదక్షుఁ దక్షుద్రుఁ డ
త్యంతక్రూరుఁడు దుర్జయాఖ్యుఁడు నరేంద్రా ! నీకు విద్యుత్ప్రభా
కాంతాగర్భము నందు నందనుఁడు లోకఖ్యాతిగాఁ బుట్టెడున్. 18?

వ. అని వరం బిచ్చి దీవించిన, మునికి మ్రొక్కి సుప్రతీకుండు చనియె నని వరాహదేవుండు చెప్పిన ధరావరారోహ తరువాతి వృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. 188

మ. తటినీనాథ గభీర! పార్వికక సుధాధామ ప్రభాధామ! వా
క్పటి మాంభోరుహ గర్భ! విభ్రమవతీ పాంచాల! ధాటీ రజః
పటలాంధీ కృత రోదసీ కుహర! శుంభత్కీర్తి సంపన్న! ది
క్కట వేదండ ఘటా విభక్త చతురాఘాటావనీ మండలా! 189

క. ప్రాజ్య భుజ భుజగ సన్నిహి
తజ్య శరానల హుతాహిత క్షితిపతి ర
క్తాజ్య నరసింగ నృప సా
మ్రాజ్య రమాభరణ! సుకవిరాజోద్ధరణా! 190

తోటకవృత్తము. కుకురు ప్రమదా కురుకుంభ కుచా
శకనీలకచా కర చాలిత హా
టక చామర కేళి నటచ్చికుర
ప్రకటాచల చుంబిత ఫాలతలా! 191

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర ప్రసాద లబ్ధ సార సారస్వతాఖి నంది
నంది సింగయామాత్య పుత్ర మల్లమనీషి మల్ల మలయ
మారుతాభిధాన ఘంట నాగయ ప్రధాన తనయ
సింగయకవి పుంగవ ప్రణీతంబైన శ్రీ
వరాహపురాణంబను మహాప్రబం
ధంబున ద్వితీయాశ్వాసము.



# వరాహ పురాణము

## తృతీయాశ్వాసము

—*—

శ్రీవాస లోచనాబ్జ! ది
శా విజయ స్తంభ దండ చయదంతురిత
క్ష్మా వలయ! తుళువకుల పా
రావార మృగాంక! యీశ్వర ప్రభు నరసా! 1

వ. అవధరింపు మవ్వరాహదేవుండు విశ్వంభర కిట్లనియె నీట్లు సుప్రతీక
నరనాథుండు లబ్ధమనోరథుండై నిజరాజధాని యగు వారణాసికిం జని
సకల కళావిలాస నివాసంబులైన రాణివాసంబులతోడ రాజ్యభోగంబు
లనుభవింప దూర్వాసోమునివర ప్రసాదంబునం గొన్నివాసరంబులకు
విద్యుత్ప్రభాదేవికి నెల మసలిన. 2

గీ. రోమరాజి, తమాల వల్లీమతల్లి
పగిది నలుపెక్కి మెఱసె నా పడఁతి నడుమ
నింద్రసామ్రాజ్య హానికి హేతువైన
ధూమకేతువు నభమునఁ దోఁచె ననఁగ. 3

గీ. భావి పురుహూత కుంభి కుంభముల మీఁద
నల్లఁబాఱు నిజాత్మజు భల్లహతుల
నని యెఱింగించు విధమున నామరాళ
గమన పాలిండ్లకొనలు నీలిమ వహించె. 4

గీ. తన తనూజుని బిరుద గాథలు వినంగ
మొనపు వెఱపున సురరాజు మొగము తెల్లఁ
బాఱు నిఁక నని తెలిపెడు భంగి, నా స
తీలలామంబు వదనంబు తెల్లఁబాఱె. 5

గీ. ఆత్మసూనుండు తరువాత నాజి గెలుచు
నమరవిభునకు నన్నింట నరుచి పుట్టు
నని నిరూపించుకరణి భోజ్యముల మీఁద
నాచకోరాయతాక్షికి నరుచి పుట్టె. 6

గీ. సత్యజన్ముండు దేవేంద్రసంపదలు హ
రించి మధ్యమలోకంబు వృద్ధిబొందఁ
జేయఁగలఁడని సూచించె నోయనంగ
నా సుధాకరముఖికి మధ్యంబు బలసె. 7

గీ. అధిక దౌహృద సంపద నా సరోజ
గంధి నడిమికి బేదఱికంబు మానెఁ
దలఁపనట్టిద యెట్టివారలకు నైన
లేమి గాపురముండునే! భూమిలోన. 8

గీ. సంచరణవేళ మణిమయ సౌధజాల
కములఁ గనవచ్చు రవి మయూఖములు చూచి
యష్టి విభ్రాంతిఁ బట్టు గర్భాలసత్వ
మేమి యనవచ్చు నింక నా నృపతి సతికి. 9

వ. ఇవ్విధంబున దినదిన ప్రవృద్ధమాన దౌహృదాభ్యుదయంబు వహింప నా రాజహంసుండు నిజ స్త్రీ వతంసంబునకుం బుంసవన సీమంతంబులు సముచితప్రకారంబున నిర్వర్తించి గర్భ రక్షా విధానంబున సడిసన్న మన్నన ముదుసళ్లం గనుసన్నల మెలంగ నాసన్నలం జేసి, దత్తావధానంబుల సేవింప నేర్పుగల పరిచారికలం బనుపుచుఁ గోర్కులం

దనుపుచు వయస్యలు రహస్యంబునం జెప్ప నప్పటప్పటికి నంతర్వత్ని
యైన పత్ని మధురాలాపంబులు వీనులం జొనుపుచుఁ గుతూహలంబు
వెనుపుచు, వర్తించి, నవమాసావసానంబున. 10

భుజంగ ప్రయాతము.

చకోరంబు లాసన్న చంద్రోదయం బ్రా
క్కకుప్తన్వి నీక్షించి కౌతూహలావ
స్థకు న్వచ్చురీతి న్నిశాలేక్షణంబుల్
ప్రకాశింప విద్యుత్ప్రభాదేవిఁ జూచున్. 11

సీ. అంతనత్యుత్తమంబైన వాసరమున
వాసరేంద్రాది నవగ్రహములు
మంచి తావుల నుండ, మధ్యాహ్నవేళ శా
త్రవ జైత్ర తేజో ధురంధరుండు
దుర్జయాఖ్యుండు సుతుండు భీకరుఁడు వి
ద్యుత్ప్రభాదేవికి నుద్భవింప
హృదయంబులోపల నెఱింగి యేతెంచి దు
ర్వాసుండు జాతకర్మములు నడిపి

గీ. మేదినీధరవిద్వేషి మీఁది కోప
మెట్టిదో కాని పని వడి యిష్టి వేల్చి
నిమిషమున నక్కుమారరత్నముఁ బదాఱు
వత్సరంబుల ప్రాయంబు వానిఁ జేసి. 12

గీ. మఱియు సంయమికుల శిఖామణి మహీమ
హేంద్రు గారాపుఁబట్టికి నేయ వ్రేయ
నడువఁ బొడువ నెఱింగించె నస్త్రవిద్య
చదువఁ జెప్పంగ నెఱిఁగించె శాస్త్రవిద్య. 13

క. ఆ వెనుక సుప్రతీక
క్ష్మావల్లభు పిన్నభార్య కాంతిమతీసా
ధ్వీవర్య గనియెఁ బెద్దల
దీవన సుద్యుమ్ను నాకృతి ప్రద్యుమ్నున్. 14

శా. వాఁడుం గంజభవాం జనాతనయులం వారించు ధీశక్తి నై
దేఁడుల్ వెళ్ళకమున్న కైకొనియె సాహిత్యంబు సంగీతమున్
వీఁ డత్యుత్తముఁడంచు భూజనులు వర్ణింపంగఁ దేజంబు క్రొ
వ్వాఁడిన్ వాసికినెక్క జవ్వనమునన్ వర్ధిల్లె నానాఁటికిన్. 15

వ. ఇట్లు వివిధ విద్యా విజృంభణంబున నవ యౌవనారంభణంబున నయనానంద సంధాయిసౌందర్యంబున, దుస్సహబాహుశౌర్యంబున, మాఱులేక విస్ఫూర్జితులైన దుర్జయ సుద్యుమ్నకుమారుల విలోకించి, తన వార్ధకంబు వివేకించి, కించిత్కాలంబును విలంబనంబు సేయక। నాయకామాత్య భృత్యపురోహిత బాంధవజనంబుల రప్పించి. వారల సమక్షంబున, మోక్షలక్ష్మీ నివాసంబును, శ్రీ మద్విశ్వేశ్వర మహాదేవుని రాణివాసంబును, గృత నిమజ్జన జగజ్జన వియోగ వేదనాదూయమాన దురితరోదన శంకాకర నికటగంగా తరంగా క్రోశంబును, సమావృత పంచకోశంబును మధ్యాహ్న సమయ భిక్షాప్రదాన వినోదన పరిగృహీత పురంధ్రీ రూప విహరమాణ విశాలాక్షీ చరణ కంజమణి పుంజకిరణ మంజరీ పింజరిత మంజుమంజీర శింజితముఖర విశిఖాముఖంబును, మణి కర్ణికా సరః పద్మకర్ణికా విలీన శిలీముఖంబును, ఢుంఠివేదండ తుండ తుండజనిత శరీర ప్రకర నిరంతర తారకితనభోవకాశంబును, ఘంటా పథ ప్రతినిశీథ చరత్కాల భైరవా రక్షక పురః కరదీపికా సహస్ర ప్రకాశంబును, శిఖా శిఖర గుంభిత శాతకుంభ కుంభామ్రేడిత గగన కల్లోలినీ కనక జలజాత గోపురంబును, నైన వారణాసీ పురంబున దుర్జయుఁ బట్టంబు గట్టి బుద్ధిమంతుల సకాశంబునం బెట్టి సుద్యుమ్ను యౌవరాజ్యంబున నిలిపి, నృపనీతి వాక్యంబులు దెలిపి, సర్వసంగ పరిత్యాగంబు గావించి, తపంబవశ్య కర్తవ్యంబుగా భావించి, విరక్త్యంగనా

లంగిత ప్రతీతుండు, సుప్రతీతుండు సకల కాల కిసలయ కుసుమ ఫల
భరిత నగంబునకుఁ జిత్రకూటనగంబునకుం జనియె నంతనిక్కడ. 16

గీ. దుర్జయుఁడు ధరిత్రీ వధూటిఁ బిలువ
రాచవారి విపద్గతి చూచి బెగడి
చేరవచ్చిన సౌఖ్యలక్ష్మి క
రాస్పదంబైన తన బాహు నాదరించి. 17

చ. ఎనిమిది దిక్కులన్ గుణములెన్నిక కెక్క భుజా పరాక్రమా
ర్జన పరతంత్ర చిత్తమున రాజ్యము సేయుచు నొక్కనాఁడు క
మ్మని హిమవారిపూరమున మజ్జన మాడి దుకూల పుష్ప చం
దనమణీ భూషణావళులు దాల్చి, నిజావరజానుయాతుఁడై. 18

క. ధళధళమను వెన్నెలలం
గలకలనగు చామరములు కరకమలములం
గల కలకంఠీజనములు
గొలగొల రావచ్చు కొలువుకూటములోనన్. 19

స్రగ్ధర. ఆ సుమ్యమ్మాగ్రజమ్మల దధిగతమణిసింహాసనుఁడై సభాసీ
మా సేవాసన్న నానా మనుజపతిహితామాత్యులం జూచి మిథ్యా
హాసాంకూరోద్గమం బాస్యమున మెఱయ, నేత్రాంతముల్ గోరబాఱన్
మీసంబుల్ దీడి పల్కెన్ మృగ పరివృఢ గంభీర నాదంబుతోడన్. 20

సీ. భారతవర్ష ధాత్రీరమణులు మన
నొల్లరో! కొలువ రాకుంట యెట్లు
హరివర్ష కువల యాధ్యక్షులు బ్రదుకంగ
నొల్లరో కొలువ రాకుంట యెట్లు!
భద్రాశ్వ వర్షభూ భర్తలు ప్రాణంబు
లొల్లరో! కొలువ రాకుంట యెట్లు ?

రమ్యవర్ష వసుంధరా వల్లభులు తల
లొల్లకో! కొలువ రాకుంట యెట్లు ?

గీ. బవరమున వాచు నా వాలుపాలు గాక
శరణు చొరఁ గేతుమాల కింపురుష కుర్వి
లావృత హిరణ్మయాఖ్య వర్షావనీశు
లొల్లరో ! తారు కొలువ రాకుంట యెట్లు. 21

క. తనతోడి దిక్పతులుఁ దా
నును గతహంకారుఁడై ననుంగనఁ డింకన్
వినఁడు సుమీ ! నే సింహా
సన మెక్కిన వార్త పాకశాసనుఁడ హహా. 22

గీ. అనిన యువరాజు సుద్యుమ్నుఁ డన్న పార్శ్వ
భాగమున నుండి చిఱుతకోపంపుఁగెంపు
తనకనుంగవ మొనపు ముందరికి వచ్చి
కేలుదోయి శిరంబునఁ గీలు కొలిపి. 23

చ. అలఘు బలాఢ్యుఁ డయ్యును దయాళువు గావున శాంతచిత్తుఁడై
నిలిచిన తండ్రి కాలమున నెమ్మది గాదములోని దోసకా
యలు వలె నున్నరాజులు బలారి భయంకర! నిన్నునట్ల కాఁ
దలఁచిరి దాడివెట్టి భుజదర్పము చూపుము వేయునేటికిన్. 24

క. అనవుడుఁ గూరిమి తమ్ముని
గని మెచ్చి పురంబు వెడలి కరితురగస్యం
దన భటుల తోడు చూచి న
యన భయద స్ఫూర్తిఁ జైత్రయాత్రోన్ముఖుఁడై 25

సీ. ఘన ఘనా ఘన సన్నహన కుహనా ఘోణి
ఘోణాపుటీ గుట గుటలతోడఁ

ప్రళయ కాల కరాళ బహు శిఖాముఖసము
ద్భట హవ్యవహ చిటచిటలతోడఁ
గులధరాధర కూట కోటిపాటన పత
ద్భీషణా శని పెటపెటల తోడ
సరభ సావిర్భవన్నర హరి స్తంభగ
ర్భ స్ఫుటీకృత పటపటలతోడ

గీ. నవఘళించి విడంబించి హుంకరించి
రాయిడించి ధణంధణా రవము రత్న
సానుగుహలఁ బ్రతిధ్వనులీన విజయ
పటహవటలంబు చఱపించి పటురయమున. 26

క. గమనింపఁ దలఁచుచోఁ బొం
దుము విజయం బనుచు నపుడు దుర్వాసుఁడు ల
గ్నము వెట్టఁగ ధవళచ్ఛ
త్రము వెట్టఁగ దుర్జయుండు రథమెక్కె తరిన్. 27

సీ. వెడలె భూధరముల విధమునఁ గోటాను
కోటులు మదభద్రకుంజరములు
నడచె వీచికల చందమునఁ బుంఖానుపుం
ఖమ్ములు జవనకంఖాణహరులు
కదలెఁ బుష్పకముల కరణి లక్షోప ల
క్షలు రత్నకాంచన స్యందనములు
చనిరి సింహంబుల జాడఁ దండోపతం
డంబులు వీరభట ప్రవరులు

గీ. పోయెముందట, సివిన పులుల వంటి
రాచబిడ్డలు తన వెంటరా నరాతి
గార్భిణ భ్రూణ హంతైన కాహళీ మ
హా విరావంబు నిగుడ రాజానుజుండు. 28

క. ఆ సమయంబున శేషఫ
ణా సాహస్రంబు ముడిగె, నడికె సమస్తా
శాసామజంబు లిట్లు జ
యాసన్న చమూపరంపరాన్వితుండై. 29

గీ. నగతనూజాత పెండ్లైన నాట నుండి
నేఁటిదాఁక నగస్త్యుండు నిలువఁడేని
నిమ్మహాసేన బరువున నెగయకున్నె
దక్షిణంబన నరిగె నుత్తరమునకును. 30

చ. అరుగు నపార సైనిక పదాహతిఁ దూలిన రేణువుల్ దిగం
బరత లలాట నేత్రునకు మాన్చె ననంగ నిజాండ కర్పణం
తరమునఁదోడి భూతములు నాల్గు నడింగిన భూమి తత్వమే
నెరసె ననంగ లోకములు నిండెఁ ద్రివిక్రమమూర్తి కైవడిన్. 31

గీ. ఆధరాధూళిపాళిచే నబ్జజాండ
భాండము వహించె భూతికరండ లీలఁ
జుక్కలు ధరించె మేదిని దుక్కులోన
విత్తిన విశాఖ విత్తుల విలసనంబు. 32

వ. ఇవ్విధంబున సకల జగదంధకరణంబైన రజోగణంబు సముద్దండకే
తన శిఖర వినిర్భిన్న జలధరగర్భ గోళగళద్వారిధారాభిషేచనంబున
నడంగ, మృదంగ నిస్సాణ దుందుభి ధ్వానంబులు మిన్నుముట్ట దాడి
వెట్టి, కౌబేర దిశా మహేశాన దేశంబుల జనితాక్రోశంబులంజేసి, భారత
భద్రాశ్వకేతు మాల కింపురుష కుర్విలావృత రమ్యహిరణ్మయ వర్షా
వలంబ జంబూద్వీప ధరిత్రీ కాంతులం బాదాక్రాంతులంజేసి. పుష్కర
క్రౌంచ శాక శాల్మల ప్లక్ష కుశద్వీపంబుల భూనాథుల దైన్యసనాథులం
జేసి, తురాషాడ్డిగీషా సమున్మేషంబున దుర్జయుండు నిర్జరగిరి కూటం
బెక్కి మిక్కిలి గర్వంబున గంధర్వులం దూలిచి. గరుడులం గూలిచి,
కిన్నరులం గొట్టి, కింపురుషులం బాడుదలవట్టి, సారణుల వెంటాడించి,

సాధ్యుల నూటాడించి, విద్యాధరులం భంగపఱచి, విబుధుల వెన్నుచఱచి, దీర్ఘనిర్ఘాత నిర్ఘోష ప్రతిభట్టాటహాసంబునుంబోలె మీటు మిగులునమ్మేటి మగనింగాంచి కాంచనగర్భ సంభవుండు నిర్భరాహ్లాదంబునఁ గుంచె సారించి యింతకాలంబునకు నీభుబుక్ష దీర మదీయ వీక్షణంబులకు జగడంపుఁగూడు కుడువం గలిగెనని, లేటి కొదమ చందంబునఁ జంగు చంగునం దాటుచు నందనోద్యానంబునఁ గల వృక్షంబులనీడం గ్రీడించు బిడౌజుపాలికి పూటాపూటింజని యిట్లనియె. 33

చ. మఱి పనిలేదే! వేసరవు మాటికి నిక్కడనుండ! నోయి చే
ఱెఱుఁగని కూన! దుర్జయ నరేంద్ర శిఖామణి వీఁడె వచ్చె నే
వెఱపును లేక వేలుపుల వెంపరలాడుచు నాలకింపు మా
మొఱలు తదీయ ధాటి నిను ముట్టుఁజుమీ నిమిషంబు నిల్చినన్.

క. నావుడు నింద్రుఁడు బెగడకు
నీవు సువర్ణాద్రి యెక్కి నిర్భయమున నా
పై వచ్చునట నరాధముఁ
డీవింతలు వినఁగ వలసె నేటికి మాటల్. 35

చ. ప్రమథగణంబు వాను హిమభానుకళాధరుఁ డెత్తివచ్చి నం
దెమలక నిల్తు, నారదమునీ! చలియింపుదునే! మనుష్యమా
త్రమునకు వీఁడుమున్ను బవరంబున నాకర వజ్రధారచే
సమసిన పాకవృత్ర బలజంభ పులోముల కంటె నెక్కుడే! 36

గీ. అనిన విని నారదుఁడు నీ మహానుభావ
మేనెఱుంగుదు రిపుఁ డల్పుఁడైన నధికుఁ
డైన నుండంగ వలయు మహాప్రయత్న
మున నయజ్ఞానపరులకు ననిమిషేంద్ర! 37

ఉ. కావున సప్రయత్నుఁడవు గమ్ము, వినోదము చాలు రమ్ము వే
పావకుఁ డాదిగా దిగధిపాలకులం బిలువంగఁ బంపు సై

న్యావళి నేర్పరింపు మన నమ్మని వాక్యము లాదరించి లీ
లావన వాటి వెళ్లె నవలన్ ధవళాక్షులు వెంటఁగొల్వఁగన్. 38

క. ఈ రీతి వెడలి వచ్చి హ
జారంబున నిలిచి, సరభసంబున నిఖిలా
శారమణులఁ బిలిపించిన
వారును వచ్చిరి చమూనివహముల తోడన్. 39

ఉ. వచ్చిన, నానుపూర్వి మఘవంతుఁడు దుర్జయ రాజురాక వా
క్రుచ్చి నరాధమున్ సమరకుంభినికిన్ బలియిత్త మంచుఁ గా
ర్చిచ్చును బోలె మండి, వలచే భిదురంబు ధరించి. సాహిణుల్
దెచ్చిన కత్తళాని జవధిక్కృత గంధవహంబు నెక్కినన్. 40

క. ఎక్కిరి నిజవాహములం
దక్కిన దిక్పతులు, వారుఁదానును భేరీ
ఢక్కానక నిస్సాణహు
డుక్కలు ఘోషింపఁగా గతున్ వడిఁ గదలెన్. 41

సీ. లయ సమారంభవలాహక స్తనిత బాం
ధవములై కరిబృంహితములు నిగుడఁ
గరిబృంహితంబుల ఖండించి నిర్నిరో
ధంబులై హయహేషితములు నిగుడ
హయహేషితంబుల నదలించి ఘూర్ణితా
ర్ణములై రథనిస్వనములు నిగుడ
రథనిస్వనంబులఁ బ్రహసించి పరవీర
భయదంబులై భటార్భటులు నిగుడ

గీ. శాత కరవాల ధళధళచ్ఛవి సహస్ర
కర కరంబుల వారింప గములు గూడు
కొని పదాహతి విధ్వస్త కనక భూధ
రాగ్రవన్యము లమర సైన్యములు నడచె. 42

క. ఆ కలకలంబు విని ధర
ణీకాంతుఁడు కూర్మితమ్మునిం గని సేనా
నీకములం బురికొల్పి భు
జాకుశలతఁ జూపుమా! దిశానాథులకున్. 43

గీ. అన్న నన్నకు మ్రొక్కి మహాప్రసాద
మవనిపాలక ననుఁజూడ నవధరింపు
మనుచు రథ మెక్కి నిజధనుర్జ్యారవంబు
మిన్నుముట్టంగ సురసేన మీఁద నుఱికి. 44

స్రగ్ధర. సుద్యుమ్నుం డాశ్రయాశార్చులు వెడలెడు నస్త్రముల్ వెలుంగన్మహేంద్రా
దిద్యోచారావలేప స్థితిఁగనుఁగొని సంధించి మధ్యాహ్నవేళా
ఖద్యోత ద్యోత వైభాకరమణి మయముల్ గాల సర్పోపమంబుల్
సద్యశ్శాణోపలాఘర్షణ ఖర శిఖరాస్త్ర ప్రతానంబు తీసెన్. 45

క. ఆ నారసములు రత్నవి
భానివహముతో జవప్రభవ శాత్కార
ధ్వానముతో నొకటి పదా
త్రై నిగుడఁగ జొచ్చుటయు సురానీకినిలోన్. 46

సీ. ఆయుధంబులు వేసి హంకారములు రోసి
మ్రొక్కువారునుఁ బుట్ట లెక్కువారు
సాహసంబులు మాని సంత్రాసములు పూని
పఱచువారును వ్రేళ్లు గఱచు వారు
ప్రాభవంబులు మాలి బాహుశక్తులు దూలి
పాఱువారును విధి దూఱువారు
మానుషంబులు గ్రాఁగి మత్సరంబులు వేఁగి
వెచ్చువారును మూఁగవిచ్చువారు

గీ. నై మహీధర మధిత దుగ్ధాబ్ధి ఘుమ ఘు
మార్భటీ సహచారి హా హా మహాని
నాదములు చేయ విని పావకాది దిక్ప
తులకు జంభాసురారాతి సెలవు పెట్టె. 47

చ. నిలిచి కనుంగొనంగ ధరణీధవ సోదరుపై దిశాధినా
థులు చతురంగ సైన్యములతోడ మృగేంద్రునిపై మదావళం
బులు చనుదెంచుకైవడి గముల్ గములై చనుదెంచి నెత్తుటం
దెలచిరి తీవ్రసాయకహతిన్ రథవాజి భట ద్విపంబులన్. 48

ఉ. అవ్వడిఁ జూచిదుర్జయలపాగ్రణి కూరిమితమ్ముఁ డద్దిరా
క్రొవ్విరి వేల్పుబిడ్డలని ఘోరశరంబుల పాలుచేసినం
గుప్ప(వ్వ?)లుగా రణాగ్రమునఁ గూలెగజంబులు మ్రొగ్గె వాహముల్
ద్రెవ్వె సితాతపత్రములు ద్రెళ్లి రథంబులు, వ్రాలెఁ గేతువుల్. 49

గీ. ఇవ్విధంబున సైన్యంబు లెల్లఁ జెల్ల
విఱిగి దిక్పతు లపకీర్తి వెంటవెంటఁ
దగిలి వచ్చిన చందానఁ దలలు వీడఁ
బాఱిరి బలారి గుండియ భగ్గు మనఁగ. 50

క. పాఱఁగ సుద్యుమ్నుఁడు మది
నాఱని కోపంబు తోడ నదలిచి వీఁపుల్
దూఱఁగ వేసెన్ ఫణిపతి
కోఱలఁ గ్రొవ్వాడి సరకుగొనని శరంబుల్. 51

వ. ఆ సమయంబునఁ బునః పునరాహ్వానంబునం, గరభ్రమిత పరిధానంబున వీరరసాధ్యక్షుండు సహస్రాక్షుండు సుద్యుమ్న విద్యున్నిభ కార్ముక నిర్ముక్త శరవిదారణ భయపలాయమానులం బావకాది దిగధీశానుల నిలిపి సమరంబునకు నూలుకొలిపి వెలివారువంబు డిగ్గి, పవనజిత్వర త్వరానైపథ్య రథ్యంబును మాతలిసారథ్యంబును వశీకృతనిశిథినీ చర

విజయ మనోరథంబును నైన రథం బెక్కి, పెక్కు దెఱంగుల వాద్యం
బులు మెఱయ, రయంబున విబుధవరూధినీసనాథుండై కవిసి, విశి
ఖంబుల వానగురిసిన విరిసిన సైన్యంబులం జూచి యేచిన కోపంబునఁ
జాపంబున గొనియంబు సంధించి, కవదొనలు బంధించి, తురగ దట్ట
రింఖా ఘరట్ట ఘట్టిత పరశిరఃకపాలుండు దుర్జయనృపాలుండు,
తబలదమామికా పణవ డిండిమ డిమడిమ ధ్వానంబు జలవిధానంబు గప్పం
దలంప, నలవిగాని వాహినీనివహంబులు మున్నాడి నడవమెఱుంగు
మెఱచిన చందంబున నిజస్యందనంబు మెఱయ నఱముఱిం దఱియనుఱికి
వెఱచఱవం గసవు గఱవ నఱవం బఱవ సంక్రందన బలంబులం
జిందఱవందఱ సేయ, నమ్మేటివిలుకాని బాణంబులను చచ్చఱపిడుగులు
వడిం బడిన గండమండల గళద్దాన ధారానిర్ఝరంబులతోడ వదన సందీప్త
సిందూరధాతు రాగంబులతోడ సముత్తుంగ కుంభకూటంబులతోడ గంధ
గజ నగంబులు వ్రక్కలుగాఁగ నక్కుమారకంఠీరవు నారాచరంబులను
కుఠారంబులు కఠోరంబులై తాఁకినఁ, గర్ణవల్లవంబులతోడ, గాత్రవిడంబ
మానధవళ చామర ప్రసూన గుచ్ఛంబులతోడ, హిరణ్మయ ఘంటికా
ఫలంబులతోడ. నంఘ్రిమూలంబులతోడ హయానోకహంబులు విటతాట
నంబులుగాఁగ, నవ్వీరవరుని శిలీముఖంబులను జంఝూనిలంబు విసరినం
గూబర స్తంభంబులతోడ సితాతపత్ర శిరోగృహంబులతోడ రథిక సారథి
సాలభంజికలతోడ నుత్తాలకేతనపటపల్లవ పారావతంబులతోడ, శతాంగ
సౌధంబులు భగ్నంబులుగాఁగ, నవ్వారణాసివల్లభు భల్లంబులను
సంవర్త మార్తాండ బింబంబులు వేఁడి చూపినం గరవాల మీనంబులతోడ,
వర్తులఖేటకమఠంబులతోడ, భుజాభుజగంబులతోడ, దుకూలడిండీర
ఖండంబులతోడ, బిరుదమేచకచమరవాల శైవాలంబులతోడ, సింహ
నాద కల్లోల కోలాహలంబులతోడ, భట సముద్రంబులు శుష్క
ఘాతంబులుగాఁగ విలోకించి రౌద్రంబున మిగుల నుద్రేకించి, సునాశీరుండు
సుధాంధసులు సూరెలం గొలువ, సుప్రతీకసూనుం దాకి, సునిశితా
స్త్రంబుల స్రుక్కించిన, నతండు, నడుము ద్రొక్కిన మహానాగంబు
లాగునఁ గ్రోధ నిశ్వాస ఫూత్కారంబులు నిగుడ విషదిగ్ధ మార్గణ

దంష్ట్రాంకురంబుల నొప్పింప, మూర్ఛిల్లుటయు నల్లంబులు దల్లడిల్ల
వైమానిక సైనికులు పెల్లగిల్లినం గనుంగొని దిశానాయకులు, రోదసీ
కటాహంబు మిగులనార్చి యెదిర్చిన. 52

గీ. నృపతివేయేసి బాణంబులేసె, నేయ
గాయముల నాదిగీశులు గానఁబడిరి
తోడివారలుగాన నింద్రుండువలెనె
తారు వేయేసి కన్నులు దాల్చి రనఁగ. 53

క. ఆవేళ మూర్ఛదేరి శ
చీవనితావిభుఁడు రాజసింహముపై నై
రావణకరి నెక్కి ధరి
త్రీవలయము సంచరింప దీ కొలుపుటయున్. 54

క. బలువిడి నది ఘీంకారం
బులు సేయుచు వచ్చి కవియ, భూపతి తాటా
కుల చప్పుళ్లకు దయ్యం
బులు వెఱచునె వత్తుగాక పొలియంగ ననుచున్. 55

గీ. కరటిపై నేసె నొకవాడి శరముఁ గ్రౌంచ
నగముపై నేయునాఁటి సేనాని వోలె
దాన నొచ్చియు నిలువ హస్తమున నమ్మ
హా గజేంద్రంబు కుంభంబు లప్పళించి. 56

సీ. సింగిణివిల్లు శచీనాథుఁ డెత్తినఁ
మనియె భల్లంబున దుర్జయుండు
జిష్ణుండు శక్తివైచినఁ గృపాణమున సు
ద్యుమ్నాగ్రజున్మండు దుమురుచేసె
కుంతంబు సురరాజుఁ గొన్నఁ జక్రమున వి
ఖాళించె విద్యుత్ప్రభాసుతుండు

నముచి మర్దనుఁడు శూలము ప్రయోగించినఁ
జదిపె ముద్గరమున సౌప్రతీకి

గీ. పవికి నింద్రుఁడు చేసాచు నవసరమునఁ
గాశికాభర్త హస్తలాఘవము మెఱయ
నతని ఫాలానఁ గ్రుచ్చె భాగ్యాక్షరములు
తుడువు మని పంచె నన వాఁడి తోమరంబు.

ఉ. ఈ పగిదిన్ మహేంద్రుఁడు మహీతల నాథుని తోమరంబుచే
నేపరి నిల్వలేక పడియెన్ మదనాగము మీఁద నుండి, తాఁ
దాపసరాజమౌళిఁ గని దండము వెట్టని నాఁటి పాపమున్
బాపఁగ నద్రి యెక్కి భృగుపాతము చేసిన భంగి దోఁపఁగన్. 58

సీ. దర్పంబు మాని యథాయథలైరి ని
లింపులు సిద్ధులు కింపురుషులు
లావు చాలించి చెల్లాచెదరైరి సా
రణులు గుహ్యకులు తురంగముఖులు
గర్వంబు విడిచి కకాపికలైరి మ
రుత్తులు విద్యాధరులు దనుజులు
బంటుతనము డించి పంచము పాదైరి
గరుడులు యక్షులు గగనచరులు

గీ. గౌరవము దక్కి పంచబంగాళమైరి
సాధ్య గంధర్వ తుషిత భాస్వరపిశాచ
విశ్వ వసుకిన్నరాదిక వివిధదేవ
యోను లత్యంత భయకంప మానలగుచు. 59

క. అప్పుడు గోత్రవిఘాతి క
కుప్పతియుతుడై ధరిత్రి గూలి వసించెన్

ముప్పిరి గొనియెడి వగ సడి
చప్పుడు గాకుండఁ బ్రాగ్దిశాకోణమునన్. 60

క. ధరణీ! కాంచనధరణీ
ధరము విడిచి యింద్రుఁ డున్నఁ దత్ప్రాగ్దేశాం
తరమున మీఁదటి విస్మయ
కరమైన చరిత్ర మొకటి కాఁగలదు సుమీ! 61

చ. ఇట, రణరంగ నర్తిత హయానటి దుర్జయ భూమిపాల ధూ
ర్జటి యెఱమన్ను పూసిన హిరణ్యపు బూదియ దెచ్చి వన్నెదా
ల్చుటకు నిజప్రతాపశిఖిలోపల వైచినరీతిఁ గ్రొత్త నె
త్తుట నిబిడంబుగాఁ గలయఁ దోఁగిన మేరువు డిగ్గి శాంతుఁడై. 62

క. అరిగె దరీముఖరిత కి
న్నరీ విపంచీ వినోదమునకు, శిఖరాం
తర పరివృత చందన తరు
మరుదోదనమునకు గంధమాదనమునకున్. 63

వ. అరిగి తద్గంధమాదన కటకంబునం దన కటకంబు విడియించి వినో
దార్థంబుగా నహరహంబును హితసహితుండై మిహిరకర నివహ దురవ
గాహంబులైన సహకార మహీరుహంబుల వాడల నీడలఁ గ్రీడలు సలు
పుచు, సామి సంపుల్ల మల్లీవల్లీమతల్లికాకుడుంగంబుల ప్రోవు తావులం
దావులు గ్రోలుచు, సముత్తుంగ శృంగశృంగాటకనటన్మయూరంబుల
కోపుల తీపులం జూపులు నిలుపుచు, విశంకట శిలాపట్ట ఘట్టన జర్జర
నిర్ఝరీకణ ధురంధర మంధర గంధవాహంబుల పొలయికల నలయి
కలు దీర్చుచుం గొన్ని వాసరంబులు నిలువ, నొక్కనాఁడు తాపసవేష
ధారులైన పెద్దలిద్దఱు వచ్చి, నచ్చిన భృత్యామాత్యులు దొరలు దండ
నాధులుం గొలువ నలువచెలువు గెలువంజాలు కవిశేఖరుల వాక్యస్తబ
కంబులవలె విలువలేనిరత్నంబులు దాపించిన కాంచన సింహాసనా
సీనుండై, పటమంటపంబులో నున్న మహన్నాయక దుర్జయు దుర్గయుం
గని యిట్లనిరి. 64

సీ. తన దుర్గమునకు నక్తందివంబునను సిత
భాను భాస్వంతులు ప్రహరి దిరుగ
రక్షోభయంకరై రావణ మదగంధ
నాగంబు, దన సాహిణమున నుండఁ
దన శాసనమును హుతాశనాఖిల దిశా
నాథులు మకుట కోణములఁ దాల్పఁ
గులధరాధర పక్షములు విభాశించిన
దంభోళి తన కటితాప గాఁగ

గీ. వాలి ముల్లోకముల నేలు వాసవుండు
నీ తురంగమ ధాటికి నిలువలేక
పాఱి తిన్నాళ్ళు తిప్పలు పట్టినాఁడు
శూరుఁడవు నీవ దుర్జయక్షోణిపాల! 65

మ. అనినన్ మానవలోకభర్త భవదాఖ్యల్ చెప్పుఁడా యేమి గో
రి, ననుం గానఁగ నేగుదెంచితిరి సంప్రీతాత్ములం జేసి పు
త్తు నటన్నన్, విని, వారలిట్లనిరి. విద్యుత్తున్ సువిద్యుత్తు నా
నను భూతాఖ్యులమైన దైత్యులము, బాహాగర్వదుర్వారకా! 66

శా. ఆకర్ణింపుము మత్సమాగమన కార్యం బష్టదిక్పాలకీ
లోకంబున్ విదళించి వచ్చితివి గఖ్యుంబాళ్ళు చిక్కంగ నా
లోకంబుల్ మునుపోలెనుండ మదినాలోకించి మాకీ వృథా
పోకార్పంబని లేదు, నావుడు దృగంభోజంబుల వ్వవ్వుచున్. 67

కం. సచివుల నాలోకించిన
నుచితం బీకార్యమనుడు నుర్వీపతి రా
త్రిచరులకు నిచ్చెనాక
ల్పచామ రాఁదోళికాతపత్ర కళాదుల్. 96

వ. ఇవ్విధంబున మన్నించి విద్యుత్తు విస్ఫురత్తుల నిరీక్షించియేను దిక్పాలక లోకంబులు నిర్భీక పరాక్రమంబున నాక్రమించువేళ మదీయకుల గురుండు దుర్వాసోమునివరుండు సకల జగత్సేవ్యమానుండైన యీశాను దివ్యాంశంబున జన్మించిన కారణంబున నట్టి యీశానుండున్న లోకంబునకు మనంబున నుపద్రవంబు సేయం దలంచుట మహాద్రోహం బని మానితి; మీరు మఱచి తప్పియును నప్పరమాత్మునిలోకంబుదిక్కుఁ బోవక, సంక్రందన సప్తజిహ్వ సమవర్తి సంతమసపతిచర సలిలాధిపతి సమీర సంపత్పతి లోకంబు లేలుకొండని పట్టదోరణచీట్లు వెట్టించి పుత్తెంచిపిన, నా పూర్వగీర్వాణ సార్వభౌములు సేనాసమన్వితులై చని తమకు నమరావతీపురంబు రాజధానిగా వసించి దుర్వార గర్వంబున విహరించుచు నర్చిష్మతీపురంబు పాలింప విషజిహ్వుండను నక్తచరుం బంపి సంయమనీపురంబు శాసింప నుద్దండుండను దనుజాగ్రణిం బంపి కృష్ణాంగనా పురంబు నిర్వహింప ఖడ్గహస్తుండను దానవపతిం బంపి విమలావతీ పురంబు నవధరింపంగ బంధుండను దైతేయనాయకుం బంపి గంధవతీపురంబు రక్షింప వేగవంతుండను రాక్షసాధ్యక్షుం బంపి, నవనిధానధామంబు గావున నలకాపురం బునుపు గావింప మిగుల నాప్తుండైన దీప్తాలకుండను నసురవల్లభుం బంపి, నిజస్వామివాక్యంబు దలంచి యీశానుండు శాశ్వతైశ్వర్యంబున నేలు యశోవతీపురంబునకు దూరంబున నమస్కారంబుచేసి దివిజరాజ్యభోగంబు లనుభవించుచు సుఖంబున నుండిరి; తరువాత వారివలన మహాద్భుతచరిత్రంబు సంభవింపంగలదు. విశ్వంభరా! యిటు దుర్జయుండు జయపటహధ్వాననాదంబు మదవదహిత హృదయవ్యథా విధానంబు సంధింప గంధమాదనంబు డిగ్గి మందరకూటంబున విడిసె, నంత వసంత సమయ సమారంభణంబులు విజృంభించిన. 69

మ. అవతంసీకృత శాతమన్యవజయుండై దుర్జయక్ష్మా వధూ
ధవుఁ డర్పించిన ధూర్త కీర్తి సుషమా ధావళ్యముల్ ముట్టుకు
న్న, విహారంబులు చూపఁగా వెఱచి లీనాలైన చందంబునన్
లవలేశంబును లేక పోయె మహియెల్లన్ మంచు సంచారముల్. 70

గీ. గహనలక్ష్మలు తమ పూర్వ కనక భూష
ణములు దిగఁద్రావి మధుమాసరమణుఁ డిచ్చు
మణుల సొమ్ములు దాల్చిన మాడ్కిఁ బొడమెఁ
బండుటాకులు డుల్లినఁ బల్లవములు. 71

క. తలిరాకు మోవులు గదల
నలికలరవకైతవమున నాలాపము సే
యులతారమణుల పలువరు
సలువలె, మొనసెం జిగుళ్లసందున మొగ్గల్. 72

క. సుమవికసనమున లతికా
రమణులు మెఱసిరి, గళన్మరందం బనుతై
లమునఁ బరాగంబను కుం
కుమఁదోఁగి సమర్త పెండ్లికూఁతులమాడ్కిన్, 73

క. తన పగతు కంఠమును బో
లె నటంచు, రతీశ్వరుం డలిగి కత్తుల బో
నునఁ బెట్టిన మూల్గెకే విధ
మునఁ బికము ప్రవాళమధ్యమున నెలుఁగించెన్. 74

సీ. విరహిచింతాగ్ని యివ్విధిఁ గెరల్పుచు నన్న
పగిడిఁ బద్మపరాగ మెగయఁగొట్టి
కాముని వడవాలు గానఁ బౌజులు సేయు
గతిమధుపంబులఁ గదలఁ దోలి
తీవెలేమలచేత నీవిధిఁ గలయంపి
చల్లించు క్రియఁ దేనె సడల నుడిసి
తన పగ సాధింపఁ గని మెచ్చి బుజ్జగిం
చిన రీతి శిఖుల పింఛములు నిమిరి

గీ. తెరువు నడచిన దాహంబు దీఱ గిరిఝ
రాంబువులు గ్రోలు కరణి రతాంత తాంత
వనితల కుచాగ్రముల ఘర్మవారి పూర
మడఁగ, విహరింపఁ దొడఁగె మందానిలంబు. 75

వ. ఇత్తెఱంగున సకల జగజ్జనాను రంజనకర పరిమళ పరంపరా సంపత్సమాసంబైన వసంతమాసంబున రాజకీరమాలికలు పచ్చతోరణంబులుగా, నిరంతర పరాగ పటలంబులు మేలుకట్టులుగా, మల్లికా ముఖవల్లీ మతల్లికలు రాల్చిన విరులు ముత్యాల ముగ్గులుగా, సరసకిసలయ కుసుమ ఫలభరితంబులైన గుజ్జుమామిళ్లు పూజకుండలుగా మరకత మణి మయూఖముల డాలు విడంబింపం జాలు మరువంపుమళ్లు జాజాలపాలికలుగా విహరమాణ మధులిహంబులు హోమధూమంబుగా, ధగద్ధగిత కళికలంగల సంపెంగలు నివాళి పళ్ళెరంబులుగా, మత్తకోకిల కాకలీ కల కుహూకార కలకలంబులు పాటలుగా, భవిష్య ద్వైవాహ మంటపంబు చందంబున, మందరకుధర శిఖర స్థానంబున నున్న కిన్నరోద్యానంబునకు హేతిప్రహేతి పుత్రికలు సుకేశియు మిత్రకేశియు సహస్ర కన్యకా పరివృతలై చనుదెంచి తదనంతరంబున. 76

గీ. లతల లోపల జంగమలతలు వోలెఁ
దాము లీలావతులు వినోదంబు సలుపఁ
బ్రాణసఖియైన కదళిక పలికె నిరప
కాళలావణ్యరాశి సుకేశి దాసి. 77

చ. ముకుళము లందెడిన్ దిలకమున్ వకుళంబును గోఁగు పొన్న చం
పకమును వావిలిం గొరివి మామిడి వంజుళమున్ బ్రియాళువున్
సకి! కను, మాసవం బుమియు, నవ్వు, వచింపు, ముఖాబ్జమెత్తు, క్ర
మ్మ కౌనఁగ నూర్చు, చన్నుఁగవ మోపు, కరంబిడు, తన్ను,
పాడుమా! 78

క. అని నున్నని తిన్నని చ
ల్లని మాటలఁ గదలికా విలాసిని పలుకన్
విని దశదోహద కేళీ
వినోదముల సంచరించు వేడుకతోడన్. 79

సీ. పద్మిని నిశ్వసింపఁగఁ బూచె వావిలి
కమలాక్షి గనఁ దిలకంబు పూచె
నవ పల్లవాంఘ్రి దన్నఁగఁ బూచెఁ గంకేళి
కలకంఠి పాడఁ బ్రేంకణము పూచె
సంపెంగ పూచె రాజనిభాస్య మొగమెత్త
మంజులకర ముట్ట మావి పూచె
మధురభాషిణి వచింపఁగఁ బూచె సురపొన్న
కుందరదన నవ్వ గోఁగు పూచె

గీ. ప్రమద గంధోత్త మాసవం బుమియఁ బూచెఁ
బొగడ కరికుంభ నిభకుచ బిగియఁ గౌగి
లింపఁ బూచెఁ గురువకంబు లేమలెల్ల
నపుడు పుష్పాపచయము చేయంగఁ దివిరి. 80

కం. చేరువ నున్నవి చూడు వ
ధూరత్నమ! కమ్మఁదేనె దొరుఁగఁగ సుమనో
నారాచుని తుహినపయో
ధారాగృహములగతిన్ లతాకుంజంబుల్. 81

కం. వనితా! మదనరథాంగం
బునేమి చందంబు వాల్చెఁ బుష్పస్తబకం
బునఁ జుట్టు దిరిగిరా బ్రా
లిన మత్తమధు వ్రతావళిం గనుగొనుమా! 82

కం. మదిరాక్షీ! వీక్షింపు మ
రుదాచలిత వల్లి వల్లరుల మెఱఁగెడు ష
ట్పదమాలిక నటిచన్నులఁ
గదలెడు నీలాలసరుల కైవడినుండెన్. 83

గీ. సకియా! చివురున సుమనో
మకరందము వడిసెఁ జూడుమా! విరహుల ద
ర్పకుఁడు నఱక శాతకృపా
ణికఁ బొటఁ బొటఁ గాఱు క్రొత్త నెత్తురు భంగిన్. 84

కం. స్మర పునరుద్భూతికిఁ బం
దిరిగుండము చొచ్చి మ్రొక్కు దీర్చిన కరణిం
తరుణీ! యాయెలమావి చి
గురుజొంపముఁ జొచ్చి వెడలెఁ గోయిల గంటే. 85

కం. ప్రకుపిత హరనిటల తటాం
బక హుతవహదగ్ధ చిత్తభవ భస్మము పో
లిక నుండెంగను సతి! చం
పక ధూళీనిహతి పతిత మధుకర వితతిన్. 86

కం. కుటిలాలక! చూడుము వి
స్ఫుటమంజరి డాసె భృంగముల చాలు నిశా
విట బింబముఁ బట్టి, హుటా
హుటివచ్చు విధుంతుదునకు నుపమానంబై. 87

కం. కొలఁది యెఱుంగక తిని కో
కిలకామిని వెడలఁ గ్రాసెఁ గిసలయ ఖండం
బులు, విరహిజనులపై ని
ప్పులు గ్రక్కెడుననఁగఁ జూడు పుష్పసుగంధీ. 88

కం. లలనా! విచ్చిన పూఁ బా
ళల నా లేఁబోఁక మోక, లక్ష్మీసుతు సే
నలలోపల జల్లెడక
త్తుల కొంతము విలసనమునఁ దోచెం గనుమా! 89

కం. కలయఁగ బ్రాలిన చిలుకలు
గల పూచిన చంపకంబుఁ గనుము చెలీ! ప
చ్చలుఁ గెంపులు దాపించిన
వలరాయని పసిఁడిమేడ వడువున నొప్పెన్. 90

మ. సుమనశ్చాపుని రాజివాసమునకున్ సొమ్ముల్ వినిర్మించు య
త్నమునన్ విచ్చిన మెట్టదమ్మి కమటానం గేసరాంగార మ
ధ్యమునన్ వైచిన కర్ణికా కనకముం దన్వీ! రజఃకీల పుం
జము నరిత్తింపఁ గరంగెడుం గనుము, గూజద్భృంగ నాడింధమున్. 91

రగడ. మందగమన చొరకు చొరకు మావి మావిమోక లెల్ల
నిందువదన మనసు విఱిగె నీడ నీడ నిలువనొల్ల
లేమ! జాదిపువ్వు మొగ్గ లేదులే దురాశ గాని
చామ! వృక్షవాటిఁ దిరుగఁ జాలఁ జాలఁ సొలపు పూని
రామ! మమ్ము లూటిసేయ రాకు రాకుమారి ననుచు
హేమ! మల్లెవిరులు నాకు నీవు నీవు దాచికొనుచు
కొమ్మ! యిది నిజంబు పలుకఁ గొంచెఁ గొంచెఁ పఱచి ప్రేమ
తమ్మికంటి! చంపకంబు దా సదా సగంధసీమ
అతివ! నారదములు గోయ. నందు నందు వేగపొమ్మ
సతి! తదీయ భాషణము పిసాళి సాళిఁ జెప్పఁ జుమ్ము
సూనగంధి! వెదకు తావిఁ జొక్కఁ జొక్కమైన దిక్కు
మానవతి! గయాళి పొత్తు మాను మానుషంబె దక్కు
పడఁతి! వెనక కొమ్మ బింబెఁ బట్టు పట్టు నున్న చేల
మడఁతి! పొగడ పొన్నతో సమానమా? నగంగ నేల
యింతి! వేగ తెలియనేర వింత వింత యే మొఱంగు

కాంత! ననలు వలపు గలవిగావు గావునం దొఱంగు
గోతి! చిలుక పెంటి మగనిఁగూడు గూడు చేరఁ జనకు
నాతి! పుష్పములకుఁగా వనాన, నాన వెట్టుకొనకు
తనువలగ్న! మీఁదఁదేటి దాఁటు దాఁటుఁ జెట్టువంప
వనిత! యెట్లు వచ్చు వన్నెవాని వాసినం జరింప
భామ! తోడివారిఁ బిలువఁ బంచి పంచివెట్టు తేనె
వామ! కుముద దామకంబు వాడ వాడవైతి వౌనె
కన్నె! చంటి ముంట గీరఁ గన్నఁ గన్నతల్లిఁ దిట్టు
నన్ను సకియ నిట్టు లేటికంటి కంటికెఱ్ఱ పుట్టు
కోమలాంగి! పాటలములు గూర్చు గూర్చుబోఁటి జోక
కామినీలలామ! బంతి గట్టు గట్టువాలు గాఁగ
తెఱవ! యెచటనుండి పాఱుతెంచి తెంచితే సరాలు
మెఱుఁగుఁబోఁడి! చెక్కుచెమట మీటు మీటుమిగులఁ జూచి
చెలువ! కేతకములు తావిచేరు చేరువలకుఁ బొమ్ము
లలన! జోటి మనమతుల్ గలంచ లంచమందె నమ్మ
పొలఁతి! ప్రేంకణములు చూడఁ బుచ్చఁ బుచ్చఁడిక మసలు
నెలఁత! చైత్రమాసమున జనించు నించు విలుతుపసలు. 92

ఉ. అంచు మదాంధ గంధ గజయానలు పువ్వులు గోసి, మూఁతలై
కాంచన శైల శృంగములు గల్పకవల్లుల, దర్పణంబులం
గొంచెపు మంచు, పట్టుగతి గుబ్బల మేనులఁ జెక్కులం గదం
బించుచు ఘర్మ బిందువులు పిచ్చిల, బంతులవాటు లాడఁగన్. 93

గీ. రాచకూతుల సకియల రత్నవతియుఁ
గదళికయు వచ్చి వారించి కమలగర్భ
గేహినీ హస్తమణి వల్లకీ నినాద
బాంధవములైన మంజుల భాషణముల. 94

సీ. చెలులార! పువ్వులు చిదిమినఁ బుష్ప బా
ణాసనునకుఁ గీడు చేసినారు

తరుణులార! చివుళ్ళు దళవిసఁ గలకంఠ
దంపతులకు నట్టు దలఁచినారు
రాజాస్యలార! మరందంబు ముట్టినఁ
జంచరీకంబులఁ జంపినారు
రమణులార! ఫలాలు రాల్చినఁ గీర పో
తముల ప్రాణములకుఁ దప్పినారు

గీ. కోకకుచలార! కొలనికి రాక యిచట
నొకతె నిలిచిన రాకుమారి కలయాన
ద్రోచిపారని పలుక వధూటికా ల
లామలు ధనాధిపారామ సీమ వెడలి. 95

లయగ్రాహి

నీలమణి తూలికల డాలునకు మాఱుకొనఁ
జాలెడు మెఱుంగుల నరాళ చికురంబుల్
ఫాలమున వ్రాల, నిడువాలు మగమీలగమి
డీలుపడ! దోలెడు పిసాళి కనుగ్రేవల్
సోల, శరదంబుద మృణాల హిమవాలుకల
నేలెడు రుచి న్వలిపె చేలలు కుచాలం
దూలఁ, జని మన్మథుని, కేలికరవాలమునఁ
దోలిన సుకేశిఁ గని వేలముల తోడన్. 96

క. చేరిరి కాసారము మద
కారి మధుపగాన లహరి కాసారమునీ
రేరుహవసీ విసిస్రవ
ణారవమధు బిందుమాలికాసారంబున్ 97

వ. ఇట్లు చేరి, వారి విహారోపయోగ్యంబులుగా సరోవరలక్ష్మి దమకు నాయి
తంబు చేసి పెట్టిన కుంకుమ గంధంపు ముద్దల చందంబున నున్న తీర

స్థల పతిత జంబీర చూత మాతులుంగ ఫలంబులుం గనుంగొని, మజ్జ నావసానంబునఁ గర్ణికాసీనయైన సరోలక్ష్మి తడియాఱ విప్పిన కేశపాశం బుల లాగునఁ జెలంగు సారసోపరి పరిభ్రమద్భ్రమరంబులఁ గనుంగొని సకలాంగంబుల సరోలక్ష్మి ధరించిన వజ్రమణిమయభూషణంబుల తళు కుల విధంబున నెగరు తగఁపు మీలం గనుంగొని, ప్రతికమల సౌధవీథి విహారభేదంబునం బ్రాదుర్భవించినఁ గొనగోళ్ళం జిగిచి సరోలక్ష్మి మీటు కుచకపోలఫాల స్వేదకణంబుల చాడ్పునం దూలు రంగత్తరంగ జలబిందు సందోహంబులం గనుంగొని. సలిలాధిదేవతలం గూడి సరో లక్ష్మి వేడుక నాడెడు కందుకంబులకైవడి గ్రీడించు పునః పునరుత్పతన పరాయణంబులైన లకుముకులం గనుంగొనుచు, సహోదర వాత్సల్యం బున సరోలక్ష్మికిం బరిచర్యఁ గావింప సంపూర్ణచంద్రుండు పంపిన కిరణమాలికలకైవడిం గ్రాలు రాజమరాళంబులం గనుంగొనుచు, వినోద వాదనాంతరంబున సరోలక్ష్మి నిలిపిన దంతప్రవాళ సమంచిత విపంచిపోలికం దిలకించు చంచు దష్టైక మృణాళకాండ చక్రవాక దంపతులం గనుంగొని నీరాటకు వచ్చు మదవతీ వతంసంబుల నర్చింప సరోలక్ష్మి గంధాక్షతలు సంధించి కుదురు వఱచిన పచ్చలహరివాణం బుల రూపమున దీపించు మధూళి మిళిత కుసుమ ధూళీ పుంజకింజిల్క రంజిత పద్మినీ పత్రంబులం గనుంగొని, తత్కాసారంబు సౌభాగ్యంబు నకు మెచ్చి పాదకటకంబులు పుచ్చి, ధమ్మిల్లబంధంబులు బిగియ ముడిచి విచిత్రాంబరంబులు విడిచి, జిలుగు పావడలు గట్టి పరస్పర కరంబులు వట్టి, సోపానంబులు డిగ్గి మిథ్యాలసత్వంబునఁ జేతులమీఁద మ్రొగ్గి చెఱకు విలుకాని బరిగోలల తెఱంగున మెఱసి నిర్మలాంబు పూరంబులు దఱిసి, కంజ కల్హార కైరవబిసకిసలయ గ్రహణ సమ యంబునం గలహింప నౌంఢౌరుల వలనం బుట్టు హుంకారంబుల బెదరి కులాయంబులు విడిచి గగనంబున నెగయు హంసక్రేంకారంబులు రేఁగి, వికస్వర తామరసాగ్రంబులఁ గ్రుంచి దుద్దీనంబులైన చంచరీకంబుల ఝుంకారంబులు మణికంకణ ఝణత్కారంబులు సందడింప, నందంద చిల్లలం జిలుకలం జల్లులాడు సమయంబున. 98

గీ. ఒకతె పలువురు సతులపైనుమియ వారు
తత్తరుణి మీఁద హస్త యంత్రములఁ జిమ్మ
వారి ధారలు మెరసె నీహారకరుఁడు
జలజములు చొర వెకలెడు శరము లనఁగ. 99

చ. తన సరి నీలవేణులు సుధా మధురోక్తుల మాక మాక యి
మ్మని పలుకంగ నీననుచు నందఱు చూడ మనోజరాజ కాం
చన మణి దండ చామరము చందము దాల్పఁ గరాంబుజంబునన్
బసివడి యెత్తి పట్టె నొక బాలవిలోల మృణాలజాలమున్. 100

గీ. మచ్చరంబున నిద్దఱు మానవతులు
పెడమరలి చల్లు లాడంగ నడుమఁ గూడి
జడలు గనుపట్టెఁ గాంచన స్తంభ కీలి
తాంగ భవ నీల డోలికా యంత్ర మనఁగ. 101

చ. సకి నతిముగ్ధఁ దోడుకొని చన్నులబంటి జలంబు గల్గు చా
యకుఁ జని యీఁత నేరిపెద నంచుఁ దదీయవలగ్న సీమ నా
త్మకరము దూర్చె నొక్క మదమత్త గజేంద్ర సమాన యాన, ద
ర్పకుఁడు లతాంతచాపమునఁ బల్లవబాణముఁ గూర్చుకైవడిన్. 102

గీ. ఒక్క సతి వెల్లకిల నీఁద నొప్పెఁ గురులు
వీఁగు జన్నులు, వలరాచ వేఁటకాఁడు
కోకములఁ బట్ట నొడ్డు వాగురులు వాని
డా కొనఁగఁ బెట్టు దీము పిట్టలు ననంగ. 103

చ. తమకముఁ గేకిస ల్మోసయ దంతపు బుఱ్ఱట కొమ్ములోని కుం
కుమ సలిలంబు నాఁగ నొక కోకిలభాషిణి పాండురారవిం
దము దనచేతఁ బట్టుకొని తన్మకరందము చల్లె బోఁటి వ
క్త్రమున, మృగాంక బింబమునఁ గాఱు సుధారసధారఁ బోలఁగన్. 104

గీ. ఇవ్విధంబున హేతి ప్రహేతి పుత్రి
కలు సఖులుఁ దారు జలకేళి సలిపి విగళ
దంబు వేణులు వదన చంద్రామృతంబు
లాని కక్కఁడు రాహువు లనఁగ వెడలి. 105

కం. దరి యెక్క వారి నీడలు
సరసిం గనుపట్టెఁ గూడి సలిల క్రీడల్
జరిపి తమ పురికి సరుగం
దిరిగిన పాథోధిపతిసతీతతి భంగిన్. 106

శా. ఆ కాలంబునఁ జిత్రశాటి నృప కన్యల్ మెచ్చి కప్పించిరో
యీకాసారజలంబు మీఁద ననఁగా, హెచ్చెన్ సఖీలోక వీ
క్షా కౌతూహలకారులై కుచతటీకాశ్మీరమున్, గండ సీ
మా కస్తూరియు, ఫాలచందనము, సీమంతాగ్ర సిందూరమున్. 107

వ. మఱియు, ననుకూల ప్రమదానేకపదర్పణంబుగాక వివేకింప ననుకూల ప్రమదానేకపదర్పణంబైన పద్మాకరంబు చూచి, హృదయానందంబున మిన్ను మోచి మోపులు గడగిన వలరాజు వాలు చందంబున వాలు వాలుం గంటి మొత్తంబు చతుర్విధ శృంగారకళాయత్తంబై తనచిత్తంబు రా మెలంగ, సుకేశి మత్తకాశిని మిత్రకేశీ సమేతంబుగా నేతెంచి మలయపవన ఝంపా సంపాత సకంప కుసుమ సంపన్న చంపక పాదపంబు నీడయని, దాపు, నీలాలవేది శుకతురంగ సాది నిలిపి, తదీయ సతి రతింగేలు కొలిపి, షోడశోపచారంబులు సలిపి, మీ వంటి దాంపత్యంబు మాకుం గలుగ వరంబు గృప సేయుండని మనోరథంబు దెలిపి మ్రొక్కి సంస్తుతించు నవసరంబున. 108

సీ. వలపులు గులుకు చెంగలువ క్రొవ్విరుల జే
కులు గాన రా సేస కొప్పు ముడిచి
మంచి పన్నీట మేదించిన సారంగ
నాభి పంకంబున నాభి దీర్చి

కుడివంక గోణము కొంగు ఱింగులు వార
నిండు చెంద్రికలచే దిండు గట్టి
కొమరు వెన్నెల వెల్లి గొలుపు కట్టాణి మౌ
క్తికములఁ గంఠమాలికలు వైచి

గీ. పసిఁడి సింగిణి ధరియించి రసికజన స
మేతుఁడై దుర్జయస్మృతలేశ్వరుఁడు
వచ్చె నెదుటికి నారాజవదన గొలువ
నించువిలుకాఁడు సాక్షాత్కరించె ననఁగ. 109

కం. ఈ రీతి నైల బిల కాం
తారము చూడంగ వచ్చి తన ముందట నా
కారంబు వహించిన శృం
గార రసము పగిది నుండఁగాఁ గుతుకమునన్. 110

ఉ. చూచె నృపాలు నెమ్మొగము చూపు సరోజ గతాళి సన్నిభం
బై చరియింపఁ, జూచి, హృదయంగమ రూప విభేద నార్థమై
చూచె నిజార్చితాంగజునిఁ జూపు మహీవిభుచేయ నిచ్చునా
రాచము కైవడి న్మెఱయ, రాజకుమారిక ఘర్మవారియై. 111

కం. జనపతియు నాసుకేశీ
వనితావదనంబు తెప్పవాల్పక వీక్షిం
చెను రాకా చంద్రోదయ
మునఁ గలువల పగిది నయనములు వికసింపన్. 112

కం. వీక్షించి పలికె విద్యా
రక్షకుఁడను పేరఁ బరగు ప్రాణసఖునితో
ద్రాక్షాఫల మధురాధర
లక్షణములు చూడరా ! కళాతత్త్వనిధీ ! 113

చ. తన శరమైన చంపకము తావులఁ గూడిన గాడ్పు రేణు మే
దిని దళ ధాళధళ్యరుచి తేనియనీరు పుటాంతరాంబరం
బును సవరించి యీ చిగురుబోఁడి ననంగవిధాత చేసెఁ బో
తనులత గందఁ దక్కిన విధాత కరంబున నంటి చేసినన్. 114

సీ. లపనంబు శశి మండలంబునఁ జేసి త
ద్చిహ్నంబు కుంతలశ్రేణిఁ బెట్టి
మోవి పంకజరాగమునఁ జేసి తత్కఠి
నత్వంబు తుంగస్తనములఁ బెట్టి
దేహంబు విద్యుల్లతికఁ జేసి తచ్చల
నంబు విలోచనాంతములఁ బెట్టి
కరరుహాంకురములు గలువరేకులఁ జేసి
తన్మార్దవంబు హస్తములఁ బెట్టి

గీ. గళము కంబునఁ జేసి తత్కాంతి మంద
హాసమునఁ బెట్టి, తనుమధ్య, మంబు వాహ
మార్గమునఁ జేసి తాత్కాళిమంబు రోమ
రాజిఁ బెట్టి సృజించె నీరామ నజుఁడు. 115

కం. స్మర మాంత్రికుండు నిలుపం
గ రాని రోమాళి పన్నగము నిలుపుట దు
స్తరమని తలఁపక వ్రాసిన
బరులు సుమీ! యీ సరోజపత్రాక్షి వళుల్. 116

గీ. మేచక భుజంగ నిభవేణి మీఁదఁ గడచి
వ్రేల నిబ్బాల పిఱుఁదు విరాలి గొలిపె
నన్ను యమునానదీ వేణి నడుమఁ బొలు
గానఁ బడియెడి పులినయుగ్మంబు కరణి. 117

గీ. అంటు కొనక విలోకింప నాత్మఁ జల్లఁ
జేయు నీ కాంత తొడలతోఁ జెప్పఁ దగునె
తరముగా నంటుకొను పాణిఁ దక్కఁ నాత్మఁ
జల్లఁ జేయని కదళికా స్తంభములను. 118

గీ. వికచాబ్జ దళాగ్రంబుల
మకరందము కరుడుగట్టి మఱి జాఱని పో
లిక నున్నవిరా సఖ ! యా
లికుచస్తని మ్రానపదాంగుళీ నఖపంక్తుల్. 119

కం. అని పిదప నా సుకేశికి
ననుసంభవయైన మోహనాకార వధూ
జన చింతామణి నాళీ
కనిభేక్షణ మిత్రకేశిఁ గనుఁగొని పలికెన్. 120

కం. ఈ రాజకీరవాణికి
నీ రాకాచంద్రవదన యేమానో ! వి
ద్యా రక్షక ! వయసున సుకు
మారత, రూపమునఁ గాంతి మార్పఁగ వచ్చున్. 121

గీ. నద్వితీయంబుగా దీని నలువ చేయఁ
దలఁచి చేయుచుఁ దలఁచిన తలఁపు కొలఁది
వచ్చు నందాకఁ జేసిన వారు మేన
కాది సతులన్న సౌందర్య మడుగ నేల. 122

కం. మధుర మధురసా స్వాద
గ్రథితారుణ్యంబు లైన కనుఁగొనలతో
ష, ధవుని మీఁద నొరఁగి, నవ
సుధాంశుమణి సౌధవీథి సుఖ పరవశయై. 123

గీ. ఇందుబింబాస్య వీణ వాయించె నేని
మృగవిలోచన కిన్నెర మీటెనేని
పల్లవాధర మెల్లన పాడెనేని
మూఁడు జగములు రాగాబ్ధి మునుఁగ కున్నె. 124

సీ. అని మహీపతి మన్మథాధీనుఁడై కుమా
రికల రూపములు వర్ణించు వేళ
నైరావతీ సమాహ్వయ దూతి యేతెంచి
కన్యకలార ! యిక్కాననమున
పోక ప్రొద్దునఁ జరింపుట నీతియే ! పురం
బునకుఁ బోదము రండు కినిసి మిమ్ముఁ
బిలువంగ నన్ను బంపిరి కన్న తల్లులు
నావుడు నమ్మాట నారసంబు

గీ. కరణి హృదయంబు నాటినఁ గళవళించి
పాపకర్మపుదైవ మీ పాటి మేలుఁ
జూడఁ జాలక నిస్తంద్ర సుఖ విహార
మునకు విఘ్నంబు గావించె ననుచు వగచి. 125

గీ. సర్వ లోకైక సౌందర్య ధూర్వహునకు
మము బరాఙ్ముఖలను జేయ మనసవ ! నీకు
బాడి గాదని పలికిన పగిది సంది
యలు గులకరింపఁ గొంతప వ్వరిగి నిలిచి. 126

శా. ఆ రాజుం గను వేడ్క చిత్తముల నూటాడఁగన్ విధంబే విధం
బో రామా ! ననవింటి వేలుపునకుం బుష్పాంజలుల్ సేయబామం
చైరావత్యలికుంతల న్మొఱఁగి జోడై చంపకక్ష్మాజ ముం
జేరం గ్రమ్మర నేగుదెంచిరి సుకేశీ మిత్రకేశీ సతుల్. 127

కం. అది యెఱిఁగి బాలికల ని
ల్పుదమని పఱతెంచి నెచ్చెలులు రత్నవతీ
కదళికలు విన్నవించిరి
మృదులోక్తుల మరులు గొన్న మెలఁతల తోడన్. 128

మ. నగరే! చూచిన వారు మీరు మదనోన్మాదంబునం బొందినన్
మగవారి న్మొగమెత్తి చూచఁ గులకన్యా ధర్మముల్ దప్పవే!
తగవే పైకొనఁ, గాక కూర్మిబలవంతంబైన నా రాజు ధై
ర్య గుణోదాత్తునిఁ దెత్తు మబ్జ ముఖులారా! యేల చింతింపఁగన్. 129

కం. అన, మరలి చనిరి సత్రమా
ననలై, ననలైదు నేర్పునను శరములఁ జే
సిన విలుకాఁడు గుఱించిన
తనుపుల హేతి ప్రహేతి తనయలు సనయల్. 130

సీ. ఇట దుర్జయక్ష్మాతలేంద్రుండు కన్యకా
వీక్షణ సంప్రాప్త విరహ వేద
నాయత్తుఁడై వేఁగఁ, బ్రాణ సఖుండు వి
ద్యారక్షకుఁడు చూచి ధరణినాథ!
యేను లతాంగుల వృత్తాంత మెఱుఁగుదు
విను, మందరాచలంబునకు నికట
మున నున్న పాటలం బనుపురంబున వేలు
పులకు నాతంకించి వలస వచ్చి

గీ. నిలిచి యెప్పుడు నీదు రాకలకు నెదురు
చూచు హేతి ప్రహేతుల సుతలు, మీఁది
పని ఘటించెద విచ్చేయు మనిన సంత
సిల్లి యక్షేశ్వరా రామ సీమ వెడలి. 131

వ. నిజభుజప్రతాపంబునకు వెఱచి భానుమంతుఁడను సామంతుఁడు వినతాపత్య పురస్సరంబుగాఁ బొడసూపి పగలు నాలుగుజాములుం బాదంబులు సేవించి సంధ్యాసమయంబునం గరకమలంబులు మోడ్చి పశ్చిమ భూధరంబను నివాసంబునకుం బోవుచు రాత్రి గొలువం బెట్టిన కిరణం బుల కరణిఁ గరదీపికా సహస్రంబులు వెలుంగ, మకరాకరగర్భంబున నెవ్వని బాధలకుంగాక చిరకాలంబు డాఁగె. నట్టి గోత్రభేదిం బట్టి మనికి పట్టు విడిచి పాఱంగొట్టుట విని భయంబు దక్కి తన్ను భజింప వచ్చిన మైనాకంబు చందంబున మెఱయు నుభయపార్శ్వ లంబమాన చమర వాలంబైన భద్రశుండాలంబు నాయితంబు చేసి తెచ్చిన, నెక్కి, క్రిక్కిరి సిన హేతిప్రహేతి కన్యకా కుచకుంభంబు లిప్పగిది నప్పళింపనెప్పుడు దొరకునో యను విధంబునఁ దద్గజేంద్ర కుంభంబు లప్పటప్పటికి నప్ప ళించుచు, వాహిని వాహినీశ్వర ప్రాచీన వేలంబునకు వేలంబునంజని యామకుంజరగ్రైవేయ ఘంటా ఘణాత్కార బధిరితాఖిల దిశాంతంబైన పటనిశాంతంబు బహిరంగణంబున నేనుంగు డిగ్గి పరివారంబు నిలిపి విద్యారక్షకు ముంజేయి కరతలంబున నవలంబించి శయ్యాగృహంబు సొచ్చె నని వరాహదేవుండు చెప్పిన విపులా చపలాక్షి మీఁదటి వృత్తాంతం బాన తిమ్మని విన్నవించిన— 132

మ. తులువక్ష్మాప కులావతంసక! సుధాంధోవాహినీ భోగిరా
డ్కలశాబ్ధి ప్రభ కీర్తి వైభవ! భుజాకౌక్షేయ ధారా విని
ర్దళి తారాతి వరూధినీధవ! కృపా రారజ్య మానేక్షణాం
చల ధైర్యాచల! సత్యభాషణ హరిశ్చంద్రా! నరేంద్రాగ్రణీ. 133

క. దృఢవాచా పన్నగ పరి
వృఢ! జయసంభరణ రణధరిత్రీనిస్సా
ణఢిమఢిమ నినాద ఝలిపి
సుఢాలగతి చతురహయ రజోరుద్ధ రవీ! 134

స్రగ్విణి.స్వర్ధవ ప్రస్ఫుర ద్వైభవా!
గీర్ధరిత్రీ ముఖాగ్రీయ దానక్రియా!
దూర్థరాగర్వ సంధుక్షమాణా సహ!
న్మూర్థరత్న ప్రభాముగ్ధపాదద్వయా! 135

గద్యము. ఇది శ్రీమ దూమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్య పుత్ర మల్ల మనీషి మల్ల మలయమారుతాభి
ధాన, ఘంటనాగయ ప్రధాన తనయ సింగయకవి పుంగవ
ప్రణీతంబైన శ్రీ వరాహపురాణంబను మహాప్రబంధమున
ద్వితీయా శ్వాసము

శ్రీ

# వరాహ పురాణము

## చతుర్థాశ్వాసము

—*—

శ్రీమహీ మహిళా విహరణ
ధామ దృగంభోజబాహు దర్వీకర! ర
క్షోమథన కథారసథా
రామధురిమ లోల! యీశ్వరప్రభు నరసా! 1

వ. అవధరింపు మవ్వరాహదేవుండు ధరణికిట్లనియె, నట్లు శయ్యాగృహంబు సొచ్చి దుర్జయ కుమారవతంసంబు హంసతూలికా తల్పంబున మేను గదియించి కిన్నర వరారామంబునఁ దాను జూచిన వరారోహల హావభావంబులు భావభిత్తిం జిత్రించిన విధంబున నుండ నొండొండ కోర్కులు నిండ ననుంగుచెచ్చెలిం గనుంగొని— 2

సీ. మదన ధనుర్మోఘ మార్గణ ధారాళ
వర్షంబు వారింప వసము గాదు
చింతానిలజ్వాల త్సంతాపజిహ్వాల
దహనంబు చల్లార్పఁ దరము గాదు
వ్రీడా గుణాసమన్విత ధైర్య జంఝూల
దంతావళము నిల్పఁదరము గాదు
హృదయాలవాల బాలేచ్ఛా జటాలవ
ల్లుల వెనుకకు దివ్య నలవిగాదు

గీ. విరహలహరీ ఘటా సముద్వేలరాగ
జలనిధానంబు దరియింపఁ గొలఁది గాదు
ధీ తరణ్యస్తమయజ మోహాతిభీష
ణాంధకారంబు విరియింప హవణుగాదు. 3

చ. వెడ వెడఁ బయ్యెదల్ సడలి వ్రేఁకపు గుబ్బ చనుంగవల్ బయ
ల్పడ, వెడవింటి వేల్పునకు, లక్తక రక్తిమ తొంగలింపఁగా
నడుగులు గొంత యెత్తి కుసుమాంజలి యిచ్చిన రీతి, నాకు నె
న్నఁడు దలబ్రాలు వోయుదురొ! నర్మసఖా! తదరాళకుంతలల్. 4

క. మరునకుఁ బ్రదక్షిణంబులు
దిరిగెడు సమయమునఁ బ్రహరి దిరిగెడు యామ
ద్విరదములఁ బోలు నా మం
థర యానల మరవ వచ్చునా! చెలికాఁడా! 5

ఉ. క్రొన్నన వింటి వేలుపునకున్ మహిఁ జాగిలి మ్రొక్కి లేచి కిం
చిన్నతలైన వేళ విలసిల్లిరి నీరజపత్రనేత్ర లా
క్రొన్నవింటివేల్పురతిఁ గూడి తటస్థుని నన్ను సేయుఁగై
కొన్న శరాసనంబులనఁ గూర్మి సఖా! నయనాభిరామలై. 6

సీ. నా మీఁదఁ జెదరక నాఁటిన తమ కూర్మి
తేటతెల్లంబుగాఁ దెలిపి చననొ!
తారు హరింప నా ధైర్య సంపదలోన
శేషంబు గలిగినఁ జేదుకొననొ!
దర్పకుఁ బక్షపాతంబు సేయక తమ్ము
నేచి నట్లనె నన్ను నేపుమననొ!
తమ మానధనము సర్వము గోలుపోయి, నా
చేష్టల వెంట నొచ్చెంబుఁ గననొ!

గీ. మరలి వచ్చిరి గాక! తామరస ముఖులు
సఖుఁడ! లేదేనిఁ దల్లుల శాసనంబు
దాల్చి పిలువంగ వచ్చిన తరుణి వెంట
దూరమరిగియు రా నేమి కారణంబు ? 7

శా. మేలం బాడుచు వచ్చు నెచ్చెలియపై మిథ్యాలసత్వంబు నూ
ల్కొ, లోలోపల వేడుకల్ నిగుడ సిగ్గుల్ దేర నొయ్యార పుం
గ్రాలుంగన్నులఁ గ్రొమ్మెఱుంగులు దొలంకన్, మందయానంబుతో
నా లీలానియమంబు చేరదురొకో! నాళీకపత్రేక్షణల్. 8

ఉ. చూపులు చూపులం గలయఁ జూచి మనోగత లజ్జ నేర్పు నం
బాపుచుఁ గప్పురం బిడునెపంబునఁ బాణితలంబు పట్టి స
ల్లాపసుధారసంబు చెవులం జిలికించి రతి ప్రసంగ వాం
ఛావర తంత్రవృత్తి మృదుశయ్యకుఁ దార్తునొకో లతాంగులన్. 9

సీ. చిలుకు రాగరసంబు చిత్తడిచే ముమ్మ
రమ్ముగాఁ బులకాంకురములు మొలవఁ
గ్రమ్మెడు నూరుపుఁ గమ్మతెమ్మెరలచే
నల్లనల్లన తనువల్లి వడఁక
చెదరిన కమ్మని చెమట పూఁదేనెచేఁ
గుంతల రోలంబకులము చొక్క
నిగిడెడు ముసిముసి నగవు వెన్నెలలచే
గాటంపు సిగ్గు చీఁకటులు దొలఁగ

గీ. బిగువు కౌఁగిటఁ గదియించి చిగురుటాకు
మోవి చవిచూచి కుచకుంభముల మనోభ
వాంకములు వ్రాసి రతిరహస్యములు దెలిపి
కమలగంధుల నెన్నఁడు గారవింతు. 10

చ. ఒక సతి మత్తమర్చితసముజ్జ్వల హారముపైఁ బరాకుగా
నొక చపలాక్షి మోపినవి నొల్లన నొక్కనసుంద దీయనా
యకమునఁ గాంచి వంచన విహారమెఱింగి సరోషయైన బా
లిక చరణంబు లత్తుక చెలీ! ధరియింతునొకో! శిరంబునన్. 11

వ. అని యిట్లు హేతి ప్రహేతి కన్యకా విలాసన ప్రసక్త మనోరథుండై సుమ
నోశక కఠోర నారాచ ధారాచలితాంతఃకరణుండు దుర్జయ కుమారుండు
బహు ప్రకారంబులం బలుకు విరహ వికారాలాపంబులు విని సారస్య
రహస్య విద్యారక్షకుండైన విద్యారక్షకుండు సమయ సముచిత వాక్యం
బుల నుపలాలింప నెట్టకేలకు సజ్జనవల్లభుండు మజ్జన భోజనాది కృత్యం
బులు దీర్చి వెండియుఁ దదంగనా కథా పరాధీన దీన మానసంబునం
బ్రొద్దు గడపు నవసరంబున. 12

ఉ. యామవతీ విలాసినికి నైదువత్రాడు, సమస్త నిర్జర
స్తోమము కూడు, లక్ష్మి సయిదోడు, నభోమణి జోడు, పాంధకాం
తామ్రకి హింసకు న్వోడలు దర్పక లుబ్ధకు దివ్వె గూడు, నె
త్తామర సూడు, రాగరసధాముఁడు, సోముఁడు దోఁచెఁ దూర్పునన్. 13

సీ. అంత నక్త్రైడఁ గిన్నరాధిపోద్యానంబు
వెలువడి దూతిక వెంట నరిగి
పాటలగంధులు పాటల పుట భేద
నంబు లోపలఁ దమ నగరు సొచ్చి
సుప్రతీక స్వహాల సూనుపైఁ దగిలిన
హృదయంబు తలిదండ్రు లెఱుఁగ కుండ
సఖులు బంధులుఁ జెప్ప నొక భంగి జలకంబు
లాడి నిరాసక్తి నారగించి

గీ. ప్రాణ సఖులైన కదళికా రత్నవతులు
గొలుప నిస్తంద్ర చంద్రికా గళిత సలిల
శీతలైందవ మణి సౌధ శిఖర సీమ
రచిత విహరణ వేదికాగ్రమున నిలిచి 14

కం. తారు గనుగొన్న రాజ కు
మారుని సౌందర్య రేఖ మరులు గొలుపఁగా
మారశర పీడితాత్మక
లై రాయిడిఁ బడుచు నాలతాంగులు మదిలోన్. 15

కం. ఏటికి నలకావల్లభు
తోఁటకుఁ బోయితిమి మన్మథుని నోమెడుచో
నేటికి వచ్చె మనోరథ
పాటచ్చరుఁడైన ధరణిపతి మా కడకున్. 16

కం. రేరాజు కాంతిఁ గ్రోలు చ
కోరికలన్ మేఘపటలి గుతిల పఱచిన
ట్లారాజుఁ జూడఁగా మము
నైరావతి వచ్చి కటకటా! నొగిలించెన్. 17

సీ. ఏచిన తలపోఁత దాఁచెద మంటి మా!
నిట్టూర్పు గాడ్పులు రట్టు సేయు
కడలేని ప్రేమంబు గప్పెద మంటిమా!
పులకాంకురంబులు పులుగు చెప్పు
బెడిదంపు వెగడుపా టడఁచెద మంటిమా!
వైవర్ణ్య భావంబు వ్రయ్యఁ బుచ్చు
మొనపు చాంచల్యంబు మొఱఁగెద మంటిమా!
ప్రాణేశ గుణనుతి బయలు పఱచుఁ

గీ. గాన, మకరాంక గరళ దిగ్ధ ప్రసూన
శర పరంపర విరహుల సంహరించు
మంచు బోధించు శుక భాష లాలకించు
క్రించు వెడవింటి జోదు జయించరాదు. 18

కం. అని చింతించి వయస్యలఁ
గనుఁగొని యిట్లనిరి తాప గౌరవమునఁ దా
ల్మి నిలుపలేక మనోజర
జని కరపిక మందపవన జనితాగ్రహలై. 19

ఉ. గ్రక్కున ఫాలనేత్రుఁడు పురత్రయ రాత్రిచరేశ్వరాంగముల్
పెక్కు దహింప నొక్కటియులేక వినాశము బొందె, నద్భుతం
బిక్కుసుమాస్త్రు నొక్కని దహించినఁ గ్రమ్మఱఁ బుట్టి తోఁచెఁదా
బెక్కు విధంబులన్ విరహిభీకరుఁడై సఖులార ! కంటిరే ! 20

సీ. మానక గుప్పించు మదన కోదండంబు
నిష్ఠురతను దన్ను నేలఁ గలయ
నెప్పుడు ఝంకించు హృజ్జాత శింజిని
గారవంబునఁ దన్ను గాలిఁ బోవ
నూరక విరఁబడు మార నారాచంబు
దుండగంబునఁ దన్ను ధూళిఁ గలయ
పనిలేని పని మిట్టిపడు మనోజ పతాక
ప్రల్లదంబునఁ దన్ను వెల్లిఁ బోవ

గీ. వీని కొలఁదియె విరహిణీ మానజల ని
ధాన కుంభోద్భవుఁడు, సోదరీ నివాస
నాశన కరుండు, కుముదినీనాథుఁ డభ్ర
వీధి నుండుచున్నాఁడు విసపు విత్తు. 21

కం. సంత్రా సదవ్యథా పర
తంత్రుల విరహుల వధింపఁ దలఁచు మనో భూ
మాంత్రికుని చేతి మారణ
యంత్ర పటము గాక వీఁడు హరిణాంకుండే ! 22

సీ. వీని చంద్రికలు ద్రావిన చకోరికలకు
త్రింగుట భారమే యింగలంబు
వీని జన్మ స్థానమైన వార్థికి లోను
పఱచుట భారమే బాడబాగ్ని
వీని సౌఁదలఁ దాల్చు విషమ లోచనునకు
నాగుట భారమే హాలహలము
వీని త్రొక్కుడు గారవించు ప్రాగ్గిరికి స
హింపఁ జాలుట భారమే దవాగ్ని

గీ. మానవతులార ! చూడుఁ డా మత్త చంచ
రీక మౌర్వీ నినాద గర్జిత కరాళ
భావ సంభవ నీరంధ్ర బాణ వృష్టి
గడలు కొనఁ గానఁబడు చలిపిడుగు వీఁడు. 23

చ. గురుసతిఁ గూడు రట్టునకుఁ గొంకని మోడు, వియోగినీ సము
త్కరముల కీడు, చూచుటకు దర్పకు రేపెడు కుట్టు చేఁడు, తె
మ్మెరలకుఁ దోడు, చిత్రగతి మిన్నులఁ బాఱెడు మాయలాఁడు, పె
న్నిరులను పోడు, కాలుకొని యేర్చు వెలుంగుల వీఁడు వీఁడువో! 24

కం. కాయజుని వాడి కత్తులు
మేయ, నతి క్రూర వృత్తి మించిన కుతుకం
బాయక కూతలు వెట్టెడు
కోయిల నొక పెద్ద లడుగు కొట్టఁగ వలదా ! 25

కం. మనుజాళిఁ బుణ్యజను ప
త్సనాభినమృతంబు జముని ధర్మునిఁగా బే
ర్కొనను విధము, దుష్టమంద ప
వనుని జగత్ప్రాణుఁ డనుచు వాక్రుచ్చుటయున్. 26

గీ. వేగ విరహులపై దాటి వెడలు మనుచు
వాహనముఁ జంద్రునకుఁ బంపివచ్చె వెనుక
గాడ్పు గాకున్న నెట్లు గాఁగలిగెఁ దనకు
మందగమనంబు సారంగ మింమనకును. 27

మ. ఫణి కన్యా ముఖఫేల, చందనగిరి ప్రత్యగ్ర సంభూత భీ
షణ దావానల కీల, పాంథరమణీ సంఘాత చేతో విదా
రణ పంచశుక శస్త్రి, శైత్య విష ధారా ఛస్త్రి, సంతాప కా
రణ మామంద సమీరణంబు, సఖులారా! మమ్ము మన్నించునే. 28

మ. అని సంపూర్ణ విధుండు వెన్నెలలు గాయ, న్మన్మథుం డేయ, హె
చ్చిన తాపంబున వెచ్చి పల్కిన సుకేశి న్మిత్రకేశిం గనుం
గొని, బోటుల్ శిశిరోపచారములు పెక్కుల్సేయ నూహించి మె
త్తని పూఁబాన్పున వారిఁజేరిచి నితాంతవ్యాకుల స్వాంతలై. 29

సీ. నీ వాలుగంటుల నీవాలు నొంచ నీ
కీ వాలు కృపతోడ నేలు మదన
నీ చందములు మాని నీ చందములు చెంద
నీ చందమామ కన్నియల మీఁద
పికమా కృశాంగులోపిక మాలి పొరల గో
పిక మార్గముల నీకుఁ బ్రేలఁదగునె;
మలయానిలంబ! కోమలయాన లీల రా
మల యాతనలఁ బెట్ట వలదు నీకు

గీ. చిలుక! నీ ముక్కు పూఁదూపు చిలుకసంగ
చిలుకకుము! చంద్రముఖులపైఁ బలుకు విసము
భ్రమర! నీ మృదునాద విభ్రమ రయమున
భ్రమరసము పుట్టఁ జేయకు బాలికలకు. 30

వ. అని సపరివారంబుగా శంబర విరోధిఁ బ్రార్థించి, యత్నంబున రత్నవతీ కదళికలు గదిసి కుముద హితమండలంబు కబళించు సమయంబున రాహువు మీఁదం జెదరిపడిన సుధాబిందుసందోహంబు చందంబునఁ దిలకింపఁ గొప్పులం గప్పురంబు శిరంబులు చెరిపి గగనగంగా కనక కమల ముకుళంబులం బొదివిన పెన్నురుపు సురువునం బరిఢవింప నిబ్బరపు గుబ్బచన్నులం జందనపంకం బలంది, మకరకేతన శాత హేతులం జమురు చమురు తెఱంగునం గనుపట్టు హస్త పల్లవంబుల మకరందంబు పూసి, యిసుకతిప్పలం గప్పిన పుప్పొడి చొప్పునఁ బ్రకాశింప జఘనంబునఁ జెంగావి జిలుగు వలిపంబులు గట్టి, మార్దవంబునం దొరయలేక శరణు జొచ్చిన కరణి దీపింపఁ జరణఁ తలంబులఁగిసలియంబులు హత్తి, సౌందర్య సరోవరంబునం బొలయు జక్కవ కవ రేవ దళుకొత్త, నుశీరతాలవృంతంబుల విసరి మఱియు బహుప్రకారంబుల నుపచారంబులు సలుప నిలువరాని తాపం బాటోపంబు చూపిన. 31

చ. అలమిన వారివాహ మనిలాహతి విప్పఁగ నాడకాడకు
న్వెలువడి వచ్చునంబుజవనీరమణప్రభలో యనంగఁ, బై
నలఁదిన చందనంబు నలువై పగులంగ దదంతరంబులం
దళతళ మంచు మించు వనితాతిలకంబుల దేహదీధితుల్. 23

క. పన్నీరు చంద్రకాంతపు
గిన్నెలఁగొని పోయఁగా నిగిరి పొగలెగయుం
గన్నెల తనువుల సుమలత
లన్నెగయు మదాలినీ కులంబుల భంగిన్. 33

క. అంబుజముఖులు చెలువంబగ
పలవింపుచుఁ గౌగిలింప పగిది ముఖములం
జిలిబిలి రసములు చిప్పిల
నలినాక్షుల బాహువుల మృణాళము లుడుకున్. 34

మ. ఘనతాపంబు హరింపనోప మనుచుంగానీ, ప్రియాద్వేషమే
చినఁగానీ, హృదయేశుఁ జన్నుల పయిం జిత్రింపఁగానీ, తమున్
వనజాక్షు ల్నిరసింపఁగాఁ జనుట హైన్యంబంచు మున్మున్న వె
న్నెన రీతిం బడుఁ బ్రేలి మౌక్తికమణుల్ మిట్టించి దూరంబునన్. 35

క. ఈ రీతి శిశిరవిధుల ని
వారింపఁగరాని విరహవహ్నిశిఖలచే
నారాటంబున బొరలం
గా రమణులఁ జూచి కదళికారత్నవతుల్. 36

సీ. వ్యజనానిలంబుచే వదలునే తాపంబు
రమణుని శ్వాసానిలమునఁ గాక
పల్లవంబుల చేతఁ బాయునే తాపంబు
వల్లభుకర పల్లవముల గాక
హిమవారిచే శమియించునే తాపంబు
వరు శరీర స్వేద వారిఁ గాక
పూఁదేనియల చేతఁ బోవునే తాపంబు
ప్రియు నునుఁబలుకుఁదేనియలఁ గాక

గీ. యీ చకోరాక్షులకు, వీరి నింక నేయు
పాయమున విభుఁగూర్తుము పోయి వేగ
తెలియఁజెప్పంగ వలయు హేతిప్రహేతి
దైత్యకులనాథులకు నని తలఁచువేళ. 37

కం. విరహిజనులగు పద్మినులకుఁ
బరితాప మొనర్చు కుముద బాంధవు మీఁదన్
గరమలిగి వచ్చుకైవడి
నరుణప్రభ తోడ నీరజాప్తుఁడు తోఁచెన్. 38

వ. అంత నిజస్వాంతంబునకుఁ గొంత ధైర్యంబు నూలుకొలిపి యే నన్ని విధంబుల వీరి మనోరథంబు సఫలంబు గావించెద నీవు బెగడక సముచిత ప్రకారంబులఁ బ్రొద్దు గడపుమని రత్నవతి సతిప్రయత్నంబునం గన్యకారత్నంబుల కడ నియమించి, కదలి, కదళిక సమీపంబునం దపంబు సలుపు హేతిప్రహేతుల కడకుం జనివారలకుం జాగిలి మ్రొక్కి కృతాంజలియై. 39

సీ. చెలులు గొల్వఁగ సుకేశియు మిత్రకేశియు
ధననాథు తోటకేగిన విధంబు
పుష్పిత చంపక భూమి రుహచ్ఛాయ
నన వింటివేల్పు నోమిన విధంబు
వనవిహారేచ్ఛ వచ్చినవాని నొక్క చ
క్కని రాకుమారు జూచిన విధంబు
మరలి గేహము సొచ్చి విరహసంతాప వే
దనలచే మిగుల నొచ్చిన విధంబు

గీ. విన్నవించిన, విని, దైత్యవిభులు గొంత
తడవు చింతించి కలన సుత్రాము విబుగఁ
దోలి మందరగిరి నున్న దుర్జయ క్ష
మారమణుఁగాఁగ నా రాకుమారు నెఱిఁగి. 40

కం. ఆది విజయంబు గైకొనె
నాదివిజబలంబు భగ్నమై పోవ నతం
డీ దొరకు మత్తనూజల
నీ దొరకుట భాగ్యమనుచుఁ గృతనిశ్చయులై. 41

చ. కదళికి! యిచ్చోటం దడవుగా నిలువం బని లేదు పొమ్ము వే
కదలి కలాపకుంతలల కంతుశరవ్యథ మానమెల్ల గ్ర
క్కదలి కలంగకుండఁ దమ కాంతునిఁ దెచ్చెద మన్న, మాఱులే
కదలకఁ బెట్టుమన్ శుకపికాదులనింక నటంచు వేడుకన్. 42

క. హేతిప్రహేతులకు నా
నాతి నమస్కృతులు చేసి నాకమునకుఁ దా
నేతెంచి తెలియఁ జెప్పెఁ ల
తాతన్వుల తోడఁ గూర్మితండ్రుల పలుకుల్. 43

క. చెప్పిన నప్పలుకుల విని
తెప్పిరి సమ్మోదవారిధిం జంద్రముఖుల్
తెప్పలఁ దేలిరి, నెచ్చెలు
లప్పుడు పల్లవిత హృదయులై తమలోనన్. 44

గీ. ఇన్ని విధముల నీరాచకన్యలకుఁ
గీడు చేసిన మన్మథుకేతు వప్ర
యోజనం బయ్యె, నెక్కుడు తేజి వ్యర్థ
మయ్యెఁ, జాపంబు నిష్ఫలంబయ్యె ననుచు. 45

శా. అంగంబుల్ హిమవారిచేఁ గడిగి రమ్యంబైన కూటంబులో
బంగారంపు జెఱంగు దుప్పటములం బాటీరజంబాల చ
ర్చం గల్పప్రసవంబులన్ మణి విభూషారాజి నందంబుగా
శృంగారించిరి సంభ్రమంబున సుకేశిన్ మిత్రకేశిన్ సఖుల్. 46

వ. అంతనక్కడ హేతిప్రహేతులు తపోవనంబు వెడలి నిజ తనూజా మనో
రథ ప్రాపణ పరాయణులై చనువారు ముందట మీరలిద్దఱు పోవు భూ
వల్లభుండు వచ్చి యిచ్చట నున్నవాఁడని యెఱింగించిన భంగి నెలుం
గించు కోకిలకులంబుల చేత నభిరామంబైన కుబేరారామంబు దరిసి తద
భ్యంతరంబునం బూచిన సంపంగి నీడ నిన్నుందన కనుంగొన్న కన్ని
యలు నేఁడు క్రమ్మఱ వత్తురను చిత్తంబున విద్యారక్షక ప్రముఖ సమే
తంబుగా నేతెంచి నిలిచిన దుర్జయ నృపాల హర్యక్షుని నిరీక్షించి. 47

సీ. ఆత్మజృంభణ సమయంబయ్యె నని మూర్తి
మంతుఁడై యున్న వసంతుఁ డొక్కొ
దివ్యౌషధార్థ మేతెంచిన నాక వై
ద్యుల కవ లోపల నొక్కఁ డొక్కొ
తమ వనంబున వినోదంబులఁ దగిలి క్రు
మ్మరు రాజరాజు కుమారుఁ డొక్కొ
మా ముద్దుగూఁతులు నోమిన నోన సా
క్షాత్కరించిన పుష్పచాపుఁ డొక్కొ

గీ. కాక, మందర కుధ రోప కంఠవాహి
నీనివేశంబు వెలువడి నిన్న బలెనె
హిత పరివారములతోడ నిచటఁ గేలి
సలుపు దుర్జయ నరపాల చంద్రుఁ డొక్కొ. 48

కం. అని తమ చిత్తంబుల భా
వన సేయుచు నికటమునకు వచ్చినవారిన్
మునివేషధారులం గనుఁ
గొని దుర్జయ ధరణిపాలకుఁడు మ్రొక్కుటయున్. 49

గీ. అతని దీవించి చంపక క్షితిరుహంబు
నీడ నాసీనులై ధరణీతలేంద్ర!
యే మహాత్ముని తనయుండ వెద్ది నీకు
నామ మిచటికి రాఁబని యేమి కలిగె. 50

చ. అనవుడు నవ్వి, యేను వసుధాధిపశేఖరుఁడైన సుప్రతీ
కుని తనయుండ దుర్జయుఁడ ఘోరపరాక్రమ సంపద న్మదిం
చిన నృపసార్వభౌముల శచీ పతిముఖ్య దిగీశవర్గమున్
మునుకొని గెల్చి పోవుచు వినోదము సల్పఁగ నిందువచ్చితిన్. 51

సీ. ఇదె నా తెఱంగు, మీరెవ్వరు మునులార!
విశదింపుఁ డనిన నిట్లనిరి దుర్జ
యక్షితినాథ! స్వాయంభువ మనువు సూ
నులము హేతిప్రహేతులము మేము
లోకభీకరులమై నాకంబునకు దాడి
వెడలి యింద్రాదుల విఱుగఁదోల
నా సుపర్వులు కలశాబ్ధికిఁ బోయి ల
క్ష్మీనాథునకు నమస్కృతులు చేసి

గీ. దేవ! హేతిప్రహేతి దైతేయవరుల
చేత నొచ్చిన మమ్ము రక్షింపు కరుణ
నాజి మును కాలనేమి సహస్రభుజుల
సంహరించినగతి వారి సంహరించి. 52

కం. అని విన్నవింపు సురలం
గనుఁగొని మధుకైటభారి కలన దనుజులం
దునుమఁగ నిదె వచ్చెదఁ బొం
డనుడు నమస్కృతులు చేసి హరిహయముఖ్యుల్. 53

కం. సంతోషంబున మేరు
ప్రాంతంబున కరిగి హరిఁ గృపావంతు రమా
కాంతు నిజస్వాంతంబులఁ
జింతింపఁగ నంత మద్విజితత్వర బుద్ధిన్. 54

మ. హరివచ్చె న్విబుధావనద్విగుణరంహస్ఫీతచేతోనురూ
పరయావ్యాప్తికి నాల్గుఱెక్కలు ధరింపం బోలుచాఁ గాంచనాం
బర కోణంబులు రెండువంకల నటింప న్నించు నాగారి నె
క్కి రణత్కంబుల రథాంగ నందక గదాఖేలన్భుజ స్తంభుఁడై. 55

గీ. ఇట్లు చనుదెంచి మీా సైన్యమెల్లఁ గూల్చెఁ
బెక్కురూపంబులై విష్ణుఁ డొక్కరుండ
వట్ట్రిమాకుల నొకదవ జ్వాల దగిలి
వివిధముఖముల నీఱు గావించునట్లు. 56

కం. అప్పుడు దైవికమునఁ జే
తప్పితి మిరువురము దేవతలు తలఁపులలో
నుప్పొంగు సముద్రాంబుధిఁ
దెప్పలఁ దేలంగ హరి యదృశ్యం బయ్యెన్. 57

చ. అది మొదలబ్జనాభుని మహామహిమాఢ్యుని వేదవేద్యునిన్
బదిలముగా భజించిన నపాయము లేదని నిశ్చయించి త
త్పద సరసీరుహ ద్వితీయ భక్తివిలాసము నెమ్మనంబులం
బొదలఁగ నున్నవారము తపోనియమంబున నెన్నఁగంబునన్ 58

కం. కిన్నరపతి కేశివనీ
కి, న్నరవర! నిన్న వచ్చి కీర్తింపుచు జో
కన్నియతి మరునిఁ గొలిచిన
కన్నియ లిరువురును మాకు గాదిలితనయుల్. 5౯

సీ. ఆ కన్నియలకు నాయకుఁడవుగా నీవు
తగుదువు మాకు నత్యంతమిత్రుఁ
డగు సుప్రతీక మహారాజసుతుఁడవు
గాన శక్రాది దిక్పాల వరులఁ
గలన గెల్చిన పరాక్రమ వంతుఁడవు గాన
జనులకు భోగ మోక్షంబు లొసఁగ
నోపిన వారాణసీపురంబునకు భ
ర్తవుగాన రోహిణీ ధన జయంత

గీ. కంతు నలకూబరాదుల కంటె మిగులఁ
జక్కని కుమారుఁడవు గాన జలనిధాన
వలయితాఖిల వసుమతీ వర్ణితాభి
రామ కీర్తివిగాన దుర్జయ నరేంద్ర ! 60

వ. ఇప్పుడు మదీయ పుత్త్ర మిత్త్ర కళత్త్రాదు లిచ్చటికి ననతి దూరంబునఁ బాటలంబనుపురంబున నున్నవా రచ్చటికి వచ్చి పరిణయంబు గావలయు నన నన్నర నాయకుండు నిరాయాసంబునం దన మనోరథంబు సఫలం బగుటకుఁ బరమ సంతోష భరిత హృదయుండై వారల వచనంబులు సబహుమానంబుగా నంగీకరించి ముందటఁ బురంబునకుం జనుఁడు మీ పిఱుందన యేనుంగదలి వత్తునని వీడ్కొలిపి గంధ పరంపరా సంపన్నం బులైన పున్నాగంబుల తోడ సదాగతి వలమానంబులైన పత్త్రంబులతోడ ధూసరితాంబరంబులైన పరాగంబుల తోడ వశీకృత రాజహంసులయిన సరసులతోడ నిరంతర చంచలాచంచలంబులైన కదళికా నికాయంబుల తోడ సుమనోరథ విజయకరంబులైన శిలీముఖంబుల తోడ మంద మంద సంచారంబులైన చామరంబులతోడ సకల స్థల సముద్దండంబులైన పుండ రీకంబుల తోడ వివాహ మహోత్సవంబు వీక్షింప యక్షేశ్వరోద్యానంబు వెనువెంట నేతెంచు విధంబున వివిధ సైన్యంబులు గొలువ భద్రేభంబు నెక్కి పెక్కు తెఱంగుల మంగళాలంకారంబుల నొప్పు నప్పాటలనగ రంబునకుం బోయి శుభముహూర్తంబున. 61

క. హేతి కుమారి సుకేశిఁ బ్ర
హేతి సుత న్మిత్త్రకేశి నిర్వర సకలో
ర్వీతలపతి కళ్యాణం
బై తత్కన్యకలఁ గొంచు నాహ్లాదమునన్. 62

క. బలభేది విఘాలా ! యని
జలజభవాండంబు పగుల జయకాహళముల్

నలుగడల మొఱయ సేనా
కలకలములు బెరయ నరిగెఁ గాశీపురికిన్. 63

గీ. అరిగి సోదరు సుద్యుమ్ను నఖిల రాజ్య
భారకునిఁజేసి విద్యుత్ప్రభా తనూభ
వుండు నిశ్చింతుఁడై పుష్పకాంచ కేళిఁ
దగిలి హేతి ప్రహేతినందనలతోడ. 64

సీ. ఒక వేళ విహరించు నుత్పలాంబుజ రేణు
సంఛన్నకాసార సైకతముల
నొక వేళ విహరించు నుత్పుల్ల మంజరీ
మంజుల మాధవీ మంటపముల
నొక వేళ విహరించు నుత్తుంగ శశికాంత
హర్మ్య శిరోగృహాభ్యంతరముల
నొక వేళ విహరించు నుజ్జ్వల మాణిక్య
ఖచిత కేళీ శైల కందరముల

గీ. జలకణంబులుఁ జెమటలుఁ జెలిమి చేయ
నళిరవంబులుఁ బలుకులు ననగి పెనఁగ
వెన్నెలలుఁ జిన్ని నగవులు వియ్యమందఁ
జల్లగాడ్పులు నూర్పులు సరసమాడ. 65

కం. ఈ సరణి ధరణి పతియు వి
లాసవతీమణులు బహుకళా నిపుణతలన్
వేసటలేక లతాంత శ
రాసన సుఖవార్ధిఁ దోలలాడుచు నుండన్. 66

కం. కలహించుటయే రాత్రియుఁ
గలయుటయే పగలు నయ్యెగాని, తలంపన్

గలశైన లేవు మఱి వా
రల హృదయాంభోజములకు రాత్రింబగలున్. 67

ఆ. అంత రాజహంసయాన సుకేశికిఁ
బుట్టె సుతుఁడు సుప్రభుం డనంగఁ
గీరవాణి మిశ్రకేశికిఁ బుట్టెఁ ద
నూభవుఁడు సుదర్శనుం డనంగ. 68

శా. ఆ పుత్రుల్ దన మానసంబునకు నాహ్లాదంబు గావింప ధా
త్రీపాలాగ్రణి దుర్జయుండు సకల ద్వీపంబులున్ శిక్షర
క్షా పాండిత్యముతోడ నేలుచు దిశల్లంఘింప నా ఖేటక
వ్యాపార స్పృహ నొక్క నాఁడు చతురంగానీకినీయుక్తుఁడై. 69

వ. వేఁటల కుద్యోగించు నవసరంబున మందురాగారంబున నుండి ఘనాఘన స్తనిత గంభీర హేషా ఘోషంబునఁ గరాళింప నుపలాలన వాక్యంబుల మస్తరింపుచు నుభయ పార్శ్వంబుల వాగెలు పట్టి సాహిణులు వెంటరా నిరాయాస భక్ష్యమాణ విపక్ష ప్రతాపంబు రూపంబున ముఖలీన ఫేన ఖలీనంబు మెఱయ నెఱయ నా తోడ రయంబునం దొరయ సమర్థంబు గాదని పవమానంబు నవమానంబు చేయుచు నుమియు నుమ్మిభంగి ఫెన భంగంబు దొరుగ నిరుగడల వైచిన ధవళ చామరంబులం దనకు నీడు గాదు మీఁద తొలంగుండని సాభినయంబుగా నిరసించు లీల వాలంబు సఖింప నిలింప తురంగమంబు నిజ కులోత్తమంబు గావునఁ దత్తురంగంబు నంబుధి మథన సమయంబునఁ గుంటుపఱచిన కంటకుండని బలింగిట్టి మట్టి రసాతలంబు భేదించు విధంబున మహీ భాగంబు త్రవ్వ నగ్రిమ చరణంబు లెత్తరింప భరింపరాని ఖురాఘాతంబుల మదీయ ఫణంబులు నొప్పింపకు మని పదంబునం బెనంగి భుజంగపుంగవుండు దీనవచనంబునఁ బ్రార్థించు తెఱంగున నంగదంబు మ్రోయఁ బాయక వినోదించు వీరలక్ష్మికి మందిరంబగు నరవిందంబు చందంబునఁ దలాటంబు లలాటోపరిప్రదేశంబునఁ బ్రకాశింప జనంబులు కనుంగొని తీవ్రధారావిహారంబున

లోహ సంఘటనంబున మనోహరచ్ఛాయా విశేషంబున మేఖలాభిరమ్యంబున సౌమ్యంబగు గాక యేమి పరులచేతఁ బట్టు పడుటయు నిరంతరంబు నొరపై మెఱయ కుండుటయు గొలిమిడి చెంతలం దిరుగుటయు విక్రమంబు జూపెడు నెడ వఁకుటయుఁగల ఖడ్గంబు ఘోరాజులకు నిట్టిహయ రత్నంబు కరణి విజయకారణంబు కాదని బహుముఖంబులం బ్రశంసింప సమ్ముఖంబునకు వచ్చి నిలిచినఁ గుంద శరదిందు పురందర మదావళ ధవళ వర్ణంబును సూక్ష్మ కర్ణంబును నిర్వక్ర పరాక్రమ కేసరి కిశోర మూర్తంబును శుభా వర్తంబును విజితవైన తేయ సత్త్వ మహత్త్వంబును దేవత్వంబును బౌరుషాతి మాన కాయంబును సముజ్జ్వలచ్ఛాయంబును సౌగంధిక సగంధ గంధంబును దృఢసంధి బంధంబును మత్తమయూర సమాన యానంబును సంభృతాభి మానంబును, దుందుభి గంభీర స్వరంబును నిష్ఠుర ఖురంబును వనాయుజోత్పన్నంబును సర్వలక్షణ సంపన్నంబును నైన జవనాశ్వంబు నెక్కి దిక్కులు పిక్కటిల్లు చుండ సురవిమత హృద్దమిత పుటభిద్ధమరు సహచర ఢయఢ ఢక్కానక హుడకా పటహ ధ్వానంబులు చెలంగ సుభట పద ఘట్టనంబుల శేష ఫణంబులు నలంగ వారణాసీ నగరంబు నిర్గమించి మహాగహనంబునకు నడచె నప్పుడు. 70

క. వెలువడియె వీటి నలు ది
క్కులఁ గుక్కలు గ్రోఁగులురులు కొమ్ములు బద్దం
గులు పందిపోటు లమ్ములు
పలలు తెరలు దీమములు సివంగుల బోనుల్. 71

సీ. కదలిరి కొండఱు ఘనతర స్కంధ భా
రంబులఁ దగు తమాలంబులనఁగ
నడచిరి కొందఱు నర్తిత భయదహే
తులతో హాలాహలా నలములనఁగ
జరగిరి కొందఱు సంభృత కఠిన శృం
గములతో నంజనాంగంబులనఁగ

వెడలిరి కొందఱు వికరాళ శరపరం
పరలతో విలయాంబుధరములనఁగ

గీ. చల్లడంబులు నొడదోళ్లఁ జలిదికూళ్ల
చిక్కములు మద్మబిళ్లల చెప్పు జోళ్ల
సెలసు విండ్లును మొదలుగాగలవి దాల్చి
నల్లచాయల మేనుల భిల్లవరులు. 72

చ. చలమరి సూఢుబంటు గరసాన మిటారి కటారికాడు బె
బ్బులి సురగాలి చోర బలుబూతము కాలరి కారుచిచ్చు కు
క్కలగరిగట్టు వా పెటుల గండను పేరుల కుక్క లందఱుం
బుల నరుదెంచె సింగముల పోలిక భూతల భర్త వెంబడిన్. 73

క. ఈ పగిది నృపతి మృగయా
వ్యాపారంబునకు వలయు వారిం గొని సే
నాపరి వృతుఁడై విపిన స
మీపమునకుఁ బోవ మ్రొక్కి మృగయవరేణ్యుల్. 74

సీ. ఎలయించి వేల్పుతేఁ దెక్కనేనుఁగునైన
నోవంబులోపలఁ ద్రోవఁగలము
పొంచి వెన్నుం దెక్కి పులుఁగురాయని నైన
నిడుపు జిఁదురు గడఁ బొడువఁ గలము
ఎలవెట్టి జముఁ దెక్కు నెనుబోతునైనను
విడిచి వాటునఁ బడ ద్రేయఁగలము
తెమలించి గాలి యెక్కు మెకంబునైనను
బలుగాలువల దీర్చి పట్టఁగలము

గీ. కాళి యెక్కు కరాళి సింగంబునైన
మరపుకోఁగల మొకయింత మందు వెట్టి

మాటలిక వేయునేటికి మమ్ముఁ జూడు
మనుచుఁ బంతంబులాడి కారడవిఁ జొచ్చి. 75

కం. అటవీ స్థలమున భైరవు
కటి నుండెడు రుండమాలికల చందముగా
నట దవిరళ నానావిధ
పట ఖండం బైన పోఁగు వాఱిరి కలయన్. 76

కం. వరుణుఁడు దుర్జయ ధరణీ
వరు నాజ్ఞను వెఱచి మృగనివారణమునకున్
బురి కొలిపి శరధులెత్తిన
తెరలనఁ దెరలెత్తి రఖిల దిగ్భాగములన్. 77

క. వ్రీలని వలలొడ్డిరి హే
రాళముగా లోకపాలరమణులు మృగయా
లీలఁ గనుఁగొనఁగఁ జేసిన
జాలక జాలములు గల దిశాధిపులనన్. 78

క. ధారుణి నోదము లహిపా
గారంబులు మోవఁ ద్రవ్వి కప్పిరి బహుమా
యారచనా పరతంత్ర
క్రూర జనుల కపట హృదయగోళము లనఁగన్. 79

వ. మఱియు వలయు తావుల వేఁటకుఁ దగిన పరికరంబులు నిలిపి ఘోర
భేరీ భాంకారంబులు నిస్సాణ ధణ ధణంకారంబులు ఝల్లరీ ఝుంకారం
బులు కాహళ క్రేంకారంబులు ధనుర్జ్యాటంకారంబులు కంఠ హుంకారం
బులు నొండొంట మెండుకొని బ్రహ్మాండ భాండంబులు వగుల్ప నసల్ప
సంరంభంబునఁ జోపు వెట్టిన బెట్టులికి తలఁకి తెంకిపట్లు విడిచి కదుపులు
కదుపులై పఱచి పుణ్యావసానంబున నరక కూపంబునం గూలు పాపపంక
మలినాత్మల చందంబున నోదంబులం గూలు కోలంబులుం బరమ జ్ఞాన

వైకల్యంబున మోహబంధంబునఁ దగులు పురుషుల తెఱంగున వలలం దగులు శార్దూలంబులు మదనాతురత్వంబునఁ బరస్త్రీల కటాక్షంబులఁ జిక్కువడు జారుల విధంబున నురులం జిక్కువడు కృష్ణసారంబులు మాత్సర్యంబున బెట్టిదంపు జగజెట్టి పటుభుజార్గళంబున వ్రేసినం ద్రెళ్లు మల్లుల కైవడిఁ జేటకొమ్ముకొట్టినఁ బట్టుకొని త్రెళ్లు దుప్పులును నిష్ఠురత్వంబున మర్మోద్ఘాటనంబులైన మాటలు హృదయంబు నాటి నొచ్చువారి లాగున మారమ్ములుగాడి నొచ్చు మున్నుబోతులును, నైవన్యసత్వంబులు పెక్కుదిక్కులం బెక్కుసాధనంబులకు లోనైన సర్వేటకాండ్రు వేగరాఁ గోలలనూది యిట్టట్టు గదలనీక ప్రాణంబులతోడన పట్టి కట్టియు వలలకుం జొరక కెలంకుల కుఱికినం గఱకు టమ్ముల నెఱకలు దూలనేసియు రేఁగి ప్రోఁగు వెలికిఁ గుప్పించి దాటు నెడఁ దప్పకుండ ఖండి వాలంబులఁ బదంబులు ఖండించియు మరలి గద్దరితనంబున గద్దించిన నుద్దవడిం గదిసి పందిపోట్లం బొడిచియు దిగులు గుడిచి నలువంకలకు జడియ నడిచంబుల డిగ్గఁబడి నఱికియు నెప్పట్టునం బట్టువడక పరువెత్తినఁ దత్తరంబున వెంటాడించి విడిచి వాట్ల వ్రేసియు ముట్టిపాటునం గలను వెట్టినఁ బట్టెడలు విడిచి గట్టువాసార మేయంబుల నుసికొలిపియుఁ బొదలు విచ్చి పొదలు సొచ్చు లాసినం గాసిలి చుట్టుముట్టి చొరకొట్టి సబళంబులం గ్రుమ్మియు బహుభేదంబులైన మృగయావినోదంబులు చూపినఁ బ్రమోదించి మేదినీనాయకుండు మృగవధకుతూహలాయత్త చిత్తంబున వేఁటలాడు సమయంబున. 80

గీ. ధరణిపాలుని కరవాలధార ద్రెవ్వి
నెత్తురులఁ దోఁగి మత్తకంఠీరవంబు
పడియె నతని భుజప్రతాపంబు చేత
నావృతంబైన రిపురాజి నుళము వోలె. 81

కం. లాఘవమున విభుఁడేయు న
మోఘాస్త్రము వడఁకె మణిసముజ్జ్వలపుంఖం

బై ఘోరభల్లుకముపై
మేఘములోఁ జంచలించు మెఱుపును బోలెన్. 82

గీ. జనవిభుఁడు నాట సవ్యాపసవ్య గతులఁ
దిరుగుచో గర్లతూపులు బరులు రెంటఁ
గట్టి కనుపట్టె తెక్కలు గల మహా మ
హీధరంబు విధంబున నేకలంబు. 83

క. భూలోక భర్త గదగొని
పౌలస్థలి వ్రేయఁ జేసె ఖాంకరణం బా
భీలముగా దర్పిత శా
ర్దూలము కోణాగ్రనిహత దుందుభి వోలెన్. 84

గీ. ఇట్లు తన బాహు విక్రమ మెల్లవారు
చూడ విద్యుత్ప్రభాతనూజుఁడు బహుప్ర
కారముల వేఁటలాడుచు వీరులైన
మానధనులకు రాజకుమారులకును. 85

చ. సెలవులు వెట్టఁ గ్రోల్పులికిఁ జేయిడి ముప్పిడి గుప్ప శౌర్యవం
తులఁగని కర్ణముల్ బిగియ నొక్కి వరాహము నెక్కి వీర్యవం
తులఁగని లేటి వెంటఁబడి దుత్తెడు మేరన పట్టు వేగవం
తులఁగని మెచ్చిలీ నేగవుతోడ నభీష్టము లెల్ల నిచ్చుచున్. 86

కం. కొంతవడి నిలిచి వారల
పంతంబులు వినుచుఁ జల్లపడు వేళకు న
క్కాంతారమునంగల మృగ
సంతతి వధియించి వేఁట చాలించుటయున్. 87

సీ. కలిగెఁ బోనెమ్మది వలసిన వంకలఁ
దిరిగి మేయఁగ హోమధేనువులకు

కలిగెఁ బోకఁగంటి గాని యెన్నుల తోడ
నారంగఁ బండ నీ వారములకు
కలిగెఁ బోపొదలుచుఁ గలయఁదీ గెలువాజి
ముదురనూరఁగ గందమూలములకు
కలిగెఁ బోకలఁగక కమల సౌగంధిక
సంపద చూపఁగా సారములకు

గీ. నసుచుఁ బలికిరి జనులప్పు డవ్విభుండు
పక్క్ణంబుల శబరాధి వతులచే ను
పాయనంబులు గొనుచు నపార పల్ల
వ ప్రసూన ఫలద్రుమావళులు గనుచు. 88

క. సందళిక కుసుమ సౌరభ
తుందిల మందానిలము లెదుర్కొనఁ దురగ
స్యందన కరిభట సేనా
సందోహముఁ దాను దిరిగి చను సమయమునన్. 89

సీ. కదలు పాదపములు కల్లోలములు గాఁగ
విరుల మంజరులు పెన్నురువు గాఁగ
హోమ ధూమంబులు జీమూతములు గాఁగ
ధవళాక్షతములు ముత్యములు గాఁగ
దేవ పూజావితర్దికలు దీవులు గాఁగఁ
గ్రతుహవ్య వాహ మౌర్వంబు గాఁగ
బర్ణశాలలు గూఢ పర్వతంబులు గాఁగఁ
జదువులు సహజ ఘోషములు గాఁగ

గీ. తూలఁ బట్టిన నీర్కావిధోవతులు ప్ర
వాళలతికలుగాఁగఁ గైవల్య లక్ష్మి

పుట్టినిల్లై సుధాంభోధి వోలె నిత్య
మహిమముల మించు పుణ్యాశ్రమంబుఁ గనియె. 90

క. అందు నను దినము సంయమి
నందను లేతెంచి వేఁడినం దరువుల మీఁ
దం దిరుగుచు నుండి సమి
త్సందోహము లంది యిచ్చు శాఖామృగముల్. 91

కం. శీతల మహీ రుహచ్ఛా
యాతల కల్పిత వితర్దికా సీనవటు
వ్రాతము గుణియింపఁగ శుక
పోతంబులు పనసకవలు పోయినఁ జెప్పున్. 92

క. చెంగట నుద్గాతలఁ గూ
డంగించి స్తోత్రమును దడంబడక సము
త్తుంగ స్వరములఁ బికములు
సాంగముగాఁ జేయు దేవతాహ్వానంబుల్. 93

క. చూపులఁగని తల్లుల సవి
చాపలమునఁ జేరి హరిణ శాఖము లబ్జుల్
చాపఁగ దూర్వాంకురములు
మేపుదురు శరీరములు నిమిరి మునివనితల్. 94

గీ. అడుగులకు మడ్గు లొత్తెడు నవని యనఁగఁ
బదనఖజ్యోత్స్నముందటఁ బర్వ మౌని
మందయానలు పోయుదుర్ బిందియల జ
లంబు గొనివచ్చి బృందావనంబులకును. 95

గీ. వాహినులఁ గ్రుంకి తపసులు వచ్చు వేళఁ
బడిచి దోవతులారఁ విప్పినఁ దమంత

మింట నేతెంచు ముక్తికామిని వరింపఁ
బోవుచోఁ బట్టు సుల్లభంబుల విధమున. 96

గీ. కానను బులికిఁ బుట్టిన కూన పూరి
మేయు నోట ! ను సామెత మిథ్యగాఁగఁ
బులులు సైతము లెలమాని పూరిమేయు
నున్న దుష్టమృగంబుల నెన్న నేల ? 97

సీ. దళములాహార పాత్రంబులు రచియింపఁ
బదను దప్పెడునని ముదుర వెఱచు
తావిపోయెడునని దేవతా పూజావ
సరము దాఁకవిరులు విరియ వెఱచు
నతిధిభిక్షకు నల్పమౌనని పిందెలా
రఁగఁబండ కొకటియు రాలవెఱచు
తపము నల్పెడు వారు తపసిదీధితులుగం
దెదరని నీడలు దిరుగ వెఱచు

గీ. నాఱవైచిన ద్రేలుచు నహరహంబు
నుపరి భాగాంతరంబుల నున్న నార
చీర లేపాటి బెడఁకిసఁ జిరుగుననుచు
విటపము కదల వెఱచు నుర్వీరుహముల 98

మ. ఫలముల్ గోరక హోమముల్ సలుపుచుం బ్రత్యక్షవైశ్వానరుల్
వలె గాన్పింతురు తాపసుల్ నిరుపమ స్వాహా స్వధాకార ర
క్తులు నానానియమా ధ్వరాజ్య మహిమోత్తుంగుల్, జగత్త్రాణ మి
త్రులు తేజోభరితుల్ సదాశివతునుల్ తుష్టామరాధీశ్వరుల్ 99

వ. ఇట్లు సకలజన వర్ణనీయాను భావ భవనంబైన పుణ్యవనంబు చొచ్చి యిచ్చ నచ్చెరువంది వందిబృందస్తుత పురందరాది నిర్జరదుర్జయుండు దుర్జయుండు పురోభాగంబున దివాకర కర దురవగాహ శీతలచ్ఛాయా

మహీరుహంబు క్రింద హృదయాలవాలంబున మొలచి కలయంబర్విన కారుణ్యలతా వితానంబుల తెరంగున గెంజడలు రంజిల్ల నిబిడంబుగా నావరించిన సాత్త్విక గుణంబురీతి శరీరంబున భసితంబు గనుపట్ట, నిరంతర పురశ్చరణ చాతుర్యంబున మెప్పించి పుచ్చుకొన్న మంత్రసిద్ధ వధూ కంఠహారంబు లేవ నక్షమాలిక హస్తాంబుజంబున మెఱయఁ, దపోధనాధిక్యంబునం గోటికింబడగ యెత్తిన విధంబున బద్ధకౌపీనంబగు దండంబు సకాశంబునం బ్రకాశింపఁ బరబ్రహ్మమయుండైన తన్ను సేవింప సకల పుణ్యతీర్థంబులు సంగ్రహించి సూక్ష్మరూపంబు వహించి వచ్చిన కమలభవాండంబు చందంబునం గమండలువు దండనుండ శిష్య గణంబునకుఁ బరతత్త్వబోధంబు చేయువాని మహాముని ప్రముఖు గౌర ముఖంగని సాష్టాంగ దండప్రణామంబు లాచరించి నిలిచిన నమ్మ నీశ్వ రుండు యథోచిత ప్రకారంబున నర్ఘ్యపాద్యంబులిచ్చి కుశలం బడిగి భూపాల ! మాపాల నేఁడు నీవు సైన్య సమేతుఁడవై వసియించి మజ్జన భోజనంబుల వలన మృగయా పరిశ్రమంబు దీర్చుకొని చనుమని పలికినం గోపించి సుప్రతీక నందనుండు డెందంబున 100

క. తానెటువలెఁ బెట్టెడునో
నానావిధభోజనములు నాకు ననంఖ్యం
బైన మహాసేనకు ని
క్కాననమున మౌని కన్నుఁగానఁడు సుమ్మీ 101

గీ. సైన్యములు దస్సె నపరాహ్ణ సమయమయ్యె
నిందు నొక పూట నిలిచిన నేమిదట్టెఁ
జూత మీతాపసుని వట్టి యేతులచుం
నృపతి విందారగింపంగ నియ్యకొనినం 102

చ. బలము లపారముల్ ధరణి భర్తయుఁ బర్యటనంబు వంకనాఁ
కలిఁగొనినాఁడు, వేగిరమె కావలె భోజనమెట్లు గూడు ! నీ
కళవళమింకనేల హరికామిత సంపదలిచ్చు భక్తవ
త్సలుఁడు గలండు నాకునని సంయమి రాజు తదర్చనార్థమై. 103

ఉ. గంగకు మందగంధవహ కల్పిత నర్తన తార తార తా
రాంగను గర్భపూర్ణ మకరంద హిరణ్మయ సార సార సా
రంగకు బాలసైకత నిరంతర ఖేలన చక్ర చక్ర చ
గ్రాంకుఁ బోయి శ్రీహరి దయానిధిఁ గీర్తన చేసే నచ్చటన్ 104

కం. అని చెప్పిన విని యే విధ
మున గీర్తన చేసె గౌర ముఖమౌని జనా
ర్దను నానతి యిమ్మన ని
ట్లని పలికె వరాహదేవుఁడవనీ సతికిన్ 105

మ. జలరూపాయ, చరాచరాత్మక జగత్సంస్థాయ లక్ష్మీ మహీ
లలనేశాయ, కరాళకాళియ ఫణాలాస్యాయ, దేవోత్తమా
య లయోత్పత్తి విసర్జితాయ, సుజనాయత్తాంతరంగాయ, కే
వల కారుణ్యకటాక్ష వీక్షణ పరీవాహాయ, తుభ్యంనమః 106

వ. వెండియు నోంకారంబునీవ భూర్భువ స్స్వరాది లోకంబులు నీవ విశ్వ
ప్రపంచంబునీవ నీవలన ఋగ్యజుస్సా మాధర్వణంబులు స్మృతులు
శాస్త్రంబులు వృక్షంబు లోషధి పశుపక్షి మృగకీటక ప్రముఖంబులు
జన్మించె నిట్టి నీ మహత్త్వంబు దెలియ నశక్యంబు దేవా ! యిప్పుడు మదీ
యాశ్రమంబునకు దుర్జయుండను నృపాలుం డపార చతురంగంబుల తోడ
నభ్యాగతుండై చనుదెంచె నారాజునకు నాతిథ్యంబు సేయు సామర్థ్యంబు
లేదు తృణగుల్మ ప్రముఖంబులైన వానిలోన నెట్టివి ముట్టినది చతుర్విధా
న్నంబులుగా మానసమున నేనెద్ది గావలెనని తలచిన నదియు నయ్యెడు
నట్లుగా ననుగ్రహింపుమని సంస్తుతి పూర్వకంబుగాఁ దన మనోరథం
బెఱింగించిన. 107

క. శతకోటి దహన విధురవి
శతకోటి ప్రభల గెలువఁ జాలిన పరమ
ద్యుతి పరిఢవింప లక్ష్మీ
పతి కరుణారస పయోధి ప్రత్యక్షంబై. 108

మ. అనవద్యవ్రతశీల ! నీకు నిది యిష్టావాప్తిఁ గావించుఁ బ్రా
ర్థన మాత్రంబునఁ నింద మంచు నొక రత్నం బిచ్చి నీరేజలో
చనుఁ డంతర్హితుఁడయ్యె గౌరముఖుఁడున్ సంతోషనిర్మగ్నుఁడై
చనుదెంచెం దన పర్ణశాలకు హవిస్సౌరభ్యధారాళకున్. 109

గీ. ఇట్లు చనుదెంచి మణికి ననేక విధము
లైన పూజలు గావించి ప్రార్థనంబు
మున్నుగా హస్తములు మోడ్చి మునికులావ
తంస మంతర్గతంబునఁ దలఁచుటయును. 110

సీ. గోమేధికంబుల కుట్టిమంబులతోఁ గి
రీటి పచ్చల వితర్దికలతోడ
పద్మరాగముల కంబములతో పుష్యరా
గముల సోపానమార్గములతోడ
నీడాడు నీలాల గోడలతో మౌక్తి
కంబుల తోరణగండ్లతోడ
వజ్రాంకురంబుల వలభులతోఁ బ్రవా
ళంబుల కప్పు పలకలతోడ

గీ. సితకరోపల సాలభంజికలతో వి
దూరమణి కేతువులతోడ నీరజాప్త
బింబ చుంబి సువర్ణకుంభంబులైన
నిలువుమేడలు గలిగి సంఖ్యలకు మిగిలి. 111

మ. హరివాణంబులు గిన్నియల్ పడిగముల్ హస్తావళుల్ పీఠముల్
గరిటెల్ గిండ్లును దట్ట లొడ్డికలు గంగాళాలు పింగాండ్లు ఘ
ర్ఘరికల్ బిందెలు కొప్పెరల్ మొదలుగా గాంగేయ మాణిక్య భా
స్వరముల్ కోటులు గ్రక్కునం బొడమెఁ దత్సౌధాంతరాళంబునన్. 112

క. నేలల సుత్తడువులతోఁ
గీలిత శృంఖలములైన కీలకములతో
నాలానంలబుతో గజ
శాలలు ప్రభవించె నతివిశాలలు పెక్కుల్. 113

గీ. కట్టుగొయ్యలతో నడుగాళ్లతోడ
రక్షణార్థ మయూర మరాళ మేష
బలిముఖ ప్రముఖములతోఁ బంచవర్ణ
రజ్జువులతోడ బహుమందురలు జనించె. 114

మ. కలహంసంబులతో రథాంగములతోఁ గల్హార నీరేరుహో
త్పల ధారాళ మరంద పానమున మత్తాగొన్న రోలంబ ప
జ్క్తుల సౌభాగ్యముతో ననేకములు ప్రాదుర్భావముం బొందె జం
చల కల్లోల ఘటా కణప్లుత మరుత్సంచార కాసారముల్. 115

మ. నలువంక న్మలయానిలాంచలముచే నర్తించు పూధూళితోఁ
గొలఁదుల్ మీఱఫలావళుల్ మెసఁగుచున్ గ్రొమ్మావులంబల్కు చి
ల్కలతోఁ గోకిల కామినీ కలకుహూ కల్లోల కోలాహలం
బులతోఁ బుట్టె ననంతముల్ సుఖకరంబుల్ కేలి కాంతారముల్. 116

క. ఇవి మొదలుగా నృపోచిత
వివిధైశ్వర్యముల తోడ విలసిల్లె శచీ
ధవ నగరము కరణి ముని
ప్రవరుని పుణ్యాశ్రమంబు పట్టణ మయ్యెన్. 117

క. అకృతకపురిం గనక
ప్రాకారము దిరిగి వచ్చె ఫణిరాజ ఫణా
నీక మణిరుచులు మిన్నులు
ప్రాఁక నగాధంబులైన పరిఖలతోడన్. 118

గీ. అపుడు గౌరముఖుండు నరాధినాథుఁ
బిలిచి నీ సైన్యములు నీవు వలచి నెడల
విడియుఁ డీ మందిరంబుల వేగ మీకు
బరిజనంబుల రప్పింతుఁ బనులు సేయ. 119

వ. అనిన విని కుతూహలంబున మిహిరమండల నిరోధి గృహస్థాపిత వళక్ష కరోపలచ్ఛ విక్షాళిత నక్షత్ర పథశ్యామికంబును, విశాలైక వింశతి భూమికంబును, వాతాయన విరతాయమాన నానావిధ ధూప వాసనా సనాథంబును, నైన సౌధంబు ప్రవేశించి దుర్జయుండు నిజానుజుండైన సుమ్యుమ్ను విలోకించి యథోచిత స్థానంబుల సైన్యంబుల విడియింప నియమింప, నయ్యువరాజు శాసనంబున యుగ్యంబుల పగ్గంబులూడ్చి కేతనాతపత్రంబులు తొలగించి ధనురాధి వివిధ సాధన సహితంబులుగా నరదంబులు పదిలంబులు సేయు సారథుల మిథః కథనంబులు, రంచె లుడించి కదళికా కుథ కంఠరజ్జు ఘంటిక ప్రచ్ఛి తోత్రాంకుశ హస్తులై సాహిణంబులకుఁ దెచ్చి గంధసింధురంబుల నాలానంబుల బంధించు మావుతుల యితరేతరాలాపంబులు, పొట్టపట్టెడలు విడిచి పల్లంబులు వలయు నెలవులం గట్టి మెత్త లార్చి కళ్లెంబులతోన తురంగంబుం మందురాగారంబులకుఁ దివియు వాహకుల పరస్పరభాషణంబుల, రమ్యభవనంబులు సొచ్చి మండలాగ్ర భిండివాల ముసలముద్గర పరశు పట్టిస ప్రముఖ నిఖిలాయుధంబులు భేటకంబులు హాటక భిత్తి భాగంబులం జేర్చు పదాతిజనంబుల యన్యోన్య వచనంబులు గలయం బెరసి ఝంఝూపవన ఘూర్ణమానార్ణవంబు కలకలంబులం గలకలం బ్రహసించె నా సమయంబున— 120

కం. గౌరముఖుఁడు మందస్మిత
గౌరముఖుం డగుచు మానికము గామితముల్
చేరువఁబుప నానృపతికిఁ
జేదువనుడి వాసుదేవుఁ జింతించుటయున్. 121

సీ. భృంగారకంబులు సంపెంగ నూనియలు గం
ధామలకములు దివ్యాంబరములు
తాళవృంతంబులు నద్దము లడపంబులు
తొడవులు జిలుగు పావడలు విరులు
పన్నీరు కస్తూరి పచ్చకప్పురము గం
ధము చాదు జవ్వాది తట్టుపునుఁగు
రవలపావలు చామరంబులు రత్నకం
బళ్ళు నీరాజనభాజనములు

గీ. మొదలుగాగల వస్తుసముత్కరములు
కరముల ధరించి వెడలిరి నరసిజాక్షు
లాధవళ రత్న గర్భంబు నందుఁ బూర్ణ
చంద్రబింబంబు వలన నచ్చరలువోలె. 122

గీ. రసములన్నియు శృంగార రసముగాఁగఁ
జేసి మాణిక్యమునను రాజీవనయన
లివ్విధంబునఁబుట్టి మహీమహేంద్రు
సమ్ముఖంబున నిలిచి తచ్ఛాసనమున, 123

సీ. ఒక విలాసిని నక నకనైన కౌను గం
పింపంగ నంటె సంపెంగ నూనె
యొకలేమ చెమట పయోధరంబుల కెలం
కులఁ దోపఁ గుంకుమ నలుగు వెట్టె
నొకబాల కడియంబు లొయ్య నొయ్యన పలు
కంగ గంధామలకంబు వెట్టె
నొక తన్వి దోర్మూల యుగళంబు రుచులు మి
న్నులు ప్రాకఁ బన్నీట జలక మార్చె

గీ. నొక చకోరాక్షి నిజకరద్యుతులు మీఁదఁ
గప్పి చంద్రిక వన్నియ గాఁగ దుప్ప
టమునఁ దడియొత్తె నొక హంసగమన సురటి
విసరుచు నఖాగ్రమున నార విప్పె నెఱులు. 124

క. ఒక రమణి యిడియె వస్త్రము
లొకభామిని భూషణంబు లొసఁగెను గంధం
బొక యింతి యిచ్చె నంతట
ముకురం బొక చంద్రవదన ముందట బెట్టెన్. 125

తే. గీ. అవని పాల ! నీకు నన్య తేజంబులు
బడిసి వేత లనిన పగిదిఁ బడిసి
పాఱ జల్లి రబ్జపత్రేక్షణలు పళ్లె
రములలోని పద్మరాగమణులు. 126

క. వనితాజనంబు లివ్విధ
మునఁ దనకు బహూపచారములు సలుపంగా
మనుజేంద్రశేఖరుఁడు గై
కొనుచున్ మణిపీఠి మీఁదఁ గూర్చున్న తరిన్. 127

సీ. సరసిజ ద్వయముపై మొరయు తుమ్మెదపిండు
వలెఁ గాళ్లగజ్జెలు గులకరింప
కంతుని బాణంబు గరిచందమునఁ బింజె
లిడుచుఁ గట్టిన చీర గుడుసు పడఁగ
హిమము గప్పిన రథాంగముల చందమున గం
చెలలోని మెఱుఁగుఁ జన్నులు చలింప
చదలఁ బ్రాకిన యెఱసంజ భావమునఁ గ్రొ
మ్ముడి మీఁదఁ జెంగావి ముసుఁగు నిలువ

గీ. సంగముల గీత మర్థంబు హస్తముల దృ
గంచలంబుల నాకూత మంఘ్రి పల్ల
వములఁ దాళంబు దెలియ మార్గమున దెలిసి
ముద్దియలు గొందరాడిరి మోహనముగ. 128

క. హరిణీనయనలు గొందఱు
మొరయించిరి కాలమానమునకున్ వీణా
మురజపణవ ఢక్కాఝ
ల్లరికా ఝర్ఝరులు ద్రుతవిలంబితగతులన్. 129

క. నాళీకముఖులు గొందఱు
సాళగ సంకీర్ణ శుద్ధసరణి మెఱయఁగా
నాళతులు సేసి పాడిరి
తాళగతులు మంద్రమధ్యతార శ్రుతులన్. 130

వ. తత్సమయంబున. 131

చ. అతివినయంబునన్ సరసిజాక్షులు గొందఱు పళ్లెరంబు వె
ట్టితిమని పిల్వఁగా బడిబడిం జనుదెంచిన వారి వెంట న
ద్భుతకర నృత్తగీత రసపూర రపిప్లుత మానసంబుతో
హిత పరివారముల్ గొలువ నేగి మహీపతి భుక్తిశాలలోన్. 132

సీ. కట్టిన చీనాంశుకంబుల పింజెలు
మొరయు మట్టెల మీఁద విరియఁ బడఁగ
నాణిముత్తియముల హారగుచ్ఛంబులు
చన్నుఁ గుబ్బల మీఁదఁ జౌకళింప
తులకించు వజ్రకుండలములు మెఱుఁగు జె
క్కుల మీద నిండు వెన్నెలలు గాయ
హరివాణముల మీదఁ గరకంకణముల దీ
ప్తులు పదార్థంబులతోన తొరుగ

గీ. నిందు వదనలు వడ్డింప ఋషిమణి ప్ర
భూత పరిపక్వ బహుభక్ష్య భోజ్య లేహ్య
చోష్య పానీయముల చవిఁ జొక్కి చొక్కి
సారె సారెకుఁ బొగడుచు నారగించె. 133

క. క్షితిపతికి నిట్లు చేసిన
గతి నతి సౌఖ్యాన్వితముగాఁ బరిజన సం
తతికి వినిర్మించె యతి సు
కృతి మజ్జన భోజనాది కృత్యము లెల్లన్. 134

క. వెండియు నమ్మణి లోపల
నుండి జనించిన యథావిధోచిత సేవా
పాండిత్యంబులు గలిగిన
కొండిక ప్రాయంబు నరులు కోటుల సంఖ్యల్. 135

సీ. కలిపి తెచ్చిన జీవనలు జమ్మి పిప్పల
దళములు భద్రశుండాలములకు
కవణంబు పసిడాలు గఱికి భోజనము సె
నగలు గుడములు గంధర్వములకు
నింబ ప్రవాళ భారంబులు కోమల
కంటకాంకురములు గరభములకు
చక్కగా నఱకిన జాడు చొప్పలు నుల
వల పిష్టములు బలీవర్దములకు

గీ. పచ్చి నంజుళ్ల కమ్మని పాలు గూడు
సారమేయంబులకుఁ గడుపారఁ బెట్టి
యెవ్వరికి నేమివలె నవి యెల్ల నిడుచు
నిఖిలజీవులఁ దృప్తిఁ బొందించిరంత. 136

చ. మునికుల చక్రవర్తిఁ బ్రమోదముగా మణి చేయు చిత్రముల్
గనుఁగొని దానికిన్ సమము గామి యెఱింగిన భంగి సిగ్గునం
దన మణిఁ బారవైచె నిది దప్పదు నాఁబడియెన్ సరోజినీ
వనవిభవా వలంబము దివాకరబింబము పశ్చిమాంబుధిన్. 137

క. ఆకరువుల మచ్చుల గుడి క
ట్టికా సువర్ణంబు మధుపనికషము గల త
మ్మికవిలసంచి ఁపస వై
శ్యకులాగ్రణి వాయిగట్టె సంధ్యావేళన్. 138

చ. ఎడపని కూర్మితోడ రమియించి వృథా కలహించి పాసి పో
యెడు తఱిఁ గామినీకర గృహీత పటాంచలుఁడైన భర్తకై
వడ మునుమాపు దాఁక మధువారి యథేష్టముగాఁగ నాని వె
ల్వడుచుఁ బెనంగెఁ దేటి ముకుళత్కమలాగ్రసితాగ్రపక్షమై. 139

సీ. దివసరాజునకుఁ బ్రతీచియిచ్చు నివాళి
దీపాంకురంబుల దీప్తివోలెఁ
గమలాప్త హరుల రింఖా ముఖంబులఁ దూలు
చరమాద్రి ధాతురజంబువోలె
నంబరలక్ష్మి నూరార్చి రమ్మనుచు భా
స్కరుఁడు పంపిన మయూఖములువోలె
నర్కునిఁదాఁకి పోరాడిన మందేహ
దనుజుల దేహరక్తంబువోలె

గీ. గలయఁబర్విన సాంధ్యరాగములు పారి
భద్రభద్రంబులై కానఁబడియె బంధు
జీవజీవంబులై వేడ్కసేయ హృదయ
హారిబింబానుబింబంబులై రహించె. 140

సీ. అశ్రితా పింఛవన్యాఘోణి రోదసి
కాపాలిక మషీ విలేపనంబు
దివసాబ్జ ముకుళనోద్ధిత భృంగతతి, వారు
ణీప రిప్రాప్త సూర్యాపకీర్తి
చక్రదాంపత్య విషము, రజన్యభిసారి
కాతను మేచక కంచుకంబు
కాలగోపాలకకంబళంబు రమాకు
మార నాసీర ధాటీరజంబు

గీ. నిఖిల దిక్కంధరాముఖ నిర్గత ప్ర
మత్త కరిఘటా నటన భ్రమత్ప్రదోష
నీలకంఠ కలాపంబు నిండఁబర్వెఁ
గౌశికప్రియతమమైన గాఢతమము. 141

చ. కడునధిక ప్రతాపనిధి కాలవశంబున నస్తమింప స
ల్గడ దలలెత్తు హీనుల ప్రకారమునన్ రవిగ్రుంకఁ దారకల్
పొడిచె నిశావిలాసిని విభుం గలియం గయిసేయుచో నెరుల్
గడిపి విదల్ప వారి కణికల్గగనస్థలి నిండెనో యనన్. 142

క. దీపించె గగనమున రజ
నీ పిక వాణీ సరోజ నికురుంబము పైఁ
బాపట చందమునన్, ఛా
యాపదము సమస్తచక్షురభిరామంబై. 143

గీ. దేవతాసింధు విహార దైరావణంబు
తొండమునఁ జల్లు వాలుకాధూళిపగిది
నుదయధవళిమ దోఁచిన నాదిగెఁ దమము
బోధము జనింప మోహము పోవునట్లు. 144

సీ. ఉపసుధర్మాస్థాని నున్నవేలుపుఁ గత్త
శానికిఁ బట్టుతలాట మనఁగ
యామిని శయనించు నాకాశనీల త
ల్పము మీఁదఁ జెంగావిబటు వనంగ
సాము చేయుచు దివస్పతికుమారుఁడు భుజా
ర్గళి నెత్తు కెంపుసంగడి యనంగ
కై సేసికొనుచుఁ బ్రాక్తరుణి సొమ్ములకు నై
పట్టిన బచ్చెన బరణియనఁగఁ

గీ. బాలితోత్పలినీ కదంబంబు చకిత
చక్రవాక కుటుంబంబు సమధి కాంధ
కార పర్వత శంబంబు గాంతి విజిత
పక్వబింబంబు చంద్రబింబంబు నొడిచె. 145

క. మదిరారస మదరాగము
వదలఁ బ్రసన్నత వహించు వనరుహనయనా
వదనమువలె విధుమండల
ముదయారుణ్యంబు తొలఁగ నొప్పెవిశదమై. 146

గీ. తోచె హరిణాంక బింబంబు నాచుతోడి
దొరువుగతి నంబరము మడికరణి నుండె
నైప మొక్కలవలెఁ జుక్క లమరెఁ జిలుప
చిలుప నీరు విధాన వెన్నెలలు మొనసె. 147

క. మినుకళ్లము తారలు చి
క్కినగింజలు పూర్ణతుహిన కిరణుఁడు తూర్పె
త్తిన కొలుచు రాశిగా లాం
ఛనము మషీరచిత ముద్రచందము దాల్చెన్. 148

చ. అమృతరసంబుచేత సమయంబను సంయమి పూర్ణచంద్ర బిం
బ మను వినిర్మల స్ఫటికపాత్రములోనఁ గళంక బాణలిం
గము నభిషేకముల్ సలుపఁగాఁ బ్రవహించె ననంగ నిండఁ బ
డ్వి మహీ నభోంత రాళమున వెన్నెల వన్నెల నెల్లఁ గప్పుచున్. 149

క. సరసీ మధ్య స్థలముల
విరిసిన నీలోత్పలములు విలసిల్లె నిశా
కరకరములు దఱుమఁ దమః
పరంపరలు వెఱచి నీటఁబడియె ననంగన్. 150

చ. కమిచి పరస్పరంబు ధవకాంతలు పాండుర నాగవల్లి ప
త్రముల ముఖంబులం గొనువిధంబున వెన్నెల లప్పళించి ము
క్కుమొనల నించుచున్ మద చకోర యుగంబులు మించె రాత్రిక
న్య మగనిఁ జూచు వేడ్క నయనంబులు పెక్కులు దాల్చెనో యనన్. 151

గీ. పగలువాసిన సకలదంపతులు విషమ
సాయకునికిఁ దలంకుచు రేయి గూడఁ
బగలు వాసినఁ జక్రదంపతులు వాసె
నట్లు వచ్చునే యెందు రాజాజ్ఞమీఱ. 152

ఉ. ఖండితలైన తామరసగంధుల నిర్భరమాన దుర్గముల్
చండ పరాక్రమంబున హళాహళిసేయఁ దలంచి వారి పా
లిండ్లుల మీఁద జల్లి కవి నేయుఁ ద్రిలోకభయంకరుం డసం
గుండు రథాంగచిత్తమను కొల్మి శిలీముఖ పంక్తిఁగాఁచుచున్. 153

సీ. అభ్యుదయంబున నఖిలలోకములు సం
భావింప నేర్చిన మంచితనము
కవిసిన నిండు చీఁకటి పికాపికలుగా
బాఱంగఁ దోలిన బంటుతనము

నానాకళానైపుణమునఁ గుముద్వతీ
సతి వలపించిన చక్కఁదనము
కాంత చకోర సంఘములకు జతుకావ
సంతంబు జల్లిన జాణతనము
గీ. నాత్మఁ దలపోసి తన పట్టి నమృతకరుని
గన్నులారంగ వీక్షింప ఘనతరంగ
బాహువులు చాచి కౌఁగలింపంగ వచ్చె
ననఁగ మిన్నంటఁ బొంగె రత్నాకరంబు. 154

వ. అప్పుడు నెఱయ విప్పిన కప్పురంపులప్పల చొప్పున నలిన భవాండ భాండంబు నిండి మెండుకొన్న మిన్నేటి పెన్నురువు మురువున దిగవ కాశంబులం బ్రకాశించు నగజాతమగని మొగంబున నిగుడు నగవు బిగువున పట్టపు పీపీ ధట్టంబులం జుట్టు గట్టుగట్టి తొట్టు పాల పెన్నీటి యుట్టంబున ఘనభశ్చక్రంబు లాక్రమించి దోయిళ్ల ముంచి క్రోల వచ్చు నిచ్చలంపు వెన్నెలగాయ గాయనంబులు కర్ణరసాయనంబులుగా నాయకుల ముందటం జలిపి రహి నిలిపి శృంగారచేష్టల నభీష్టంబులు తెలిపి వారలఁ గూటంబులకు నూలుకొలిపి కూటంబులకుం డాయు నాయకుల ధగధగాయమానంబులైన హరివాణంబుల మిలమిలమను ధవళకల మాన్నంబులు గిన్నియల నించి వెన్నపడిదంబులు జున్నులు ఖండశర్కరలు దధిఖండంబులు గోక్షీరంబులు నిక్షురసంబులుఁ జలి వెలుంగునకు నర్పించి సరస సల్లాపంబుల వల్లభులం గూడి వెన్నెల పులుగంబు లాడు ప్రియసతులును బింబంబులకుఁ బ్రతిబింబంబులైన పెదవులకుదల సీత్కారంబులు చెలంగ ఘనకుచభరంబు లాస్ఫాలింప హస్తంబుల మణి కంకణంబులు గులకరింప నంగన ముందటికిం జిమ్ము నడుగుదమ్ముల మంజీరంబులు మొఱయనిటలంబులఁ గుటి లాలకంబులు నటియింప యమునా తరంగిణి వేణి కలంక్రేణి సేయు వేణులు పిఱుందుల నాందోళింప ముక్తాఫల గుచ్ఛంబులు మొలక చన్నులఁ జౌకళింప యువజనంబులకుం గన్నుల పండువులుగా పెంపులు సొంపులై పింపిళ్లు గూయు బాలికలును సహోదరియైన మహా

దధి కన్యక చందనంబు గెండమ్మి నధివసించెనో యన శోణమణిభాజనం బులనున్న వారుణి గ్రోలియు రెంటివలనం గల మాధుర్య తారతమ్యంబులు విచారించు పగిది నుపదంశంబులుగా ద్రాక్షా ఫలంబులు గఱచి గంధోత్త మంబు చవి చూచియు నభ్యంతర ప్రతి ఫలిత విలోచనంబులై సంఫుల్ల హల్లక సహితంబులైన కొలంకుల తెఱంగున మెఱయు పాత్రంబులలోని మైరేయం బాశ్వాసించియు వెన్నెలలఁ గరఁగు కురంగాంక పాషాణ చష కంబుల వెలితిగాని మధురాసవం బానియు మదంబు పెక్కువం జొక్కి మక్కువం బ్రియుల మీఁదవాలు వాలుగంట్లునై నిఖిలంబునకు సుఖంబు నెలవుకొలుపు రాత్రిధాత్రీవిభుండు హితజనంబుల నిలిపి శయ్యా నివా సంబు చొచ్చు నవసరంబున. 155

సీ. శాతమన్యవ శిలా స్తంభ కోణంబుల
రత్న ప్రదీపాంకురములు నిలిపి
పటికంపుజాజాలవల్లికలోనఁ గ
ప్పురపు వీద్యంబులు పొందు పఱచి
పచ్చల పింగాణిఁ బన్నీరు గులికిన
చందన పంకంబు సవదరించి
పదియాఱు వన్నియ బంగారు భృంగారు
కంబున హంసోదకంబు నించి

గీ. కారు క్రొమ్మెఱుఁగుల వంటి కాంత లాయ
తంబు చేసిరి నవలతాంతముల మెత్త
గలయ విప్పిరి వలిపె చెంగావిచేల
హంస తూలికా డోలా విహారశయ్య. 156

క. పవడించె నందుపై మా
నవపతి మణి కటక ఝుణ ఝుణత్కారంబుల్
చెవికి నొకపాటి వినఁబడఁ
బ్రవాళహస్తలు నిజాంఘ్రి పద్మము లొత్తన్. 157

వ. అప్పుడు - 158

సీ. కరి మయూర మరాళి కలకు నొయ్యారమీ
నామిచ్చు నడపు సన్నంపు నడపు
కమల కోరక చక్రకనకకుంభముల సౌ
ష్ఠవము దోరణకట్టు చన్నుకట్టు
విషమాస్త్ర శరమీన విద్యుల్లతల సోయ
గములకు ములుమాపు కలికిమాపు
మధుకరశైవాల మఘవ నీలంబుల
నిగ్గు బైకొను కప్పు నెఱుల కప్పు

గీ. సొప్పు మీఱంగ నరుదెంచె నొకవధూటి
నిరుపమాన విలాస మాణిక్య పేటి
ముఖర చరణ తులాకోటి ముఖ సుగంధ
సంప దభివృద్ధికర ఘన సారవీటి. 159

కం. అరుదెంచినఁ బని నెపములఁ
బరిచారిక లెల్లఁ దొలఁగ బార్థివుఁడు మనో
హర పర్యంకమునకు నా
తరుణిఁ గరము పట్టి తిగిచి తమకము మొనపన్. 160

చ. దరహసితాస్యుఁడై తనులతన్ వెడవాల్చి నగించి వేడుకల్
గెరలఁగ జేసి పల్కి పలికించి కపోల తలంబులంటి క
ప్పురమిడి కౌఁగిలించి కుచముల్ నఖరంబుల నొక్కి పాటలా
ధరసుధఁ గ్రోలి నీవిక వదల్చి మనోభవకేళి సల్పుచున్. 161

సీ. ముత్తియంబుల పేరు చిత్తజున్మని తూగు
టుయ్యాల పగిది నుఖ్ఖూఁత లూఁగ

రతి నైపుణము చూచి నుతియించు విధమున
మణిమయ కాంచి కింకిణులు మొరయ
గళవల్లకీ నాద గతులకు నటియించు
కరణిఁ బింకపుఁ జన్నుఁగవ నటింప
చెమట తొల్కరివానచే నంకురించు కం
దళముల భంగి లేనగవు మొనప

గీ. మానికంబునఁ బుట్టిన మదచకోర
నేత్ర పుంభావమునఁ దన నేర్పు చూప
సౌఖ్య జలరాశిఁ దేలుచుఁ జతురశీతి
బంధముల వీఁడు దోఁడాడెఁ బార్థివుండు 162

కం. సైనికులు నిట్లు మణిభవ
మానవతులఁ గూడి మాడి మదన క్రీడల్
నానావిధములఁ జూపుచు
నానందము తోడనుండు నా సమయమునన్. 163

క. జక్కవలకు రవి యిఁక రా
గ్దిక్కు ధరం బెక్కు ననుచుఁ దెలియఁ ద్రివాచన్
నిక్కము చేసిన తెఱఁగునఁ
గొక్కొక్కోరుతులఁ గోడి కూయఁ దొడంగెన్. 164

గీ. వార్ధకము దాల్పఁగా యామవతికి దృష్టి
పాటవము దప్పె ననఁగ నుత్పలకదంబ
ముల సొబగు దప్పి పలితంబు మొనపె ననగఁ
మఘవ దిగ్భాగమునఁ బాండిమంబు మొనపె, 165

సీ. పాంథ మానసముఁ బ్రాలేయకర కాంత
శిలలు నుపద్రవంబులఁ దొలంగె

విశ్వంభరా రుహ విటపాగ్రములు రథాం
గద్వంద్వములు వియోగంబు విడిచె
విహరమాణ చకోర విహగసంఘము సమ
స్త పదార్థములు విభక్తంబులయ్యె
పాకశాసన దిశాభాగంబు గాయక
కంఠంబు లలితరాగమునఁ బొదలె

గీ. మదన కేళీ విరామ రామాజనంబు
భానుమత్కిరణములు నంబర పరిగ్ర
హంబు గావించె గృహదీపి కాంకురములు
కౌశికంబులు దుర్దశాగతి వహించె. 166

చ. వసువు చకోర యాచకుల వాంఛలు దీరఁగ నిచ్చి చెల్లినన్
విసువుచు దాఁగె సస్త్రప్రధిపీధర సీమ ననంగఁ దాల్మి పెం
పు సడలి రాత్రి పుష్పిణిఁ గుముద్వతిఁ గూడి విశుద్ధి మజ్జనం
బుసలుపఁ బశ్చిమాంబుధికిఁ బోయె ననంగ విధుండు గ్రుంకినన్. 167

కం. హరి హయ దిగ్గిరిపై ము
మ్మరముగ నిగిరిచిన గుజ్జు మామిడి మోకం
బురుడింప లోచనోత్సవ
కర కరముల తోడఁ బొద్దు కరకరఁ బొడిచెన్. 168

కం. ఇలఁగల కొలఁకుల విరిద
మ్ముల మీఁదఁ బ్రభాతకాలమున గంధవహం
బులు వీవఁ దూలు పుప్పొడి
వలె బాలాతపము లన్నివంకలఁ బర్వెన్. 169

క. కౌలంకుల జలరక్తాక్షత
ముల నర్ఘ్యాంజలులు రవికి మును లీ నలినీ
లలనయు నిచ్చిన గతి జల
జంపుఘు కేసరము లంబుజంబులఁ దొరిగెన్. 170

క. తలలెత్తి సూర్యకాంత
స్థలములపై గంధవాహ సహచర కీలం
బులు జలజవనీ హితునకు
నిలావిలాసిని నివాళి యిచ్చె ననంగన్. 171

వ. అంతకు మున్న దుర్జయ మహీకాంతుండు సమయోచిత రాగంబులు నిజ విజయాంకితంబులయిన గీతంబులు మంగళగాయకులు పాడ వదన సౌభాగ్యంబు ప్రముచ్చిలింప వచ్చిన యిందుబింబం బనంగ బింబాధర ధరియించిన మెఱుంగుటద్దంబు గనుంగొనుచు మేల్కాంచె నని వరాహదేవుండు చెప్పిన విని యిలావిలాసిని తరువాతి వృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. 172

శా. పుంగ్రామణ్యవతంస! వైష్ణవకథోపూతాత్మ! సంత్రాస కృ
త్సంగ్రామాంగణ పాండవార్జున! భుజస్తంభాసి కుంభీనసా
లంగ్రస్తాఖిల మత్తశాత్రవ నృపాల ప్రాణవాతూల! సా
యంగ్రావస్థరవిచ్ఛవిస్తన విశేషాజ్జేక్షణాలింగితా. 173

కం. తుళ్వకుల జలధి కల్పక
సాళ్వశ్రీ నారసింహ జనపాల! స్ఫు
ర్ధాళ్వభ కంఠీరవ! మణి
గాళ్వతులా కోటి రుచివిక స్వరచరణా! 174

భుజంగప్రయాతము. సఖీభూతదోశ్చాప! సంవర్త వేళా
శిఖావత్సమిద్ధ ప్రసిద్ధ ప్రతాపా!
మఖోద్ధారణ స్ఫూర్తి మారారి కోటీ
రఖేలద్ద్యుగంగా తరంగాభకీర్తీ! 175

గద్యము. ఇది శ్రీ మదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్య పుత్ర మల్లమనీషి మల్లమలయమారుతాభి
ధాన, ఘంటనాగయ ప్రధానతనయ సింగయకవి పుంగవ
ప్రణీతంబైన శ్రీ వరాహపురాణం బను మహా
ప్రబంధంబునం జతుర్థాశ్వాసము



# వరాహ పురాణము

## పంచమాశ్వాసము

—*—

 క్షోణి భారతీ హరి
ణాక్షీ సదృశానురంజనానుభవ కళా
దక్షిణనాయక ! కీర్తి
ప్రక్షాళిత విశ్వ ! యీశ్వర ప్రభు సరసా. 1

వ. అవధరింపు మవ్వరాహ దేవుండు ధాత్రి కిట్లని యె, న ట్లు మేల్కాంచి దుర్జయనృపాలుండు కాలోచితకృత్యంబులు దీర్చి సముచిత వైష్ణవరత్నంబు సమీపంబున సుధాధామమండలంబు దండభార్గవుండునుంబోలె నున్న గౌరముఖ మహామునిం గని నమస్కరించి నిలిచిన సమయంబున 2

మ. మెలఁతల్ భూషణపేటికల్ పరిజనుల్ మేడల్ తురంగేభ శా
లలు వప్రంబులు మందిరోపవనముల్ కాసారముల్ కేళి శ
య్యలు పీఠంబులు పాత్రముల్ మొదలుగా నారత్నగర్భంబు లో
పలడించెన్ సకలప్రపంచము పరబ్రహ్మంబు నందుం బలెన్. 3

క. ఆ కుహనాతంత్రము ధా
త్రీకాంతుఁడు విస్మయము మదిం బొడమఁగ నా
లోకించి మౌని వనుప న
నీకిని గొలువంగఁ జని మణిగ్రహణేచ్ఛన్. 4

గీ. ఆశ్రమ బహిః ప్రదేశంబునందు నిలిచి
బ్రాహ్మణధనంబు గొనుట ధర్మంబు గాదు
మనుజపతులకుఁ దగియెడి మానికంబు
గాన విడుచుట నీతిమార్గంబు గాదు. 5

మ. అని చింతించి విరోచనాహ్వయు నమాత్యగ్రామణిం జూచి ప
ల్కె నపూర్వంబగు రత్నమే పగిదిఁ గల్గెన్ మౌనికిన్ సర్వకా
ల నిరహారత నుండువారలకు నేలా దండు తాణెంబు సే
యు నరస్వామికిఁ గాక తద్గ్రహణ కృత్యోపాయముల్ సెప్పుమా. 6

గీ. అనవుడు నతండు కటకట! మనుజ భర్త
బ్రాహ్మణ ద్రవ్య మపహరింపంగఁ జూతఁ
దగవు గాదని చెప్పఁ జిత్తంబు నొచ్చు
ననువుగా విన్నవించెద నని తలంచి. 7

సీ. అదరి కావించెద మన్న నిల్వదు మాయ
పెనుమాయ నిన్న గల్పించెఁ గాన
పెనఁగి చేసెద మన్న భేదంబు గొల్పదు
పరుల బుద్ధులకు లోఁబడదు గాన
కనలి చూచెద మన్నఁ గాఁగాదు దండంబు
ధరణీ సురాన్వయోత్తముఁడు గాన
తవిలి యిచ్చెద మన్న దానంబు నిష్ఫలం
బామానికం బమూల్యంబు గాన

గీ. నాత్మ నూహింపఁగా నుపాయములలోన
నెప్పటికి సామముచితంబు నృపవరేణ్య!
మౌని చిత్తంబు రంజిల్ల మంచిమాట
లాడి మణిఁ దెత్తు ననుఁ బంప నవధరింపు. 8

క. అని తదను శాసంబునఁ
జని మునిఁగని మ్రొక్కి మంత్రి సవినయముగ ని
ట్లనియె నొక పదార్థము వేఁ
డ నృపాలుఁడు నన్ను మీ కడకుఁ బుత్తెంచెన్. 9

గీ. ఋషికులైకవతంస ! నిస్పృహుఁడవైన
నిన్విచారించికొని మేదినీ జనావ
నానుభావధురంధరుండైన దుర్జ
యుని విచారించి దయతోడ నొసఁగ వలయు. 10

క. అనవుడు ముని నాయకుఁ డి
ట్లనియె నృపతి నిన్నుఁ బంపునఁట ! వినుము విరో
చన పరులకు నది యీవ
చ్చిన నిచ్చెద దాఁచనేల చెప్పుమటన్నన్. 11

వ. వశీకృతనయకళాపాండిత్యుండైన దుర్జయనృపామాత్యుండు హస్తం బులు మొగిచి మహాత్మా ! నిన్న మృగయాపరిభ్రమంబున నలసివచ్చిన నన్ను నేకాక్షోహిణిబలంబు నిలిపి యే పదార్థంబును సంపాదింపరాని యిట్టి నట్టడవిలోనం జిట్ట మిడిచిన మాత్రంబున విచిత్రంబుగా నానావిధ పదార్థంబు లేరత్నంబువలన సంపాదించి రాజోపచారంబుల నతిథి సత్కారంబు సలిపితిరి తద్దివ్యరత్నంబు కృప సేయ వలయు నని మారాజు దేవరకు విన్నవింపుమని నన్నుం బుత్తెంచె నన్న సన్నంపు నవ్వునివ్వ టిల్ల గౌరముఖుండు విరోచనుం గనుంగొని చతుర్ముఖుని ముఖంబున జన్మించిరి గావున బ్రాహ్మణులకు వేడుటయు భుజంబులం బుట్టిరి గావున రాజులకు నిచ్చుటయుధర్మంబు మది నిది విచారింపక బ్రాహ్మణుల రాజులు వేడుట విపరీతంబు యథార్థంబు చెప్పెద నదియునుంగాక వైష్ణవంబైన రత్నంబు మాకు వెచ్చ పెట్టశక్యంబు గాదు నీదు వాక్యంబులు వినరాదు కాదుకూడ దని వాదునకుం జొరక వచ్చి తడవాయె విచ్చేయు మని సోల్లుంఠంబు లాడిన. 12

గీ. మంత్రి యిట్లను మీకు నేమములు హోమ
ములు జపంబులుఁ దపములుఁ బొనుఁగుపడక
నడచు నెవ్వాని వలన నన్నరవరుండు
వేఁడ మణి యీఁక కడపుట్ట వెఱ్ఱితనము. 13

క. అనవుడు రోషారుణ లో
చనుఁడై గౌరముఖమౌని సత్తముఁడు విరో
చనుఁ జూచి బొమలు నటియిం
ప నిజక్షమ చెదర నదరిపడి యిట్లనియెన్. 14

ఉ. దుష్టచరిత్రులైన నృపతుల్ ధరయేలుట కంటె గల్గు నే
కష్టము ! శిష్టలోకము సుఖస్థితి నుండదు గాన నిట్టి ష
ష్ఠాష్టక మెట్టు పుట్టె నకటా ! వికటాలపితంబు లేటికిన్
భ్రష్ట ! పోకాలి పొమ్మనును బల్కిన నుల్కిన మానసంబునన్. 15

గీ. మరలి యేతెంచి మంత్రిదా మంచి మాట

లాడిన విధంబు మునికులాధ్యక్షుఁ డాగ్ర
హించి పల్కిన చందంబు నేర్పడంగ
విశ్వభూతల భర్తకు విన్నవించి. 16

కం. ఆ చింతామణి ముని తన
పేఁచమడఁచు దాఁక నింకఁ బెనులోభముతో
దాఁచు కొనుగాఁక నాచే
నీచే నిఁక మోస పోవునే నరపాలా ! 17

చ. అనవుడు రోషరూక్ష నయనాంతములన్ వెడగెంపుఁ దోఁప నా
నన కమలంబునం బ్రహసనస్వనముల్ నిగుడంగ దుర్జయా
వనితలనాయకుండు మదవైరి నీ దవనీలు సీలు నిం
గని మునిచేతి మానికము గైకొని రమ్మని పంపెఁ బంపినన్. 18

శా. ఆ నీలుండు వరూథినీ పరివృతుండై పోయి తేజో నిధిం
మౌనిం గానికి నైనఁ గైకొనక భీమ భ్రూకుటీ నాట్యరే
ఖా నైపుణ్యము ఫాలభూమి మెఱయంగా యజ్ఞశాలాంతర
స్థాన స్థాపిత రత్నరాజము హరింపం దేరు డిగ్గె న్వడిన్. 19

వ. ఇవ్విధంబున రథావతరణంబు చేసి డాసిన సమయంబున రత్నంబువలన నిర్యత్నంబున సపత్నభయంకరంబులై ఘన ఘనాఘన శంకాధ్యంకరణ ఘీంకరణంబులం గల సాధోరణంబులైన వారణంబుల తోడ సాది కోలాహల విశేషితంబులం గల రౌద్ర సముద్ర తరంగంబులైన తురంగంబుల తోడ దశదిశా సంధి విఘటన ప్రథితరటనంబులం గల సవిధీకృతరథిక మనోరథంబులైన రథంబులతోడ దుర్వారగర్వ ప్రబోధన సాధనంబులం గల సముద్భటార్భటులైన వీరభటులతోడ జలధరాధ్వగ ధ్వజపటంబులు నటింపఁ జామీకరదండ చామరంబులు దూల విచిత్రాతపత్రంబులు మెఱయ జైత్ర వాదిత్రంబులు మొరయ సుప్రభ సురశ్మి శుభశుభదర్శన సుకాంతి సుందర సుద్యుమ్న సుశీల సుంద సుముఖ సుకాంత సోమ సుమన శ్శంభు దీప్త తేజో నామధేయులు పదేవురు దొరలు వెడలి కడలి వెల్లి విరిసిన తెఱంగునఁ జతురంగ బలంబులు నడవ సంవర్త సమయ సమవర్తుల చొప్పున నిప్పులు గ్రక్కు దృక్కోణంబుల దుర్జయ నృపాలు పడవాలు నీలుం గనుంగొనుచు వాని సేనల మీఁదం గవిసిరి తదవసరంబునఁ 20

కం. అలిగి హరులు హరులు గజం
బులు గజములు రథములు రథములు భటులు భటుల్
బలువిడిఁ దాకిన సైన్యం
బుల రెంట న్వెడలె నాఱుపులు పెడబొబ్బల్. 21

కం. విపులా సంభూత పరా
గ పరంపర లెగసి సైనికక్షతజముచే
నప హృతములయ్యె బాలా
తపములచే నడఁగు నంధతమసము వోలెన్. 22

సీ. కుప్పలుగా నేనుఁగులు మ్రగ్గె దంత శుం
డా దండ కుంభకర్ణములు దునిసి
వాములుగా వారువంబులు వ్రాలెఁ గం
ధరవాల మధ్యపాదములు ద్రెవ్వ
ప్రోవులుగా రథంబులు ద్రెళ్లె రథిక సా
రథి పతాకా కూబరములు నలిగి
గుట్టలుగా బంట్లు గూలిరి బాహు మ
స్తక పార్శ్వ బాహు వక్షములు మురిసి

గీ. యిట్లు దన సర్వసైన్యంబు ఋషిమణి ప్ర
భూత చతురంగబలముచేఁ బొలిసి పోవ
మింట నమరులు గొనియాడ నొంటిఁ జిక్కి
నీలుఁడు పరాక్రమ క్రీడ నెఱపి పడిన. 23

మ. నరనాథాగ్రణి సిల్ల చూపిన మహానాగంబునుంబోలె రో
షరసావేశమునన్ మణిప్రభవ రాట్సైన్యంబుపై నెత్తి పో
యి రణక్రీడలు సల్పుచున్ మెఱయుటన్ హేతిప్రహేతిక్ష పా
చరవీరుల్ విని పంపి రాత్మబలమున్ జామాతకుం దోడుగన్. 24

వ. ఇవ్విధంబునఁ బంపువడి వడిగల వారువంబులం బూన్చిన కాంచన
స్యందనంబులెక్కి లెక్కింప నొక్కొక్కనివెంట నొక్కొక్క యక్షోహిణి
రక్కసులఁ గలిగి సంఘన విఘన ప్రఘన విద్యుత్ప్రభా శనిప్రభా విప్ర
జిత్తి ప్రవీర ప్రతర్ధనాగ్నిదంష్ట్రి వాయుశత్రు భయంకరోన్మత్తాక్ష భీమ
కర్ణ సుఘోషాగ్నితేజులను పదేవురు హుటాహుటిం జనుదెంచి ఖండనం
బునఁ బ్రచండ పరాక్రమక్రీడ వాలు దుర్జయనృపాలుంగని మ్రొక్కి
దేవా! నీ వాహవంబునకు వచ్చుట విని మీ మామలైన హేతి ప్రహేతులు
పుత్తెంచినం, బనివింటిమి. మమ్ముం జూచు మని సంరంభంబున రత్న
సంభవుల మీఁదం గవిసి పవిశితంబులైన శిలీముఖంబుల నేసియు మండ
లాగ్రంబుల వ్రేసియు భిండివాలంబుల నొంచియు శూలంబులఁ జించియు

సురియలం బొడిచియు ముసలంబుల నఱఁచియు భుజావష్టంభంబున విజృంభించిన మరలు మాతంగంబులును వెరలు తురంగంబులును సురుగు రథంబులును దిరుగు పదాతులునై తమ సైన్యంబు దైన్యంబు వహించినం జూచి కించిదరుణలోచనాంచలంబులతోడ నారత్న సంజాతులు దైతేయనాయకుల మార్కొని సుప్రభుం డైదు శిలీముఖంబుల సంఘునని సురశ్మి నాలుగు వాలమ్ముల విఘనుని శుభుండు రెండు కాండంబులం బ్రఘనుని శుభదర్శనుండు పండ్రెండు మార్గణంబుల విద్యుత్ప్రభుని సుకాంతి మూఁడుతూపుల నశనిప్రభుని సుందరుఁడు తొమ్మిది సాయకంబుల విప్రజిత్తిని సుద్యుమ్నుండు పదికంకపత్రంబులఁ బ్రవీరుని సుశీలుం డాఱుశరంబులఁ బ్రతర్దనుని సుందుండు పండొమ్మిది ప్రదరంబుల నగ్నిదంష్ట్రిని సుముఖుండు ముప్పది కోలల వాయుశత్రుని సుకాంతుండు పదియాఱు ములుకుల భయంకరుని సోముం డొక్క భల్లంబుల నున్మత్తాక్షుని సుమనుం డిరువది యేనాశుగంబుల భీమకర్ణుని శంభుండు పదునాలు గంబకంబుల సుఘోషుని దీప్తతేజుండు పదునెనిమిది బాణంబుల నగ్నితేజునిం బిలుకు మార్చి పేర్చి దిక్కులు వగుల నార్చిన. 25

లయగ్రాహి

నిర్జరవరప్రముఖ దుర్జయుఁ డనం బరఁగు
దుర్జయుఁడు తన్మణి జనుర్జన ధనుర్జ్యా
వర్జిత నిశాతశర నిర్జిత నిశాటులఁ గృ
పార్జవమునం గనుచుఁ దర్జనలు బాహా
ఖర్జువులు సంగర మార్జన సముద్యమన
ధూర్జవములన్ మెఱయ నిర్జడమకీల
స్ఫూర్జితలలాటశిఖి భర్జిత పురత్రితయ
ధూర్జటియనం గినలి గర్జిలుచు వీఁకన్. 26

సీ. ఘుందట బలభేరి ముఖ్యదిక్ప్రతి విభా
శాయని బహు కాహళములు మొరయ
గంధదంతావళగ్రై వేయ ఘంటా ఘ
ణాత్కారముల నజాండంబు లవియ
కంఖాణతురగ రింఖాపుంభితక్షమా
ధూళి నభ్రపథంబు దూటుకట్ట
పర భయంకర వీరభట భుజ భ్రమితాయు
ధ వ్రాతములు ధళధళయనంగ.

గీ. కఠినతర నేమిచక్ర సంఘట్టనముల
నురగ పరివృఢ ఫణపరంపరలు చదియఁ
గదియ నడచి నిశాతాశుగముల గములఁ
దెఱపిగని శత్రుసైన్యంబు నఱకువేళ. 27

కం. కనుపట్టె రాహువదనం
బునఁ జిక్కిన సూర్యబింబమో యనఁగా న
ల్లని గరి గల శిత సాయక
మునఁ దగిలి విరోధి కనకముకుటము మింటన్. 28

గీ. మెడలు దునిమిన మీఁదికి వెడలు రుధిర
ధారల మదాంధ పరిపంథి వీరభటక
బంధములు నిల్చెఁ బెక్కులు పగలు బిరుదు
బంట్లు పట్టించుకొను దివ్వె పౌఁజు లనఁగ. 29

కం. కులిశహతి రుధిరజనిత
స్ఫులింగనివహంబు చందమున నెగసెఁ గృపా
ణలతా దళితాహిత గజ
ముల కుంభముల సర క్తముక్తా ఫలముల్. 30

చ. అరిమకుటీ విటంకముల నాయసదండ పటుప్రహార చా
తురిఁ గురువింద రత్నములు దూలి ధరంబడు వీరపుంగవుల్
పౌరిఁబొరి ప్రక్కలించు కొనిపోవ నభోమణి మండలంబునం
దొరిఁగెడు దీప్తి ఖండములతోఁ దులఁదూఁగుచు నన్నివంకలన్. 31

కం. అమరత్వమునకుఁ బోవుచుఁ
దమ భవబంధంబు లూడఁ దన్నుకొనుగతిన్
సమరోర్వి నిమిషమాత్రం
బు మదారాతుల కబంధములు దన్నుకొనున్. 32

చ. వర వరణాభిలాషమున వారిజపత్ర విలోచనల్ పురం
దర పురినుండి శీఘ్రగమనంబున రాఁ గుచఘర్మ వారిచేఁ
గరఁగిన కుంకుమద్రవము గాఱెడుకైవడిఁ గాఱఁ జొచ్చె నం
బర వలమానలూనరిపు మస్తపరిస్రవ దస్రబిందువుల్. 33

గీ. కదన ధాత్రీతలమున హుంకారగర్భ
మై పడిన శత్రుమస్తకం బాడు తన క
ళేబరము చూచి మెచ్చి బళి! బళీ! య
టంచుఁ గొనియాడు విలసనం బభినయించె. 34

గీ. గంధదంతావళము రేసి కఠినదంత
కాండమునఁ బొడ్చి యెత్తినఁ గానఁబడియె
సమద శాత్రవ మహిమయ స్యందనంబు
కపట కిటికొమ్ము మొన రత్నగర్భవోలె. 35

గీ. ఒక్క భటుఁడొక్క విద్వేషి నుఱికి పొడువఁ
బోటుగంట్లలో వెళ్ళి పొడుచువాని
పైఁబడియె రక్తములు పోటుపడిన వాని
క్రోధరస పూరములు ముంచుకొనియె ననఁగ. 36

క. పురముం గనుఁగొని యెడు ని
ర్జర వరులకు వేయుచామరంబులు వలె నం
బరమున నాడె శిలీముఖ
పరిఖండిత విమతకేతు పట పల్లవముల్. 37

వ. ఇత్తెఱంగున, నప్రతిహత ప్రతాప దీప్యమానుండై సుప్రతీకసూనుండు రణవిహరణంబు సలుప నిలుపరాని కోపంబునం జాపంబులు సాధించి హరించి పంచానన పరాక్రములు సుప్రభ ప్రముఖులైన మణిప్రభూతులు పదేవురు మహారథులు సారథుల నెచ్చరించి మచ్చరించి వచ్చు వియచ్చరారాతి మార్కొని పేర్కొనంగల సుద్యుమ్న విరోచనాదులఁ బెక్కండ్ర నుక్కడంచి బహువిధ వ్యథా దాయకంబులైన సాయకంబుల ముంచిన నాగ్రహించి మహీవల్లభుండు తదీయ విగ్రహంబులు భల్లంబులం జిల్లులు వోవ నేసినం బల్లసిల్లు సమయంబున సమిత్కర్కశార్థంబు చనిన గౌర ముఖుండు నిజాశ్రమంబులోని మహాహవకోలాహలంబు నాలోకించి రభసంబునం బఱతెంచి రణభైరవ యోగదండంబుల చాడ్పున మస్తిష్క పంక మధ్యంబున నిలువంబడిన సచక్రదోర్దండంబుల దాశరథి శరధిం గట్టినకట్టు విధంబున రుధిరపూరంబునం జాలుగా గిరికొనం గూలిన గంధగజకబంధంబుల వల్మీకరంధ్రంబుల వెడలు భుజంగంబుల భంగి నిపతి తాశ్వ కుక్షిగోళంబుల బహుక్షతంబుల వెడలు ప్రేవుల సకానన ప్రదేశంబులఁ గలయ రాలిన ఫలంబులతోడ ఝంఝూ పవన భగ్నాగ్ర తాళద్రుమ కాండ కాండంబుల పగిది రథిక చక్ర రక్షక మస్తకంబులు చుట్టునుం బడియున్న సముత్తుంగ శశాంక కూబరంబుల భూతంబులు మాంసఖండంబు లొండొరులకు వడ్డింప నాయితంబు చేసిన చట్టువంబుల వడువునఁ దొడికిన పిడివదలక మొదలికిం దెగిన బాహుదండంబులం గను పట్టు ఖేటకంబు వినోదంబునకు బేతాల బాలికలు ద్రిప్పు త్రిప్పటంపు బల్లలచందంబునఁ దల్లకెనవై రక్తాపగావర్తంబుల బిరబిరం దిరుగు విచిత్రాతపత్రంబుల జయరమా వివాహోచిత రక్తాక్ష పాత్రంబుల కరణిం గ్రాలు సామిఖండిత సముక్తాఫల మదావళ కుంభపాలికల నభస్థలంబునం బిశాచ కిశోరంబులు విడిచిన గాలిపడగల కైవడి నాడాడ నాడు నట్టల

భీమాభిరామంబైన సంగ్రామంబు రత్న సంభవ దుస్సహ పరాక్రమంబున విజృంభించు దుర్జయుం గనుంగొని భయ విస్మయంబులు సంచడింపమణి నిమిత్తంబునం బ్రాదుర్భవించిన యావిపద్దశ నివారించి రక్షింపుమని వన జాక్షుం దలంప నమ్మని హర్యక్షునకుం జక్షుః ప్రియకరంబై. 38

మ. ఎదుటన్ సత్కృపతోడ దుర్జయ ధరా ధీశాన సేనా వనం
బు దహింపం గల చక్రదావ శిఖి నుద్బోధింప నేతెంచెం ద
ప్పదు నాఁగా వినతా తనూభవ చలత్పక్షా నిలంబుల్ సమ
స్త దిశాకోణము లాక్రమింపఁ గటి భాస్వత్పీతవాసంబుతోన్. 39

గీ. ఇట్లు తోఁచి మురారాతి యేమి పనికి
నైతలంచితి విన్పింపు మనిన మౌని
దేవ కారుణ్యమున మమ్ము గావు సబలు
దుర్జయ నృపాలు దేవతా ద్రోహి దునిమి. 40

మహాస్ర. అనుచున్ సాష్టాంగముల్ సంయమి సలుప నుదగ్రాగ్రహ వ్యగ్రతన్ వై
చిన చక్రం బావిరోధిక్షితిపతి నడగించెం బలంబున్ దహించెన్
మొనలన్ వేయింటి చుక్కల్ మురిసి ధరణిపై బ్రుగ్గు చందంబుగాఁ గాం
చన గర్భాండ ప్రపూర్ణ జ్వలదనల శిఖాసంఘు జాంఘాలికంబై. 41

సీ. అంతటఁ జక్రంబు శాంతమై నిజ భుజా
గ్రమునఁ జేరిన శౌరి గౌరముఖుని
తోడ నిట్లనియె నిందు విరోధి సైన్యంబు
నిమిషమాత్రంబున సమసెఁ గాన
నీ మహారణ్యంబు నైమిషం బనఁబడు
నిచ్చోటనే వసియింతు యజ్ఞ
పురుషుండనై రత్నమున జనించిన యాప
దేవురు తరువాతఁ గృత యుగమున

గీ. జలధి వలయిత విశ్వ విశ్వంభరా త
లేంద్రులై పుట్టఁ గలరని యెఱుగఁ జెప్పి
చనియె శిష్యగణంబుఁ దానును దపస్వి
కులమణియు నుండె నాశ్రమస్థలము నందు. 42

క. ధరణీ ! యీ కరణి నిశా
చర హర చక్రముస సుతుఁడు సమసిన విని శో
క రసార్ణవమున మునుఁగుచు
నిరవద్యుఁడు సుప్రతీకనృపతి వికలుఁడై. 43

గీ. ఎట్టకేలకు ధైర్యంబు హృదయమునకు
నూలు కొలుపుచు నారాయణుండు రాముఁ
డనఁగ నున్నాఁడు చిత్రకూటాద్రి మీఁద
రామ సంజ్ఞను వినుతింతు నా మహాత్మ. 44

వ. అని కృతనిశ్చయుండై శ్రీరామ! కారుణ్య రసబ్ధి సోమ! నిశాత శిలీ ముఖ విఖండిత నిశాచర యూథ! నరనాథ! ప్రపన్నార్తి హరణ ప్రవీణ! సురూపధురీణ! విజయలక్ష్మీ కళా నిస్తంద్ర పురాణ కవీంద్ర దేవా! నీవ సూక్ష్మాకారంబున సకల తేజంబులకు మహత్తర తేజంబులు గావింతువు, భూతత్త్వంబున నైదు గుణంబులు జలతత్త్వంబున నాలుగు గుణంబులు రజస్తత్త్వంబున మూఁడు గుణంబులు వాయు తత్త్వంబున రెండు గుణంబులు నభస్తత్త్వంబున నొక్క గుణంబునునై నిలుతువు దుఃఖ జరా బడబాగ్ని భయంకరంబును బహిరభ్యంతరేంద్రియ గ్రాహ దురవగాహంబును నైన సంసార సాగరంబున మునుఁగు జంతు సంతానంబులు భవదీయ నామంబులు దలంచినఁ దరి తెలంగున దరిచేర్తువు సచరాచర ప్రపంచంబు నీయం దరమించుట జేసి రామాభిధానంబున విహరింతువు లోకోపకారార్థంబు మీన కూర్మాద్యవతారంబుల వర్తింతువు సంవర్త సమయంబు ధగిద్ధగిత హరిదంతరాళ కరాళ కీలా నలంబవై విజృంభింతువు దేవాది దేవుండవు గావున నిన్ను శరణంబు వేడెదనని మస్త కన్యస్త

హస్తుండై సంస్తుతించించిన సాక్షాత్కరించి పాంచజన్యధరుండు సుప్రతీక
వసుధాధ్యక్షుని నిరీక్షించి. 45

సీ. వరమిత్తు వేడుము నరపాల శేఖర
నావుడు నతఁడు నానందనులకు
నాకు నీ దేహంబు నన కూడవలె నన్న
నట్లగా నొసఁగె శ్రీహరి వసుంధ
రాంగనా స్వాయంభువాహ్వయ మన్వంత
రంబున మొదలి యుగంబునందు
నేకదేశములోని వృత్తాంత మిది భూర
జోంబుధి జలపరమాణు గణము

గీ. నైన గణియింపఁగా వచ్చుఁగాని వినుము
తత్కృతయుగంబు లోపలి దైత్య మథన
కృత చరిత్రంబు లన్నియు నెన్నరాదు
వనజభవునకు శతకోటి వత్సరముల. 46

గీ. అనిన విని కపట కిటితో హరి విచిత్ర
కృత్యములు గౌరముఖుఁడు వీక్షించి పిదప
నేమి గావించె రత్నజు లేమియైరి
యెవ్వ రమ్మౌని తన్మణి యేడదనిన. 47

కం. విను విష్ణు మహిమఁ గని ముని
చనియెఁ దదారాధనంబు సలుపఁ బ్రభాసం
బను సోమ తీర్థరాజం
బునకుఁ దపః ఫలద కల్పభూజంబునకున్. 48

కం. చని దైత్యాంతక నామం
బున నచ్చట నున్న విష్ణుఁ బూజించుచుఁ గ
న్గొనియె నొకనాఁడు ముందట
మనసిజదమనోపమేయు మార్కండేయున్. 49

సీ. ఇట్లు దూరంబున నీక్షించి యెదురేగి
సాష్టాంగ మెఱఁగి నిజాశ్రమంబు
నకుఁ దెచ్చి దర్భాసనంబున నునిచి నా
నావిధాతిథి పూజనములు నడపి
ముకుళితహస్తుఁడై ముందట నిలిచి మ
హావ్రత ! యేమి కార్యంబుఁ దలఁచి
యిటకు విచ్చేసితి రెఱిఁగింపుఁడనిన న
మ్మునివతంసుఁడు గౌరముఖుని తోడ

గీ. ననియె, మీ వంటి వారి దర్శనమె మాకుఁ
గార్య మింతియు నొందేహిక ప్రయోజ
నంబు గలిగిన నడుగుము సమ్మతంబు
గాఁగ వచియింతు ననవుడు గౌరముఖుఁడు. 50

కం. పితరులు గల రందురు వే
ద తత్త్వ విదులైన బుధులు తత్పితరులు వ
ర్ణతతికి సాధారణులో
గతకల్మష ! మఱియు వేఱె కలరో చెపుమా ! 51

సీ అనుడు మార్కండేయుఁ డగ్గౌర ముఖునితో
వినుము విష్ణుఁడు తండ్రి విశ్వమునకు
నాతని వలన బ్రహ్మ జనించె నాబ్రహ్మ
ఋషుల నేడ్వుర సృజియించి వారిఁ
గని నన్నుఁ బూజింపుఁ డనిన నాసంయము
లాత్మలోపలఁ బరమాత్మఁ గొలువఁ
గలుషించి వైకారిక స్వరూపుఁడు పద్మ
జన్ముండు మద్వ్యభిచార కారు

గీ. లార ! కాన దురాచారులాల ! కాన
కితవ కృత్యంబు లిట్లు చేసితిరి మీరు
బ్రహ్మ విజ్ఞాన గర్వంబు పదటి పాలు
గావలయు నంచు ఘోరంబుగా శపించె. 52

గీ. వారలప్పుడు తనయుల వంశకరులఁ
గని విమానస్థులై నాకమునకుఁ బోయి
తత్సుతులు శ్రాద్ధములు సమంత్రకము గాఁగఁ
దమకుఁ జేయంగ నుండిరి తాపసేంద్ర ! 53

వ. ఇత్తెఱంగున నుత్తములైన సూనులం బడసి వైమానికత్వంబున నాకంబునకుం జని సుఖంబున నున్న మఱి మరీచ్యాదు లేడ్వురలో నమూర్తులు ముగ్వురు సమూర్తులు నల్వురు వీరు దేవతలకుం బితరులై తద్దేవతలుం బూజింప యుగశత పర్యంతంబు సనాతనలోకంబుల వసియించి వెనుక బ్రహ్మవాదులై జన్మించి తమ పూర్వ సాంఖ్య మతంబుఁ గొంతకాలంబు వర్తించి పునరావృత్తి రహిత యోగసిద్ధిం గాంచి యోగ బలంబున సకల యోగులకు యోగాభివృద్ధి గావింపుదురు గావున వారికి శ్రాద్ధంబులు చేయ వలయు నిది పితృ ప్రథమ సర్గంబు మఱియు ననేక ప్రకారంబులఁ బితరులు సప్త లోకంబుల నిలిచి భూలోకవాసులు భువర్లోకవాసుల భువర్లోకవాసులు మరీచ్యాదులైన సువర్లోకవాసుల, సువర్లోకవాసులు కల్పోపవాసి సంజ్ఞులైన మహాలోకవాసుల, మహాలోకవాసులు సనకాదులైన జనలోకవాసుల జనలోకవాసులు వైరాజులైన తపోలోకవాసులఁ, దపోలోకవాసులు సత్యలోకవాసులఁ బూజింపుదురు వసు సాధ్య రుద్రాదిత్యాశ్వి మరుద్రుషులు నేతత్కన్యకా సముద్భవులును వశిష్ఠ బ్రహ్మ పితరులైన యగ్నిష్వాత్తాదులు బ్రహ్మక్షత్ర వైశ్యులకు సమత్వంబునం బూజింప నర్హులు శూద్రజాతికిం బితరులు వేరలేని నిమిత్తంబున శూద్రులు బ్రహ్మ క్షత్రియ వైశ్యానుమతంబున సర్వ పితరులం బూజింపుదురు భట్టారకా ! యెట్టి మహాత్ములకుం బితృ సర్గంబు సమస్తంబును సవిస్తరంబుగా వచియింప నశక్యంబగుటంజేసి సంక్షేపరూపంబునం జెప్పితి వ్యతీపాతాయన

విషువ చంద్ర సూర్యగ్రహణ సంక్రమణ దర్శాది పుణ్యకాలంబుల నక్షత్ర గ్రహ పీడా సమయంబుల దుస్స్వప్నావలోకనంబుల నూతన ధాన్యాగమనంబుల విశిష్ట ద్రవ్య పాత్ర లాభంబుల గంగాది మహాతీర్థంబుల శక్త్యనుసారంబున శ్రాద్ధకర్మంబు సలుపుట ధర్మంబు, శ్రాద్ధ కర్మంబు సలుప విత్తంబు దొరకదేని తిలతర్పణంబు లిచ్చిన శ్రాద్ధఫలంబు సిద్ధించు నత్తిలతర్పణంబులు దుర్లభంబులైన ధేనువునకు నేకాహ్నిక గ్రాసంబుగొని పెట్టినం జాలు నిఖిలాభావంబున వనంబునకుం బోయి సూర్యాదిలోకపాల సాక్షిగా నూర్ధ్వబాహుండై తన నిర్ధనత్వంబు పితరులకుం బెద్ద యెలుంగున విన్నవించుట సముచితంబు నాకు నీపై తృకరహస్యంబు చతురాస్య తనూజుండైన సనకానుజుండు తెలిపె నింక శ్రాద్ధ యోగ్యా యోగ్యుల వినుము. 54

సీ. జ్యేష్ఠ సాముఁడు యోగి శిష్యుండు సోదరి
సూనుండు త్రిమధువు సోమయాజి
మాతామహుఁడు త్రిసామగుఁడు త్రిణాచి కే
తుఁడు త్రిసువర్ణుండు మహితసుతుఁడు
జామాత యతి మేనమామ మాతా పితృ
భక్తుండు వియ్యంబు భార్య తండ్రి
ఋత్విజుం డతిథి పైతృకకర్మయోగ్యులు
శ్యావదంతుఁడు నపుంసకుఁడు కునఖి

గీ. దేహరము వాఁడు దొంగ నిందితుఁడు రోగి
సోమవిక్రయి కొండీఁడు గ్రామయాచ
కుండు పరపూర్వ పెనిమిటి కూలిచదువు
చెప్పువాఁడును శ్రాద్ధవర్జితులు సుమ్ము. 55

కం. మునివల్లభ యీ చందం
బునఁ బైతృకవిధులు సలిపి పురుషోత్తమ చిం
తన మది మఱవక మెలఁగెడు
ననవద్యుఁడు గాంచు నైహికాముష్మికముల్. 56

కం. అని మార్కండేయుఁడు చె
ప్పిన విని పండ్రెండు సమలు పితృపూజన చే
సినకతన గౌరవక్షుత్రిఁడు
తన గతజన్మములు నూఱు దలఁచె ధరిత్రిన్. 57

సీ. తలఁచిన జన్మ శతంబున నొక్క జ
న్మము నీకు వినిపింతు, నలువ, తొల్లి
పరమతత్వజ్ఞాన విరహితులై పోయి
సుతులఁ బోధింపంగ సుగతి పొందుఁ
డని శపించిన మరీచ్యాది మానసపుత్రు
లేడ్వురలోపల భృగుఁడు గౌర
ముఖుఁడు, తద్భృగువంశమునఁ జనించినవాఁడు
గాఁగ మార్కండేయ మౌనిపుంగ

గీ. వుండు దెలిపినఁ దెలిసి పండ్రెండు వత్స
రములు పితరులఁ గర్మకాండములఁ బూజ
చేసి గౌరముఖుండు ప్రభాసతీర్థ
వాసు దైత్యారి నిట్లని ప్రస్తుతించె. 58

సీ. జలజగర్భుని చదువుల చెఱపీడ్కొలు
మంధానకుధరధురంధరుండు
విషధి మునింగిన విశ్వంభరకుఁ దేవ
సుమనో విపక్ష వక్షోవిదారి
కుంభినీనభములు గొలిచిన కొలగోల
పార్థివ రుధిర తర్పణపరుండు
లంకాధిపతి తలలకు గండకత్తెర
రేవతీ హృదయ రాజీవహేళి

గీ. త్రిపురవసితల యీలువు తెక్కలీఁడు
ఖురఘురట్టు విఘట్టిత క్షోణితలుఁడు
చింతిత ఫలప్రదాత రక్షించుఁగాత!
నన్ననుచు భక్తి రెట్టింప సన్నుతింప. 59

కం. అత్యంత కరుణతో నా
దిత్యసహస్రోపమాన దివ్యప్రభతోఁ
బ్రత్యక్షంబై నిలిచిన
దైత్యాంతకు మేన మునివతంసుఁడు గలసెన్. 60

మ. అనినన్ భూచపలాక్షి యిట్లనియె జన్యాగ్రంబునం దన్ను గె
ల్చిన దుష్టాత్ముఁడు దుర్జయుండు చనఁ బ్రాచీ దిఙ్మహీసీమ ని
ల్చిన సుత్రాముఁడు నాక మేలు దనుజుల్ విద్యు త్సువిద్యుత్తులున్
సనకాదిస్తుత యేమి చేసిరి పరిస్పష్టంబుగాఁ జెప్పవే. 61

సీ. అనిన మాయావరాహము చెప్పఁ దొడఁగె సు
నాసీరుఁ డమర సైన్యములు గొలువ
వారణాశికిఁ దూర్పువంక భారతవర్ష
మున నుండె నవ్వార్త విని ముదంబు
తోడ విద్యు త్సువిద్యుత్తులు జలరాశి
గర్భస్థులైన రాక్షసులఁ గూడు
కొని హిమాద్రి సమీపమున విడిసిరి వారి
పై దండు వెడలంగఁ బాకశాస

గీ. నుండు దలఁచిన నాంగీరసుండు వచ్చి
శక్ర ! విద్యు త్సువిద్యున్నిశాటవరుల
యోగవిద్యా సమర్థుల నోర్వలేవు
వేయి గోమేధమఖములు సేయవేని. 62

కం. అని వాచస్పతి బోధిం
చిన ధేను సహస్రముల శచీపతి రావిం
చి నియోగించెన్ సరమా
శుని నాగోమేధ మఖ పశువులం గాయన్. 63

శా. ఈ రీతిన్ వెనువెంట దేవశుని రా నిచ్ఛాగతిం బోయి నీ
హారక్షోణిధరంబు చేరువల మేయన్ గోగణంబున్ సుప
ర్వారాతుల్ గని చెప్ప భార్గవుఁడు కార్యం బాత్మ నూహించి ని
ర్ధారించెన్ బలమర్ధనాధ్వర పశుగ్రాహం బవశ్యంబుగాన్. 64

శా. నిర్ధారించి పులోమజిత్పశులన్ వేపట్టుఁ డన్నన్ సుర
స్పర్థుల్ వార్ధుల భంగి పొంగెడు మహాసైన్యంబుతో వచ్చి చం
ద్రార్ధోత్తంసుని మామ గహ్వరములన్ హంభా రవారంభముల్
వర్ధిల్లం బసిఁ బట్టినన్ సమర దుర్వారార్భటుల్ చూపుచున్. 65

కం. వారించిన రాత్రించర
వీరులు మృదువచనరచన వేలుపుఁ గుక్కన్
నోరార్చి పాలు వోసిన
వారికి నది పసుల నిచ్చి వచ్చెఁ గడంకన్. 66

సీ. అరుదెంచి ప్రణమిల్లెనా కుక్క వెనువెంట
గోరక్షణార్థము గూఢ మార్గ
మునఁ బంపఁ జనిన వేల్పులు నేగుదెంచి క్రొ
క్కారి యింద్రుఁ దప్పుడు సరమఁ జూచి
కటకట పసుల నెక్కడ బాఱఁదోలి వ
చ్చితి చెప్పు మనవుడు శీతనగము
పొంత మేయుచుఁ దప్పిపోయిన పోనాట
వీభూమి నిందాక వెదకి వెదకి

గీ. కానలేనైతి నేనని కల్లలాడ
గూఢచారులు దేవ ! యీ కుక్కc వేపి
కడుపు శోధింపు సకలంబు గానవచ్చు
ననినc గోపతి మిగులంగ నాగ్రహించి. 67

కం. ఊళలు వెట్టంగా డా
కాలన్వడి దన్నుటయు భుగాలున నోరం
బాలు వెడల నాసరమయు
జాలి గుడిచి మంచుగొండ చక్కికిc బోవన్. 68

వ. పురందరుండును బృందారకవాహినీ పరివృతుండై సరమ వెంటంజని తుషారగిరి ప్రాంత కాంతారంబు సొచ్చి మఘవిఘాత హేతువులైన యాతు ధానులం దునిమి ధేనువులం గొని వచ్చి గోమేధసవన సహస్రంబు సలిపి తత్ప్రభావంబున దుర్వార బలగర్వంబు పూని మగుడ హిమవంతంబునకు దాటివెట్టి దానవులం జుట్టుముట్టి భీమ సంగ్రామ రంగంబునం గసుపుగొట్టి హతశేష దోషాచరులు విషధి మధ్యంబునం బడిన విజయలక్ష్మీ పరిరంభ జృంభణంబున జంభారి నాకపురంబునకుంబోయి హవ్య వాహనాది దిక్ప తుల వారివారి పురంబుల నిలిపి నిష్కంటకంబుగా రాజ్యంబుచేసె నీసర మాఖ్యానంబు మానవులు విన్న గోమేధ యజ్ఞఫలంబు ప్రాపింతురు వైరులచేత రాష్ట్రంబు గోలుపడిన భూవల్లభుండు విన్న నిర్జర నాయకుం డుంబోలె వెండియు నిజమండలంబున సుఖంబున నుండునని చెప్పిన విని రత్నగర్భసంభవులైన పదేవురుదొరలు రాజులై పుట్టి యేమి నామంబులు దాల్చిరి యెవ్విధంబున విహరించిరి త్రేతాయుగంబున జనార్దను చేత నేభంగి వరము వడసిరి తెలియ నానతిమ్మనిన వరాహదేవుం డిట్లనియె. 69

మ. నలినాక్షీ ! విను, రత్నసంభవులలోనన్ సుప్రభుం డబ్ధికిన్
నెలవోలెన్ శ్రుతకీర్తి భూపతికి జన్మించెం బ్రజాపాలు పే
ర లలాటాక్ష కిరీట నాకతటినీ రంగత్తరంగాభ తుం
దిల కీర్తి ప్రభ తోడుగాc గృతయుగాదిన్ మోద సంపాదియై. 70

శా. నానా దేశ నరేశ్వరుల్ విగతమానగ్రంధులై మ్రొక్కఁగా
దానక్షాత్ర గుణంబుల న్వెలసి మాద్యత్కుంజరస్యందనా
జానేయాశ్వ భటుల్ భజింప మృగయేచ్ఛం దత్ప్రజాపాల ధా
త్రీనాథుం డొకనాఁడు కాననమునన్ క్రీడించుచు న్మందరన్. 71

కం. పావనము సుకృత లక్ష్మీ
జీవనము జనార్దనాభిషేకార్హ సరో
జీవనము నొక్క గమ్య త
పోవనము న్వెఱఁగు పడుచుఁ బొడగాంచి మదిన్. 72

ఉ. ఇందు మహాతపుండను ఋషీశ్వరుఁ డొక్కఁడు తత్త్వ సచ్చిదా
నందముతోడ నుండుట వినంబడుఁ గావున నమ్మహాత్ముఁ జూ
డందగు నంచు డాసి ముకుటంబు పదాబ్జమునందు మోవఁగా
వందన మాచరించి నిలువ న్మునినాథుఁడు సంభ్రమంబునన్. 73

శా. ఆశీర్వాదము చేసి యేమి ? కుశలంబా ! నీకు; నిర్దోషముల్
గా శాసింపుదువా ! దిగంతములు సౌఖ్యంబుల్ భవత్పాలనా
వైశారద్యమునం గదా నడచు నిర్వక్రంబులై నీకు ధా
త్రీశా ! నీసరి చెప్ప రాజసుతు లేరీ ! ధైర్య సంపన్నతన్. 74

చ. అని కొని యాడుచున్ సముచితాతిథికృత్యము లాచరించి, వ
చ్చిన పని యేమినా, నృపతి చేతులు మోడ్చి భవార్ణవంబునన్
మునిఁగెడు మానవుల్ వెడలి ముక్తికిఁ బోయెడి త్రోవ యేదో చె
ప్ప నవధరింపు నావుడు దపస్వి మహీశ్వరుతోడ నిట్లనున్. 75

సీ. అర్చన దాన హోమాదులు ఫలకంబు
లింద్రియ నిగ్రహం బినుప చీల
యఖిల భూతదయా పరాయణత్వము లిపి
కాఁడు వైరాగ్యంబు గాలిచీర

ధైర్యం బుద్ధ సత్వగుణంబు మ్రోకులు
మంచివారలతోడి మైత్రి సరకు
శీలంబు నడిపించు మాలిమి సంచలిం
పని మానసంబది బరువుగాఁగఁ

గీ. బెగిన మురారిచరణ రాజీవభక్తి
గౌరవంబను పేరోడ గలిగెనేని
ఘోరభవసాగరము దాటి చేరవచ్చు
మోక్షమను దీవి మానవాధ్యక్షతిలక. 76

కం. కావున శ్రీహరి పదరా
జీవద్వంద్వంబు సేవచేసిన జనులే
కైవల్య రాజ్యలక్ష్మల
తో విహరింపుదురు తప్పదుసుమీ యనినన్. 77

గీ. అనఘ ! యేరీతి నారాయణాంఘ్రి పంక
జములు గొలుతురు నావుడు సంయమీశ్వ
రుండు భూపాల ! విను పురంధ్రులు పురుషులు
శ్రీహరి పదాంబుజములు భజించు విధము. 78

సీ. అబ్జభవాండమధ్యంబునఁ గలిగిన
బ్రహ్మాది సురకదంబంబు విష్ణు
వలన బుట్టిన వేదములు చాటి చెప్పున
న్నారాయణుని శాసనమునఁగనక
గర్భు దేహమున నావిర్భవించిన పావ
కాశ్వి హైమవతీ గజాన నాహి
కార్తికేయాహిమకర మాతృ దుర్గాది
శాధీశ హరిదండ హస్తరుద్ర.

గీ. సోమ పితరులు దమలోన మేమ మేమ
దొడ్డ వారమటంచు వాదునకుఁ జొచ్చి
రొదలు చేయంగఁ దారొక్కరుండు పాయ
గిలి విచారించి దహనుండు పలికె నగచు. 79

వ. మూఢులార! వృథా కలహంబుమాని, సకలాధికుండనేన, నన్ను సేవిం పుఁడు, మద్విరహితంబై, బ్రహ్మ దేహంబు నిలుచుటయెట్టు చూడుండని, వెడలిపోవ, నప్పితామహు దేహంబు కనుగందక పూర్వ ప్రకారంబున నుండె. నప్పుడు, ప్రాణాపాన స్వరూపంబులైన నాసత్యులు, వాక్స్వ రూపంబైన గౌరియు, నభస్స్వరూపంబైన వినాయకుండును, ధాతు స్వరూపంబులైన భుజంగంబులు, నహంకార స్వరూపంబైన కార్తికే యుండును, జక్షు స్వరూపంబైన సూర్యుండును, గామక్రోధాది స్వరూ పంబైన మాతృకలు, నైశ్వర్య స్వరూపయైన దుర్గయు, శ్రవణేంద్రియ స్వరూపంబులైన దిక్కులు, వాయు స్వరూపుండైన కుబేరుండును, మన స్స్వరూపుండైన విష్ణుండును, ధర్మస్వరూపుండైన యముండును. గోప స్వరూపుండైన రుద్రుండును, దన్మాత్ర స్వరూపులైన పితరులు. క్రమ క్రమంబున వైశ్వానరునట్లు పలికి వెడలిపోవ, నప్పితామహుదేహంబు షోడశాత్మకుండు నానందమయుండైన సోముచేత నాప్యాయితంబై కను గందక పూర్వప్రకారంబున నుండిన విలోకించి పీతిహోత్రముఖ క్షేత్రాధి దేవతలు వైలక్ష్యంబునం బొంది, సోమాభిధానుండైన పరమే శ్వరు నుద్దేశించి. దేవా! పావక ప్రాణాపాన వాగంబర ధాత్వహంకార నయన కామక్రోధలోభ మోహ మద మాత్సర్య భూమికైశ్వర్య శ్రవణ పవన మనోధర్మ రోషతన్మాత్రలు నీవ, యట్లగుట యెఱుంగక దురభి మానంబున మేము లేక నిర్వహింపదని భవదీయ దివ్య శరీరంబు విడిచి వెడంగుల మైతిమి. మమ్ము నిర్మించిన నీవ విగతస్థానులం జేయక మన్నింపుమని సన్నుతించిన నమ్మహాత్ముండు "మిమ్ము వినోదార్థంబు కల్పించితి నింతియ కృతకృత్యుండనైన నాకు, మీవలన నయ్యెడు కార్యంబేమి? మీరు విచారింపవలవదు" మూర్తామూర్త రూపంబులు మీకు రెండేసి యిచ్చితి మూర్తరూపంబుల నవతరించి హవ్యవాహనాశ్వి

గౌరిగణపతి ప్రభృతి నామంబులం దాల్చి వర్తించి కడపట నావిగ్రహంబు ప్రవేశింపుండని వరం బిచ్చిన సంతసిల్లిరి. నారాయణు మహత్వం బిట్టిది, వారల జననంబును వారల భోజ్యంబులు వారల తిధులు వారల నర్చించు విధంబును రహస్యంబుగా వక్కాణింతు వినుము. 80

సీ. పరమాత్ముఁ డణువు నభస్స్వరూపంబు స
ర్వజ్ఞుండునైన నారాయణుండు
మొదలఁ దానేకత్వమున వినోదము సల్పు
చో భోగకాంక్ష సంక్షోభితాత్ముఁ
డై నిల్వ, భగవదాహ్వయ మహాసలిలంబు
వెడలె నానీరంబు వికృతిఁ బొంద
నాలోల కీలా కరాళానలము సంభ
వించె నాదహనంబు వికృతిఁబొంద

గీ. వాయువు జనించె నాగంధవహము వికృతిఁ
బొంద గగనంబు పుట్టె నీచందనమున జ
లాగ్ని పవనాంతరిక్షంబు లవతరించె
కలయఁ బడనంత నవలంబు గాలిఁగూడి. 81

గీ. నీరు శోషింపఁ జేయఁగా నింగి విఱిఁగె
నప్పుడప్పావక సమీరణాంబరములు
నాలుగును గూడి కఠిన పిండత వహించె
నట్టి పిండంబు పృథ్వీసమాఖ్యఁ దాల్చె. 82

గీ. వినుము నరపాల! తత్పృథివికి జలాది
యోగ కాఠిన్యమున గంధమొక గుణంబు
కల్గి నాల్గింటి గుణములు కలయ, గుణము
లైదు సమకూరె నదియ బ్రహ్మాండమయ్యె. 83

సీ. ఆ కాండభాండ మధ్యంబునఁ బరతత్త్వ
మూర్తి విష్ణుఁడు చతుర్ముఖ చతుర్భు
జంబులతోడఁ బ్రాజాపత్య రూపంబు
ధరియించి సృష్టి విధానమునకు
వగఁగాన లేక తీవ్రంబుగా రోషింప
నా రోషమున సహస్రార్చియైన
భయదానలము పుట్టి బ్రహ్మాండము దహింప
నజుఁడు వీక్షించి బ్రహ్మాండమెల్లఁ

గీ. గాల్ప హవ్యంబు కవ్యంబు దాల్పుమనుచు
నానతిచ్చిన కతమున హవ్యవాహుఁ
డై మహాత్మక! నాబుభుక్షాతురత్వ
మడఁగు చందము చెప్పంగ నవధరింపు. 84

వ. అని విన్నవించినఁ బ్రసన్నుండై జగన్నాటకసూత్రధారుండు హవ్యవాహనా! నీవు యాజకదత్త దక్షిణల సంతృప్తుండవై దేవతలకుఁ దద్భాగంబు లిచ్చును దక్షిణాగ్నినామంబును సకల స్థలంబుల నాహవనీయంబులు వహించి తదంశంబులు సుపర్వులకు సమర్పించుచు నాహవనీయాభిధానంబును వివిధ ప్రాణి శరీరంబులు గృహంబులనం బరంగు నా గృహంబులకుం బతివై గార్హపత్యాహ్వయంబును నిన్ను నుపాసించు విశ్వనరుల సద్గతిం బొందించుచు వైశ్వానర సంజ్ఞయు, బలధనంబులకు ద్రవిణంబను బద్దంబు చెల్లుట నా ద్రవిణం బొసంగుచు ద్రవిణ దాఖ్యయు గలిగి విహరించుమని నియోగించె నృపాలా! యింక విష్ణుని విభూతి కథన ప్రసంగ వశంబు నందెడి మహాత్మ్యం బెఱింగించెద నాకర్ణింపుము.

కం. అవహ్ని సవినయంబున
దేవా! యీ నాకు నొక్క తిథి తత్తిథిచేఁ
గావించెద సంతృప్తి స
దా విశ్వంబునకు ననిన ధాత సుముఖుఁడై. 86

సీ. నానాసుపర్వగంధర్వయక్షులకు వై
శ్వానర ప్రతిపదా వాప్తి నీవు
చేయుదుగాన నిచ్చితి; పరితిపన్నామ
తి నీకు నాపుణ్యతిథిఁ బవిత్ర
హవ్యంబుచే నిన్ను యజియింప సంతృప్తిఁ
బొందుఁ జరాచర భూతకోటి
యిట్టి పాడ్యమి నెవ్వఁడేని భవత్ప్రీతి
గా నిరభ్యవహారుఁడైన ధేను.

గీ. దుగ్ధ మాత్రాశనుండైన దొరకు నాక
తార్థునకు ముప్పదాఱు మహాయుగములు
నాకసుఖమును వెనుక నర్ణవపరీత
సకల భూచక్రపాలనై హిక సుఖంబు 87

కం. అని పలుక బ్రహ్మశాసన
మున మెలఁగె హుతాశనుండు పురుషులకు వధూ
జనులకుఁ బ్రాతఃకాలం
బున నీకథ వినిన సుకృతములు సిద్ధించున్. 88

సీ. భూప! ప్రాణాపానములు దస్రులై జనిం
చుట యింక విను మున్నజుండు గనియె
సుతులఁ దొమ్మండ్రఁ; దత్సుతులలోన మరీచి
గనియెఁ గశ్యపుని; నాకశ్యప ప్ర
జాపతి గనియె భాస్కరులఁ బన్నిద్దఱ
వారు మాసంబులు వత్సరంబు
దైత్యాంతకుఁడు తదాదిత్యులు పన్నిద్ద
ఱకుఁ బెద్దవాఁడు మార్తాండుఁ డతఁడు.

గీ. త్వష్టకన్యక సంజ్ఞ నుద్వాహమయ్యె
నవ్విలాసిని, యమ, యము నాహ్వయములు
గలుగు కొడుకును గూఁతును గనియె, గని ని
జేశ్వరుని మేనివెట్ట సహింపలేక. 89

శా. స్వచ్ఛాయన్ సుముఖిన్ సహస్రకరుఁ గొల్వన్ బెట్టి హేలా విహా
రేచ్ఛన్ గోడిగయై దువాళిఁ జనియెన్ హేషల్ ఘనధ్వానముల్
దుచ్ఛం బాడ శరీర దీప్తి వితతుల్ తొల్వానకాలంపుఁ జం
చచ్ఛం పాలత నవ్వ నుత్తర కురుక్ష్మామండలీ సీమకున్. 90

మ. నలినాప్తుండును రూపరేఖల సవర్ణన్ సంజ్ఞఁగా నాత్మలో
పల భావించి సదానురక్తి విహరింపం గొన్ని సంవత్సరం
బులకున్ వారికి మందుఁడుం దపతియుం బుట్టంగ నాపిన్న పా
పల మీఁదం బలె సంజ్ఞ బిడ్డల యెడం బక్షంబు గావింపమిన్. 91

కం. ఛాయం గనుఁగొని నాయం
బా! యిటువలె నీకుఁ బక్షపాతపుఁ జేతల్
చేయన్ శిశువులపై ననఁ
గా యముఁ డేడ్చుచు సహస్రకరుతోఁ బలికెన్. 92

శా. తండ్రీ! సారెకు రువ్వు నాగ్రహము మీఁదంగ న్నదేగాతిగా
గుంద్రాలం గొని దాయగాక యది నాకుం దల్లియే! యెన్నఁడున్
వీంద్రం జూచిన జాడ నన్ను యమునన్ వీక్షింప; దంతంతకుం
ఖీంద్రం బయ్యెఁ గసిండికోత వలదా మీకున్ విచారింపఁగన్. 93

సీ. అని తనపైఁ గొండియము చెప్పఁ రోషస
వర్ణ వివర్ణ విఘూర్ణమాన
లోచనయై జముఁ జూచి పరేతభ
ర్తవు గమ్మటంచు ఘోరంబుగా శ

పింప; బిడ్డనిఁ జేరఁ బిలిచి పద్మాప్తుండు
వత్స ! మీ దట సమవర్తి వైఁది
గీశ్వరత్వంబు వహించెద వంచు నా
శ్వాసించి తత్కాంత సంజ్ఞ గామి

గీ. మానసంబున భావించి మండిపడుచు
నోరి దుష్టాత్మ ! జనని మహోగ్ర కలుష
కృత్యము నిమిత్తమునఁ గ్రూరదృష్టితోడ
సంచరింపుము నీవని శని శపించి. 94

కం. వంచించి ప్రాణవల్లభ
గొంచక తానుత్తరకురుకుంభినిఁ బంచా
రించిన; గోడిగయై వ
ర్తించు విధము యోగదృష్టిఁ దెలిసి తురగమై 95

కం. పుంఖానుపుంఖరింఖా
సంఖాత వసుంధరా రజమ్ములు చదలం
బ్రేంఖోళింపఁగ సంజ్ఞా
కంఖాణిం జేర నరిగి కామాతురతన్. 96

వ. పునః పునః ప్రోథ చలనంబునఁ దశనకిరణ ధాళధళ్యంబులు దశాదిశావ
కాశంబులఁ బ్రకాశింప, నిశ్వాసంబులు నిగుడ మెడసాచి కూణిత దృక్కో
ణంబుల తోడ వదనంబు గదియించి, నస చేసిన బిసరుహాప్తునిం గా
నెఱింగి నిజాంతరంగంబునఁ గౌతుకంబు చదుకొత్త; నత్తరి నత్తఱవైన
తత్తడి మత్త కాశినిం జిత్త జత్త జక్రీడా వినోదంబు నంగూడ; సూర్య
వీర్యంబు రెండు ప్రకారంబుల సంజ్ఞా గర్భంబునఁ బ్రవేశింప సద్యస్స
మయంబున నరభుకు లిద్దన విర్భవించిత తంద్రికి సాష్టాంగంబు లెఱంగి
తదీయ నిర్దేశంబున నొక్క పుణ్య ప్రదేశంబునకుం జని నారాయణాత్మ
కుండైన బ్రహ్మ నుద్దేశించి "బ్రహ్మణే బ్రాహ్మణ ప్రియాయ స్థాణకే
మహాస్థాణకే స్థిత స్థాపకాయ పురుషాయ మహా పురుషాయ పురుషోత్త

మాయ భూతాయ మహాభూతాయ భూతాధిపతయే సౌమ్యాయ మహా సౌమ్యాయ సౌమ్యాధిపతయే దైత్యాయ మహాదైత్యాయ దైత్యాధిపతయే రుద్రాయ మహారుద్రాయ రుద్రాధిపతయే విశ్వాయ మహావిశ్వాయ విశ్వాధి పతయే పక్షిణే మహాపక్షిణే పక్షిపతయే ప్రజాపతయే పరమేశ్వరాయ నారాయణాయ నిష్క్రియాయ నిష్ప్రపంచాయ నిర్గుణాయ నిరపేక్షాయ నిరాశ్రమాయ నిరామయాయ నిరాలంబాయ నిరాచారాయ నిరాధారాయ నిరాలోకాయ విష్ణవే నమోనమోయని బ్రహ్మపారస్తోత్రంబు ప్రాతఃకాలం బున జపింప దయా సన్నిధి వెన్నుండు ప్రసన్నుండై వారికి యజ్ఞ భాగయోగ్యత్వంబును దేవ సమానత్వంబును సమస్తవస్తు వేద్యత్వంబును హృద్య రూపత్వంబును గలుగ విదియనాఁడు వరం బిచ్చె నదిమొదలుగా నాశ్వినేయులకు విదియ ప్రియ దివసంబయ్యె నట్టి విదియఁ బిష్టాహారులై సంవత్సరం బొకటి గడపిన వారు సౌందర్యాదిగుణంబుల నాశ్వినేయ సన్నిభులై జనింతురు నరులీ కథ విన్న దోష నిర్ముక్తులు సుపుత్రయు క్తులునై సుఖియింతురు ధరిత్రీకళత్ర! యింక వాక్కు గౌరియై జన్మిం చిన విధంబు వినుము. 97

సీ. మున్ను సృష్టి విధానమునకు నుపాయంబు
గానక కోపించి కమలభవుఁడు
తనకోపమున జనించిన రుద్రునకు గౌరి
పేరి కూర్మి కుమారిఁ బెండ్లి సేసె
రుద్రుండు గౌరీ సరోరుహపత్రాక్షిఁ
గూడి వినోదింపఁ గొంతకాల
మునకు నా బ్రహ్మ రుద్రునిఁ జూచి ప్రజలఁ గ
ల్పింపుము నీవని పెక్కు మాఱు

గీ. లాన తిచ్చిన నాకు మహాతపంబు
సలుపక ప్రజా వినిర్మాణ శక్తి చాల
దనుచుఁ గాండ జలంబుల మునుఁగ గౌరి
తనువు నిజదేహమున దాఁచె ధాత మఱియు. 98

కం. మానసములోన నేడ్వురు
సూనుల నిర్మించె నా ఋషులు వసుపశు రు
ద్రా నిమిష ముఖ్య బహు సం
తానంబులఁ గనిరి దక్ష తనయుల వలనన్. 99

ఉ. ఆయెడ నొక్కనాఁడు చతురాస్యుఁడు రుద్రవధూటి గౌరి మ
త్కాయములోన దాఁచు కొనఁగాఁ బనిలేదని దక్షుఁ జూచి వ
త్సా ! యిది బిడ్డ నీకని సమర్పణ చేసిన నాటనుండి దా
క్షాయణియై వసించెఁ దదగారమునం గడునాదరంబునన్. 100

కం. భూనాథ ! యిట్లు గౌరి స
దా నయనోత్సవము సేయఁ దనకూఁతుల సం
తానము తామరతంపర
యై నెమ్మది నుండ దక్షుఁ డాహ్లాదమునన్. 101

కం. పులకించి చూచి నా తన
యల యీ బలగంబు చల్లనై వర్ధిలఁగా
వలె నధ్వరంబు చేసెద
నలినాసనునకు సమర్పణముగా ననుచున్. 102

వ. కృతనిశ్చయుండై మరీచి బ్రహ్మగా నత్రి బ్రాహ్మణాచ్ఛంసిగా నంగిర
సుం డాగ్నీధ్రుండుగాఁ బులస్త్యుండు హోతగాఁ బులహుం డుద్గాతగాఁ
గ్రతువు ప్రస్తోతగాఁ బ్రచేతుండు ప్రతిహర్తగా వసిష్ఠుండు బ్రహ్మణ్యుం
డుగా సనకాదులు సభాసదులుగా హిరణ్యగర్భుం డధిదైవతంబుగా నిజ
దౌహిత్రులైన రుద్రాదిత్యాంగిరస ప్రముఖులుం బితృవసుగంధర్వ గీర్వా
ణాదులుం బూజ్యులుగా నాజ్యధారా పరంపరాభిషేక జాజ్వల్యమాన పవ
మాన సఖ శిఖాముఖ చిటచిట ధ్వానంబులు మహేంద్ర ప్రముఖ బర్హిర్ము
ఖాహ్వానంబులు భుజగరాజ నిభవచో విలాస భాజన సజ్జన పరస్పరాలా
పంబులు యాజకస్వాహా స్వధాకార కలకలాటోపంబులు బధిరిత దిక్క
లాపంబులై కొనసాగ యాగంబు వేళ హేళి సహస్ర దుస్సహ మహస్స

నాధుండును సర్వజగన్నాధుండును సర్వవేదమయుండును సర్వజ్ఞానాశ్ర యుఁడును సరోరుహాక్షవాండమాలికా హారమనోహర గౌరీకుచస్పర్శియు ప్రత్యక్షదర్శియు మక్తమరుద్ధుర్యుండును నైన రుద్రుండు పదివేలవత్స రంబులు విశ్వనిర్నిమీష మహాతపంబుచేసి కాండసలిలంబు వెడలి. 103

కం. జన సస్య నివహ మృగ నగ
వన వనధి సమేతమైన వసుమతిఁ గనియున్
ముని పఠ్యమాన దక్షస
వన దేవాహ్వాన మంత్రవైఖరి వినియున్. 104

కం. నను మిగిలి జగతిఁ గల్పిం
చిన వాఁడెవ్వఁడు నితాంత చిత్తాహమికన్
నను మిగిలి యజ్ఞఫలముం
గొనియెడు వాఁడెవ్వఁ డనుచుఁ గోపించుటయున్. 105

ఉ. అశ్మాత్యంతకఠోరమూర్తులు మహాహాలాహలజ్వాల ధూ
మశ్మశ్రుల్ భుజదండ హిండిత కుఠారప్రాసఖడ్గార్గళా
రశ్మివ్రాతముతోడ వెల్వడిరి రుద్రక్రూర గాత్రంబునన్
గూశ్మాండాగ్ని వతః పిశాచగణ రక్షోభూత వేతాళముల్. 106

కం. ఈ విధమునఁ దనదేహము
లో వెలువడి వేలు లక్షలుం గోటులు భూ
తావళులు బహుముఖంబుల
సేవింపఁగ దక్షమఖవిజిత్వర బుద్ధిన్. 107

సీ. ధర్మ మక్షంబు నక్తందివములు చక్ర
ములు సదనంబులు మూఁడు బరము
స్మృతులు పగ్గంబులు మీమాంస కేతువు
పురుషార్థములు నాల్గు పూనుగాఁడి

పవమానములు నేమి వరము వేదములు తే
జీలు త్రివృత్తులు చెర్లకోల
పరమవిజ్ఞానసంపద కూబరంబు హి
రణ్యగర్భుండు సారథియునైన

గీ. సకల విద్యా వినిర్మిత స్యందనంబు
నందుఁ బ్రణవంబు గుణము గాయత్రి కార్ము
కంబు సప్త స్వరంబులు నంబకములు
గాఁగ రుద్రుండు రథికుఁడై కదలె నంత. 108

కం. నిశ్చేష్టితులై మునులు న
భశ్చరులు సమ్మదలుగా సభాజనములు చే
తశ్చాంచల్యమునం గడు
నాశ్చర్యము వడఁగ దక్షయాగము లోనన్. 109

గీ. రథికవర్యుని మూర్త్యంతరంబు గానఁ
దానతనిఁ గూడె ననఁగఁ గృశానుఁ డాజె
సారథి ముఖంబు సంభవస్థలము గానఁ
దా మతనిఁగూడె ననఁగ మంత్రము లడంగె. 110

చ. అవి గని ఋత్విజుల్ విముఖులై సురలార ! బలోద్ధతుండు దా
నవుఁ డొకఁ డేగుదెంచె సవనంబున భాగము లాహరింప న
న్న విని చలాచలిన్ విబుధనాథులు దక్షునితోడఁ జెప్పినన్
బవరము చేసి తద్దనుజుఁ బట్టుఁడు నావుడు వారు సుగ్రతన్. 111

చ. వెడవెడ నార్చుచున్ దిశలు బీఁటలువాఱ నదల్చి రుద్రుపై
నడచిన సమ్మహాఘురఁడు నవ్వుచు భూతపిశాచకోటిఁ జూ
చుడుఁ జని వేయఁ జొచ్చెఁ దపసుల్ ధరణింబడి బాతశింపఁగా
ముడుసులు గుండ్లు దుండ్లు శవముల్ పుఱియల్ పఱియల్
ముఖస్థలిన్. 112

కం. ఈ చందంబున భూతపి
శాచంబులు వైవ దేవసైన్యంబులు నా
రాచములు ముంప భూతపి
శాచములుం దఱుమ దేవసైన్యము విఱిగెన్. 113

కం. విఱిగినఁ గని మఖశాలకు
నుఱికి వసుంధర వడంక నొండొరు గడవం
బఱచుచుఁ బందులు పటపట
కొఱుకుచు నారుద్రసైనికులు ధౌర్త్యమునన్. 114

సీ. స్ఫ్యంబులు నఱికి యూపంబులు గూలిచి సో
మము గ్రోలి కృష్ణాజినములు చించి
మునుల భార్యలఁ దోఁచుకొని పురోడాశంబు
మెక్కి వేదులు గొఱ చక్కలాడి
హోమకుండములు నిర్ధూమధామంబులు
గావించి పశువులఁ గావు పట్టి
స్రుక్కులు విఱిచి ఋత్విక్కుల బాధించి
సదమదంబుగ సభాసదులఁ దోలి
గీ సవన వాటంబు నుగ్గునూచంబు చేసి
యింద్రులోపలఁ గాన మే సందిగొంది
నడఁగెనో చూడుఁడా సోమయాజిగాని
ననచుఁ బరువులు వెట్టుచో నమరవరులు. 115

కం ఆహవ సన్నాహ ప్రతి
ఘా హుంకారములు నిగుడఁ గొడ్షేయకరా
శాహతుల భూతబల సం
దోహంబుల మీఁద గవిసి నొప్పించుటయున్. 116

వ. రుద్రుండు రౌద్ర సమున్నిద్రుండై మరుద్రాజి నాజిం బడలువరచి మెఱుంగు మెఱచిన చందంబున నిజస్యందనంబు మెఱయ నెఱయం బరాక్రమించె మించినం గని భగుండు దిగిభంబులు వెగడు కుడవ నార్చి యెదిర్చి పేర్చిన వాని కన్ను కార్చిచ్చు వంటి శరంబునం బోకార్చి తత్సహోద దరుండు భుజదండ కుండలీకృత కోదండ పరివేషుండు పూషుండు ధట్టించి కిట్టిన మిట్టకోలలం దొడిగి వాని పండ్లు డుల్లనేసి బోసిం జేసి హెచ్చుటయు, సొచ్చి వియచ్చరులు విచ్చి భయపలాయమానులైన మగుడ వారి నాలంబునకు నూలుకొలిపికట్టిన పచ్చపట్టుదట్టి చెఱంగులు రింగులు వాఱ భుజార్గళ చతుష్టయంబున శంఖచక్రగదా శార్ఙ్గంబులు వట్టి వినత పట్టి నెక్కి మార్కొని జనార్దనుండు నారాయణాస్త్రంబు ప్రయోగించినం గపర్ది పాశుపతాస్త్రంబు వఱపె నిట్లు హరి హర ముక్తంబులైన దివ్యశరంబులు పరస్పర జిగీషామర్షంబున వర్ష సహస్రంబులు సమరంబు సలుపుచు నప్రతిహతప్రభావంబున. 117

సీ. ధరియించె నొకటి సుదర్శనచక్రంబు
కొనియె ముమ్మొనల కుంత మొకటి
కాంచనచేలంబు గట్టె నొక్కటి గప్పె
నొకటి చాఱలవన్నెమెకముతోలు
కౌస్తుభరత్న మొకటి పూనె గాలి మే
తల కడియంబును దాల్చె నొకటి
లేలిహానారి దువాళించె నొక్కటి
తొడుకుబాబా నెక్కి తోలె నొకటి

గీ. మకుట మొక్కటి సవరించె నొకటి జడలు
ముడిచె నొకటి మొరసె నంబురుహనేత్ర
ముల నొకటి బేసి కన్నుల నిలిచె శంఖ
మొకటి పూరించె డమరుకం బొకటి ద్రిప్పె. 118

కం. అపుడు సమీపంబున ను
న్న పంకరుహసంభవుండు నారాయణ పా
శుపతాస్త్రంబులు వీక్షిం
చి పెద్దయెలుఁగునఁ బ్రశంస చేయుచుఁ బలికెన్. 119

శా. ఓహో ! యీ గతిఁ బోరఁగా సకలలోకోపద్రవం బయ్యెఁ జూం
డీ ! హంకారము మాని పూనుఁ డిఁక శాంతిన్ మీరు మీలోన నే
లా హింసా పరతంత్ర బుద్ధి హరి రుద్రాస్త్రావతంసంబులా
రా ! హేరాళము వెళ్లెఁ గాలమని చేరవ్వచ్చి ప్రార్థించినన్. 120

సీ. ఆరుద్ర నారాయణాస్త్రద్వయంబు శాం
తి వహించుటయు భారతీవరుండు
శంకరాంబురుహాలోచనుల నిరీక్షించి
హరిహరులార ! చరాచర ప్ర
పంచ రక్షణము గావించుఁడు మీరంచు
వచియించి సర్వగీర్వాణులార !
క్రతువుల మొదలిభాగము రుద్రయోగ్యం బ
టంచు వేదములు ఘోషించు గానఁ

గీ. దొలుత యజ్ఞాంశ మిచ్చి రుద్రుని పరాక్ర
మంబు గొనియాడి సత్కృపా మహిమ గాంచి
బ్రదుకుఁ డనవుడు వారలు పరమభక్తి
యుక్తి దండప్రణామంబు లొసఁగి నిలిచి. 121

రగడ. రుద్ర ! జగద్రక్షా దక్షిణ ! కారుణ్య సుధారస పూర్ణ దృగంచల !
భద్ర గుణైకాశ్రయ ! మధ్యందిన భాను సహస్ర సమాన తనుప్రభ !
ఖట్వాంగ కురంగ కపాల త్రిశిఖ ప్రముఖ విభాసి భుజామండల
పట్వాప కలాపగూఢపా త్పరివృఢ హారధురంధర కంధర !
కంఠేకాల మదావళ దనుజా ఖర్వ గర్వరేఖా నిర్వాపక !

కుంఠీభూత త్రిపుర ధాతృ వైకుంఠాది సుపర్వస్తుత విక్రమ !
ఫాలాంబక పావక చుంబిత రతిపతి భస్మస్థాసక వక్షస్థల !
బాలసుధాకర కోరకిత జటాపటల భగాక్షి విపాటన కరశర !
పోషితభక్త చపేటనిపాతిత పూషదంతి దంతురిత రణాంగణ !
యోషాయిత వామశరీర ! మహాయోగి హృదయ పుష్కర పుష్పంధయ
ప్రధ్వస్తా ధ్వర ! బహు విద్యామయ ! రథబద్ధ చతుర్వేద తురంగమ !!
సాధ్వసదాయిక దోరదంష్ట్రిక చక చక శోభాస్రేడితాట్టహాస !
వెంగలి దక్షునిఁ గూడినకతమున విజ్ఞానము చెడి పశువుల మైతిమి !
గంగాధర వేయేటికి నీ భారము మనుపంగా నొచ్చిన వారము
జగదుత్పత్తి స్థితిలయములు నీ శాసనమున వర్తిల్లు సంతతము
నిగమోక్త ప్రథమాంశముగొని మన్నించి యజ్ఞ మీడేరఁగఁ
జేయుము. 122

మానిని. అంచు మహేంద్ర ముఖామర పుంగవు
లంగములం బులకాంకురముల్
ముంచుకొనం గరముల్ నిటలంబుల
మోపుచు భక్తి సమున్నతిఁ బ్రా
ర్థించిన వారల దీనత మాన్పఁగ దేవుఁడు
చల్లని చూపుల వీ
క్షించి సుధా పరిషిక్త మృదూక్తి వి
శేషము దోఁప వచించెఁ గృపన్. 123

సీ. వాసవప్రముఖ దేవతలార ! ప్రథమాంశ
మునఁ దృప్తి పొందె నామనము దక్ష
మఖము ధన్యత వహింప నన్ను గ్రహించితి
భగులోచనముఁ బూషపండ్లు మున్ను
వలె నుండఁ జేసితిఁ గలనిలో మత్ప్రితా
పంబు గనుంగొని పశువులై చ

రించిన మిమ్ముఁ బాలించి విజ్ఞాన మి
చ్చితిఁగాన నేఁ బశుపతి సమాహ్వ

గీ. యమున విహరింతు నీ దినం బాదిగాఁగ
శాంతులై భూతి రుద్రాక్షజటలతోడఁ
బాశుపతదీక్ష ననుగొల్చు భక్తవరులు
మోక్షలక్ష్మీవధూరత్నమునకు వరులు. 124

కం. అని గీర్వాణులతో మ
న్నన నానతి యిచ్చి రుద్రునకు వాక్పతి ద
క్షుని సుతగౌరి జగన్మో
హిని గుణవతిఁ బెండ్లిచేసి యిట్లని పలికెన్. 125

వ. దేవా! యీ వామనేత్ర జగజ్జనయిత్రి మత్త కీరవాణి వాణిగా నిజప్రభావ సకలగిరి పరిహాసంబైన కైలాసంబు నివాసంబుగా వాసవప్రభృత్యాదిత్యులు భృత్యులుగా నస్మదాదులకుఁ బూజ్యుండవై లోకైక సామ్రాజ్య వైభవంబు లనుభవింపుమని తదనుమతంబున దక్ష ప్రముఖులు గొలువ ప్రాజాపత్యపురంబునకుం జనియె నిటనిటలాక్షుండు దాక్షాయణిం దోడ్కొని మహాప్రమథగణంబు భజింప రజతాచలంబునకు విజయం చేసెనని వరాహదేవుండు చెప్పినఁ గుంభినీరంభోరువు మీదటి వృత్తాంతం బాన తిమ్మని విన్నవించిన. 126

శా. ఏణీ దృఙ్మకరాంక! సాల్వ నరసింగేంద్రానుకంపా సరి
ద్వేణీ వర్ధిత కీర్తి కల్పక! చతుర్వేలా సమావేల్లిత
క్షోణీభారభరాణదక్షిణభుజా కుంభీనసాధ్యక్ష! గీ
ర్వాణీ సంతతగీయమాన రణదుర్వార ప్రతాపోదయా. 127

కం. నిర్ధ్వస్త సకల కలుష ము
హుర్ధ్వనిత వరూధినీ మహోగ్ర పటహ భి
న్నోర్ధ్వాండ చక్రవాళ బ
హిర్ధ్వాంత పరంపరా సుహృత్కీర్తి విభా. 128

పంచచామరము. కుఠార శూర వార కంఠకుంఠ నైక మర్మక
ర్మఠాది దారి శౌరి భక్తి రక్తి యుక్తి ఫల్గుణా
శఠారిభూవరా సువాతజాతవేది గూఢపా
త్కఠారికా కఠోర దోర ఖర్వ గర్వ ధూర్వహా. 129

గద్యము. ఇది శ్రీ మదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభిధాన ఘంటనాగయప్రధానతనయ సింగయకవిపుంగవ ప్రణీతంబైన శ్రీవరాహపురాణం బను మహాప్రబంధంబునఁ బంచమాశ్వాసము

శ్రీ

# వరాహ పురాణము

## షష్ఠాశ్వాసము

—*—

శ్రీహిత నిశాంత ! పద కట
కాహిత హరి నీల పుత్త్రికాకార తృణ
గ్రాహి తరళాయ మానమ
దాహిత భూకాంత ! యాశ్వరాధిపు నరసా ! 1

వ. అవధరింపు మవ్వరాహదేవుండు భూతధాత్త్రి కిట్లనియె నట్లు ఖండేందు
శేఖరుండు వెండికొండకు విజయంచేసి కొంతకాలంబు వినోదింప నొక్క
నాఁడు గౌరి తన మనంబున. 2

సీ. తండ్రి దక్షుండు చిత్తంబున ననుఁ గల
కాలంబు రిపు భార్యగాఁ దలంచి
గారవింపక మానునో ! రమణుండు రు
ద్రుండును శాత్రవదుహితగాఁగ
భావించి విశ్వసింపక మానునో ! నాకుఁ
గడవంగ రాని దుందుడుకు వుట్టె
నీ రీతిఁ బుట్టిన యింటికిఁ జొచ్చిన
యింటికి నెప్పుడు నెరపరంబు

గీ. సేయు కాయంబుతో నుంట సిగ్గు గాదె
వేయు నేటికి దేహంబు వేఱఁ దాల్చి

తపమునఁ బ్రసన్నుఁ గావించి తరుణ హిమక
రార్ధమౌళికి నిల్లాలి నగుదు ననుచు. 3

చ. హిమధరణీధరంబునకు నేగి తపం బొనరించి పెద్దకా
లమునకు యోగవహ్నిశిఖలం దనువల్లిక వేల్చి తన్నగేం
ద్రమునకు మేనకాసతికి నందనయై సరిలేని రూపచా
రిమ కొనసాగఁ దా నుమయుఁ గృష్ణయు నాఁగ ధరించె నామముల్. 4

గీ. ఆకుమారి పరంజ్యోతి నైన నాకు
బ్రోల నేటికిఁ బెట్టితె ముగ్ధ యనుచు
నగు విధంబునఁ బొమగుక్క నడుము నగుచు
నుండు మందిర దీపికాజ్యోతిఁ జూచి. 5

కం. అక్కుధరపుత్రి నాకున్
ముక్కంటికి వేఱులేదనుచుఁ దెలుపుటకున్
మిక్కిలికను దాల్చినగతిఁ
జక్కని రారేక నెన్నొసల దరియించెన్. 6

గీ. అమ్మహాశక్తి రత్నపుబొమ్మరింట్లఁ
జేర్చుఁ బన్నారుదొంతుల బిసరుహాస
నాండభాండంబు లీరీతి నుండ దొంతి
పేర్తునని లోకములకుఁ జూపెను వడువున. 7

గీ. ఆయిగురుటాకుఁ బోడి నామాయ నిట్టు
పడుచు లేచుచు నుండురు పద్మసంభ
వాదులని తెల్పు తెఱఁగున హస్తవాతు
రీధురీణతఁ గందుకక్రీడ సలుపు. 8

చ. అతివిశదప్రభా విలస నాస్పదమైన పదాంగుళీనఖ
ప్రతతి వెలుంగు నా హిమధరాధరపుత్రికిఁ బద్మనేత్రకున్

గతజననంబునం దమకు గాఁడిలిసోదరిగాన భక్తితో
సతతము గొల్వ దక్షతనుజాతలు తారలు వచ్చెనో యనన్. 9

కం. అంబుజభవాది విబుధ గ
ణంబుల దొడ్డతనమెల్ల నాకు వెనుక త
ధ్యంబని చూపెననంగా
బింబాధర దొడ్డతనము పిఱుఁదునఁ దాల్చెన్. 10

కం. ఆకన్యారత్నంబు ని
రాకారుండైన శివుని హత్తిన తన మా
యాకళ చందము దోఁపఁగ
నాకాశమునంటి నడుము నారు వహించెన్. 11

కం. కాఠిన్యము దోరంతర
పీఠిం బూర్ణంబులైన పృథుకుచముల నా
పాఠీననయన దాల్చెం
దా తేవం దంద్రిగుణము దాల్చిన భంగిన్. 12

గీ. ఆసతి ధరించె శక్తిత్రయ ప్రభావ
భావములతోడ విహరించు పరమశక్తి
నేననుచుఁ దెల్పుగతి మోవి నీక్షణముల
నెఱుల నరుణిమ ధవళిమ నీలిమయును. 13

కం. ఈరీతి గోత్రకుధరా
గారంబున శైశవంబు గడపి క్రమమునం
దారుణ్యము గైకొని జగ
దారాధ్య మృగేంద్ర మధ్య హైమవతి మదిన్. 14

కం కనకధరాధరచాపుఁడు
తనపతి గావలె నటంచుఁ దలపోసి మహా

వనమునకుఁ జనియె జననీ
జనకుల యనుమతిఁ దపంబు సలిపెడు కొఱకున్. 15

సీ. చని పూగ పున్నాగ సాలరసాలాది
సాలరమ్య ప్రదేశముల నిలిచి
కందక పాటలగంధి కావునఁ దీవ్ర
తాధురామోఘ నిదాఘవేళ
కొంకక క్రొమ్మెఱుఁగుంబోఁడి గావున
జాతనిర్ఘాతజీమూతవేళ
వందక శీతాంశువదన గావున దీర్ఘ
యామినీ ఘోర నీహారవేళఁ

గీ. దపము గావింప వెడలె వత్సర సహస్ర
ములు మహాదేవుఁ డంత నాఘామిధకకు
మారి గౌరి ననుగ్రహింపంగఁ దలఁచి
తొంటి తనలాంఛనంబులు తొలఁగఁబెట్టి. 16

సీ. అనవరతస్నానమునఁ జేసి కలుష సం
తట వండువట్టినతల వడంక
సారెకు నుష్ణించి నీరు గ్రమ్మెడు నేత్ర
ముల మీఁద నలిపిన బొమలు వ్రాలఁ
గడుపెద్ద యెముకలు గానంగ వచ్చు జా
మ్మన దొడ్డ జన్నిదంబులు చలింప
త్రోళ్ళు వ్రేలాడెడు తుంటిపై బ్రహ్మక
మ్మల చింపి దోవతి ముఱికి వలవ

గీ. ముసలిబ్రాహ్మణుఁడై వేదములు చదువుచు
నలసి నిలుచుచుఁ దానడుగడుగునకును

దడఁ బడిపడుచుఁ బార్వతి దాయ వచ్చి
యీరెలుంగున దీవించి యిట్టులనియె. 17

శా. శ్రీశైలంబున సేతుబంధమునఁ గాంచిం గుంభకోణంబున
గాశిన్ మందరఁ గాళహస్తి నిఁక లెక్క లెట్టఁగా నేల నా
నాశైవస్థలులన్ వసించితిమి కాంతా! నిన్నుబోలంగ రా
కాశీతాంశునిభాస్యలం గనము లోకఖ్యాతశీలంబునన్. 18

క. నాపత్ని నిర్నిమిత్తము
గోపించి తొలంగిపోవఁ గ్రుస్సి మనస్సం
తాపంబుతోడ వెదకుచుఁ
బైపాటున నిన్నుఁ గంటి భాగ్యముకతన్. 19

సీ. ఆఁకలి గొన్నాఁడ నశనంబు వెట్టింపు
మది నన్ను బ్రాహ్మణమాత్రుఁగా వి
చారింపకుము విను శ్రౌతకర్మమున ద
క్షత వహించిన ప్రతిస్పర్ధి విఱుగ
దట్టించి నాల్గువేదములు విభాశించి
బ్రహ్మరథంబెక్కి బహువిధాధ్వ
రాగ్రపూజనము పరిగ్రహించిన జగ
జెట్టి యోగ్యుఁడ నిన్ని చెప్పనేల

గీ. నాకు నొకనికిఁ బెట్టు ముల్లోకములకుఁ
దృప్తి గలుగు నటన్న గిరీంద్రకన్య
భూనిలింపఫలంబులు గాని యిచట
నశనము గడింపరాదు నీయడుగులాన. 20

క. కాన ఫలహారముఁ గొనఁ
గా నీచిత్తమున వేడ్క గలదేని గృత

స్నానుఁడవై రమ్మన నా
హా! నావాంఛితము సఫల మయ్యె నటంచున్. 21

శా. పట్టెన్ గట్టదరిన్ మహామకర మబ్రహ్మణ్యమై దా ననుం
జట్టల్ దూయక యుండ రమ్మ! విడిపించన్ గట్టుకో కీర్తికిన్
బట్టంబున్ సుకృతాత్మరాల! భువనప్రఖ్యాతిగానంచుఁ గూ
వెట్టన్ వించు నమశ్శివాయ యని భూభృత్కన్యవై యాకులిన్. 22

కం. పితృభావన హిమవంతునిఁ
బతిభావన శివునిఁ దక్కఁ బరునంటని నే
నితని భుజాదండము ప
ట్టి తిగువఁగా నెట్టులోర్తు దెందము గలఁగెన్. 23

గీ. అయిన నితని కరస్పర్శనాపయశము
మాన్పుకొనవచ్చుఁ గాని బ్రాహ్మణుఁడు మొసలి
బారిఁ బడి చావఁ గావని పాతకంబు
మాన్పుకొనరాదు జన్మజన్మముల ననుచు. 24

కం. వలిచనుగుబ్బల నునువ
ల్కల చేలము జాఱ నడుము గడగడ వడఁకన్
గలకంఠ శ్రుతి గెలిచిన
యెలుఁగున బ్రాహ్మణున కభయమిచ్చుచుఁ బఱచెన్. 25

గీ. పఱచి పార్వతి పరమకృపారసంబు
భయరసంబు మనంబులోపలఁ దొలంక
గంగదరి ద్రొక్కి నిలిచి తత్కపటవిప్రు
పాణికర పల్లవంబునఁ బట్టి తిగువ. 26

మ. కులకాంతా కరసంగమంబు మఱియుం గొందాక నాకాంక్ష సే
యులలాటాక్షుని సమ్మతిన్ మొసలి నిమ్నోదప్రవాహంబులో

పలికిన్ రాఁ దిగుచున్ మరుత్తటిని సాపత్న్యంబునం బార్వతీ
లలనం గైకొన నీక వల్లభునిఁ గేలంబట్టు చందంబునన్. 27

క. ఈపగిది మొసలి సలిలము
లోపలికిన్ దిగువఁ దావెలుపలికిఁ దిగువన్
బాపనిఁ గొంత దడవు ఫే
నాపుత్రిక తిగిచి తిగిచి నాఁటిన వగలన్. 28

చ. బరవసమైన యీతని విపద్దశ యేగతి మాన్పుదుం గటా
హరహర! యంచుఁ బల్కుటయుఁ నవ్వచన ధ్వనికంటె మున్న శం
కరుఁడు నిజాకృతి న్నిలచె గంధగజేంద్రముతోలు మౌళి పె
న్నురువులజాలు పాపములనూలు సితాంగము డాలు మీఱఁగన్. 29

సీ. ఆవేళ గిరిజ దా నాదిజన్మంబునఁ
దొలఁగి యేతెంచుట దలఁచి నాన
నాననాబ్జము వంప నభవుండు నవ్వుటా
లకు బల్కెఁ గోకిలాలాప! నన్నుఁ
జెట్టపట్టక వృథ సేయకుమన్నఁ బ
న్నగహార ఘోరకాననములోనఁ
దపము గావించుట ధవునిఁగా నినుఁగోరి
కావున నది వృథగాదు వినుము

గీ. విన్నవించెద నొకమాట నన్నుఁ గన్న
తండ్రి నీహారనగరాజు ధారవోసి
యీనిఖిలలోకవిదితంబుగా నమాన
వైభవంబున వచ్చి వివాహ మగుము. 30

వ. అని సవినయంబుగా ననునయాలాపంబులు పలికి చిట్టకాలకుఁ జెట్టవట్టి విడువని గట్టువిలుకాని నెట్టకేలకు నొడంబఱచి తదనుమతిం బార్వతి పుట్టినింటికిం జనియె ముక్కంటియు నిజనిశాంతంబైన రజతసాను

మంతంబునకు విజయం చేసె నట్లు పుట్టినింటికిం జని తనకావించిన ఘోర
తపః ప్రభావంబునకు మెచ్చి కృపాసముద్రుండగు రుద్రుండు ప్రత్యక్షం
బై పలికిన చందంబు సమందాక్షంబుగా మంద మందాక్షరంబుల నుమా
కాంత హిమవంతునికి విన్నవించి జనక ! కనకధన్వుండు వెనుకటి
జన్మంబున మత్ప్రాణవల్లభుండు గావున నది యెఱింగిచితి మీఁదటి కర్త
వ్యంబు మీక తెలియు నన్న నన్నందనిం జూచి నిజాంతర్గతంబున నేఁడు
నాజీవనంబు పావనం బయ్యెఁ బొమ్మంచు మంచుగుబ్బలిరాచవాఁడు
పరమానంద బాష్ప మకరంద తుందిల నయనారవిందుండై. 31

కం. ఎల్లజగంబులు నేలిన
హ ల్లకహితజూటుఁ డల్లు డయ్యెడు నఁట ! నా
యిల్లు వెలసె లోకంబులఁ
దల్లీ ! రుద్రాణి ! యెట్టి ధన్యుఁడ నాకో ! 32

గీ. పరమ పావని విశ్వ ప్రపంచజనని
వైన నినువంటి కూఁతును గానలేరు
గాన నానాసుపర్వులలో నపత్య
వంతు లెవ్వారు నా యీడువారుఁ గారు. 33

మ. అని గౌరీరమణీశిరోమణికి నాహ్లాదంబుగాఁ బల్కి వే
చని లోకైకపితామహున్ నలువ నాస్థానంబులో నుండఁగాఁ
గని దేవా ! శశిఖండమౌళికి నుమం గల్యాణి నాకూర్మినం
దన నీ నాత్మఁ దలంచి దేవరకు విజ్ఞాపింప నేతెంచితిన్. 34

క. నావుడు సంతసమున వా
ణీవిభుఁ డిది మంచితలఁపు నీహారగిరీం
ద్రా ! వివిధామర సహితుఁడ
నై వచ్చెదఁ బెండ్లి చూడ నాయిత పడుమా. 35

క. అని వీడుకొలుప నజ్ఞా
నుశాసనమున నగాగ్రసరుఁ డింటికి వ
చ్చి నిజపురము శృంగారిం
చి నిరాఘాట ప్రమోద చిత్తము తోడన్. 36

సీ. స్వస్తి సమస్తభవ్యగుణ సంపన్నుఁడై
న తుషారపర్వత నాయకుండు
స్వస్తి సమస్తదివ్యగుణ సంపన్నులై
న నిషధ వింధ్య మందర సుమేరు
దర్దుర గంధమాదన మాల్య వత్పారి
యాత్ర లోకాలోక చిత్రకూట
మలయ ప్రముఖ బాంధవులకు సంప్రీతిఁ బు
త్తెంచిన శుభలేఖ దేవదేవుఁ

గీ. డైన శిశునకు మన గౌరి నాదిశక్తి
నిచ్చుచున్నాఁడ మీరలు వచ్చునది వి
వాహమున కంచు లేఖలు వ్రాసి పంప
వారు నాకారములు దాల్చి వచ్చి రపుడు. 37

కం. వేగవతీ యమునా గం
గా గోదావరులు మొదలుగా గల నదులున్
సాగరములు భూరుహ లతి
కాగుల్మము లవయవములు గైకొని వచ్చెన్. 38

వ. ఇట్లు వచ్చిన చుట్టంబుల యథోచిత ప్రకారంబుల గారవించి మంచుగుబ్బలి రాచవారు తనకు సహాయులై విహరింప బ్రహ్మాండంబు చవికెగా నక్షత్ర పథంబు ముత్యాల మేలుకట్టుగా మేదిని వేదిగా దిగంత శుండాలంబులు పూజకుండలుగా నవద్వయద్వీపంబులు జాజాలపాళికలుగా జలనిధానంబులు కలశంబులుగా దివాకరులు దివియలుగా సుధాంశుండు గడియారంబుగా మేఘంబులు వాద్యంబులుగా వివాహంబు సేయ నాయత్తపడి పెండ్లి

కౌతుకుం బిలువం బంచిన మందరం బమందరయంబునఁ గైలాసంబునకుం జని కింకుర్వాణ సర్వ సుపర్వ శర్వుంగని సాష్టాంగ దండప్రమాణంబు గావించి దేవా ! వైవాహికముహూర్తం బాసన్నం బయ్యె విచ్చేయుమని విన్నవించిన నన్నీలకంధరుండు నిజవివాహవృత్తాంతంబు నీరజాసను వలన మున్నవిని సమ్మతించిన వాఁడు గావున గమనోన్ముఖుండై. 39

సీ. రింగులు వాఱ గైరికపు గెంటెంపుఁ బ
చ్చడము గటిప్రదేశమునఁ గట్టి
పాటలరుచుల సౌభాగ్యంబు మాపు ర
త్నవిభూషణములు గర్ణములఁ దాల్చి
ధవళతరచ్ఛాయ నవకంబులైన ప
చ్చసరాలు విపులవక్షమున వైచి
కపిలజటావల్లికలలోన పెక్కు తో
యముల క్రొవ్విరుల మాల్యములు ముడిచి

గీ. ఫాల ఫలకాగ్రమున శరత్కాల చంద్ర
కాంతి మించు ననంగ రక్షా తిలకము
తీర్చి పావన ధర్మంబు తేజి నెక్కి
వనరుహభవాది గీర్వాణవరులు గొలువ. 40

గీ. రాజరాజసఖుండు రాజసంబున శైల
రాజ రాజధాని రాజమంద
లావరోధి రత్నహర్మ్య స్థల బహువి
ధాని సప్త నవనిధానిఁ జొచ్చి. 41

క. నిక్వాణంబులఁ జరణ ప్ర
దాక్వంగద భూష లదర ధరవల్లభ సౌ
ధక్వంగణ భాగంబున
శాక్వరపతి డిగ్గి సురలు సాహో ! యనఁగన్. 42

గీ. అవసర మెఱింగి యక్షనాయకుఁడు మెలపు
తోడఁ దొడిగింప రత్నపాదుకలు మెట్టి
వ్రజికై దండఁ బట్టి వివాహవేది
కడకు విచ్చేయుచో నంతకంటె మున్న. 43

సీ. కట్టిన చీనాంశుకంబు శంబరవైరి
గద్దియ గవిసెనఁ గడవనాడ
చెరివిన గొజ్జంగివిరులు గాళింది లో
పలి ఫేనలవములఁ బరిహసింప
తీర్చిన కస్తూరితిలకమ్ము విరిదమ్మి
వ్రాలిన మత్తాలి గేలిసేయ
వైచిన మణిహార వల్లులు మేరు శృం
గంబుల మీఁది చుక్కల జయింప
గీ పార్వతీకన్యఁ గైసేసి భారతీ ర
మా శచీ ముఖ్యదేవతామానవతులు
తోడుకొని తేర శివునకుఁ దుహినధరణి
ధరవరేణ్యుండు విధ్యుక్తి ధారవోసె. 44

ఉ. హాటకగర్భుఁ డట్టిసమయంబున మంత్రము చెప్పఁ బార్వతీ
పాటలగంధి కంధరముపై నిజబాహుల రోమహర్షముల్
మాటికి మాటికి న్మొలవ మంగళసూత్రము గట్టె నా జగ
న్నాటక సూత్రధారుఁడు ఘనధ్వని మ్రోయఁగ దివ్యదుందుభుల్. 45

సీ. ఉమ రోమరాజితో నొరసి కీడ్పడిన చం
దమున భూషాహులు తలలు వంప
దుర్గ నేత్రంబులతో మాఱుకొని తిర
స్కృతమైన గతిఁ జేతఁ జింక బెదర

చండిక నొసలితో జగడించి విఱిగిన
చాడ్పున శశిరేఖ జడలు దూర
కృష్ణ పెన్నెఱులతో నెదిరి వీగిన విధం
బున గళచ్ఛవిభూతి పూఁత నడఁగ

గీ. పొగ నెపంబున మాటికి మొగము ద్రిప్పి
వామదేవుండు వామపార్శ్వమున నున్న
నమ్రవదనసరోజ నన్నగతనూజ
నానఁ జూచుచు హోమకృత్యంబు నడపె. 46

క. ఆడిరి రంభాదులు గొని
యాడిరి సారణులు చేరి హాహా హూహూల్
పాడిరి మేలంబులకున్
గూడిరి గీర్వాణ కుధరకులముల చెలువల్. 47

వ. ఇత్తెఱంగునఁ గురంగాంకశేఖరుండు సాంగంబుగా సర్వ మంగళ కళ్యాణం బవధరించి యీ దంపతులు చరాచర ప్రపంచంబు రక్షింతురు గాక యనుచు దీవించిన విరించి బహూకరించి సనక సనందన సనత్కుమారాది మహామునుల సంభావించి దేవతల మన్నించి హిమవన్నగ చక్రవర్తి సన్మానించి వారల వీడ్కొలిపి పార్వతీసహితుండై కైలాసంబునకు విజయం చేసె వసుంధరాధీశ్వర ! యివ్విధఁబునఁ బితామహ దక్షతు హీనక్షోణీధరంబులవలన గౌరికిం గలిగిన జనన్మత్రయంబు సురాసురలు నెఱుంగరు నీకు వినిపించితిని హైమవతి వివాహంబు తదియనాఁడు గావున నవ్వాసరంబునఁ గథాశ్రవణ పూర్వకంబుగా నుపవాసంబు సలిపిన నుప్పిడి చేసిన నారీనరులకు మనోరథంబులు సిద్ధించు నింక నాకాశంబు వినాయకుండై జన్మించిన చందంబు వినుము. 48

సీ. మున్ను గీర్వాణులు మునులు సుధర్మా స
భాసీనులై సచరాచరముగ

శిష్టజనంబులు చేయు కృత్యములు ని
రర్విఘ్నంబులై చాగురీతి దుష్ట
మతులు గావించు కర్మములు నిర్విఘ్నంబు
లై నడచుట మాన్పఁగా నుపాయ
మెద్దియో యంచు నూహించి మహోగ్రక
ల్మషకర హరికిఁ గైలాసగిరికి

గీ. నరిగి పరమేశ్వరునకు సాష్టాంగ దండ
ములు సమర్పించి శంకర ! పురనిశాచ
రావరోధ వధూకంఠ హార హరణ
కరణ చణ బాణ ! ధూర్తుల కార్యమునకు
నంతరాయంబు పుట్టింప నవధరింపు 49

కం. అంచు నుతియించుటయు శివుఁ
డించుక వడి తెప్పవాల్ప నెఱుఁగక యెదుటన్
జంచలత లేని తొలకరి
చంచలవలె నున్న శైల సంభవఁ జూచెన్. 50

కం. చూచి విసర్జిత పరవీ
క్షాచింతకుఁడై తదీయసౌందర్య సరో
వీచి కలలోన మునుఁగుచు
లేచుచు నిజహృదయ మనుగలింపఁగ మఱియున్. 51

సీ. పలుమాఱు సోమరి చలిగాలి సోఁకున
గదలెడు నీలాలకములు చూచి
తొలుకాఱు క్రొమ్మెఱుంగుల వంటి రుచులు ముం
దట వెదచల్లు నేత్రములు చూచి
చిన్నారి పొన్నారి చెమటచిత్తడి తోడి
వికచ కపోలపాళికలు చూచి

పచ్చి కస్తూరికా పంకంబు దాల్చి క్రి
క్కిరిసిన గుబ్బ పాలిండ్లు చూచి

గీ. కౌను చూడంగ నాత్మనాకసము దోఁప
వాయుతేజోంబు భూమి తత్వములు నాల్గు
మూర్తులు వహించి మింటికి మూర్తి లేమి
యేమి కారణ మనుచు నూహించి నవ్వె. 52

గీ. శంభుఁడీ చందమున జ్ఞానశక్తియైన
నగతనూభవఁ జూచుట నభము సంస్మ
రించుట నగుట మూర్తిభవించు మంచు
నలువ మును పల్కుటయుఁ గారణములు గాఁగ. 53

కం. క్షితి జల తేజో మారుత
పతి తద్గగనము జనించెఁ బరమేశ్వర సం
స్మిత ముఖమున సకల గుణా
న్వితమూర్తి వహించి చక్రిని కూమారుండై. 54

కం. ఈ రీతి సుదయమైన కు
మారునకు సహస్ర కోటి మన్మథ సదృశా
కారునకు వలచి సభలో
గౌరీ సేవానుయాత ఖచర పురంధ్రుల్. 55

కం. నిలిచిరి నివ్వెఱపడి వెల
వెలనై క్రొమ్ముత్తెలక చెమట వెడలఁ దదీ యో
జ్జ్వల కాంతి చంద్రికలలో
పల హిమకిరకాంతరత్నపాంచాలికలై. 56

కం. ఆతని సదాశివమూర్తి
ప్రతిమాన విలాసు వేడ్కపడి పరమపతి

ప్రతలకు నగ్రేసర పా
ర్వతి సైతము కంటిఱెప్ప వాల్పక చూచెన్. 57

ఉ. ఆ సమయంబునన్ మనసిజారి లలాటతటీ నటీభవ
ద్భ్రూభ్రమసముదగ్రుఁడై తన సుతుం గడకన్నులు జేవురింపఁగా
గాసిలి చూచి వీఁడు సురకాంతల నా సభలోన వెఱ్ఱులం
జేసెఁ దనూవిలాసముఁచే నని భీషణ భాషణార్భటిన్. 58

ఉ. ఓరి! గజాననంబును మహోదరమున్ భుజగోపవీతమున్
వారక తాల్చి మంచు గతవత్సలతన్ శపియింపఁ దద్విధా
కారము తోడ నిల్చె ముసు కామవికారసమేతలై తనుం
గూరిమిఁ జూచు నిర్జర చకోరవిలోచన లెల్ల దోయఁగన్. 59

కం. ఈ కరణి శప్తుఁడై వికృ
తాకారము దాల్చి నిలువ నాత్మోద్భవు నా
లోకించియు శాంతుఁడు గా
లేక హరుఁడు చెమట దొరుగ లేచి నటింపన్. 60

ఉ. ఆ సకలాత్ము పెంజెమట నంజనవర్ణులు చక్రశూల చా
పాసి ముఖాస్త్రహస్తులు గజాస్యులు పుట్టిరి భూమి భాగ సం
త్రాసముగా సభం బొక వినాయకుఁడైన విధంబు చూచి తా
నీసున వారి తత్త్వము ననేక వినాయకులైన లాగునన్. 61

వ. అప్పుడు కకుప్పుటలంబు పటపటం బగులమిగుల నుప్పతిల్లు ఘీంకారగజ్జల చప్పుళ్లతోడ సముద్దండ శుండా దండవ మధుశీకరంబులు భీకర వర్షంబులై కురియ గండమండల గళదానధారా ప్రవాహంబులు నిర్నిద్ర సముద్రంబులై వెల్లి విరియ ధగద్ధగాయమాన వివిధాయుధంబులు లయ సమయ విశద ద్వాదశాదిత్యులై బీరెండలు గాయ జగత్పూర్ణ కర్ణతాళ వాతూలంబులు సప్తసమీరంబులై విటతాటనంబులు సేయ ననల్పకల్పాంత శంక నావహించి విహరించు నిఖిలజన ప్రయోజన విటపి కుఠారంబుల హిమకర

కరాళమూర్ధ సార్థ త్రికోటి రోమకూప ఘర్మకణ ప్రభూత హీరంబుల విలోకించి కంపించిన ప్రాచీన బర్హిర్ముఖ బర్హిర్ముఖుల భయంబు నివారించి పరమేశ్వరు నుద్దేశించి దేవా! నీ వాకసంబున వినాయకవ్యాజంబున మూర్తీభవించితి వింక నిమ్మహానుభావునకు నుత్తమ నామధేయంబులు విభుత్వంబును బ్రసాదింపవలయు నని వినయంబునఁ బ్రార్థించినఁ గాత్యాయనీకాంతుండు శాంతుండై. 62

కం. సకల గజాస్యులు నీ సే
వకులై విహరింపఁ బ్రాభవము గనుము వినా
యక! దంతావళముఖ వి
ఘ్నకర గణేశాది నామకములఁ గుమారా. 63

చ. అని నిజవక్త్ర సంజనితుఁడైన వినాయకు నాదరించి పా
వన తటినీజలంబులు సువర్ణఘటంబుల నించి దేవతల్
గొని చనుదెంచినం గొలువుకూటములో రవికోటి దీప్తి మిం
చిన మణిపీఠిమీఁద నభిషేకము చేసి మృదూక్తి నిట్లనున్. 64

గీ. యజ్ఞదేవాది సకలకార్యముల నిన్ను
మొదలఁ బూజించు నిర్మలాత్ములకు ఫలము
గలుగఁ జేయుము నినుఁ గొల్వఁ దలఁపు లేని
ఖలుల కత్యంబులకు విఘ్నములు ఘటింపు. 65

కం. అని శంకరుఁ డానతి యి
చ్చిన సమయంబునఁ బులోమ జిచ్ఛిఖి యమ రా
క్షసుజాసన వరుణానిల
ధనపతి ముఖ నిఖిల దేవతలు సాంజలులై. 66

కం. కఠినోరగ బద్ధ మహో
జఠర! వినాయక! పినాకిసంభవ! జగతీ
శతకార్య విఘ్నకారక!
కుఠార సృణి పాశటంక గుంభితహస్తా. 67

తోదకము. అనత సర్వ సురావన! విఘ్నే
శాన! మనోరథ సౌధ ఘటా సో
పాన! గజానన! భక్త హృదేకా
లాన! సదాళి మిళద్వరదానా! 68

గీ. అనుచు నుతియించు వేల్పుల నాదరించె
ద్విరదవదనుండు తజ్జన్మదినము చవితి
గాన నాఁడు జనంబులు కథ విని తిల
భక్తము భుజింపఁ గామిత ఫలము గలుగు. 69

సీ. పార్థివ వినుమింకఁ బంచతన్మాత్రలు
పాములై పుట్టుట భారతీ క
ళత్రుని మానసపుత్రుఁడైన మరీచి
సుతుఁడు కశ్యపుఁడు దక్షుని కుమారి
కద్రూ సమాహ్వయ కామిని గర్భంబు
నందుఁ గర్కోటకానంత మహస్వి
పద్మ తక్షక మహాపద్మ వాసుకి సరీ
సృప కుళికా పరాజిత సుషేణ

గీ. శంఖ ముఖ్య సహస్ర భుజంగములఁ
గనియెఁ దత్సంతతిని గ్రమంబున జనించె
దుర్వికారాకరంబులు సర్వలోక
భీకరంబులు పెక్కు దర్వీకరములు. 70

మ. అవి లోకంబుల నిండి జంతువుల నుగ్రాపాంగ సంభూతహ
వ్యవహ జ్వాలల నీఱుసేయు ముఖ నిశ్వాసోష్మఁ గాల్చు న్విషం
బు వెలిం గాఱెడుకోఱలం గఱచి చంపుం బ్యాగడల్ విప్పి భ్రమిం
గు వధించున్ నృప! హస్త నిర్ఘృణ ఫణాకోటీ చపేటంబులన్.

కం. ఇప్పగిది నాఁడు నాటికి
నప్పాములు సంహరింప హతశేష జనుల్
నొప్పివడి పోయి నలువకుఁ
జెప్పిన నతఁ డాగ్రహంబు చిప్పిలు మదితోన్. 72

గీ. వాసుకి ప్రముఖాఖిల వ్యాళవరులఁ
బట్టి తెప్పించి విశ్వప్రపంచ మెల్ల
జెల్ల భక్షించితిరి గానఁ జెతుఁడు మీఁద
జనని కోపంబు కతమున నని శపించి. 73

కం. స్వామీ ! విషకలుషాత్ములు
గా మము సృజియించి నీవ కడపట నతి మా
త్రామర్షోపేతుఁడవై
భీమముగా నీగతిని శపింపం దగునే 74

సీ. అని విన్నవించిన నహుల వీక్షించి వి
రించి నే మిమ్ముఁ బుట్టించి నాఁడ
ననుచు భక్షించువారా ! జగజ్జంతు సం
దోహంబు; నిటువంటి దుండగముల
మాని కాలప్రాప్తులైన వారల నిర్ని
మిత్తంబు మిక్కిలి మీకు నెగ్గు
చేయువారలఁ గఱచి వధింపుఁ డన్యుల
త్రోవఁ బోవకుఁడు గారుడము వచ్చు

గీ. మంత్రవిదులకు నౌషధమణి సమేతు
లకు భయంపడి తిరుగుఁడు సకల సురవి
హంగపతులకు దాయాదులై నిలువుఁడు
గాలి నియతాశనంబుగాఁ గ్రోలి మనుఁడు. 75

క. ఆ కరుణతో మీరు బుభు
క్షుకులై భూలోక మతల కుతలముగాఁ జే
యక పోయి వసింపుఁడు త
ప్పక యిచ్చితి నతల వితల పాతాళంబుల్. 76

చ. అని పరమేష్ఠి పంప నతలాది పదంబులకున్ భుజంగముల్
పని వినె వాని సంభవము పంచమి గావున భక్తి నద్దినం
బున లవణాన్నముల్ వెరసి ముట్టక పాముల నాలపాల మ
జ్జన మొనరించు పుణ్యులకు, సర్పభయంబులు లేవు భూవరా! 77

వ. సర్వతత్వంబులకుఁ బరమంబైన పురుషుని వలన సత్వాదిగుణాత్మకంబై పరగు నవ్యక్తంబు సంభవించె నప్పరమ పురుషావ్యక్తంబుల వలన నడుమ మహత్తత్వం బవతరించె మహత్తత్వంబునకు నహంకార సంజ్ఞయుఁ బరమపురుషునకు శివనారాయణాభిధానంబులు నవ్యక్తంబున కుమారమానామంబులు ప్రవర్తిల్లు నేతద్విధ పరమ పురుషావ్యక్త సంయోగంబున నహంకారంబు గుహుండై జన్మించిన చందంబింక వినుము. బ్రహ్మమానస పుత్రులైన మరీచి ప్రముఖుల సంతానక్రమంబున సుపర్వగంధర్వ యక్ష పక్షి దనుజ మనుజ ప్రభృతి సృష్టివర్ధిల్ల దుర్ధర్షబల ధూర్ధరులు విప్రజిత్తి విచిత్తి భీమాక్ష క్రౌంచాహ్వయంబులు వహించిన రాత్రించరుల పరాక్రమంబునకు నిలువలేక చీకాకు పడిన నాకౌకసులం జూచి వాచస్పతి యిట్లనియె. 78

ఉత్సాహ. ఇంతవట్టు దేవసేన లెల్ల నేల నీశచీ
కాంతుఁ డొకఁడ బల్లిదుండుగాఁడు గాన నింకన
త్యంత శూరతాసనాథు దండనాథు మీరు ధీ
మంతులైతి రేని చింతమాని బ్రహ్మ వేడుఁడా. 79

ఉ. నావుడు వారు మంత్రి వచనంబులఁ గార్యము నిశ్చయించి భా
షావరుపాలికిం జని నిశాటవరేణ్యుల బాధ చెప్పి దే
వా వలె మాకు నొక్క దళవాయి ధరాధరవైరికిన్ మహా
దేవచమూకదంబక పతిత్వము దాల్చుట బెట్టుగావునన్. 80

క. అనవుడు వినివాక్పతి యి
ప్పని నాచేఁ దీర్పఁగాదు ఫాలాక్షి హుతా
శనకణ దగ్ధ పురత్రయ
దనుజునిచేఁ గాని దేవతావిభులారా. 81

మ హా స్ర గ్ధ ర

అనివారల్ వెంటరాఁగా నరిగి సకుతుకుండై పురోభాగభూమిన్
గనియెన్ నక్షత్రమార్గ గ్రహిశశిఖర శృంగాటక స్థాంధకస్ప
ర్థినిరాఘాట ప్రకాశ ద్విగుణ సితిమ దేదీప్యమానాత్మరోచి
ర్ధునికల్పి భూతసర్వ ద్రుమ జలధి చతుర్మ ద్రి నారాజతాద్రిన్ 82

గీ. కని విబుధులార! యిగ్గిరి గగనధరణి
మండలంబులు నీలాలమట్లు గాఁగ
నున్నదిగదా! సదాశివ యోగివరుఁడు
చేతనూఁదిన పటికంపులాతమనఁగ. 83

కం. ఈకుధరేంద్రము లోకా
లోకపు బల్గోడ దట్టిలో నికటాద్రుల్
మేకులుగా మెఱయుచు నది
గో! కానఁగ బడియెఁ దెల్లగొల్లెన భంగిన్. 84

గీ. చూడుఁ డీకొండ బ్రహ్మాండ శుక్తి మధ్య
మున జనించిన కట్టాణిముత్తియంబు
చందము వహించెఁ గార్తిక చంద్ర చంద్రి
కా మనోహర చాకచాక్యంబుతోడ. 85

చ. సురవరులార! యున్నగము చుట్టున నున్నవి చూడుఁ డాధరా
ధరములు భానుసైంధవ పథశ్రమనోదనకారికందరా
స్తర తరువాటముల్ మునుముదంబున నెత్తెడువేళఁ బర్జికం
ధరుఁడు భుజార్గళంబులఁ గదల్పఁగ రాలిన రాలకైవడిన్. 86

సీ. కనుపట్టె నీశైలమున దక్షకన్యకా
        ధవుఁడు సామాన్యపుఁ దపసివోలె
నొకపిన్న రాచక్కి నుండు నీగిరి నల
        కాపట్టణమ్ము పక్కణమువోలెఁ
దిరుగు నీ వసుమతీధరముమీఁద గణా
        ధిపతి మదావళకలభంబు వోలె
నాదిశాక్వరము విహారంబు సలుపు నీ
        కొండ చెంపల గోవుకోడె వోలె

గీ. నిన్నగంబునఁ బ్రవహించు సన్నపాటి
నిర్ఝరము వోలె మందాకినీ స్రవంతి
గాన నీమెట్టు మోక్షంబు కట్టుమట్టు
కనుఁడు గీర్వాణవరులార! కన్నులార. 87

క. అని వర్ణించుచు నజ్జా
సనుఁడు సుధాంధసులుఁ దాను సపులక కళికా
తనులై తక్కుధరాగ్రం
బునకు నరిగి హరువటారము గనుంగొనుచున్. 88

సీ. పెనుబాపపేరు వేసినగట్టు వాకుంభి
        దైత్యావరోధ వైధవ్యదాయి
కదవన్నె బంగారుగట్టువిల్తుఁడు భక్త
        రక్షణ క్రీడాపరాయణుండు
చిగురు కైదువజోదు పగ దాయ పార్వతీ
        వనితా చకోర పార్వణవిధుండు
చేదు భోజనము చేసిన మొక్కలీఁడు ద
        క్షా ధ్వర ధ్వంస దీక్షాధికారి

గీ. కలిమి గలవాని కూరిమి చెలిమికాఁడు
నీరనిధివేష్టితోర్వీ మహారథుఁడు
బుడుతవెన్నెల పూమొగ్గ ముడుచు వేల్పు
చిరకృపా దృష్టి మనల రక్షించుఁగాక. 89

వ. అని నిశ్చల మనస్కులై నమస్కరించుచుఁ జతుర్ముఖ ప్రముఖ బర్హిర్ముఖులు సంతసంబున సంతతవిహరమాణ బహు సహస్ర వేదండతుండ గండమండల గళద్దాన ధారాసురభిత బహిర్ద్వార వితర్దికానిషణ్ణ సపరివార కుంభోదర కుంభంబును శిఖరసముత్తంభితశాతకుంభ కుంభంబును సకలపాతక శ్వసన గ్రసన వ్యసన దండకుండలి రసనాయమాన కేతనంబును మోక్షలక్ష్మినికేతనంబును సమంజస కంజరాగ సాలభంజికా పుంజపింజరిత నిజాకరంబునైన హజారంబు డాయంబోయి తమరాక విని పిలువ నియోగించిన వచ్చి నందికేశ్వరుండు దోడుకొనిపోవ లోపలి చావడిం గొలువున్న సర్వమంగళానుషంగ వామోత్సంగు భుజంగాభరణుంగని సాష్టాంగంబు లెఱఁగి మస్తకన్యస్త హస్తులై. 90

దండకము. జయజయ జగదీశ యీశానకాశాహిపాకాశగంగాభ రాకాశశాంక ప్రకాశ ప్రతీకాశ నిర్నాశ దృక్కర్ణ మౌర్వీక సౌవర్ణ భూభృద్ధనుర్ముక్త బాణాః బాణాగ్రజాగ్రచ్ఛిఖావన్మఖైకాహుతీ భావ ధుర్య త్రిపుర్యాదితేయ ప్రతీపోద్భటాటోప చిద్రూప కద్రూతనూజాంగుళీ ముద్రికాకోణ నిద్రాణ నారాయణచ్ఛాయ దాయాద కంఠోప కంఠస్థల స్థాయు కక్షేశ కారుణ్య ధారాళమారాళ పక్షద్వయీ మంద మందానిల స్పంది మందాకినీ కంజకింజల్క సిందూరితేం దుప్రభా భాసితాశాంతరాభోగ వరక్షాసముద్యోగ దక్షాధ్వరధ్వంసన ప్రక్రియా ధర్మధూర్దండ చక్రీకృతాహర్నిశాశేష విద్యామయా! స్యందనా రోహవేళా భుజస్తంభ సంభావితోంకార శింజిన్యు పేతత్రయీ మాతృకోదండ సప్తస్వరీకాండ దండాయుధ ధ్వంసకా! గజరజని చరాంతఃపురీ నీలధమ్మిల్ల బంధాంధ కారాంశుమాలీ! యధారక్త నేత్రాంత కైలాస విశ్రాంత నిశ్రేయస ద్వాః కవాటీభవ ద్గూఢపాదీభ్రరు షడ్గ్రంథ

నిర్గంధనా కుంచనోడ్యాణ జాలంధర ప్రఖ్యబంధ త్రయీ భస్త్రికాధ్మాత జాజ్వల్యమానానల జ్వాలసంశోధిత బ్రహ్మనాడీ వినిక్షిప్త చంద్రార్క సంజ్ఞా నిలస్వాంత యోగీశ్వరాయత్త వేదోక్త్య నిర్ధారితాయత్త దేవా భవన్మూర్తి విస్ఫూర్తి కీర్తింపఁగా నేర్తుమే కర్తవున్ భర్తవున్ హర్తవున్ నీవ నీకేలనిల్చె డిభూలాకృతిన్ లోకముల్ మూఁడు నీనేత్రముల్ చిత్రభానుత్రయంబుల్ సముద్రంబులేడున్ సరిద్రత్నసానుప్రధానాద్రులున్ నీజటావల్లికల్ తల్లిదండ్రుల్ మృగీనేత్ర ధాత్రీధర గ్రామణీ పుత్రియున్ నీవు నీదృష్టికిన్ శిష్టరక్షా విధానంబులున్ దుష్టశిక్షా విధానంబులున్ నీకు నైసర్గికంబుల్‌గదా! భర్గ దుర్గా మనోనాయకా! పరమపురుష రూపంబు నీవున్ మహాశక్తి రూపంబు గౌరీ వరారోహయున్ బోధరూపంబు నీవున్ సుధారూప మార్యా సరోజాక్షియున్ భూమిలో నైదు నీరంబులో నాల్గుతేజంబులో మూఁడు వాతంబులో రెండు నభంబులో నొండు నానాగుణంబుల్ ప్రవర్తిల్లఁ దత్తద్గుణంబుల్ వివేకించిన న్నీవ సర్వేశ్వరా! పాలనాజ్యంబురాలం బృహద్భానువు న్నవ్వల న్నూనెయుం బువ్వులం దావియుంబోలె విశ్వంబునన్నీవు చైతన్యమై నిల్తు గంగధరా! సౌధ జాలంబులన్ రేణుజాలంబు చందంబుగా రోమరంధ్రంబులన్ బెక్కు బ్రహ్మాండముల్ దాల్తు వైరాజరూపంబునన్ మదన మదన దిగ్రీష్మ! నీ మౌళి మీదన్ సుధాబిందువుల్ చిందు నానందకందంబు నీక్షించి సాక్షాత్పరిజ్ఞానముంగా విచారింప లేమిం జుమీ కొందర ప్రాజ్ఞతం జందురుం డందు రామందులన్ దెల్ప నేమందులున్ లేవు భూత్యష్టకానర్గళా సర్గసంభూతికిన్ మున్ను తత్వతంబులేనేనులంబాసి భాసిల్లు చెప్ప ద్వితీయుండవై శూన్యభావంబుతోడన్ వినోదించు నిన్నాదినారాయణుం డంచు నబ్జాసనుండంచు ఫాలాక్షుఁ డంచున్ భజించున్ బ్రపంచంబు కొంచెంబు మాబుద్ధి నీశుద్ధ బుద్ధ స్వరూపంబు వర్ణింప శక్యంబె వ్యాకంబులన్ శంకరా! శంకరాత్రించరశ్రేణిచే మాకుఁ బాటిల్లఁ బాటిల్లఁగాఁ జేయ శక్రుండు శక్తుండు గామిన్ సదా గ్లానిచిత్తంబులం బూని రక్షోనిశాత క్షుర ప్రక్షతాంగ క్షరద్రక్త పూరంబున న్నాని

సేనాని నానా నిలింపావనార్థంబు నిర్మించు మంచున్ భవత్పాదముల్
చేరి ప్రార్థింపు చున్నార మన్నం బ్రసన్నాన నాంభోజుఁడై. 91

గీ పార్వతీవల్లభుండు వాక్పతి ముఖులైన
పంచదశదేవతలలోన భావి నవత
రింపఁ గలవాని నరసి నిర్మింతు నొకని
దానవ జయావధాని సేనాని మీకు. 92

మ. అని గీర్వాణుల నిర్వహింప సుముఖుండై శక్తి నాత్మాంగవా
సిని సంక్షోభము నొందఁ జేసిన జనించెం గోటి మధ్యందినా
ర్కనిభాభా మహిమం గుమారుఁడు సగర్వక్రవ్య భుక్కామినీ
జన వైధవ్యద బాహుదండ సహజ జ్ఞానాభిధా శక్తితోన్. 93

కం. భూవర తిలక ! ప్రజా పా
లా ! విను మన్వంతరముల నాశాంభవ దే
హా విఖ్యాత నిలింప చ
మూవిభునకుఁ బెక్కు జన్మములు గలవు సుమా ! 94

సీ. ఇట్లు సేనానాథు నిచ్చిన శివునిఁ బూ
జించి వాక్పతి సునాశీర ముఖ్య
దైవత సహితుఁడై తమ తమ తేజోంశ
ములు కుమారవతంసమునకు నొసఁగ
నాశక్తిధరుఁడు నత్యధిక తేజో విశే
షమ్మున దీపించి జనక ! యింక
వాహంబు నొకటి సేవకులఁ గొందఱ నాకుఁ
బాలింపవలె నన్న భవుఁడు వాహ

గీ. నంబు పవనంబుకంటె మనంబుకంటె
మిక్కుటంబైన వడిగల కుక్కుటంబు

భటుల శాఖ విశాఖులఁ జటుల బల స
ముద్భటుండైన పట్టికి మొదల వెట్టి. 95

కం. అనిమిషరథినీ పాలన
మునకున్ బట్టంబు గట్టి భూతగ్రహ శా
సన కర్తఁ జేసి యాతని
వినుతింపుఁడు మీరలన్న విని యింద్రాదుల్. 96

ఉ. షణ్ముఖ ! కుక్కుటధ్వజ ! కృశానుసముద్భవ ! మాతృజా తురా
షాణ్ముఖ ! దేవతాసకలసైన్యధురంధర ! కార్తికేయ ! వి
ద్విణ్మథన ప్రచండభుజవిక్రమసార ! కుమార ! తారకా
రాణ్మకుటప్రసూత ! మము రాక్షసబాధలఁ బాపి కావుమా ! 97

కం. అని కొనియాడిన సేనా
ని నిలింపుల నాదరించి నిఖిల జగత్పూ
ర్ణ నిరకుంశ తేజంబున
దనుజుల ననిలో హతాహతంబుగఁ దోలెన్. 98

వ అని మహాతపోమునీశ్వరుండు చెప్పినఁ బ్రజాపాలుండు మహాత్మా ! శివజ్ఞానశక్తివలనఁ బ్రాదుర్భవించిన కుమారస్వామి నేమి కారణంబున మాతృజ కృశానుసముద్భవ కార్తికేయ నామధేయంబుల నాదితేయులు సంస్తుతించిరి తత్కారణంబు తెలియ నాన తిమ్మనిన మహీశా ! యిది సేనానికి నాదిమన్వంతరంబునఁ గలిగిన జన్మంబు తరువాత నాతనికి రెండవజన్మంబున మాతృ కృశాను కృత్తికాకృత్తివసనభృత్తనయలు సముత్పత్తి నిమిత్తంబు లయ్యెదరు దేవతల నాగతజ్ఞులు గానఁ గార్తికే యాది నామధేయంబుల సన్నుతించిరి యీభంగి నహంకారంబు గుహండై పుట్టిన పరతత్వవిద్యారహస్యంబు నీకు వినిపించితి నీ దృగ్విధగుణ గరిష్ఠుండైన షణ్ముఖుండు షష్ఠినాఁడు దేవసేనాధి పత్యంబు వహించిన కతన నవ్వాసరంబునం గథా శ్రవణపూర్వకంబుగా ఫలాహారులైనవారికి

ధన ధాన్య పుత్ర పౌత్రాభి వృద్ధులు సిద్ధించు నింక శారీరజ్యోతి భాస్క-
రుండైన విధంబు వినుము. 99

గీ. జ్ఞాన శక్తికిఁ బరమాత్మునకు విభేద
మించుకయు లేదు సుమ్ము! భావింప నా స
నాతనుం డాత్మఁ డొకనాఁడు జ్ఞానశక్తిఁ
జూచెఁ జూచిన నొక మహాజ్యోతి పుట్టె. 100

కం. నానాదిగంతరంబుల
లో నిండుచుఁ దనకుఁ దాన లోకభూతం
బై నిలువ నమ్మహాతే
జో నివహము చొచ్చి రఖిల సురవరముఖ్యుల్. 101

సీ. సుర లివ్విధంబునఁ జొచ్చిన కతమున
సూర్యాఖ్యమైన తేజోగుణంబు
రవి సంజ్ఞగల శరీరము వేఱ తాల్చె నా
రవి నిజకాంతి పరంపరా వి
భాసితలోకుఁడై భాస్కరుం డయ్యెఁ బ్ర
కర్షత్వమునఁ బ్రభాకరుఁ డనంగఁ
బరఁగె సమస్తప్రపంచమునకు నాద్యుఁ
డగుట నాదిత్య విఖ్యాతి గనియె

గీ. దివసమునకు దివాహ్వ వర్తిల్లుఁ దద్ది
వాకరణాలి గాన దివాకర ప్ర
శస్తి ధరియించె నతని భాస్వత్ప్రదీప్త
దీప్తిఁ బుట్టిరి ద్వాదశాదిత్యులధిప ! 102

కం. వారలకు నగ్రగణ్యుం
డై రవి సంవత్సరమయ హవ్యవహ శిఖా

దారుణ కరముల భువనము
లీరేడును వేఁచి పోఁక నెఱిఁగి సభయులై 103

కం. తద్గర్భంబున నున్న మ
రుద్గణములు వెడలి నీవు రుచి దహన జ్వా
లోద్గిరణంబుల సకల జ
గద్గోళము సంతపింపఁగాఁ జేయకుమా. 104

వ. దేవ! మహానుభావ ! పురాణ చరాచరప్రాణ ! మునివరేణ్యగణ్య ! గుణ
గౌరవ గాఢాంధకార గంధగజ కంఠీరవ ! కాల చక్రధర ! జన్మజరాభర
భయ వినాశకర ! పద్మినీ హృద్య ! వేదాన్త వేద్య; హరి హర బ్రహ్మ
స్వరూప ! సకల లోకైక దీప ! యాజుషాగమ ప్రకృత్తి కారక ! సం
సార తారక ! కాండ భాండ మండల విశ్రమావాసకుక్షి ! కర్మసాక్షి !
నితాంతసంతాపంబు చూపక కాంతిం బొంది విభ్రాంతులమైన మమ్ము
రక్షింపుమని బహుప్రకారంబుల బ్రార్థించిన విని సహస్రకరుండు సూక్ష్మా
కారంబు వహించి భువనపూజ్యుండై నిలిచె నట్టి భాస్కరు జన్మదివసంబు
గాన సప్తమి నాఁడు కథా కర్ణనంబు మున్నుగా శాకాహారులైన వారికి
నాయురారోగ్యంబులు గలుగు నింక శరీరాధిదేవతలైన కామ క్రోధాదులు
మాతృక లగుట వినుము. 105

గీ. ఆది మన్వంతరంబున నవతరించి
వారె బ్రహ్మవర ప్రభావమునఁ గువల
యంబు గంపింప సాంపరాయ స్థలిని ని
రస్త నానాసురుం డంధకాసురుండు. 106

సీ. ఇట్లు దానవరాజు హెచ్చిన నొచ్చి వి
యచ్చరవ్రాతంబు వచ్చి తనకు
విన్నవింప నజుండు మున్ను వానికి శరీ
రంబున వెడలిన రక్తకణము

లెన్ని మేదిని రాలె నన్నియు నంధకా
సురులుగా నిచ్చితి వరము నేను
గావున మనచేతఁ జావఁడు పురవధూ
చికుర బంధద్రోహి చేతఁగాని

గీ. కదలి పోదము రండని కలుషకదశ
కా సమదభద్రకరికిఁ గైలాసగిరికిఁ
దత్తఱంబున నేగి వెత్తమున నిలిచి
చటులఁ బ్రతిశబ్దములు పుట్టి మొరలు వెట్ట. 107

కం. ఆ ఘోషము బాహాముహు
రాఘాత మదాంధ కాంధకాసుర చాప
జ్యా ఘోషము వినియె జయ
శ్లాఘామర్ధరుఁడు హరుఁడు సమ సమయమునన్. 108

మ. విని గీర్వాణుల భీతి మాసిపి మనోవీధిన్ విచారించి వీఁ
డు నిరాతంకత నెట్టు వచ్చె నగరాట్పుత్రీ జిఘృక్షా ప్రయో
జనుఁడై కన్నులఁ గానఁ డంచుఁ గొనమీసల్ దీఁడి తాల్చెన్ భుజం
బున రక్షోవనితాజనాక్షి జనితాంభోజాలమున్ శూలమున్. 109

కం. రణ సన్నాహంబున ఫణ
ఘృణిమండలి మెఱయ వాసుకిం బిగియించెన్
మణికాంచిగా రణత్కం
కణములుగాఁ దొడిగెఁ దక్షక ధనంజయులన్. 110

కం. ఈ విధమునఁ గట్టాయిత
మై వెలువడి నముచి భిన్మకామరవరసే
నా వీరభద్రగణ బృం
దావళవదనులు భజింప నడచిన శూలిన్. 111

చ. కనుఁగొని నీలదానవుఁడు గంధగజాకృతి ఘీంకరించి వ
చ్చిన మృగరాజ రూపమునఁ జించె నఖంబులఁ గుంభముల్ ఘనా
ఘనఘన గర్భముక్త కరకల్ వలె మౌక్తికరాజి రాలఁ గా
నని మొన వీరభద్రుఁడు భయంకర కంఠ నినాదరౌద్రుఁడై 112

కం. ఆ సమయంబున సంస్తుతి
చేసిరి దేవతలు మెచ్చి శివుఁడు తదానీ
తాసుర మత్త గజాజిన
వాసము ధరియించి కృత్తివాసుండయ్యెన్. 113

సీ. ఇట్లు రుద్రుండు భద్రేభచర్మంబు ధ
రించి శూలంబు సారించి కవిసె
నంధకాసురుపై సహస్రాక్ష శిఖి యమ
రాక్ష సాబ్ధిప సమీరణ కుబేర
ముఖ్యగీర్వాణచమూసమూహములతో
సేనాని యెలగోలుచేసి రాత్రి
చరసైన్యముల బారి సమరె నాదైత్యులు
సురల మార్కొని యేపు చూపుచోట

గీ. సరభసంబునఁ గలహభోజనుఁడు నార
దుండు చని విన్నవింప విష్ణుండు వచ్చెఁ
బక్షిపతి నెక్కి పైఁడి దుప్పటి చెఱంగు
దూలఁగా బిట్టు వాగెలఁ దోలుకొనుచు. 114

ఉ. ఆ హరిఁ జూచి వేలుపు లహంకరణంబుల దైత్యసేనతో
నోహరిసాహరిం బెనఁగ హుమ్మని వైరుల నుగ్గునూచముల్
గా హరియింతు నేనని చలంబున నంధకుఁ డాగ్రహించి పై
రా హరిణాంకశేఖరుఁ డురస్థ్సలి శూలమునం బగిల్చినన్. 115

గీ. రక్త కణరాజి విశ్వంభరా తలమునఁ
దొరిగె జొటజొట నందుఁ బుట్టిరి నిలింప
వాహిని చలింప జిహ్వల వక్త్రవివరు
లంధకాసురవరులు సంఖ్యలకు మీఱి. 116

సీ. వారలఁ గర చక్రధారల వ్రచ్చి వం
దఱలాడె హరి పురత్రయ విభేది
మూలాంధకాసుర శూలాగ్రమున గ్రుచ్చి
యెత్తె నెత్తిన నెత్తు రేఱులై ర
ణాంగణంబునఁ బాఱె నందు నంధకు లనే
కసహస్రములు పుట్టఁ గాంచి మిగుల
నాగ్రహించిన దర్పకారాతి ముఖమున
నెఱమంట వెడల యోగీశ్వరీ స

గీ. మాఖ్యగల శక్తియై నిల్చె మఱియు నొక్క
శక్తి నిర్మించె నాత్మలాంఛన కళాను
షక్తిఁ గేవల సాహసవ్యక్తి రాక్ష
సేంద్ర భీషణశక్తి మహేశ్వరుండు. 117

వ. విష్ణు బ్రహ్మ కుమారేంద్ర దండధర వరాహస్వాములు తమతమ రూప చిహ్నంబులు దాల్చిన శక్తులం గల్పాంత వహ్నికల్పంబులం గల్పించిరి యిప్పగిది నుప్పతిల్లిన యోగీశ్వరీ ప్రముఖ శక్త్యష్టకంబు భుజావష్టంభ సరంభంబున విజృంభించి రుధిర సంభూతాంధక సహస్రంబుల సంహరించి వదనగహ్వరంబులు దెఱచి కండలు కటుకునఁ గఱచియు రక్తంబులు గుటుకు గుటుకునం గ్రోలియుఁ గీకసంబులు పెటుకు పెటుకున విఱిచియుఁ బ్రేవులు పుటుకు పుటుకునం ద్రెంచియు విహరించి రణక్రీడ చాలించె నీలకంఠుండు నంధాకాసురుం బరిమార్చి పేర్చి విజయంబునఁ గైలాసంబునకుం జనియె. నారాయణుండు వైకుంఠంబున కేగె భారతీవల్లభుండును సత్యలోకంబున కరిగె హరిహయాది హరి

దీశానులు నాత్మనివాసంబులకుం బోయి సుఖంబుండిరి మహీమండ లేశ్వర; కామంబు యోగీశ్వరి క్రోధంబు మహేశ్వరి లోభంబు వైష్ణవి ద్రియోమదంబు బ్రాహ్మి మోహంబు కౌమారి మాత్సర్యం బైంద్రి పైశున్యంబు దాండధరి యీర్ష్యవారాహి యీ మాతృకల జన్మం బష్ట మీదివసంబు గావుననాఁడు కథవిని బిల్వాహారులైన వారికి భోగమోక్షం బులు సిద్ధించునింక మాయ దుర్గయై జన్మించిన విధంబు వినుము.

కం. విద్వన్నిధి లవణోద
న్వద్వేల్లితభూమివలయ నాయకుఁడై సిం
ధు ద్వీపాహ్వయుఁడు సగ
ర్వ ద్వేషులు దలకఁ బుట్టె వరుణాంశమునన్. 119

శా. ఆరాజన్యకులైకభూషణము పూర్వాసూయతో జంభదై
త్యారాతిన్ విధళింపఁ జాలుపు మపత్యంబుం గనం గోరి పు
ణ్యారణ్యంబుల మూల పర్ణ జల వాతాహార సంశీలతన్
ఘోరంబైన తపంబు చేసె భువనక్షోభంబు సంధిల్లగన్. 120

సీ. అనినఁ బ్రజాపాల మనుజేశ్వరుఁడు ముని
నాయక! యే కారణమునఁ బూర్వ
వైరంబు గలిగె గీర్వాణాధిపతికి సిం
ధుద్వీప ధాత్రీవధూవరునకు
నావుడుఁ ద్వష్టృ నందనుని వృత్రాఖ్యుని
సకలాయుధంబులఁ జావులేని
వాని వాశాన్నిధి ఫేనంబుచే సమ
యించె సుత్రాముఁ డావృత్రరాత్రి

గీ. చరవరుండు వుట్టె జగతి సింధుద్వీపుఁ
డనఁగ నది నిమిత్తమున మహేంద్రు
సంగరాంగణమున సంహరింపగఁ జాలు
తనయుఁ బడయఁగోరి తపము చేసె. 121

కం. జనవల్లభ మీఁదటి కథ
వినుమట్లు తపంబు సలుప వేత్రవతీ వా
హిని సూనశరాసనగే
హిని వలె సౌందర్యరేఖ నెఱెంచుటయున్. 122

కం. కనుఁగొని సింధుద్వీపా
వనినాథుఁడు తనతపంబు వఱుతం గలయన్
మనసిజ భీషణ సమ్మో
హన బాణ పరంపరాభిహతమానసుఁడై. 123

కం. మకరికలు గానఁబడ హం
సకములు మెఱయంగ వేణి జాఱ గళన్మౌ
క్తిక కంకణములు మొరయ ని
టకు మెల్లన వచ్చునదికటా! దక్కునొకో! 124

మ. అనుచో దగ్గఱి పార్థివల్లభుని భార్యన్ వేత్రవత్యాఖ్య నే
నినుఁ గామించితి నాదరింపు కలకంఠీకంఠి కామించినం
జనవుల్ చెల్లఁగ నీక త్రోచుటలు దోసంబండ్రు సుమ్మీ బుధుల్
జననాథోత్తమ! యింక నేటికి వృథా శంకింప నా మాటకున్. 125

గీ. అనుచు లావణ్యజలధి కామిని సరోజ
నేత్ర తనకూర్మి గాఁగ నిలిచి సరస
తానుకూల వాక్యముల్ లహరి గొలిపె వ
సుంధరా భర్త చిత్తంబు సుడి వడంగ, 126

కం. జన విభుఁడును సూనశరా
సనకేళి మనోరథంబు సఫలముగా జే
య నదియు సద్యోగర్భం
బున మాణిక్యంబువంటి పుత్రునిఁ గనియెన్. 127

కం. రాత్రించరు వరుఁ డాతఁడు
వేత్రవతీసుతుఁడు గాన వేత్రుం డనఁగా
ధాత్రీతల మేలెఁ గకు
జ్జైత్రతఁ బ్రాగ్జ్యోతిషాఖ్యపట్టణపతియై. 128

గీ. రాజసంబున హస్త్యశ్వరథపదాతి
పాదఘట్టన మేరువు మీఁదఁ బసిఁడి
బూడిదలు రేఁగ నొకనాఁడు దాడివెట్టి
యుట్టిపడి నాకనగరంబు చుట్టుముట్టి. 129

సీ. వాసవుఁ గొట్టిన వహ్నిఁ గూడె శచీశ్వ
రాగ్నుల మోఁదిన యమునికడకు
వచ్చిరి హరి శిఖి వైవస్వతుల జయిం
చిన దైత్యుఁ గలిసిరి జిష్ణు కీలి
శమనక్షపాటులఁ జఱచిన వరుణునిఁ జే
రిరి యింద్ర బర్హిః పరేతపాస్ర
పప్రచేతసుల విభాళించిన సమీరు
డాసిరి దేవరాడ్దహన దండి

గీ. యాతు పాశి మరుత్తుల గాతి గొనిన
ధనదుఁ జెందిరి కుధరభేద్య నల కాల
రాక్షసాంభోధివర జగత్ప్రాణ యక్ష
పాలకుల వెంటఁ బట్టిన శూలిఁ గనిరి. 130

ఉ. దిక్ప్రభు లెల్ల నిట్టి పగిదిన్ భయకంపితగాత్రులై మన
శ్శుక్ప్రతికార చింతకు యశోవతి యుంట యెఱింగి రాహవి
ర్భుక్ప్రతిమాన రోషమునఁ బొంగుచు వేత్రనిశాచరుఁడు వా
ర్మృక్ప్రకరార్భటిన్ బటహముల్ మొరయన్ జనుదేర నత్తరిన్. 131

కం. ఆశాధినాథులును వా
గీశానుని లోకమునకు నేగి నిజ మనః
క్లేశంబు గానఁబడ నా
క్రోశించిరి సలిలనిధులు ఘూర్ణిల్లంగన్. 132

సీ. ఆదికృతుల మొఱ లాలించి విష్ణు పా
దమునఁ బుట్టిన సలిలములలోన
క్షేత్రజ్ఞ మాయ గాయత్రి జపించుచు
నుండియుఁ గమలాసనుండు సదయు
డై నిరీక్షించి మాయా వినిర్మితులుగా
రా సురాసురులంచు నాత్మఁ దలఁప
నావిర్భవించె శార్ఙ్గాసి గదా శంఖ
చక్ర పాశాంబక చాప హస్త

గీ. నిర్మలాంబర మత్తకంఠీరవాధి
రూఢ శక్తి జనించి మరుచ్చమూ ప
రంపరలు చూడఁ బెక్కు వర్షములు పోరి
వేత్ర నక్తంచరుని మెడ విఱిచి వైచె. 133

ఉ. ఆర్చి బలాదిముఖ్యులు నిశాటపతి ప్రళయానలంబు చ
ల్లార్చిన సింహవాహనకు నాదిమశక్తికి లోక దుర్దశల్
దీర్చిన వేదమాతృకకు దేవికి హస్తసరోరుహాంజలుల్
చేర్చిరి ఫాలభాగమునఁ జేయఁ దొడంగె శివుండు సంస్తుతుల్. 134

సీ. గాయత్రి మూఁడు వక్త్రముల శూలిని బ్రహ్మ
మది నుద్భవించిన మంత్ర శక్తి
దను జఘ్ని మూఁడు తత్త్వంబుల మొలచిన
గౌరి వేదంబులఁ గన్నతల్లి

వాణి చంద్రార్క పావక నేత్రమూఁ డక్ష
రముల నిల్చిన శంకర ప్రభూత
శబరి సుధారస స్రావిణి మూఁడు లో
కంబులు నిండిన కమలనిలయ

గీ. దేవి స్వాహా స్వధాత్మిక దివ్య భూష
ణాంబర ప్రసవా లేప నాభిరామ
భక్తవరద మహామాయ పరమముని వ
రేణ్య సంసేవ్య నిన్ను వర్ణింప వశమె. 135

మ. అని యీశానుఁడు సంస్తుతించు తఱి దైత్యారాతి పాదోద్భవాం
బునిమగ్నుండు విరించి వెల్వడి బహిర్భూమిం బ్రకాశించు దే
వి నిరీక్షించుచు భావి కార్యము మనోవీథిన్ తర్కించి యి
ట్లనియెన్ బూర్వ దిగీశ్వరప్రముఖ సర్వామర్త్యవర్గంబుతోన్. 136

సీ. సురలార ! జగదీశ్వరి గాన నీ దేవి
నసుసరించి హిమాగమునకుఁ బొండు
భవ ! భవత్కృత మహాస్తవ పాఠకులకు నీ
శక్తియు నీవు నైశ్వర్య మిండు
దుర్గ మీఁదట గర్వదుర్వారుఁడై పుట్టు
మహిషాసురునిఁ జంపి మనుపు మిమ్ము
నని బ్రహ్మ చనిన గాయత్రి నిర్జరపరం
పర గొల్వ నీహారధరణిధరము

గీ. చేరి మందార సంతాన పారిజాత
కల్ప హరిచందనావృతాగ్రస్థలంబు
తానకముగా వసించి తద్దైవతముల
నందితులఁ జేసి తాల్చె నందా సమాఖ్య. 137

వ. ఇట్లు మహా మాయచేతఁ జేతఁ బ్రమోదంబు నొంది పురందరాదిబృందా
రకులు మందిరంబులకుం బోయిరి నరేంద్రా! నంద జన్మ దివసంబు
నవమి గావున నాఁడు కథ విని పిష్టాహారులైన వారికి నభీష్టార్థంబులు
సిద్ధించు నని ప్రజాపాలునకు మహాతపోమునీశ్వరుండు చెప్పె నని
వరాహదేవుండు వినిపించిన వసుంధరాపురంధ్రి తరువాతి వృత్తాంతం
బాన తిమ్మని విన్నవించిన. 138

మ. కృతనారాయణ పాదపూజన! జనక్షేమక్రియాభోగ! భో
గ తిరస్కారిత పాకశాసన! సనక్షత్రక్షపా నాయక
ప్రతిబింబ శ్రుతి మౌక్తిక స్తబక రారాజత్ప్రసన్నాస్య! నా
స్యతి నైపుణ్య విరోధిరాజ పరిరక్షా దక్ష బాహార్గళా. 139

కం. బుధవినుత! సాళ్వ నరసిం
గధరాధవ! దండనాథ! కాంతాపంచా
యుధ! సుమన స్తరు సుమనో
మధురస మధురిమధురీణ మంజులఫణితీ. 140

పృథ్వి. దయాభరణ శోభిరాట్తనయ వార తన్వీ విటా
నయాచరణ! గీయమాన బిరుద ప్రతాపోద్భటా!
జయానక మృదంగ ఝర్ఝర హుడుక్కికా ఝల్లరీ
భయానక రవార్భటీ పటపట ద్దశాశాతటా. 141

గద్యము. ఇది శ్రీ మదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంట నాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీ వరాహపురాణం బను మహా
ప్రబంధంబున షష్ఠాశ్వాసము

శ్రీ

# వరాహపురాణము

## సప్తమాశ్వాసము

—*—

శ్రీనరకంఠీరవ ! భయ
దానన గహ్వర మహాట్టహాస కఠోర
ధ్వానదళితాష్టదిగ్విజ
యానక యీశ్వర వసుంధరాధిప నరహా. 1

వ. అవధరింపు మవ్వరాహదేవుండు సర్వంసహకు నిట్లనియె నట్లు మహాతపోమునీశ్వరుండు నందోత్పత్తి చెప్పిన ప్రజాపాలుం గనుంగొని నరేంద్రా ! ఇంక దిక్కుల జన్మంబు వినుమని వివరింపం దొడంగి నాది సర్గంబున నైసర్గిక మహామహుండు పితామహుండు తన విసర్జింపం గల ప్రజల కవకాశం బెట్లు దొరకునోయని చింతించుచున్న యవసరంబున. 2

కం. అక్కమలజు కర్ణంబులఁ
జక్కని కన్యకలు పదురు జనియించిరి, లేఁ
జెక్కుల డాలు తళుక్కు త
ళుక్కు మనఁగ వాలుఁ జూపులు పిసాళింపన్. 3

సీ. ఆ కన్యకలలోన నార్వురు ముఖ్యులై
పరఁగఁ బ్రాగ్దక్షిణ పశ్చిమోత్త

రోర్ధ్వాధరాఖ్యల నున్న నల్వురు ధార
తీనాథునకు మ్రొక్కి దేవ ! మాకు
నిలువ తావులు వల్లభులు వలెనని విన్న
వించిన శతకోటి విస్తృతంబు
బ్రహ్మాండ మిందులోపల నిచ్చ వచ్చిన
నెలువుల నిలువుండు నెలతలార !

గీ. మీకుఁ బ్రాణేశ్వరుల వినిర్మింతు ననిన
నట్ల వసియించుటయు సరోజాసనుండు
నధిక బాహుప్రతాప దృప్తాసురేంద్ర
హరణ శీలుర లోకపాలుర సృజించి. 4

సీ. పవిపాణి నొకతెకుఁ బ్రాణవల్లభుఁ జేసి
పావకు నొకతెకు భర్తఁజేసి
దిననాథసుతు నొకతెకుఁ బెనిమిటిఁ జేసి
మనుజాశి నొకతెకు మగనిఁ జేసి
మకరాకరస్వామి నొకతెకుఁ బతిఁ జేసి
వాయువు నొకతెకు వరునిఁ జేసి
యక్షేంద్రు నొకతెకు నధినాయకునిఁ జేసి
యీశాను నొకతెకు నీశుఁ జేసి

గీ. తాను శేషోరగంబు నూర్ధ్వకు నధరకుఁ
గర్తలైరి వసుంధరాకాంత నాఁడు
మొదలుగాఁ గల్గె నైంద్రి ప్రముఖములైన
నామధేయంబు లష్టదికామినులకు. 5

కం. దశమీదివసంబున నీ
దిశలు వొడమెఁ గానఁ దత్తిథిం గథ విని ద
ధ్యశనము మానవులు భుజిం
ప శాశ్వతబ్రహ్మలోక పదవులు దొరకున్. 6

ఉ. ఇంక శరీరవాయువు ధనేశ్వరుఁడైన విధంబుఁ జెప్పెదం
బంకరుహప్రసూతికిఁ బ్రపంచ వినిర్మితివేళ వెళ్లనా
తంకవిధాయి తీవ్రసికతల్ వెదచల్లుచు నూర్పుగాడ్పు కూ
లంకష సప్తసాగరజలంబులు తుప్పరగాఁగ రువ్వఁగన్. 7

కం. ఆపవనుం గనుఁగొని భా
షాపతి వారించి నీవు శాంతిపరుండవై
రూపంబు దాల్పు మనఁ దా
రా పరివృఢుఁబోలు మూర్తి గ్రక్కునఁ దాల్చెన్. 8

సీ. ఈరీతి శాంతి వహించిన పురుషుండు
నలువ పంపున దేవతల బలంబు
విత్తంబు రక్షించి విత్తేశ్వరాహ్వయం
బున నిల్చె నాతండు జననమైన
ఘస్ర మేకాదశిగాన నాఁడు నరుండు
కథ విని వహ్నిపక్వంబుగాని
భక్ష్య మాహారింపఁ బ్రాపించు సకల సం
పత్సౌఖ్యములు ప్రజాపాల ! యింక

గీ. నాదిమక్షేత్రమున మనంబైన విష్ణు
దేవుఁడు ప్రయోజనార్థంబు దేహ మెత్తి
సంచరించుట సరసభాషా విజృంభ
ణమున వినిపింతు సావధానముగ వినుము. 9

వ. నారాయణాత్మకుండైన చతుర్ముఖుండు మున్ను తన వినిర్మించిన సృష్టి గనుంగొని ఈసృష్టి పాలింప నాకతక్క నన్యులకు వశంబుగాదు గావున నమూర్తత్వంబు మానిపాలనాసమర్థంబైన మూర్తి వహింతునని చింతించు కాలంబున మనంబు పరిగృహీతాప ఘనంబై పురోభాగంబున నున్న నన్నిరవధికతేజఃప్రసారంబైన శరీరంబులోన నానాభువనంబులు ప్రవేశించిన విరించియు నించుకవడి విచారించి తా మొదల వాగాదులకు

నిచ్చిన వరంబు దలంచి నీవు సర్వజ్ఞుండవు సర్వలోక నమస్కృతుండవు. సర్వలోకకర్తవునై వర్తింపుము. భవజ్జఠరంబున ముజ్జగంబులు ప్రవేశించుటంజేసి పరమతపోధనవిధేయంబు విష్ణునామధేయంబు గలిగెనని పలికి ప్రకృతిస్థితుండయ్యె నప్పుడు. 10

గీ. అప్రమేయుండు విష్ణుండు నాది కాల
బుద్ధి సర్వంబు మానసంబునఁ దలంచి
యోగనిద్రానుభవకేళి నోలలాడె
నింద్రియార్థాస్తరణ భుజగేంద్రశయ్య. 11

సీ. ఆతని నాభి రంధ్రాంతరంబున నొక్క
పద్మంబు పుట్టె నా పద్మమునకు
విరివి సప్తసముద్ర వేష్టిత సర్వ స
ర్వంసహాకర్ణిక రత్నసాను
వా రత్నసానువుపై రవికోటి ప్ర
భాభాసురంబైన బ్రహ్మగృహము
గనుపట్టె నే తత్ప్రకార ప్రభావంబు
గల విష్ణు దుర్వార కలుష జిష్ణుఁ
గీ. గాంచి తద్దేవ దివ్యవిగ్రహగతుండు
పరమపురుషుండు నేఁడు నా పనులు సిద్ధిఁ
బొందెనని సమ్మదంబునఁ బొదలి పొదలి
పలికె నిట్లని గంభీరభాషణముల. 12

వ. ఇంద్రనీల తన ల కువలయాంజనాభ! కంజనాభ! నీవు నిరంతరంబును జ్ఞాన విభేదనార్థంబు ఖడ్గంబును ధర్మభేద నార్థంబు గదాదండంబును ధరియించి కాలచక్రంబు చక్రంబుగా నవిద్యాజయంబు శంఖంబుగా భూపద్మంబు పద్మంబుగా యజ్ఞాంగంబు ముసలంబుగా భూతమాలిక కంఠమాలికగా సుధాకర మార్తాండమండలంబులు శ్రీవత్స కౌస్తుభంబులుగా

సమీరణుండు గరుత్మంతుఁడుగా సవరించి నానాభువనగామిని లక్ష్మీ భామిని వరియించే ప్రతి యుగంబున వివిధరూపంబుల నవతరించి శిష్ట రక్షణం బంగీకరించి దుష్టరాక్షసుల సంహరించి విహరింపు మనియె నవ్విష్ణుని జన్మదివసంబు గావున ద్వాదశినాఁడు కథ విని హయ్యంగవీ నాహారులైన వారికి శాశ్వత స్వర్గభోగంబులు గలుగు నింక ధర్మంబు జన్మించిన విధంబు వినుము.

క. మును సరసీరుహగర్భుఁడు
తన మదిలో మద్వినిర్మితప్రజ ధర్మం
బున మెలపఁజాలు పురుషుం
డనవద్యుం డొకడు వలయునని చింతింపన్. 14

శా. ఆకంజాసను దక్షిణాంగమున నీహారేందు కుంద ప్రభా
నీకాశుం డవదాతపట్టవసనాన్వీతుండతి స్థూలము
క్తా కర్ణాభరణుండు పుట్టె నొకఁ డత్యంత క్షమావంతుఁడై
నాకా నోకహ పుష్పగంధి మకుటన్యస్తాంజలుల్ మీఱగన్. 15

శా. వానిం జూచి పితామహుండు నగుచున్ వత్సా ! జగజ్జంతు సం
తానంబుల్ భవదీయశాసనమున్ వర్తింప సత్కీర్తితో
నీ నేర్పుల్ గొనియాడ నుండుమని మన్నింపం జతుష్పాదుఁడై
తా నిల్చెన్ సుజనానురంజనముగా ధర్మాభిధానంబునన్. 16

సీ. ఈరీతి సకలలోకైకనాయకుఁడైన
ధర్ముండు నాల్గుపాదములు నిలిపి
కృతయుగంబున సంచరించుఁ ద్రేతాయుగం
బున మూఁడుపాదముల్ మోపి నడచు
మెలఁగు రెండంఘ్రుల మెట్టి ద్వాపర యుగం
బునఁ గలియుగమున వెనుకఁ ద్రొక్కి
త్రొక్కి ప్రవర్తించు నొక్క కాలూది ప్ర
జాపాలమానవేశ్వరవతంస

గీ. వినుము సచరాచరాంతరంబున వసుంధ
రామరక్షత్ర వైశ్య శూద్రాన్వయముల
నా మహాత్ముండు భాగము లాఱు మూఁడు
రెండు నొకటియునై విహరించు చుండు. 17

కం. ఈ కరణి ధర్మపురుషుఁడు
లోకత్రయపూర్ణుఁడై నిలచువేళ నహ
ల్యా కాముక గురుతోడ ని
శాకరుఁడు తదేకనిష్ఠఁ జదువుచు నుండన్. 18

కం. ఆ గురువుచిగురుఁబోఁడి స
దాగరగరనై మనోజు తరవారి గతిన్
సోగ మెఱుంగు తెఱంగునఁ
దా గేహములోన మెలఁగుఁ దారుణ్యమునన్. 19

కం. ఈ గజగామినిఁ గామిని
నేగతి నే సందు గొందు నిఁక నని విధుఁడున్
వేఁగుచు గురుఁ డిలు వెళ్లిన
చో గానము చేయు నవ్వుఁ జూచిన మ్రొక్కున్. 20

సీ. నైపుణి లిపి లేఖనం బొనర్పక ఫల
కమునఁ దద్రూపలేఖన మొనర్చు
కర పుస్తకావలోకనము సల్పక తదా
కారలేఖావలోకనము సల్పు
వ్యాఖ్యాన శబ్దంబు లాలకింపక తత్ప
దాంగదశబ్దంబు లాలకించు
తనలోన శాస్త్రచింతనలు చేయక తన్ని
తంబ సంస్పర్శ చింతనలు చేయు

గీ. యివ్విధంబున దివసంబు లెన్నియైనఁ
గడపి వేసరి గీష్పతి కన్ను మొఱఁగి
తెగువ నొకనాఁడు పైకొంగు తిగిచి తార
సమ్మతిలుటయు నోలాడె సౌఖ్య జలధి. 21

కం. ముల్లోకంబుల జనములు
రోళ్లం రోకండ్లఁ బాడ రోయక మఱియున్
వెల్లి విరిగాఁగ దిరిగి న
గళ్లకు నయగారి మెలఁతుకం గొనిపోయెన్. 22

గీ. పోయి పెద్దలు చెప్పిన బుద్ధి వినక
కిల్బిషం బని మానక కెలనివారు
నగుట యెఱుఁగక రాజు తానగుటఁ జేసి
దారవలె నవ్విధుఁడు సదా రమింప. 23

గీ. ధర్ముఁడు వడంకి కడుపాప కర్ముఁడైన
చెడుగు హిమధామునకు బుద్ధి చెప్పనేని
తప్పు గార్యంబు బ్రహ్మచిత్తంబు మిగుల
నొచ్చు నాకు నదక్షత వచ్చుననుచు. 24

కం. అరుదెంచి పలికె నిట్లని
గురువులసతి నెట్టు వేసికొంటివి నీకున్
వరుసా! కట కట! దోషా
కర యీ పాతకము సేయఁగా కాదు సుమీ. 25

సీ. అఖిలవేదాతీతుఁడైన శ్రీ మన్మహా
దేవుండు నిను శిరసావహింప
ముప్పు త్రిప్పులు లేక ముప్పది మూఁడుకో
టులు సుధాంధసులు నీవలనఁ బ్రదుక

తం్రడి దుగ్ధపయోనిధానంబు నినుఁదన
కన్నులారఁగఁ జూచి మిన్నుముట్ట
పరమధర్మంబు దప్పక చతుర్దశభువ
నంబులు నీశాసనమున మెలఁగ

గీ. రాజవై నేఁడు కడపట నోజమాలి
తెచ్చుకొంటివి పాయని తిట్టు రట్టు
నకట! యిఁకనైన నా చెప్పినట్లు చేసి
దేవతాచార్యునకుఁ దారఁ దిరుగనిమ్ము. 26

కం. ఈ నీ దుర్వ్యసనము విని
నానాభువనముల జనులు నయహీనత "రా
జానుమతో ధర్మ" యనం
గా నడుతురు గానఁ దగవు గాదని పలికెన్. 27

కం. ఆపలుకుట విని కామాం
ధోపి నపశ్యతి యనన్ శశాంకుండు దురా
లాపము లాడక పొమ్మని
కోపాటోపమున వెడలఁ గొట్టించుటయున్. 28

కం. ఏగె మణిహంబు మాని మ
హాగహనంబునకు ధర్ముఁ డవమానముతో
వేగమ "ధర్మస్యత్వరి
తాగతి" యను వచన మిప్విధం బయ్యె నన. 29

కం. ఈవిధమున దుష్కర్మము
త్రోవ నడవఁ గడఁగి నలుగురుం జూడఁగఁ దా
రావిటుఁ డటు చేసిన పరి
భావంబున ధర్ముఁ డడవిపాలైన తఱిన్. 30

సీ. ప్రభువు లాశ్రితపక్షపాతంబు విడిచిరి
పుణ్యవర్తనములు పొనుఁగు వడియె
ప్రాజ్ఞులు వేదశాస్త్రంబులు మఱచిరి
సకలవర్ణములు బెజ్జంబు గలిసె
బలవంతు లధముల బాధింపఁ దొడఁగిరి
యిల్లాండ్ర యీలువు లెత్తిపోయె
సత్యంబు పలుకుట జనులు చాలించిరి
చెడియె నుత్తముల దాక్షిణ్యగుణము

గీ. పాడి దప్పిరి నృపతులు బలిసె గొండె
మడఁగెఁ దాలిమి మాత్సర్య మతిశయిల్లె
జెల్లె దయ పాతకంబులు వెల్లి వాఱె
గ్రమ్మె దుర్వ్యసనంబులు దిమ్మ రేఁగె. 31

మ. జగతీనాయక! యిట్లు ధర్మము వినాశంబైన దేవాసురుల్
తగవుల్ దప్పి పరస్పరాంగనల నుద్దండంబునం బుచ్చుకో
జగడం బత్యధికంబుగాఁ దొడఁగుటన్ శాంతంబు గావింప రా
క గుముల్ గూడి రణంబు చేసిరి వడంకన్ మూఁడులోకంబులన్. 32

కం. అప్పుడు నారదసంయమి
చెప్పిన విని కళవళంబు చిత్తాబ్జములో
నుప్పతిల నంచతేజీ
నెప్పళమున నెక్కి నలువ నిలువక వచ్చెన్. 33

గీ. వచ్చి కలహంబు వారించి వారివలన
నిజతనూజుండు ధర్మంబు రజనికరుని
చేఁ దిరస్కృతుఁడై వనసీమమునకు
నరుగుట యెఱింగి తత్సురాసురులు గొలువ. 34

వ. చరాచర శరణ్యుండు హిరణ్యగర్భుండు మహారణ్యంబు చొచ్చి వృషభ రూపంబున విహరించు ధర్మపురుషునిం జూపి యీ పరమపావనుం గొనియాడుం డనిన దేవదానవులు మకుట తట ఘటితాంజలులై హార నీహార తారాధవ ధవళాంగ ! చతుశ్శృంగ! సముత్తుంగ ద్విమస్త! సప్త హస్త! సఫలీకృత వేదవాద! చతుష్పాద సకల స్మృతి పురాణేతిహాస ప్రసిద్ధ త్రిబంధ బంధమోక్షలక్ష్మీ కరారవింద లీలాదర్శక! సర్వ మార్గ ప్రదర్శక పాపతిమిరాపనోదన ప్రదీప ! సమస్త దైవత్వ స్వరూప! వానలేని సస్యంబుల కైవడి నీవులేని కారణంబున లోకంబులు చీకాకు పడియె. మృగాంకుండు చేసిన తప్పు సహించి మమ్ము నిర్వ హింపుమని సన్నుతించినఁ బ్రసన్నుండై ధర్మదృష్టి విలోకించిన వారు విగత సమ్మోహులైరి. పితామహుండును వత్సా! నీవు సంచరించుటం జేసి యిక్కాననంబు ధర్మకాననం బనం బరగు బ్రాహ్మణవదనంబులు సదనంబులుగా నిలిచి నీవు పూర్వప్రకారంబున భువనంబులు శాసింపు మని సన్మానించి యిది మొదలు ధర్మంబు గడవక నడవుండని సురా సురుల వీడ్కొలిపి నిజనివాసంబునకు విజయం చేసె. నిట్టి ధర్ముని జన్మదినంబు గావునఁ త్రయోదశి నాఁడు కథ విని పాయసాహారంబు భుజియించిన జనంబులకు ననేక ధర్మంబులు సిద్ధించు విశేషించి యీ ధర్మోత్పత్తి శ్రాద్ధకాలంబునఁ బఠించినఁ బితరులకు బునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోకంబు గలుగు మహీవల్లభ! యింక మహాతత్వంబు రుద్రుండై పుట్టిన విధంబు వినుము. 35

సీ. మును ధాత కల్పాంతమున నిద్ర దెలిసి లో
క వినిర్మితికి వగ గానలేక
సంక్షుబ్ధుఁడైన రజస్తమో గుణములు
ద్రేకంబుఁ జూపె నా రెంట రక్త
నీలవర్ణుండు త్రినేత్రుండు తేజః ప్ర
భావధూర్ధరుఁ డొక్క బాలకుండు
జనియించి మ్రోల రోదనము చేసిన రుద్రు
డను పేరు పెట్టి పుత్రా ! చరాచ

గీ. రంబు సృజియింపు మనఁ గాఢాంబుపూర
మధ్యమంబున మునిఁగి నిర్మాణ శక్తి
తనకు సిద్ధించు కొఱకునై తపము చేయఁ
బూనె నారాయణుని మనంబున గుఱించి. 36

కం. ఈ రీతి రుద్రుఁ డరిగిన
సారసగర్భుండు మానసంబునఁ గనియెన్
సారాచారులఁ బుత్రుల
వారివలన జగము సంభవంబైన తఱిన్. 37

సీ. కమలాసన ప్రీతిగా దేవతలు సప్త
తంతువు గావింపఁ దపము మాని
వారిపూరంబు వెల్వడి వచ్చి రుద్రుండు
యజ్ఞకోలాహలం బాలకించి
నను మీఱి యీభువనంబు లెవ్వండురా
సృజియించి మఖము చేయించువాఁడు
కొట్టి వైచెదనని కోపించి నిజతనూ
ద్భవమైన భూత భేతాళ యోగి

గీ. శాకినీ డాకినీ పిశాచములు పెక్కు
వేలు లక్షలు కోటులు విండ్లు గదలు
ముసలములు ముద్గరంబులు మొదలుగా న
నేక శస్త్రాస్త్రములు ధరించి కొలువ. 38

కం. క్రతుశాలఁ జొచ్చె నత్యు
ద్ధతి నొంతత్సద్గుణాన్వితంబుఁ జతుర్విం
శతి హస్త మాత్రమును నై
శితశరములు గురియు ధనువు చేతం గొనుచున్. 39

వ. ఇట్లు సవనవాటంబు పాటపరిం జొచ్చి నిరాఘాట పరాక్రమంబున శక్ర
ముఖ్యాఖిల నిలింప పరంపర వెంపరలాడి భగుని కన్నులు గెలికి పూషా
ర్కుని పండ్లు డుల్ల మొత్తి యజ్ఞపురుషుని బీజంబులు దునిమిన నతండు
మృగరూపంబునఁ గారడవికిం బరచె నంత భారతీకాంతుండు రౌద్రస
మున్నిద్రు రుద్రుం జేరి సాంత్వనవచనంబుల శాంతస్వాంతు గావించి
కవుంగిలించి దేవతల విలోకించి మీరలిమ్మహానుభావు సంస్తుతించి కృతా
ర్థులు గండని పలుకుటయు వారు సింధురాంధక జలంధర సప్తతంతు కంతు
కృతాంత సంహరణాది భూత భవిష్య ద్వర్తమాన నానావిధ జయాంక
మాలికలను వర్ణించిన మెచ్చి వేడిన వరంబు లిచ్చె నట్టి రుద్రుని జన్మ
దినంబుగానఁ జతుర్దశినాఁడు పశుపతిం బూజించి కథ విని గోధూమాన్నంబు
భుజియించిన మానవులకు భోగమోక్షంబులు గలుగు వసుంధరాధ్యక్ష
యింకఁ బంచతన్మాత్రలు పితరులై పుట్టిన తెఱంగు వినుము 40

గీ. మును చరాచర నిర్మిత్సు వనజభవుఁడు
మానసంబునఁ బంచతన్మాత్రలు వెలి
చేసి నిశ్చలయోగ విద్యా సమేతుఁ
డై పరంజ్యోతి భావించు నవసరమున. 41

మ. నయనాశ్చర్యముగా నిజాంగమునఁ దన్మాత్రల్ "పిబామ స్తరా
మ" యటంచుం బురుషాకృతుల్ మెఱయ జన్మంబైన నా భారతీ
ప్రియుఁడున్ వారల ధూమవర్ణముల వారిం దిర్యగూర్ధ్వాస్యులన్
వియ దధ్వాధి ముఖ ప్రయాణపరులన్ వీక్షించి లేనవ్వుతోన్. 42

గీ. ఓ తపసులార ! మీలోన నూర్ధ్వవదను
లైన వారలు నాందిముఖాఖ్య మెలఁగుఁ
డగుఁడు పితృదేవతలు తిర్యగాస్యులైన
వారలు గృహస్థులకుఁ దరువాయి వినుఁడు. 43

వ. మీమార్గంబు దక్షిణాయనంబు మీ దివసం బమావాస్య తద్దివసంబున నుపవ
సించి కుశవేధ చేసి కుశ తిలోదక తర్పణంబుల మీకు సంతృప్తి గావించు

పుణ్యాత్ములకు వరంబు లిండని చతుర్ముఖుండు నియమించె విశ్వంభరా
తలేశ్వరా ! యింక సోమోత్పత్తి వినుము. 44

సీ. నలువ మానసపుత్రునకు నత్రిమునికి నం
దనుఁడైన సోముఁడు దక్ష సుతల
నిఱువది యేడ్వుర వరియించి వారిలోఁ
గుసుమసాయక రత్న గోపురాధి
రోహిణి రోహిణిరూపరేఖా విశే
షఁబున హెచ్చ నచ్చామ మీఁది
వలపులు దలకెక్కి కలనైన దమవంకఁ
గడకంటఁ జూడమి కడమ సతులు
గీ. విరహ సంతాపభరమున వేఁగి వేఁగి
పుట్టినింటికి నొకనాఁడు పోయి లోచ
నాంబుధారలఁ దండ్రి పాదాంబుజముల
గడిగి పలికిరి కంఠ గద్గదికతోడ. 45

చ. అనవరతంబుఁ గోక తిమిరాంబురుహంబులు పూర్వజన్మ వా
సనలఁ దుషారధామకరసంగతి కల్మికి నోచ్చుఁ గాని మా
ఘన కుచచక్రముల్ కబరికాతమముల్ వదనారవిందముల్
జనక ! తుషారధామకర సంగతి లేమికి నోచ్చుఁ జూడుమా ! 46

గీ. ఆలి నొల్లనివాఁడు దా నీలకూర
కుప్పు చాల లేదన్నట్లు తప్పులేని
తప్పుఁ గొట్టించు మమ్ము సంతతము నేమి
చెప్పు కొందుము ! నీతోడ సిగ్గు పడక. 47

సీ. నీహారసలిలంబు నించి కాంచన కల
శముల మజ్జన మార్పఁ జనవులేదు
పచ్చలకూటంబుపైఁ బళ్లెరంబు పె
ట్టినవేళ వడ్డింపఁ జనవులేదు

కప్రంపుఁబలుకు బాగాల నర్పించి నే
ర్పున నాకు చుట్టి యీఁ జనవులేదు
పర్యంకతలమునఁ బవ్వళించినఁ జేరి
చరణాంబుజము లొత్తఁ జనవులేదు
గీ. మాకు నెన్నండు నత్రికుమారు దక్క
నేలుకొన్న గయాళి రోహిణికిఁ దక్క
పాప మెటువంటిదో కాక భాగ్యవంతుఁ
డైన పెనిమిటి గలిగియు లేని ఫలము. 48

కం. అని విన్నపంబు చేసిన
తనయల నూరార్చి వచ్చి దక్షుఁడు తాఁ జె
ప్పిన బుద్ధి వినని శశిపై
గినిసి కనుంగొనలు దొరగిల నిర్దయుఁడై. 49

కం. ఖల వృత్తి మత్తనూజల
నొలపక్షము చేసి వరుస లొసఁగక శోకా
కులితలఁగాఁ జేసిన చం
చలచిత్తుఁడ! చెడు మటంచు శపియించుటయున్ 50

ఉ. ప్రామిడి కానఁ గించి దపరాధము సైపక యిట్లుఁ దిట్టఁ
నేమి ఫలంబు గల్గె! నశియింపుము నీవు నటంచు సోముఁడున్
మామ నవంధ్యకోపమున మాఱుకుమాఱు శపించి సృష్టిలో
నామవినాశమై వెదకినం బొడఁ గానగ రాక పోయినన్. 51

సీ. గ్రక్కున సప్తపారావారవలయిత
క్షోణిమండలి వాన గురియ దయ్యె
వానలేని కతాన వాడి వత్తులవలె
సకలసస్యంబులు సమసిపోయె
సకలసస్యంబులు సంక్షయించిన నిమి
త్తంబున జీవిసంఘంబు నలిగె

జీవిసంఘంబు నొచ్చిన కారణంబున
సవనకృత్యంబులు చట్టు వడియె

గీ. సవనకృత్యంబు లడఁగిన నవసి నవసి
వాసవాది సుపర్వులు వరుగులై జ
గల్లతామూలకందంబు గమలనాభుఁ
డున్న కడకేగి యాదశ విన్నవింప. 52

గీ. అరమాభర్త నిర్జరులార ! యుప్పు
డోషధీమూలముల సోముఁ డున్నవాఁడు
గానఁ దడయక రాక్షసులు దుగ్ధ
జలనిధానంబు దరువుఁ డోషధులు వైచి. 53

చ. అని వనమాలి వేల్పులకు నానతి యిచ్చి మృగాంకశేఖరున్
వనరుహసంభవుం దలఁప వారును వచ్చిరి వారు దాను వా
హనముల నెక్కి పోవుచుఁ బ్రియంబునఁ జూచిరి ఫుల్ల కేతకీ
వన సురభీకృత త్రిపురవైరి మహారథి దుగ్ధవారిధిన్. 54

కం. కని రాజహంసలు భజిం
ప నున్న మత్పుండరీకమండలములు దా
కొనఁ జక్రవర్తుల విధం
బున నానాద్వీప రక్ష బొదలు తదబ్ధిన్. 55

కం. దగ్గఱి జలపానాగత
దిగ్గజకట గళిత మదనదీసౌరభ స
మ్యగ్గంధవహము తనువుల
మొగ్గ చెమటలాఱ విసర ముదితాత్మకులై. 56

సీ. తేలెడు పవడంపుఁ దీఁగెలు వాహినీ
సతులు దీసిన నఖక్షతము లనఁగ
నూర్ముల విహరించు నురగుల మణిఫణం
బుల భుజాంగదముల మొగపు లనఁగ

నాడకాడకు మీఁద నాశెకు జలధర
స్తోమంబు బడబాగ్నిధూమ మనఁగ
దాటు మీనంబులు తత్త్రస్తా సురవీరు
లెగుర వైచిన శాతహేతు లనఁగ
గీ. సంతతంబును బహువిశేషముల మెఱసి
యీ సుధాంభోనిధానంబు దృక్కరంభ
మై మన మనంబులకు మోద మావహించె
ననుచు నొండొరుతోఁ జెప్పుకొనుచు నిలచి. 57

శా. ఆవైకుంఠ హరాబ్జజుల్ వనుప హల్లాల్ల ధ్వనిన్ మందర
గ్రావంబున్ సుర దైత్యకోటి వెఱుకంగా నొప్పె రంధ్రంబుకై
జావాసంబున నుండి వాసుక మహా వ్యాళంబు నేత్రర్థమై
రా విస్తారపుఁ ద్రోవ చేసినగతిన్ బ్రాప్తాతి గంభీరతన్. 58

వ. ఇట్లు మందరాగబమందరాగంబునం బెకలించి తెచ్చి కవ్వంబుగా న మర్చి, వాసుకిం దరిత్రాడు చేసి వివిధౌషధివితానంబు సుధాంబు నిధా నంబున వైచి వైచిత్రి మెఱయ మఖవత్ప్రముఖ నిఖిలాదిత్యులు వాలం బును శిరంబునుం జుట్టిపట్టి త్రచ్చి త్రచ్చి ధృఢముష్టిని పీడంబునం గర తలంబులు పొక్కినఁ దొలంగువారును జంగసాచిన పదంబులు నొప్పి దీఱ నప్పటప్పటికి వీడ్వడ నిడు సమయంబునం గానక త్రొక్కిన వారును సవ్యాపసవ్యభ్రమణ రభసంబునం దొడుతోడం దొరఁగు మందరగండశైలంబులు దాఁకిన లోఁగువారును నేత్రశ్రవో వదన గహ్వర జిహ్వాల విష నిశ్వాస వైశ్వానరంబు సెకలు సోఁకిన వేఁగువారును సముల్లోల కల్లోల హల్లీసక ప్రభూత జంఝూనిలంబులు చఱచి కొట్టినం గూలువారును నిరంతర మథన ప్రయాసవశంబున దప్పి పుట్టిన దగదట్టి సోలువారును నైన నుభయపక్షంబుల లోపలఁ గొందఱు ధైర్యంబు కలిమిఁ బ్రాణంబులు పిడికటం బట్టుకొని వట్టిబిగువున నిల చిన విలోకించి కించిద్విహాసనంబులు వదనారవిందంబునకు విందులుగా గోవిందుండు సంభ్రమంబున. 59

శా. వాచామాధురి దేవదానవుల నాశ్వాసించుచున్ వచ్చి ధ
ట్టి చామీకరచేలమున్ బిగియఁ గట్టెన్ మీఁదికిం ద్రోచె బా
హా చంచన్మణి కంకణంబులు గృహీతాహీంద్ర పుచ్ఛాననుం
డై చేసేత మథింపఁగా దొడగెఁ దుగ్ధాంభోనిధిన్ భూవరా! 60

సీ. నగఘర్ష కండూయనము సౌఖ్యమునఁ గూర్కు
పట్టు గూర్మము గుఱు పెట్టె ననఁగ
నద్రి మూలోపలాహతుల భగ్నములైన
చిప్పల ముత్యాలు చెదరె ననఁగ
నచల నిర్మథన జాతాత్యుష్ణమున సుధాం
భోనిధానము మేను బొక్కె ననఁగ
క్ష్మాధరోత్తుంగ శృంగ విఘట్టనమున జు
క్కలు రాలి తెట్టున గట్టెననఁగ

గీ. ఘుమఘుమ ధ్వాన కోలాహలములు చెలఁగ
గగనవీధికి దుగ్ధ శీకరము లెగసె
తఱుచుగా బుద్బుదంబులు దలలు సూపె
నాల్గువంకలఁ గలయ ఫేనములు గ్రమ్మె. 61

కం. ఆసలిలాకర మథనము
చే సోముఁడు పుట్టె నిజరుచి స్థగితాశుం
డై సర్వశాస్త్ర మథనము
చే సుజ్ఞానంబు కరణి శ్రీపతి యెదుటన్. 62

వ. ఇట్లు చరాచర ప్రపంచంబునకు బ్రాణంబైన సోముండు సంభవించిన సంతోషించి మధుకైటభారాతియు నీరాకర మథనక్రీడ చాలించి వైకుంఠంబునకుం జనియె, నది మొదలుగా ధూర్జటి జటాజూటంబున సోమకళ ధరించు క్షేత్రజ్ఞుండును జలాత్మకుండునునైన సోమునివలన బ్రతిపదాది వానరాధి దైవతంబులు పదార్వురు దేవమానవులు వోషధులు వృక్షంబులు నిరాతంకంబున బ్రదుకు నిట్టి సోముని జన్మదినంబు గావునఁ

బుధ్వమనాఁడు కృతోపవాసులై భక్తి యుక్తి నర్ఘ్యంబు లిచ్చి యవా ర్యంబు భుజియించినవారికి నత్యంత కాంతి తుష్టి పుష్టి ధనధాన్య సమృద్ధులు సిద్ధించు రాజకులోత్తంస తిథిప్రశంస వినిపించితి నింక దత్త్వస్థవుల వృత్తాంతంబు వినుము వారిలోన సుప్రభుండు వర్తమాన కృతయుగంబున నీవై జనించి ప్రజాపాలనామంబు దాల్చెఁ దీప్త తేజుండు వత్సనామంబును సురశ్మి శశికర్ణ నామంబును . సుదర్శనుండు పాంచాలనామంబును సుకాంతి యంగనామంబును సుందరుండు వంగ నామంబును సుందుండు ముచికుంద నామంబును సునాముండు సోమ దత్త నామంబును శుభుండు సంవరణ నామంబును సుశీలుండు వరదాన నామంబును సుముఖుండు కేకయ నామంబును శంభుండు సేనాపతి నామంబును సుకాంతుండు దశరథ నామంబును సోముండు జనక నామం బును వహించిరి. కడమ పది యేవురు త్రేతాయుగంబున నవతరించి కర్మభూమికి నాయకులై బహువిధాధ్వరంబులు చేసి నాకలోక సౌఖ్యం బనుభవింపఁగలరని చెప్పి బహుమానపూర్వకంబుగా నమ్మహీనాథు వీడ్కొలిపి యోగమహత్వంబున విష్ణుతత్వంబునం గలసె నిట మహీ పాలుండగు ప్రజాపాలుండు మహాతపః కథిత పరమబ్రహ్మ విద్యా విషయ కథాశ్రవణంబున విరక్తుండై తపంబు సలుప నరుగు సమయం బున— 63

కం. ముందట నవలోకించె ము
కుంద సమీపాభిసారి గోపప్రమదా
నందకర కుంజములు గల
బృందావనమున్ మునీంద్ర బృందావనమున్ 64

కం. ఆ వనమున ఘోరతపము
గావింపుచు నుండి కొంత కాలంబునకుం
గోవింద నామధేయుని
శ్రీ వనితా విభుని వినుతి సేయఁ దొడంగెన్. 65

కం. గోవింద! వేదవేద్య! శ
చీవర సోదర! నిశాట సేనా సుభట
గ్రీవా కదుష్ట రుధిర
ప్లావితకర చక్రధార! భక్తాధారా! 66

కం. శరనిధి మగ్న ధరాధూ
ర్ధర! శబ్దస్పర్శ రూపరస గంధాఢ్యా
విరహిత పరిపూర్ణ సుధా
కిరణ సహస్రప్రకాశ! కితవమృగేశా! 67

సీ. పన్నగతల్ప! నీ భక్తులతోఁ బొత్తు
మని కాని దుఃఖంబు మఱవరాదు
నిఖిల జగన్నాథ! నీ చరిత్రంబులు
విని కాని మోహంబు విడువరాదు
పుండరీకాక్ష! నీ పుణ్యతీర్థములకు
జని కాని కలుషంబు చదుపరాదు
నిగమాంత సంస్తుత్య! నీ పదద్వంద్వంబు
గని కాని జన్మంబు గడపరాదు
గీ. కనక గర్భాదులకునైన నను గృతార్థుఁ
జేసి రక్షింపుమని ప్రశంసింప మెచ్చి
తనకుఁ బ్రత్యక్షమైన విష్ణుని శరీర
మున లయం బయ్యె నరపాలపుంగవుండు. 68

కం. నావుడు వరాహమునకు మ
హీ వనరుహపత్రనేత్ర! యిట్లనియె మహా
త్మా! వనితలు బురుషులు ని
న్నే విధముపఁ గొలువ మెత్తు వెఱఁగింపు దయన్. 69

గీ. అని పలుక దంభకోలనాయకుఁడు భూమి
కామినీ! భావ సాధ్యుండఁ గాని మంత్ర
హోమ దానాది విధుల సాధ్యుండఁ గాను
నిక్క మైనను వినిపింతు నొక్క విధము. 70

వ. బ్రహ్మచర్యంబు సత్యంబు నసంగ్రహంబు నస్తేయంబు నహింసయు మొదలగాఁ గలయవి మానస వాచకవ్రతంబు లేక భుక్తంబు నక్తం బుపవాసంబు మొదలుగాఁ గలయవి కాయికవ్రతంబులు వీనిలోన మానవులు శరీరక్లేశకర వ్రతంబులు సలిపిరేనియు విధేయుండ నగుదు నేతదర్థంబునకు నితిహాసంబు చెప్పెద మున్ను సన్నుతాచారధుర్యం డరుణిమునివర్యుండు పుణ్యనదీ తీరంబునఁ దపంబు చేయ నుద్యోగించి పోవుచుఁ గ్రమక్రమంబున— 71

మ. బుధవంద్యుం తడకఁ డొక్క పావన వనీ భూమి న్విలోకించె వా
ర్నిధి కల్లోల ఘటాపసక్త జలవేణీ నీవిక న్నిర్గళ
న్మధుమత్త భ్రమరీ మిళ త్కమలగంధ స్రావికన్ బాహుదం
డ ధృలాచిత్ర విచిత్ర సంతరణ నానానావికన్ దేవికన్. 72

సీ. ఈ తెఱంగున దేవికాతరంగిణిఁ గనుం
గొని తత్తటంబునఁ బనస వకుళ
నారంగ పూగ పున్నాగాది నానాగ
పుష్ప పూర్ణారణ్య పుణ్యభూమి
సతతంబు నిత్యుపాసములతో నత్యుగ్ర
తపము గావించుచుఁ దానమాడ
నొకనాఁడు చనుచోట నోరి! బాపడ! పెట్టు
పెట్టుమటంచు నాకట్టు కొన్న

గీ. పాపకర్ముని గార్ముక బాణపాణిఁ
గ్రూరదృష్టుల యెఱ జేరు గ్రుడ్లవానిఁ
జెంచు తెరువాటు గాని వీక్షించి తపసి
తల్లడంబున శ్రీహరిఁ దలఁచి నిలిచె. 73

కం. దొంగయు, హృదయ సరోరుహ
భృంగీకృత శార్ఙ్గధరుని ఋషిఁ గనుఁగొని వి
ల్లుం గోలయు ధర వైచి క
లంగుచు నంజలి మిళల్లలాట స్థలుఁడై. 74

ఉ. ఓ సదయాత్మ! సంయమికులోత్తమ! పిన్నట నాటనుండి నేఁ
జేసిన పాపపుం జెడుగుచేతలు చెప్పెద నుప్పు గోకకున్
భూసురకోటి నట్టడవిఁ బొట్టలు చించితి బిట్టు గొంతుకల్
గోసితి నల్లపూసకొఱకుం బదివేవురు పుణ్యభామలన్. 75

గీ. ఇన్ని చేసినఁ గడపట నింటిలోనఁ
ద్రావుడికిలేదు పాపంబె తగిలె నాకు
వల్కలములకుఁగాఁ జంప వచ్చి నిన్ను
గనుఁగొని మహాద్భుతంబు శాంతుండ నైతి. 76

శా. చౌర్యం బింతటనుండి మానితి వనాచారంబు చాలించితిన్
భార్యాపుత్ర ధనేషణత్రయ పరిభ్రాంతిం బెడంబాసితిన్
గార్యాకార్యవిచారతన్ వలని శంకల్ దక్కె నాకుం దప
శ్చర్యాసిద్ధికి నొక్కమంత్ర ముపదేశం బిచ్చి రక్షింపవే. 77

కం. అనిన మునీంద్రుఁడు వనితా
వనిసుర ఘాతకము సేయువాని నిరీక్షిం
చిన భాషించినఁగా గాఁ
దని చూడక మాఱుమాట లాడక పోవన్. 78

కం. తొలఁగక దొంగయు మోక్షపుఁ
దలఁపున వెనువెంటఁ బోయి దైవిక సలిలం
బులఁ గ్రుంకఁ గ్రుంకు నమ్మని
నిలిచినచో నిలుచుఁ దోడునీడయ పోలెన్. 79

సీ. ఈగతి మోక్షార్థియై గురువులకు శి
ష్యుని విధంబునఁ జెంచు దనకు వినయ
పరతంత్రచిత్తుఁడై పంపక పరిచర్య
గావింపఁగాఁ గొంత కాలమునకు
నొకవాసరమున దైవిక తీర్థమాడుచో
గుటగుట మనుచు నాఁకొన్నక్రోలు
పులి తటంబునఁ బ్రేఁప పొదనుండి మౌనిపుం
గవు మీఁద నుఱికినఁ గంటిఁ గంటి

గీ. ననుచు నాబోయ కరశరాసన కఠోర
గుణ విరావ ప్రతిధ్వని కుధర గుహల
వెడల వెడవెడ నార్చుచుఁ బిడుగుతునుక
వంటి నారాచమున నదరంట నేయ. 80

కం. ధారుణిఁ బడియెడు పులి ఘాం
కార ధ్వానంబు చేయఁగా వినుచు "నమో
నారాయణాయ" యని ముని
పేరెలుగున నుగ్గడించె భీతాత్మకుఁడై. 81

కం. ఘోరతర వ్యాఘ్రంబును
నారాయణమంత్రము వినినకతన నైజా
కారంబు విడిచి పురుషశ
రీరంబు ధరించి మునివరేణ్యునితోడన్. 82

కం. స్వామీ ! నారాయణ మం
త్రామృతములు తావకాననాబ్జభవములై
నామీఁద వెల్లి విరియ ని
రామయత మురారిపురికి నరిగెద నన్నన్. 83

ఉ. ఎవ్వఁడ వీవు నావుడు మునీ! తొలు జన్మమునన్ బ్రతాపినై
చివ్వకు వచ్చు వైరినృపసింహుల దేహములన్ తటాకముల్
త్రవ్వీన దీర్ఘబాహుఁడను రాజను విద్యలు వచ్చునంచు నేఁ
గ్రొవ్వున విప్రులన్ సరకుగోక తిరస్కరణంబు చేసితిన్. 84

కం. కోపించి వారు దుర్వి
ద్యాపాండిత్యమునఁ బ్రల్లదము లాడుదురే
భూపాధమ! శార్దూలమ
వై పుట్టు మటంచు నిర్దయత శపియింపన్. 85

కం. ఏటువడి ధర్మమను బరి
దాటిన నామనసులోని దర్పము వెడలన్
మీటి కరాంజలి మణిమయ
కోటీరాగ్రమునఁ బెట్టుకొని యిట్లంటిన్. 86

చ. తలఁపఁగ వాక్య వైఖరిఁ "గథ"మ్మన శక్తుఁడు గాఁడు శేషకుం
డలి పతియైన మిమ్మెదిరి నా వలనం బదివేలు తప్పులున్
గలవు ప్రధానవృత్తి ననుకంప వహించి వసుంధరా మరు
త్కులమణులార! శాపమునకుం గడ యెన్నఁడు నాకుఁ జెప్పుఁడా! 87

సీ. అని విన్నపంబు చేసిన రాజ! కడు నాక
లిగొని హస్తాన్న కాలికుని నొక్క
బ్రాహ్మణశ్రేష్ఠుని భక్షింపఁ జని భిల్ల
శాత భల్లాహతిఁ జచ్చు వేళ
నవ్విప్రుఁ డతిభయ వ్యాకులత్వమున నా
రాయణ స్మరణంబు చేయ విన్న
ఫలమున శార్దూలభావంబు వీడ్కొని
పురుషుండవై ముక్తిఁ బొందఁ గలవు
గీ. తథ్య మనిరి భవన్నిమిత్తమున నట్ల
శాప మోక్షంబు గలిగె సాక్షాత్పురాణ

పురుషమూర్తులు గావున ధరణి దైవ
తముల సద్భాషణము లమోఘములు సుమ్ము. 88

శా. ఆకర్ణింపు మునీంద్ర ! యేనొక రహస్యం బూర్ధ్వ బాహుండనై
నీకుం జెప్పెద మేదినీసురవరుల్ నిక్కంబు నిక్కంబు ల
క్ష్మీకాంత ప్రతిబింబముల్ జపతపస్సిద్ధుల్ సదాశుద్ధు ల
స్తోక జ్ఞాన కళా ధురంధరు లనింద్యుల్ వంద్యు లెవ్వారికిన్. 89

వ. బ్రాహ్మణ ద్వేషియైన నను వంటి పాపకర్ముండు నైతము నారాయణ మంత్రంబు పరముఖంబున విన్న మాత్రంబునఁ బవిత్రుండయ్యె బ్రాహ్మణ భక్తి యుక్తులై భక్తిపూర్వకంబుగా నారాయణమంత్రంబు జపియించిన పుణ్యులమహిమ యేమని చెప్ప నని బ్రాహ్మణ ప్రశంస గావించి నారాయణమంత్ర ప్రభావంబు వచియించి దీర్ఘబాహుం డనర్ఘమాణిక్యమయ విమానంబెక్కి స్వర్ఘంటాపథంబునం జనియె మునియు వనేచరుం గటాక్షించి మహోత్సాహంబున వత్సా ! భవత్సాహసంబునకు మెచ్చితి వరంబు వేడుమని మన్నింప నన్నిషాదుండు దండప్రణామంబు చేసి తాపసోత్తంస ! యింతకాలంబునకు సుముఖుండవై నాతోడ సంభాషించుట కంటె వరంబులు గలవే ! నన్నుఁ బనిచి పని గొనుమని విన్నవించిన. 90

సీ. ఓయి ! కిరాతాన్వయోత్తంస పశ్యతో!
హరత వీకొఁని తపశ్చరణ కాంక్ష
మున్నొక్క మంత్రంబు నన్నుఁ బ్రార్థించిన
నాఁటికి నీ తోడ మాటలాడ
నైతి నయోగ్యుండవని నేఁడు దైవికా
పుణ్య జలస్నానమున మదీయ
సందర్శనమున గోవింద నామశ్రవ
ణంబున నతిపావనత వహించి

గీ. నిలిచితివి గానఁ దగుదువు నిఖిల కర్మ
ములకుఁ దపమైనఁ జేయుము వలసె నేని

వరము లేమైన వేఁడు నా నరుణి మౌని
మణికి బోయ పునః ప్రణామంబు చేసి. 91

కం. చతురాననాది సురసం
తతి నతపద పంకజుండు నారాయణుఁ డే
గతిఁ గొలువ సులభుఁ డగు నా
నతి యీవలె నదియ వరము నాకు మునీంద్రా ! 92

గీ. అనిన విని యేవ్రతంబైన దను గుఱించి
పరమ విశ్వాసమునఁ బట్టి భక్తులకుఁ బ్ర
సన్నుఁడగు గాన భక్షింప శకట మన్వృత
మాడనని పట్టు వ్రతము శ్రీహరి గురించి. 93

కం. అని తపసి తత్పుళిందుఁడు
ధనమడుగక మోక్షమడుగఁ దలఁచిన నీలా
గున మోసపుచ్చి యేగిన
వెనుక నియమపరత నాటవికవల్లభుఁడున్. 94

చ. గురువుల నాత్మ గీల్కొలిపి ఘోరతపో నియమానుషక్తుఁడై
తరుపతితచ్ఛదాశన విధి న్విహరించుచు దైవికాసరి
త్పరిసర పుణ్యకానన విభాగమునందు బుభుక్ష కుక్షిలో
దరికొన జీర్ణపర్ణములు దానొకనాఁడు దినంగఁ బోయినన్. 95

కం. నక్షత్రపథసరస్వతి
భక్షింపకు శకట మనుచు భాషించిన నా
వృక్షంబు విడిచి వేఱొక
వృక్షమునకుఁ బోవ నట్ల యెఱిఁగించుటయున్. 96

సీ. ఆ భిల్లవల్లభుండఖిలంబు శకటంబ
కా విచారించి హృత్కమల కర్ణి

కాసీన దేశిక ధ్యానామృతంబు ప్రా
ణాధారముగ నిరాహారవృత్తి
నతిఘోరతపము చేయంగ దుర్వాసో ము
నీంద్రుండు వచ్చిన నెదురుకొని స
సంభ్రమస్వాంతుఁడై చాఁగి యే నెటువంటి
భాగ్యవంతుఁడనో పైతృకంబు

గీ. పెట్టసమకట్టువేళఁకు బిచ్చుకుంటు
మీఁద భాగీరథియుఁ బోలె మీర లేగు
దెంచితిరి గాన వలయు నాతిథ్య మవధ
రింపు నిస్తంద్రకారుణ్య! ఋషివరేణ్య! 97

గీ. అనిన దూర్వాసుఁ డాత్మలో ననశన వ్ర
త ప్రియాసంబుచేఁ గృశత్వమునఁ బొంది
యును మహాబ్రహ్మవర్చసయుక్తుఁడైన
యితని తపము పరీక్షింతు నే నటంచు. 98

కం. ముని తరు జీర్ణ పలాశా
శనుఁడవు నిరశనుఁడ విపుడు శబరాన్వయవ
ర్ధన! నీకు శక్యమే వన
మున మా కభీప్సితాన్నముల దొరకింపన్. 99

కం. పేరాఁకలి గొంటిమి కడు
పార భజించెదము శాలియవ గోధూమా
హారములు పెట్టు మనవుడు
నే రీతి ఘటింతు నితని యీప్సిత మనుచున్. 100

కం. తలఁచు తఱిన్ మందాకిని
బలభిత్కరి సొచ్చి పెఱికివైచిన రక్తో

త్పల మనఁగాఁ జిక్కుములో
పల నొక మణిపాత్ర మభ్రపథమున వచ్చెన్. 101

ఉ. ఆ నవరత్నపాత్ర శబరాగ్రణి పాణి ధరించి మ్రొక్కి యి
చ్చో నిలుమయ్య నన్ను దయఁ జూచి బుభుక్షకు నోర్చి తత్త్వవి
ద్యానిరతాత్మ ! సంయమివరా ! మధురాన్నము లల్లరామయో
షానగరంబునం బరమసాధ్వులచేఁ గొని వచ్చునంతకున్. 102

కం. అని వినయము తోడఁ దపో
ధనవతి నొసఁ బలికి గురుపదస్మరణము గై
కొని రామయోష నికటం
బున నున్న వనంబు చొచ్చి పోయెడు వేళన్. 103

సీ. అర్పించె నొక కోమలాంగి సంభ్రమమున
వచ్చి పువ్వులవంటి వంటకంబు
వైచె ఫలంబులవంటి లడ్వాలు మ్రొ
క్కుచు నొక్క పృథుల వక్షోజయుగళ
వడ్డించె నొక వరవర్ణిని కడువేడ్క
పడి పరాగమువంటి పంచదార
వంచె మరందంబువంటి కమ్మనినేయి
మన్ననతో నొక్క మధురవచన

గీ. మఱియు వనదేవతాస్త్రీలు మహిరుహములఁ
బుట్టి పట్టెడు వివిధాన్నములకు నెడము
చూపెఁ గీకటమునిపాత్ర సూక్ష్మమయ్యు
మహిమ బహువిద్యలకుఁ గవి మనసువోలె. 104

శా. ఈ రీతిన్ గడువేగ వాంఛితఫలం బీడేర ధన్యుండ సం
సారాంభోనిధిపారగుండ నని యిచ్చెన్ మెచ్చునన్ వచ్చి నై
జారణ్యస్థలి నన్నిషాదమునిభిక్షాపాత్రముం బెట్టి దే
వా! రావయ్య! భుజింప నంచు వినతుండై పల్కె దుర్వాసుఁడున్. 105

గీ. మనసులోపల సీతని మహిమ నిజము
గానెఱింగెద ననుచు నో మౌని నదికి
నడవ నోపముచేఁ గమండలువు లేదు
సలిలములు దెమ్ము మాకు నాచమనమునకు. 106

సీ. అనవుడు శబరసంయమి కొంతతడవు వి
చారించి గురుపదాబ్జములు డెంద
మున సంస్మరింపుచుఁ బోయి చేరువనున్న
దేవికానది డాసి దేవి! కామి
తార్థదాయిని! పాపహారిణి! లోక పా
వని! తల్లి! నాకు భవజ్జలావ
గాహనంబును దేశికధ్యానమును దక్క
నన్యంబు లేదు మహామునీశ్వ

గీ. రాగ్రగణ్యుండు దుర్వాసుఁ డరుగు దెంచె
నతిథియై నేఁడు రానోపఁ డలసి తీర్థ
మాత నా విన్నపము విను మచట విమల
వారి దొరకదు విచ్చేయ వలయు ననిన. 107

మ. క్షమపై నద్భుత మావహిల్ల శశిరేఖా భంగశృంగారయై
సముదాత్త ధ్వని పూర్యమాణ సకలాశాభోగయై చక్రి వి
భ్రమరోధోనిపతత్పయఃకణికయై పాఱె న్నిషాదేంద్ర వ
త్సము వెంట న్పడి దేవికాసురభి సంజాతోన్ముఖత్వంబునన్. 108

వ. ఇవ్విధంబున సవిధంబునకు వచ్చిన దేవికాతరంగిణిఁ గృతస్నానుండై దుర్వాసుండు శబరతాపసుండు వడ్డింపనాఁకంట నాకంఠపూరితంబుగా బహువిధాహారంబు లారగించి, నిజలోచనాంచలంబులం గారుణ్యరసంబు దొలంక నతనివంకం జూచి నీవు గురూపదేశమార్గంబున సత్యం బవలంబించి తపంబు గావించితివి గావున సత్యతపోనామధేయంబు వహింపుము వేదశాస్త్ర పురాణేతిహాస బ్రహ్మ విద్యా వైశా

రద్యంబు నీకుం గలుగ వరంబిచ్చితి ననిన సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి మునీంద్రా? కిరాతుండనైన నేను వేదాదివిద్యలకు నర్హుండ నగుట యెట్లు డెందంబుననున్న సందేహంబు మాన్పుమని విన్నవించిన. 109

సీ. అనసూయపట్టి యిట్లనియె నోయి సుధీని
ధాన చెప్పెదఁ బురాతన కిరాత
దేహంబు గాదు నిరాహారతపము సే
యఁగ శరీరాంతరం బయ్యె ననిన
ఋషికులేశ్వర ! నాకు రెండు విగ్రహము లే
గతిఁ గల్గె నావుడు నతఁడు సత్య
తపునితో జంతుసంతతికి నధర్మరూ
పంబును ధర్మరూపంబును భయ

గీ. రూపమును నైన తనువు లార్యులు వచింపు
దురు వరుస మూఁడటంచు నందుల నధర్మ
ధర్మభోగానుభూతికిఁ దగిన మేను
పారలౌకిక మనియెడు పేరు దాల్చు. 110

కం. విశదముగా విను తేజః
కృశానుసమయాతనాశరీరంబును భో
గశరీరంబును గైవ
ల్య శరీరము ననఁగఁ ద్రివిధమగుఁ దత్తనువుల్. 111

గీ. నీవు గురుసంస్మరణ తపోనియమ పరతఁ
జేసి ధర్మంపు మేను దాల్చితివి సుమ్ము
సర్వకాలంబు జీవహింసకు నిధాన
మైన తొల్లింటి పాపంపు మేను మాని. 112

సీ. అటుగాన వేద శాస్త్రాది సమస్త వి
ద్యలకు నర్థత్వంబు గలదు నీకు
సంశయింపకు మానసంబున మానవుం
డెందాఁక వర్తించు నెనిమిదింట
నందాఁక నతఁడు గర్మానుబంధంబులఁ
బొరలు నష్టకవర్గమునకుఁ బాసి
ప్రతిగతుఁడై సంతతస్థిరతఁ బ్రాపింప నా
ర్గేనులు వర్తించి యేకమార్గ

గీ. నిరతుఁడై కాంచు బ్రహ్మంబు నిక్క మనిన
సంయమీశ్వర ! యిట్టి సుజ్ఞాన మహిమ
యెఱుఁగ నేరని వారికి నెట్లు గలుగు
బహుసుఖైకాస్పదము పరబ్రహ్మపదము. 113

వ. అనవుడు దుర్వాసుండు సత్యతపు నిరీక్షించి నిర్మలాత్మా ! యింక నొక్క మర్మం బాకర్ణింపుము సుజ్ఞానంబునం గాని సత్కర్మంబు జరగదు సత్కర్మంబున గాని విజ్ఞానంబు వొడమదు వివేకింప నీ రెండు నొండొంటికి సాధనంబులు సత్కర్మంబులు బ్రహ్మక్షత్ర వైశ్య శూద్ర వర్ణంబుల యజన పాలన కృష్యాది వృత్తి శుశ్రూషా భేదంబులఁ జతుర్విధంబయ్యె బ్రహ్మ క్షత్రియ వైశ్యులు వేదోక్త ప్రకారంబున నిజాచారంబుల నడుపవలయు వీరికి శూద్రుండు సేవ చేయవలయును నిత్తెఱంగునఁ గులధర్మంబు దప్పక బ్రహ్మోపాసకులైన జనులు మోక్షంబునం బొందుదురు బ్రహ్మంబరూప నామధేయం బప్రమేయం బని దురవగాహంబుగా నూహింపకు బ్రహ్మం బనంగ భక్తరక్షా పరాయణుండైన నారాయణుండు తద్దేవుండు యజ్ఞాదికృత్యంబుల వలన సులభుండగు నని దుర్వాసుండు సత్యపునకుం జెప్పెనని వరాహదేవుండు వచియించిన ననంతకాంతా! మీఁదటి వృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. 114

శా. కల్పాంతస్థిరకీర్తిపూర ! జగదేక స్తోత్ర పాత్రాచితీ
కల్పానోకహ ! సప్తసంతతి బహూకారాదినానాగుణా౽
కల్పానల్పరమా విలాస ! నరసింగస్వామి ! నిర్జిత సం
కల్పాభిజ్ఞ ! పరక్షితిక్షపణ దీక్షాదక్ష కౌక్షేయకా ! 115

కం. కర్పూరోజ్జ్వల యశ ! దో
ర్దర్పాపర పరశురామ ! తారుణ్య కళా
దర్పక ! పటు పరితాపా
హర్పతి హృతరిపు సతీ దృగంజనతిమిరా ! 116

మత్తకోకిల. లుబ్ధ మన్మనకుమారపల్లవలోలదృగ్జమ్మకరధ్వజా !
లుబ్ధకీకృతవైరిభూవర లోకనిశ్వసితాగ్ని ధూ
ర్లబ్ధతాపకులాద్రి శైత్యకరప్రభావ యశోరుచి
స్తబ్ధ దుగ్ధరసాబ్ధి నందన చంద్ర చంద్రన చందనా ! 117

గద్యము. ఇది శ్రీ మదూమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంటనాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీవరాహపురాణం బను మహా
ప్రబంధంబున సప్తమాశ్వాసము.

శ్రీ

# వరాహ పురాణము

## అష్టమాశ్వాసము

—*—

శ్రీద సవన భుగ్భూజాం
భోద సమత్యాగ! మధురిపుత్రి ప్రరహరా
భేద సపర్యాచర్యా
హ్లాద సమేతాత్మ! యీశ్వరాధిపునరసా. 1

వ అవధరింపు మవ్వరాహదేవుండు కాశ్యపి కిట్లనియె నట్లు దుర్వాసుండు చెప్పిన విని సత్యతపోమునీంద్రుండు భట్టారకా! నారాయణుండు యజ్ఞాదికృత్యంబులం గాని సులభుండు గాఁడన? యతధరించితివి యజ్ఞాదికృత్యంబులు ధనసామగ్రి లేక నడపరాదు ధనంబు గలిగె నేనియు లోభంబున సంసారులు తత్కృత్యంబులకు నూలుకొనరు గావున నల్పప్రయాసంబున సకలవర్ణంబులకు మోక్షంబు గలుగు మార్గం బాన తిమ్మనిన సుముఖుండై. 2

గీ. అత్రిముని సంభవుండు మహానుభావ!
సర్వసర్వంసహాకాంత జలధిలోన
మునిఁగి పాతాళమున నుండి మున్ను వారి
జోదరునిఁ గూర్చి తాఁజేసె నొక్క వ్రతము. 3

కం. తద్వ్రితము రహస్యంబు మ
రుద్వ్రిత వినిర్మితంబు రోగ భవభయా

పద్వ్రిక తిల విత్రము త్రిజ
గద్వ్రిడావతి పురుషులు గావింపఁ దగున్. 4

సీ. సత్యతపోమునీశ్వరచంద్ర ! యెట్లన్నఁ
జెప్పెద నిను మార్గశీర్ష శుద్ధ
దశమీదినంబునఁ దానంబుఁ జేసి య
తాత్ముఁడై విహితకృత్యములు దీర్చి
లవణంబు పులుసు తైలంబు వర్జించి హ
విష్యంబు భక్షించి వెనుక పాలు
గల చెట్టు పుడుక చక్కనిదిగా నెనిమిది
వేళ్ల మానంబులు విఱిచి తెచ్చి
గీ. దంతములు దోమి వదన హస్త చరణములు
గడుగుకొని వార్చి రవిబింపగతుని విష్ణు
శంఖ చక్ర గదాంబుజ స్వర్ణవసను
మణిమయకిరీటదేదీప్యమానుఁ దలఁచి. 5

కం. ఏ నేకాదశినాఁడు మ
హానియతి నుపోషితుండనై కేశవ! ల
క్ష్మీనాయక ! నీకుఁ బ్రియము
గా నపరతిథిన్ భుజింతుఁ గావుము నన్నున్. 6

మ. అని ప్రార్థించి సపుష్పతోయముల నర్ఘ్యం బిచ్చి శార్ఙ్గి న్మనం
బునఁ జింతింపుచుఁ బవ్వళించి రవిదీప్తుల్ సోఁకి నెత్తమ్మి మే
ల్కనుకంటె న్మను లేచి భూతగణరక్షాధారణాపాత్రి ! ధా
త్రి నమస్తే యని పల్కి పుచ్చుకొని మృత్పిండంబు హస్తంబునన్. 7

కం. జలజభవాండోదరమునఁ
గలిగిన తీర్థములు తావకములైన కరం
బులఁ బుట్టినవి దినేశ్వర
త్రిలోకనుత ! నాకు నిమ్ము తీర్థఫలంబుల్. 8

గీ. అని మహీభాస్కరులఁ గొనియాడి మృత్స్న
మూఁడు మాఱులు నైజాంగముల నలందు
కొని నదీసలిలంబులఁ గ్రుంకి నిత్య
కృత్యములు దీర్చి యింటికి నేగు దెంచి. 9

వ. శాతకుంభ కుంభ రంభాస్తంభ దర్పణ ధవళచామర సురభిమాల్య వితానంబుల నలంకృతంబైన మంటపంబున నా రాత్రి నారాయణు నారాధించి 'కేశవాయనమో'యని పాదములు 'దామోదరాయ నమో'యని కటీరంబును 'నృసింహాయ నమో'యని యూరు యుగ్మంబును 'శ్రీవత్స ధారిణే నమో' యని వక్షంబును 'త్రైలోక్య విజయాయనమో'యని భుజంబులును 'సర్వాత్మనేనమో'యని శిరంబును 'రథాంగపాణయేనమో'యని చక్రంబును 'శంఖాయ నమో'యని శంఖంబును 'బద్మాయనమో'యని పద్మంబును 'గంభీరాయ నమో'యని గదాదండంబును 'శార్ఙ్గమూర్తయే నమో'యని యభయహస్తంబును బూజించి తద్దేవతాగ్ర భాగంబున సరత్న జలపూరితంబులు విమలాంబర పరివృతంబులు గంధ పుష్పాక్షత సమన్వితంబులు తిల తామ్ర పాత్ర స్థగితంబులు నైన కలశంబులు నాలుగు చతుర్వేదంబులు చతుస్సముద్రంబులుగా భావించి తత్కలశంబుల నడుమ హిరణ్మయంబుగాని రజతమయంబుగాని దారుమయంబుగాని యొక్క ప్రతిమ గావించి వస్త్రావృతంబైన పీఠంబు పెట్టవలయు నట్టి పీఠంబు దొరకదేని సలిల పూర్ణకుంభంబుం గుదురు పఱచి తదుపరి స్థలంబున సువర్ణంబునం జేసిన మత్స్యప్రతిమ ప్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి దైత్యాంతకా! రసాతలగతంబైన వేదంబులం బోలె సంసారనిమగ్నుండనైన నన్నుద్ధరింపుమని ప్రార్థించి జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయావసరంబున సముచిత క్రియాకలాపంబులు సలిపి పూర్వదక్షిణ పశ్చిమోత్తరంబుల కలశంబులు ఋగ్యజుస్సామాథర్వణవేదులకుఁ గ్రమంబున నిచ్చి తోయ పాత్రస్థిత కాంచన మీనంబుం గుటుంబియైన భూసురాగ్రణికి సమర్పించి తదనంతరంబున. 10

సీ. పాయసాన్నంబుల బ్రాహ్మణోత్తముల సం
తృప్తులఁ గావించి భృత్య వర్గ
సహితుఁడై మౌనంబు సడలక పారణ
చేసిన సువ్రతశీలు పుణ్య
ఫలము వచింతు నా బ్రహ్మకల్పము సత్య
లోకంబునందు ననేక సౌఖ్య
మునునుండి జన్మించు వెనుక వైరాజుల
లోన జగన్నుతశ్లోక ! యింక

గీ. నైహిక ఫలంబు వినిపింతు నతి దరిద్రుఁ
డధికసంపదఁ బొందు గొడ్రాలు సుతులఁ
గాంచు నన్నియు నేటికి నెంచఁ బాయు
బ్రహ్మహత్యాది బహువిధపాతకములు. 11

కం. ఈ సువ్రతంబు తత్పర
యై సలిపిన ఫలమునంగదా మును లయవే
ళాసాగరమగ్నధరి
శ్రీసతి హరిచేత నుద్ధరింపఁగఁ బడియెన్. 12

చ. అమృతరసోపలబ్ధికి సురాసురవీరులు గూడి పుష్యమా
సమున సముత్పతచ్ఛఫర శైవలకర్కట చక్రవిక్ర వి
ద్రుమలహరీ ఘటాగగనరోధిఁ బయోధి మథింప నిందిరా
రమణుఁడు దాల్చె మందరధరా ధరభారముఁ గచ్ఛపాకృతిన్. 13

గీ. అమ్మహాకచ్ఛపేంద్రప్రియంబుగా వి
శుద్ధమానసుఁడై పుష్యశుద్ధదశమి
నాఁడు పూర్వప్రకారంబు నరుఁడు దాసు
చితవిధులు దీర్చి యేకాదశీదినమున. 14

వ. స్నానాదికృత్యంబులు జరపి నానావిధ పరిష్కార మనోహరంబైన
మంట పాంతరంబున రాత్రి లక్ష్మీకళత్రు నారాధించి 'కూర్మాయ నమో'

యని పాదంబులు 'నారాయణాయనమో'యని కటీరంబును 'సంకర్షణాయ నమో'యని యుదరంబును 'విశోకాయ నమో'యని యురస్థలంబును 'భవాయ నమో'యని కంఠంబును 'సుబాహవే నమో'యని భుజంబులును 'విశాఖాయ నమో'యని శిరంబును 'చక్రాయ నమో'యని చక్రంబును 'శంఖాయ నమో'యని శంఖంబును బూజించి తద్దేవతాగ్ర భాగంబునం గలశంబులు పూర్వప్రకారంబున నిలిపి మధ్యకలశోపరిస్థలంబున హైయంగవీన పూర్ణతామ్ర పాత్రంబున యథాశక్తి భర్మనిర్మిత సమంచిత కూర్మప్రతిమ ప్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబు గావించి మఱునాఁడు సూర్యోదయావసరంబునం గలశప్రతిమాదానంబులుచేసి వసుమతీసుపర్వులకుఁ బాయసాహారంబులు సదక్షిణంబులుగా నొసంగి భృత్యవర్గంబును దాను భుజియించిన జననశతత్రయార్జిత పాతకంబులం బాసి యిహలోకంబున బహుసౌఖ్యంబులనుభవించి విష్ణుసామీప్యంబున నాబ్రహ్మకల్పంబు వసియించి పిదప మర్త్యభువనంబునం బుట్టి పట్టభద్రుండగు. 15

ఉ. భంగములై నగంబులు గుభాలునఁ ద్రెళ్లఁ గరళ్లదాఁటుతో
నింగికిఁ బొంగు వారిధి మునింగిన భూవలయంబు కన్నెగే
దంగి తుద న్వసించిన మదప్రద సౌరభ నిశ్చలీభవ
ద్భృంగముఁ బోలఁ గొమ్ముకొన నెత్తె మురారి వరాహరూపమై. 16

ఆ. ఆ కిరీశ్వర ప్రియంబుగాఁ బూర్వ వి
ధమున మాఘ శుద్ధదశమి నుచిత
కృత్యములు ఘటించి యేకాదశీతిథి
నధికభక్తుఁడైన యన్నరుండు. 17

వ. స్నానాది కృత్యంబులు జరపి సంతమస స్థాపిత ముకుర కల్పితా పరిమితక్షణదేశంబైన మంటప ప్రదేశంబున నా రాత్రి వామదేవు నారాధించి 'వరాహాయనమో'యనిపాదంబులు 'వామదేవాయనమో'యని కుటీరంబును 'క్షేత్రజ్ఞాయనమో'యని జఠరంబును 'విశ్వరూపాయనమో'యని యురంబును 'సర్వజ్ఞాయనమో'యని కంఠంబును 'ప్రజానాం పతయేనమో'యని

శిరంబును 'బ్రహ్మమూర్ధ్నాయ నమో'యని భుజంబులు 'దివ్యాస్త్రాయనమో' యని చక్రంబును 'నమృతోద్ధాయనమో'యని శంఖంబును బూజించి తద్దేవ తాగ్రభాగంబున సరత్న సలిల పూర్ణ కుంభంబు నిలిపితుమపరి స్థలంబున సౌవర్ణ కాంస్య తామ్ర వైణవంబులలోన దొరికిన పాత్రంబున సకల సస్య బీజంబులు నిండించి పెట్టి, యథాశక్తి హేమంబునం గల్పించి ధవళవస్త్ర యుగంబునం బొదివి దంష్ట్రా సముత్తంభిత విశ్వంభరంబైన వరాహ ప్రతిమం బ్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబుచేసి మఱు నాఁడు సూర్యోదయావసరంబునఁ గలశప్రతిమా దానంబు గావించి తదనంతరంబున విప్రులకుఁ బాయసాహారంబు సదక్షిణంబుగా నొసఁగి భృత్యవర్గసహితుండై భుజించిన భూలోకంబున శాశ్వతైశ్చర్యంబు లనుభవించి పిదప వైకుంఠంబున నుండు నిమ్మహావ్రతంబున కొక్క యితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. 18

సీ. శంసితవ్రతుఁడైన సంవర్తసంయమీ
శ్వరుని కుమారు లేవురు సమిత్కు
శార్థంబు చని భీకరారణ్యమున నప్పు
డట జనియించిన హరిణశాబ
ములఁ దల్లిఁ బాసి వాపోవుచుఁ గన్నులు
దెఱవని వాని నైదింటిఁ జూచి
కరుణ నొక్కొక పిల్లఁ గరములఁ బట్టు మా
త్రమున నామృగకిశోరములు చచ్చి

గీ. టయు భయంపడి జనకుని డాసి నిర్ని
మిత్తమున సంభవించిన మృగ శిశువధ
పాతకము చెప్పి యిదిమీరు పరిహరింప
వలయునని విన్నవింప సంవర్తమునియు. 19

కం. మా తండ్రి మొదలఁ బాతకి
పాతకి నేనతనికంటె బాలకులారా!

పాతకులై తిరి మీరును
దాతతరము పాతకంబు తప్పక వచ్చెన్. 20

గీ. అనుచు దుఃఖించి దైవికంబైన పనికి
నింక నేల విచారింప నేణ చర్మ
ధారులై మీరలైదు వత్సరము లడవిఁ
గ్రుమ్మరుఁడు మీఁదఁ బాప నిర్ముక్తి గలుగు. 21

చ. అనవుడు నేణచర్మధరులై ఋషిలేపుత్రకు వురున్ వనం
బున నొక యేడుగాలము తపోనియతిన్ వసియింప నంతన
వ్వనవసుధాతలంబునకు వచ్చి కిరాతులు చొప్పు చూపఁగాఁ
బనివడి వీరసేనజనభర్త మృగంబుల వేట లాడుచున్. 22

కం. ముందట నొక్క మహీజము
క్రింద హరిణచర్మములు ధరించిన మునిరా
ణ్ణందనులం గనుఁగొని మృగ
సందేహంబున నిశాతశరముల నేసెన్. 23

కం. ఏసిన హరి హరి యనుచు గ
తాసువులై కూలుటయు మహైశ్వర్యము సం
త్రాసంబును ముప్పిరిగొన
నాసంయమి సుతుల కటకు నరిగి విభుండున్. 24

కం. అసదృశ పాపఫలంబున
నసిమోవని బ్రహ్మహత్యలైదు దగిలె నె
ట్లు సహించువాఁడ మృగయా
వ్యసనము కొఱగామి గానవచ్చె నటంచున్. 25

సీ. పోయి చేరువనున్న పుణ్యాశ్రమస్థలం
బున నున్న దేవరాతునకు మ్రొక్కి

తనకు నిష్కారణంబున బ్రహ్మహత్యలు
దగులుట చెప్పి గద్గదికతోడ
నేడ్చిన, నాసంయమీశ్వరుఁ డూరార్చి
రాజన్య! మున్ను వారాశిలోన
మునిఁగిన భూమికామిని నుద్ధరించిన
కరణి మహాపాతకంబు వలన

గీ. శ్రీ వధూజాని నిన్నుద్ధరింపఁ గలఁడు
తలఁకనేల వరాహవ్రతంబు సలుపు
మనిన నాతండు చని వరాహవ్రతంబు
సలిపి శుద్ధాత్ముఁడై జగజ్జనులు వొగడ: 26

శా. దృప్తారాతి వరూధినీ రుధిరమత్తీభూత భూతస్తుతి
వ్యాప్తానేక రణస్థలీవిజయబాహాగంధవాహాసియై
సప్తాంభోనిధి మేఖలావలయితక్ష్మామండలం బెల్ల సం
తృప్తిం బొంది దిగంతరాళములఁ గీర్తిస్ఫూర్తి వర్తింపఁగన్. 27

సీ. ఆ నరేంద్రుండు దేహావసానంబున
మణిమయంబైన విమాన మెక్కి
నాకంబునకుఁ బోవఁ బాకశాసనుఁ డర్ఘ్య
మీ వలెనని యెదు రేగుదేరఁ
గనుఁగొని విష్ణుకింకరులు నివారించి
వీరసేనావనిధార! యితఁడు
తపమున నీ కంటెఁ దక్కువఁ గానఁ జూ
డ కరమ్ము నావుడు సకల దిగధి

గీ. పాలకుల దివ్యతేజఃప్రభావమును ని
రాకరించి వివర్జిత ప్రళయమునకు
సత్యలోకంబునకుఁ జని సౌఖ్యలీల
విపుడు సైతము నున్నాఁడు ఋషివరేణ్య. 28

మ. ధర గంపింప మహానఖాభవన రత్న స్తంభ సంభూతుఁడై
కరజంబుల్ నులివెట్టి రక్తకణముల్ గారంగ వీక్షించి రౌ
ద్రరసద్రోణికలో యటంచు విబుధవ్రాతంబు వర్ణింప శ్రీ
హరి, రక్షోభుజమధ్యమండలము చెండాడెన్ నృసింహాకృతిన్. 29

గీ. ఆ నృసింహునకుఁ బ్రియంబుగా ఫాల్గున
శుద్ధ దశమి నాఁడు సువ్రతుండు
విహిత విధులు పూర్వవిధమునఁ దీర్చియే
కాదశీ దినమునఁ గ్రమము తోడ. 30

వ. స్నానాది కృత్యంబులు జరపి రంగవల్లికా ప్రముఖ శృంగార కళా సాన్నిధ్యంబైన మండప మధ్యంబున రాత్రి మధుకైటభారాతి నారాధించి, 'నారసింహాయ నమో'యని పాదంబులు, 'గోవిందాయ నమో'యని యుదరంబును, 'విశ్వభుజాయ నమో'యని కటీరంబును, 'ననిరుద్ధాయ నమో'యని యురంబును, 'శతికంఠాయ నమో'యని కంఠంబును, 'పింగకేశాయ నమో'యని శిరంబును, 'దైత్య ధ్వంసాయ నమో'యని చక్రంబును, 'జలాత్మనే నమో'యని శంఖంబును, బూజించిన తద్దేవ తాగ్రభాగంబున సరత్నసరిలకుంభంబు నిలిపి తదుపరిస్థలంబునఁ దామ్రదారువైణవంబులలోన దొరికిన పీఠంబుమీఁద ధవళవస్త్రయుగ ళంబునఁ బొదివి యథాశక్తి హిరణ్యనిర్మిత నరసింహప్రతిమ ప్రతిష్ఠించి, షోడశోపచారంబులు సలిపి, జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయావసరంబునం గలశప్రతిమాదానంబులు గావించి తద నంతరంబ వసుధాసుధాంధసులకుఁ బాయసాహారంబు సదక్షిణంబుగా నొసఁగి భృత్యసమేతుఁడై భుజియించిన మర్త్యభువనంబున సౌఖ్యంబు లనుభవించి పిదప విష్ణులోకంబున నుండు నిమ్మహావ్రతా చరణంబునకు నొక్కయితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. 31

సీ. మునికులోత్తంస కింపురుషవర్షంబునఁ
భారవశవ్యక్షమాపాలకుండు

వత్సరాజు విరోధివర్గంబు చేతరా
జ్యము గోలుపోయి భార్యయును దానుఁ
జని వసిష్ఠాశ్రమంబునఁ గొంతకాలంబు
వసియింపఁగా నొక్కవాసరమున
నవ్వసిష్ఠుండు నరాధీశ యిచటికి
రానీకు నేమి కారణము చెప్పు

గీ. మనిన జనభర్త ముకుళితహస్తుఁడై వి
పక్షులకు నాజిఁ దానోటుపడిన తెఱఁగు
విన్నవించి మహాత్మ ! ప్రసన్న బుద్ధి
నొక్క గతి నాకుఁ జెప్పునా నూఱడించి. 32

మ. నరసింహవ్రత మాచరించి మను మన్నన్ వత్స ! భూజాని త
త్పరచిత్తంబున నేగి తద్వ్రతము సల్ప న్మెచ్చి చక్రంబు శ్రీ
హరి యీఁ గైకొని, తన్మహాస్త్రమున మత్తారాతిరాజన్య కం
ధరముల్ సంగరసీమలో నఱకి శాంతస్వాంతుఁడై క్రమ్మఱన్. 33

కం. సామ్రాజ్యము పాలించె వి
నమ్రాఖిల కువల యాధినాధ కిరీటా
తామ్రమణి తరుణ దినమణి
కమ్ర విభావికసితాంఘ్రికమలద్వయుఁడై. 34

మ. తనరూపంబు గ్రమక్రమంబున దళద్బ్రహ్మాండభాండంబు నిం
డినచో భాస్కరుఁ డందెకు న్మొగపుమాణిక్యంబుగా సప్తవా
రినిధానీపరివేష్టితాఖిల ధరిత్రీమానము ల్మీఱఁ బె
ట్టిన పాదంబున, దైత్యభేది బలి మెట్టెన్ వామనాకారుఁడై. 35

ఆ. మనుజుఁ డట్టి వామనునికిఁ బ్రియంబుగాఁ
జైత్ర శుద్ధదశమి సకల కర్మ

ములు మునుపటి చందమునఁ దీర్చి యేకాద
శీదినమున శుద్ధ చిత్తవృత్తి. 36

వ. స్నానాదికృత్యంబులు జరిపి వైభవాభిరామంబైన మండపసీమంబున రాత్రి ముకుందు నారాధించి 'వామనాయ నమో'యని పాదంబులు, 'విష్ణవే నమో'యని కటీరంబును, 'వాసుదేవాయ నమో'యని జఠరంబును, 'సంపూర్ణ కామాయ నమో'యని యురంబును, 'విశ్వసృజే నమో'యని కంఠంబును, 'విశ్వరూపిణే నమో'యని శిరంబును, 'విశ్వజితే నమో'యని భుజంబులును, 'శంఖాయ నమో'యని శంఖంబును 'చక్రాయ నమో'యని చక్రంబును బూజించి, తద్దేవతాగ్రభాగంబున సరత్న సలిల పూర్ణకుంభంబు నిలిపి తదుపరి స్థలంబునం దామ్రదారువైణవంబులలోన దొరికిన పీఠంబు మీఁద యజ్ఞోపవీత కమండలు పాదుకాతపత్ర బ్రుసీసమేతంబైన యథాశక్తి కాంచన వినిర్మితవామనప్రతిమం బ్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయావసరంబునఁగలశప్రతిమాదానంబులు చేసి తదనంతరంబ ధరామర పుంగవులకుఁ బాయసాహారంబు సదక్షిణంబుగా నొసంగి భృత్య సహితుండై భుజియించినఁ బుత్త్రపౌత్రాభివృద్ధి గాంచి నిఖిల సుఖంబు లనుభవించి బ్రహ్మకల్పపర్యంతంబు వైకుంఠంబున నుండి పిదపి మధ్యమ లోకంబునఁ జక్రవర్తియై పుట్టు నిమ్మహావ్రతాచరణంబునకు నొక్క యితిహాసంబు చెప్పెద నాకర్ణింపుఁడు. 37

మ. యతివంశోత్తమ! పూర్వకాలమున హర్యశ్వాహ్వయుండైన భూ
పతి పుత్రార్థము గానలోఁ దపము సల్ప న్మెచ్చి విప్రాకృతిన్
శతపత్రాక్షుఁడు వచ్చి చైత్రసిత పక్ష ద్వాదశిన్ వామన
వ్రతముం జేయుము నీకుఁ గల్గును గుమారప్రాప్తి రాజాగ్రణీ.. 38

గీ. అనిన వీటికి నేగి హర్యశ్వుఁ డిమ్మ
హావ్రతము చేయ నదితికి నసురవైరి
పోలె నుగ్రాశ్వుఁ డనురాజు పుట్టి చక్ర
వర్తియై తాల్చె వివిధభూవలయభరము. 39

మ అనవద్యుండు హరుండు దా(గఱప నభ్యాసంబు గావించు వే
ళ నిరాయాసత మత్త ఖండిఁ దునుకల్ గా దొడ్డరోకంటఁ గొ
ట్టిన లీలన్, భయదాజిరంగమునఁ గొట్టెం గం(డగొడ్డంటి వా
త నిలింపారివిదారి హైహయ భుజస్తంభావళుల్ రాముఁడై. 40

గీ. ఆ పరశురామునకు హృదయ (ప్రియంబు
గాఁగ వైశాఖ శుక్లపక్షమున దశమి
సముచితాచారములు పూర్వసరణి నరుఁడు
చేసి కడు నిష్ఠ నేకాదశీదినమున. 41

వ స్నానాది కృత్యంబులు సలిపి సారఘనసారసారంగమద సరిమళ ధారా
ళంబైన మంటపాంతరాళంబున రాత్రి శతపత్రనేత్రు నారాధించిజామ
'దగ్న్యాయ నమో'యని పాదంబులు 'సర్వధారిణే నమో'యని యుదరం
బును 'క్షత్రాంతకాయనమో'యని భుజంబులు 'మణికంఠాయనమో'యని
కంఠంబును 'శంఖాయ నమో'యని శంఖంబును 'చక్రాయ నమో'యని
చక్రంబును 'బ్రహ్మాండధారిణీనమో'యని శిరంబును బూజించి తద్దేవతాగ్ర
భాగంబున సరత్న సలిల పూర్ణకుంభంబు నిలిపి తదుపరి స్థలంబునఁ
తామ్రవైణవఁబులలోన దొరకిన పీఠంబు మీఁద వస్త్రయుగళచ్ఛన్నంబును
దక్షిణ హస్తవిన్యస్త పరశ్వధంబునునైన యథాశక్తి హేమనిర్మిత జామ
దగ్ని ప్రతిమం బ్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబు చేసి
మఱునాఁడు సూర్యోదయావసరంబునఁ గలశప్రతిమాదానంబును గావించి
తదనంతరంబునఁ సర్వంసహా సుపర్వులకుఁ బాయసాహారంబు సదక్షిణం
బుగా నొసంగి భృత్యులుం దానును భుజియించినఁ బుత్త్రులం బుణ్యశ్లోకుల
ననేకులం బడసి యిహలోకసౌఖ్యంబు లనుభవించి కడపట నా బ్రహ్మ
కల్పంబు సత్యలోకంబున నప్సరస్త్రీ సమూహంబు గొలువనుండి చక్ర
వర్తియై జన్మించి ముప్పదెనిమిదివేలు సంవత్సరంబులు బ్రదికె నిమ్మహా
వ్రతాచరణంబునకు నొక యితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. 42

సీ. సత్యతపోమునీశ్వర ! వీరసేన భూ
పాలవర్యుఁడు పుమపత్య వాంఛ

నతిఘోర తపము చేయఁగ నచ్చటికి యాజ్ఞ
వల్క్యమహాయోగి వచ్చి రాజ !
నీవు తపం బేల గావింపఁ గడఁగితి
నావుడుఁ బుత్రసంతాన లిప్స
నాచరించెదనన్న హరి హరి ! భయదాట
విస్థలి నీదురవస్థ పడక

గీ. జామదగ్న్య వ్రతము సల్పి చక్రవర్తి
యైన ఘనకీర్తి నిధిఁ గనుమనిన నీ వ్ర
తంబు గావించి కాంచె నిర్దళిత ఖలుని
బలవదరివీరవనదావానలుని నలుని. 43

చ. తన శరలాఘవంబు బలదానవజిత్ప్రముఖాఖిలామరుల్
గనఁగొని మెచ్చి యెల్లకడలం గురియించు నభస్తరంగిణీ
కనకసరోజవృష్టి యనఁగాఁ దనియెన్ సకిరీట రావణా
ననములు దూలి భూతలమునం బడ శ్రీహరి రామభద్రుఁడై. 44

గీ. ఆ దశరథాత్మజునకుఁ బ్రియంబుగాఁగ
సువ్రతుఁడు నిష్ఠతో జ్యేష్ఠ శుద్ధదశమి
నాఁడు పూర్వప్రకారమున సకల సము
చితవిధులు దీర్చి యేకాదశీ దినమున. 45

వ. స్నానాది కృత్యంబులు జరపి సంస్థాపిత బహు ప్రదీపమాలికా జనిత పుష్పకమణీ ప్రీడంబైన మంటప క్రోడంబున రాత్రి జనార్దను నారాధించి 'దామోదరాయనమో'యని పాదంబులు 'త్రివిక్రమాయనమో'యని కటీరంబును 'ధృత విశ్వాయ నమో'యని యుదరంబును 'సంవత్సరాయనమో' యని యుదరంబును 'సంవర్తకాయ నమో'యని కంఠంబును 'సర్వాస్త్ర ధారిణే నమో'యని చక్రంబును 'సహస్ర శిరసే నమో'యని శిరంబును బూజించి తద్దేవతాగ్రభాగంబున సరత్నసలిల పూర్ణకుంభంబు నిలిపి తదు పరి స్థలంబునఁ దామ్ర వైణవ దారవంబులలోన దొరికిన పీఠంబు మీఁద

వస్త్రద్వయ వేష్టితంబులైన యథాశక్తి కనక నిర్మిత రామలక్ష్మణ ప్రతిమం బ్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయావసరంబునఁ గలశప్రతిమా దానంబు గావించి తదనంతరం బున నుర్వరాసుపర్వులకుఁ బాయసాహారంబు సదక్షిణంబుగా నొసంగి భృత్యసంగతుండై భుజియించిన శాశ్వతైశ్వర్యధుర్యుండై పవిత్రచరి త్రులం బుత్రులం బడసి పిదప నా చతుర్దశ మహేంద్రంబు నిసర్గ స్వర్గ భోగంబు లనుభవించి మర్త్యంబున జన్మించి సార్వభౌమత్వంబు వహించు నిమ్మహావ్రతంబునకు నొక్క యితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. 46

మ. మును సంతానము గోరి పంక్తిరథరాజ్ముఖ్యుండు, నానానిలిం
పనుతుండైన వసిష్ఠుఁ డీవ్రతము చెప్పన్ భక్తి గావించి స
జ్జనతాధీనుల దుష్టదానవభిదాసంధానులన్ మానులన్
గనియెన్ సూనుల రామచంద్రుఁడు మొదల్గా నల్వురన్ సంయమీ. 47

మ. ఇనుఁ డాఖండల దిక్కునం బొడముచో నీరెండ గాయంగ వి
చ్చు నవాంభోరుహముల్ మదాళికరణిన్ జుంబించె నందన్మరం
దనదీతుందిల కుంజపుంజములలోనం గుంకుమోద్వర్తనం
బుఁ దీపించిన గోపికాజనముఖంబుల్ శార్ఙ్గి శ్రీకృష్ణుఁడై. 48

ఆ. అట్టి కృష్ణునకుఁ బ్రియంబుగా నాషాఢ
శుద్ధదశమినాఁడు సుజనవరుఁడు
పూర్వభంగి నియమములు దీర్చి యేకాద
శీదినమునఁ బావనోదకముల 49

వ. స్నానాది కృత్యంబులు జరపి యదభ్ర విభ్రమ సందర్భంబైన మంటప గర్భంబున రాత్రి వైకుంఠనాయకు నారాధించి, 'వాసుదేవాయనమో'యని పాదంబులు, 'సంకర్షణాయ నమో'యని కటీరంబును, 'ప్రద్యుమ్నాయ నమో'యని జఠరంబును. 'ననిరుద్ధాయనమో'యని యుదరంబును. 'చక్ర పాణయే నమో'యని భుజంబులు, 'భూపతయే నమో'యని కంఠంబును, 'పురుషాయ నమో'యని శిరంబును, 'శంఖాయ నమో'యని శంఖంబును,

'జక్రాయ నమో'యని చక్రంబును బూజించి తద్దేవతాగ్రభాగంబున సరత్న సలిలపూర్ణ కుంభంబు నిలిపి తరిపరిస్థలంబునం దామ్రమవైణవ దారవంబులలోన దొరకిన పీఠంబు మీఁద వస్త్రయుగచ్ఛన్నంబును యథాశక్తిని హాటకనిర్మితంబును సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధసహితంబునునైన వాసుదేవప్రతిమఁ బ్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయావసరంబున సర్వంసహాసురులకుం బాయసాహారంబు సదక్షిణంబుగా నొసంగి భృత్యవర్గంబును దానును భుజియించిన నపుత్రతత్వదారిద్ర్యాది దుఃఖంబులం బాసి విద్యా విత్త సంపన్నుండై సౌఖ్యంబు లనుభవించి తదనంతరంబున దేహావసానంబున ముప్పదియాఱుమన్వంతరంబులు విష్ణులోకంబున వసియించి పిదప మర్త్యంబున సప్తజన్మంబులు జన్మించు నిమ్మహావ్రతాచరణంబునకు నొక్కయితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. 50

కం. యదువంశోద్భవుఁడైన వ
సుదేవజనవల్లభుండు సూనులఁ బడయన్
మదిఁ గోరి చేసెఁ దనభా
ర్యఁ దేవకియుఁ దానుఁ బెక్కువ్రతములు నియతిన్. 51

గీ. ఇవ్విధంబున వ్రతము లనేకములు స
లిపిన సంతాన లాభంబులేమి నామ
హేశ్వరుఁడు సతికిట్లనియె శశికాంత
మణి మయైకాంత శుద్ధాంతమందిరమున. 52

సీ. లోలాక్షి ! పొదిగిళ్ళలో నున్న సుతు చిన్ని
చిన్ని నవ్వులు నిరీక్షించువారు
రమణి ! తనూజాతుఁ డమృతంబ చిలుకఁ బ
ల్కెడు ముద్దు పల్కు లాలించువారు
తలిరాకుఁబోఁడి ! విందు లు విందులనఁ బాఱు
తెంచు నందనుఁ గౌఁగిలించువారు

బింబోష్ఠి ! తనయుండు పెడము పెట్టిన వేళ
నిష్టార్థములు దెచ్చి యిచ్చువారు

గీ. రాజబింబనిభాస్య ! గారాపుఁబట్టి
దిట్టి తిట్టించుకొని ప్రమోదించువారు
శ్రీవధూటీకళత్రు గుఱించి పూర్వ
జన్మమున నేమి తపములు సలిపి నారొ ! 53

మ. అని చింతింపుచునుండ నారదుఁడు బ్రహ్మజ్ఞాన సంవేది వ
చ్చె నభోవీధి నటజ్జటాకిసలయశ్రేణు ల్వ్రిపంచీ పికా
దినినాదంబులు భూతి పుష్ప రజముల్ దీపింపఁగా వంశవ
ర్ధన సంతాన ఫలప్రదానకర సంతానంబు చందంబునన్. 54

కం. ఆ సమయంబున విభుఁడు య
థా సముచిత పూజనములు తాత్పర్యముతోఁ
జేసిన సంతోషించి మ
హా సంయమి సంస్మితాననాంభోరుహుఁడై. 55

కం. శాంతివిభూషణ ! లక్ష్మీ
కాంతుఁడు నీ మీఁదఁ గరుణ గలఁడు సతతమున్
సంతానము లేమికి మది
చింతింపకు మేలి వార్త చెప్పెద వినుమా. 56

సీ. నిన్న విశ్వంభర నిర్జరేశ్వర సభా
గారంబునకు వచ్చి కంస నరక
మురభోజ పాంచాల కురు జరాసంధులు
మొదలైన ధూర్తుల మోవలేను
రక్షింపుఁ డనుచు నాక్రందింప సంక్రంద
నాది దిక్పాలకు లబ్ధిశాయి
కడకేగి యే తత్ప్రకారంబు విన్నవిం
చిన నా రమాభర్త చిత్తగించి

గీ. మానవులలోన నొకఁ డెవ్వఁడైనఁ దాను
సతియు నాషాఢ శుక్ల పక్షంబు నందు
ద్వాదశితిథిని వాసుదేవవ్రతంబు
సలుపు వానికి సుతుఁడనై సంభవించి 57

కం. భూభారం బడఁచెద మీ
మీ భువనంబులకు నిర్గమింపుఁడు ప్రాలో
మీ భర్తృ ముఖ్య సురలా
రా! భయములు మాని నిర్భరాహ్లాదమునన్. 58

కం. అని దేవుఁ డానతిచ్చిన
విని వచ్చితి నా వ్రతంబు విశ్వంభర నిం
క నొకఁడు గావింపక ము
న్నీ నీవ కావింపు కలుగు నందనుఁడు నృపా. 59

కం. అని చెప్పి నారదుఁడు పో
యిన పిమ్మటఁ దాను సతియు నీ వ్రతము జగ
జ్జన సంస్తుత్యముగాఁ జే
సిన పుణ్య ఫలోదయమునఁ జేసి మునీంద్రా. 60

ఉ. దానవ వాహినీపతు లతర్కిత భీతిఁ గలంగ, నాకలో
కానకదుందుభిస్వనము లంబరవీథిఁ జెలంగ, వేద్కలో
నానక దుందు భిక్షిత వరాగ్రణి పట్టపుదేవి దేవకీ
మానిని గాంచెఁ గృష్ణుని, రమాకుచ మండల సంచరిష్ణునిన్. 61

చ. కెరలిన తీవ్రహ వ్యవహ కీల పరంపర కీఁడి సోఁకి పా
దరసము లాగునన్ నిజకథా రచనల్ చెవిసోఁకి దర్పధూ
ర్ధర పురయామినీచరపురంధ్రుల యీలువు లెత్తిపోవఁగా
గరుణ సువర్వ సంఘములఁ గాచె ముకుందుఁడు బుద్ధదేవుఁడై. 62

గి. అట్టి బుద్ధునకుఁ బ్రియంబుగా శ్రావణ
శుద్ధ దశమినాఁడు సువ్రతుండు
విహిత విధులు పూర్వ విధమునఁ దీర్చి యే
కాదశీ దినమునఁ గ్రమము తోడ. 63

వ. స్నానాది కృత్యంబులు జరపి విలంబమాన నానా సురభి సూన స్మారిత నందనోద్యానంబైన మంటపస్థానంబున రాత్రి గరుడధ్వజు నారాధించి 'బుద్ధాయ నమో'యని పాదంబులు, 'శ్రీధరాయ నమో'యని కటీరంబును, 'జఠరోద్భవాయ నమో'యని జఠరంబును. 'సంవత్సరాయ నమో'యని యురంబును, 'సుగ్రీవాయ నమో'యని కంఠంబును 'విశ్వబాహవే నమో'యని భుజంబులు, 'శంఖాయ నమో'యని శంఖంబును, 'చక్రాయ నమో'యని చక్రంబును, 'బరమాత్మనే నమో'యని శిరంబును బూజించి దద్దేవతాగ్రభాగంబున సరత్న సలిల పూర్ణకుంభంబు నిలిపి తదుపరి స్థలంబునఁ దామ్ర దారవ వైణవంబులలోన దొరకిన పీఠంబున వస్త్ర యుగళచ్ఛన్నంబైన యథాశక్తి చామీకర నిర్మిత బుద్ధప్రతిమం బ్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయావసరంబున గలశ ప్రతిమా దానంబు గావించి తదనంతరంబ సముద్ర మేఖలా లేఖులకుం బాయసాహారంబు సదక్షిణంబుగా నొసంగి భృత్యులుం దాను భుజియించినఁ బుత్ర పౌత్రాభివృద్ధి గలిగి సామ్రాజ్య సుఖంబు లనుభవించి శరీరంబు వీడ్కొని పెద్దకాలంబు పరమపదంబున నుండు నిమ్మహావ్రతాచరణంబునకు ఫలంబు శుద్ధోదనుండు జనార్దను నందనుం గాఁబడసె మఱియు నొక్క యితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. 64

క. నృగుఁడను ధాత్రీపతి తా
మృగయార్థము వాహినీసమేతుండై పో
యి గహన భాగంబునఁ జం
పె గవయశార్దూల సింహ భేరుండములన్ 65

ఆ. ఇట్లు చంపి చంపి యేకాకియై శర
భంబు వెంటఁ బఱచి పఱచి డస్సి
వారువంబు నొక్క వసుమతీరుహమునఁ
గట్టి నీడ నొరగి కన్ను మొగిచె. 66

కం. ఆవేళం బదునాలుగు
వేవురు గొలువంగ వేఁట వెంబడి నొక భి
ల్లావనిపతి వచ్చుచు ని
ద్రా వివశత నున్న నృగునిఁ దప్పక చూచెన్. 67

ఉ. చూచి కిరాతులారా ! బలుసొమ్ములు తెమ్మలుగాఁగ నబ్బె నీ
రాజకుమారుఁ డోఁచుఁడు తురంగమరత్నముఁ బట్టుఁడన్న న
న్నీచమనస్కు లొక్కనొకనిం గడవం బఱతెంచె హస్తముల్
చాఁచఁ గడంగుచో నృగురసారమణీశ్వరు మేని లోపలన్. 68

చ. ఒక ధవళాంగిభామిని సముద్భవమై కరవాల చక్ర కా
ర్ముక గదలన్ భుజావలయముల్ గదలన్ మదభిల్ల సైన్యమున్
సకలము నేలఁ గూల్చె మణిసాను మహాగుహ వెళ్ళి సింహ శా
బకము నఖాంకురాగ్రముల భద్రగజంబుల వ్రచ్చు కైవడిన్. 69

కం. ఈరీతి శబరవీరుల
బారిసమరి మగుడఁ గైటభధ్వంసక మా
యారాజీవాక్షి నిజశ
రీరములోఁ జొచ్చువేళ నృగ భూపతియున్. 70

క. మేలుకొని తత్తరుణి నా
భీలాహవ రంగపతిత భిల్లభటులఁ దా
నాలోకించి సవిస్మయుఁ
డై లేచి సమీప జవనహరి నెక్కి వడిన్. 71

సీ. పోయి తపోవనంబున నున్న వామదే
వునకుఁ జాగిలి మహామునివరేణ్య !
విను కాననమునఁ జల్లని చెట్టునీడ ని
ద్రించి మేల్కాని విలోకించ నా శ
రీరంబు చొచ్చె నారీరత్న మొకతె ని
షాదులఁ బెక్కండ్ర జంపి తచ్చ
కోరాక్షి యెవ్వతె కూలిన భిల్లు లె
వ్వరు గెప్పు నావుడు వామదేవుఁ

గీ. డనియెఁ దొలిమేన శూద్రుండవై జనించి
ద్విజుల పంపున గావించితివి నృపాల
చంద్ర శ్రావణ శుక్లపక్షంబునందు
ద్వాదశీ తిథి బుద్ధవ్రతంబు నీవు. 72

గీ. కాన నీమేన నుత్తమక్షత్ర సంభ
వంబు రాజ్యరమావైభవంబు నిచ్చి
నడపి నదియు నిషాదుల నఱకి నదియు
దృఢము తద్ద్వాదశీ పుణ్యతిథియ సుమ్ము. 73

కం. అని చెప్పిన సంతోషం
బున నా నృగ ధరణిపాలపుంగవుఁ డరిగెన్
దనపురికి శిఖరమణికే
తుని రుద్ధాదిత్యరథ చతుర్గోపురికిన్. 74

ఉ. తొట్టిన రోష విస్ఫురణతో ధరణిం గల పక్కణ స్థలుల్
బట్టబయల్పుగా మెదడు వట్టిన పాండుకపాలఖండముల్
గట్టిన వెండినాళములకై వడి నంటఖురాంచలంబు ల
న్మట్టె నిషాదమస్తము లుమారమణీరమణుండు కల్కియై. 75

గీ. అట్టి కల్కికిఁ బ్రియముగా నధిక భక్తి
భాద్రపద మాసమున శుక్లపక్ష దశమి
సముచితాచారములు పూర్వసంజఁ దీర్చి
శిష్టవర్తనుం డేకాదశీదినమున. 76

వ. స్నానాది కృత్యంబులు జరపి చతుర్ద్వార తోరణ విలోల జాల ప్రవాళం బైన మంటపగోళంబున రాత్రి పీతాంబరునారాధించి 'కల్కినే నమో' యని పాదంబులు 'హృషీకేశాయ నమో' యని కటీరంబును 'మ్లేచ్ఛ ప్రధ్వంసాయ నమో' యని యూరుయుగ్మంబును 'జగన్మూర్తయే నమో' యని కంఠంబును 'ఖడ్గపాణయే నమో' యని భుజంబులును 'విశ్వమూర్తయే నమో' యని శిరంబునుం బూజించి తద్దేవతాగ్రభాగంబున సరత్నసలిలపూర్ణకుంభంబు నిలిపి తదుపరిస్థలంబునఁ దామ్రమైనవ దారవంబులలోన దొరకిన పీఠంబు మీఁద వస్త్ర యుగళచ్ఛన్నంబైన యథాశక్తి జాతరూప కల్పిత కల్కి ప్రతిమ ప్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయానంతరంబునఁ గలశ ప్రతిమాదానంబు గావించి తదనంతరంబ మేదినీదివిజులకుఁ బాయసాహారంబు సదక్షిణంబుగా నొసంగి భృత్యులుం దానును భుజియించిన నరాతుల గెల్చి రాజభోగంబు లనుభవించి దేహావసానంబున విష్ణులోకంబున నుండు నిమ్మహావ్రతాచరణంబున నొక్క యితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. 77

చ. ప్రవిమల తత్త్వవాదనధురంధర మున్ను విశాలమేదినీ
ధవుఁడు సమస్త రాజ్యము నితాంతబలోద్ధతులై సగోత్రులా
హవమున గెల్చి పుచ్చుకొన నాకులత న్నిజరాజధాని కా
శి వెడలి గంధమాదనము చేరి తదగ్ర సరస్తటంబునన్. 78

గీ. భక్తవత్సలు హరి గూర్చి ముక్తి కన్య
కాలలామంబు చన్నుల కరణిఁ బరిఢ
వించు పరిపక్వ ఫలముల విట్టి వీఁగు
బదరికారణ్యవాటీఁదపంబు సలుప. 79

కం. నరనారాయణు లనియెడు
పరమమునులు వచ్చి ధరణిపాలకులాగ్రే
సర ! వరము వేఁడు మన నా
నరనాథుఁడు వారిఁ జూచి నవ్వుమొగముతోన్. 80

కం. నాదు మనోరథ మా ల
క్ష్మీదయితునిచేతఁ గాని మిముబోఁటులచే
గాదు చనుఁడు "దూడల తర
మా ! దంటులు గొఱుక" ననిన మౌనివతంసుల్. 81

చ. అకటకటా ! నృపాల ! పరిహాసము చేయుట భావ్యమే గణిం
పక మధుకైటభాంతకుని పంపున నీ హృదయంబులోని కో
రిక సమకూర్తు మన్న విని శ్రీ రమణీపతికిం బ్రియంబుగా
సకలమఖక్రియల్ సలుప సంపద యీవలయుం బ్రిసన్నతన్. 82

కం. అనవుడు విశాలనృపుఁ జూ
చి నరుండి ట్లనియెఁ దపము చేయున్ భువనా
వనకరుఁ డీ నారాయణుఁ
డనిశము నను గూడి బదరికారణ్యమునన్. 83

సీ. సర్వజ్ఞకాములు ఋషభ మైనయాతనిఁ
గులవృద్ధికాములు కూర్మమైన
యాతనిఁ గిటియైన యాతని ముక్తికా
ములు, పాపహరణకాములు, నృసింహుఁ
డైన యాతనిఁ బొట్టియైన యితనిఁ బరి
జ్ఞానకాములు, రాముఁడైన యాత
ని ధనకాములు, దాశరథియైన యాతనిఁ
బ్రబలారి జయకాములు, బాలకృష్ణు

గీ. లైన యితనిఁ దనయకాము, లఖిల జగద
పూర్వ సౌందర్యకాములు, బుద్ధుఁడైన

యితని మాయాసుతుండైన యితని నాధి
పత్యకాములు, గొలుతురు పార్థివేంద్ర ! 84

గీ. కానఁ గల్కి వ్రతము సల్పు నా, నృపాల
కాన్వయోత్తంసుఁడు విశాలుఁ డట్లు చేసి
లీల రాజ్యంబు వడసెఁ దాలిచె విశాల
నామము బదరికాటవి నాఁటనుండి. 85

ఉ. అంబుధి గాడ్పు నాభి కుహరాగ్రము తమ్మిఁ గదల్పగా. శరీ
రంబున నంతటం గలయ రాలిన పుప్పొడి, కప్పుకొన్న పీ
తాంబరమో యనన్, సముచితార్కరుచిం గనుపట్టిఁ బవ్వడిం
చెం బరమప్రమోదమున శ్రీరమణీపతి పద్మనాభుఁడై. 86

గీ. ఆసరోరుహనాభ ప్రియంబు గాఁగ
నాశ్వయుజ శుద్ధదశమి నత్యంతభక్తి
సముచితాచారములు పూర్వ సరణిఁ దీర్చి
శిష్టవర్తనుఁ దేకాదశీదినమున. 87

వ. స్నానాదికృత్యంబులు జరిపి దివ్యవిమాన సమానప్రకాశంబైన మంట పావకాశంబున రాత్రి విష్ణుదేవుం బూజించి 'పద్మనాభాయ నమో'యని పాదంబులు, 'పద్మయోనయే నమో'యని కటీరంబును, 'సర్వదేవాయ నమో'యని యుదరంబును, 'బుష్కరాక్షాయ నమో'యని యురంబును, 'నవ్యయాతునమో'యని భుజంబులును, 'శంఖాయనమో'యని శంఖంబును 'జక్రాయ నమో'యని చక్రంబును, 'బ్రభావాయ నమో'యని శిరంబును బూజించి తద్దేవతాగ్రభాగంబున మీనవ్రతంబునకుం బోలెఁ గలశంబులు మీఁద మధ్యమకలశంబు మీఁద సహిరణ్య గర్భనాభిబిసరుహంబైన యధాశక్తి జాంబూనద నిర్మిత పద్మనాభప్రతిమం బ్రతిష్ఠించి షోడశోప చారంబులు సలిపి జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయంబునఁ గలశప్రతిమాదానంబులు గావించి తదనంతరంబున నిలానిలింపులకుఁ బాయసాహారంబు సదక్షిణంబుగా నొసఁగి భృత్యవర్గసహితుండై

భుజియించినఁ గోరిన కోర్కెలు సిద్ధించు. నిమ్మహావ్రతాచరణంబునకు నొక్కయితిహాసంబు చెప్పెద నాకర్ణింపుము. కృతయుగంబునఁ దొమ్మిదివర్షంబులలో నొక్క వర్షంబునకుఁ దన పేర భద్రాశ్వవర్ష నామధేయంబు గల్పించిన భద్రాశ్వుండు భద్రాసనంబున భద్రగజగామినీ కర చమరవాల వాతూల కించిచ్చంచల చికురాంచలుండై మండలేశ్వరులు గొలువఁ గొలువున్న సమయంబున. 88

సీ. సరిగా జగత్ప్రపంచముతోడ నొకవంకఁ
దూనిక వచ్చిన దొడ్డకపిలె
ప్రేమ రెట్టింప లోపాముద్ర మోముదా
మర తావిఁ గ్రోలుచుఁ దిరుగు తేఁటి
వానకాలంబుచే వండు వట్టిన జలం
బెల్లఁ దేర్పఁగఁ జాలు చిల్లగింజ
పరిపూర్ణకుంభగర్భం బను శుక్తిలో
మొనపిన కట్టాణిముత్తియంబు

గీ. సింధురామాశుగము రోదసీకటాహ
కుహర పాటన పటుకూట కోటి కోటి
వింధ్యనగ బలిదైత్య త్రివిక్రమాంఘ్రి
ఋషికులాగ్రేసరుఁ డగస్త్యుఁ డేగుదెంచి. 89

శా. ఆభాస్వత్కుల మౌళిమండనముచే నర్ఘ్యాదిపూజల్ దయా
ర్ద్రీభావంబున నంది వైరిజలదశ్రేణీ మహామాతరి
శ్వా! భద్రాశ్వ! పథశ్రమాపనయ నేచ్ఛ స్నీనివాసాంతర
క్ష్మా భాగంబున నేడునాళ్లు నిలువంగాఁ గోరి యేతెంచితిన్. 90

గీ అని తదీయానుమతి నుండి మునివరుండు
సవతు లేనూఱుగురు పరిచారికల వి
ధంబున భజింపఁగా నున్న ధరణివిభుని
యింతిఁ గాంతిమతీదేవి నెదుటఁ గాంచి. 91

కం. ఒకదినమున జేసిన పూ
జకు మెచ్చి యితనికి నిట్టిసామ్రాజ్యము కాం
చక యిచ్చిన హరి నెఱుఁగమి
నకటకటా! మోసపోయె నఖిలజగంబుల్. 92

మ. అరరే! శౌరి! బళీ! ధ్రువుం డహహ! భద్రాశ్వుండు! వహ్వా తలో
దరి! ప్రహ్లాదుఁడు మేలు! బాపు మహిభర్తల్! విప్రు లౌరా! వణి
గ్వరులాహా కసుగాపు సాధు! మదవద్వాతాపిదైతేయ సం
హరణ ప్రౌఢిఁ బ్రసిద్ధుఁడైన ముని మర్ఘ్యా! యంచు నుద్బాహుఁడై. 93

కం. ఆనందబాష్పములు గనుఁ
గోనల దిగజాఱ నూలుకొను పులకలతో
మేను గనుపట్టహాసం
బాననమున మొనపఁ బాత్రలాడుచు నున్నన్. 94

కం. ఆ కలకలంబు విని ధా
త్రీకాంతుఁడు వచ్చి తాను దేవియు వినతుం
డై కుంభజ! యీ హర్షం
బేకారణమున జనించె నెఱిఁగింపు దయన్. 95

కం. అనవుడు భద్రాశ్వునిఁ బే
ర్కొని భూవర! నీవు నీపురోహితులు వధూ
జనములు నకటకటా! నా
మనము దెలియలేక మూఢమతులై తిరిగా. 96

సీ. నావుడు దండప్రణామంబు చేసి భ
ద్రాశ్యుఁ డగస్త్య మహామునీంద్ర!
దేవరపలుకులు దెలియ మాకు వశంబె
కృపతోడ నానతి యిమ్మటన్న
నరనాథ! పూర్వజన్మమున నీదేవి యీ
భామ వైనిశనామపట్టణమున

హరిదత్తుఁ డను పేరఁ బరఁగు కోమటియింటి
వరవుడు శూద్రాన్వవాయమున జ

గీ. నించి దానికి విటుఁడవై నీవు నట్టి
సంజ్ఞ నా వైశ్యునకుఁ బరిచర్య చేసి
తిరుగుదువు సెట్టియు మురారి చరణ కమల
యుగళ నిశ్చల భక్తి సంయుతుఁడు గాన. 97

వ. ఆశ్వియుజ శుద్ధద్వాదశీదివసంబునఁ బద్మనాభవ్రతంబు సలుపుచు విష్ణుదేవాలయంబునకుం జని మహోత్సవంబు గావించి దాసీదాసులైన మిమ్మద్దఱదీప మాలికలకుం గావలిపెట్టి మరలి యింటికిం బోవుటయు దీపమాలిక లతిప్రయత్నమ్మునఁ గాచిన పుణ్యంబునఁ బ్రియవ్రత వసుంధరాధిపతికిం బుట్టి పట్టాభిషిక్తుండవైతివి. నాఁడు నీకుం బ్రేయసి యైన దాసియు నిక్కాంతి మతియై జనించె. భద్రాశ్వనరేశ్వర, పరకీయ దీపజ్వాలనఫలంబున నిట్టి సామ్రాజ్యంబు సిద్ధించె, నిజద్రవ్యంబు వెచ్చపఱచి లక్ష్మీపతికి దీపంబులు సమర్పించిన వారిభాగ్యంబు చెప్ప నెట్టివారికిని వశంబు గాదు, గావున శ్రీహరిం బ్రశంసించితి, బాల్యంబున నందనవనంబునం దపంబుచేసి వాసుదేవప్రసాదంబున నసాధారణ మదంబు వడసెం గావున ధ్రువు నుపశ్లోకించితి, రాక్షస వంశంబున సంభవించి యొండెఱుంగక పుండరీకాక్షుం గొలిచి నిలిచెం గావునఁ బ్రహ్లాదు వర్ణించిరి. భర్తకుఁ దాత్పర్యంబునం బరిచర్య నడపి తత్పరోక్షంబునఁ గౌస్తుభవక్షు నారాధించి మోక్షంబు గనుం గావున వనిత విను తించితి. నిన్ను సంస్తుతించు తెఱఁగు మున్నచెప్పితి వెన్నుండు ప్రసన్నుండుగా జన్మంబులు నివర్తింప సామర్థ్యంబు గలదు. గావున రాజుల విప్రుల వైశ్యుల్యం గొనియాడితి; బ్రాహ్మణశుశ్రూషలు మొదల వదలక వారి ముదల నారాయణభక్తియుక్తుండైన మాత్రంబున ముక్తి వరారోహ వరియించుఁ గావున శూద్రుం బొగడిన, మధుమథన చరణ కమల మధుకరాయమాన మానసుండనై మెలంగుదు, గావున నన్ను బహూకరించు కొంటినని వెండియు. 98

గీ. కృతయుగంబున నొకయేట, త్రేత నాలు
నెలల, ద్వాపరమున నెలనెలఁ, గలుగు పుణ్య
ఫలము కలివేళ శ్రీవిష్ణుభక్తులైన
విమలమతులకు దివసమాత్రమునఁ గలుగు. 99

కం ఈ విధము నిశ్చయించియు
శ్రీవిష్ణుపదాబ్జభక్తిచే కొనమికి నే
భావంబులోన రోసి క
దా! విశ్వము మోసపోయె నంటి నృపాలా! 100

కం. అని చెప్పిన భద్రాశ్వుఁడు
వినిపింపుడు సులభమైన విష్ణువ్రత మ
న్న నగస్త్యమునీంద్రుఁడు మ
న్నన నానతి యిచ్చెఁ బద్మనాభవ్రతమున్ 101

సీ .సత్యతపోమునీశ్వర ! యివ్విధంబునఁ
దాఁ బద్మనాభవ్రతంబు చెప్పి
జననాథుఁ జూచి పుష్కర తీర్థమున వసిం
చిన కుమారస్వామిఁ గని భజించి
క్రమ్మఱ వత్తు నీకడకు నంచు నగస్త్య
ఋషికులోత్తంసుఁ డదృశ్యుఁ డైన
భార్యాయుతంబుగా భద్రాశ్వమేదినీ
పతియు నీ పద్మనాభవ్రతంబు
గీ. చేసి విష్ణుని కరుణావిశేషమున న
నేక సత్పుత్రపౌత్రాభివృద్ధి గాంచి
మఱియు గర్వాంధ పరిపంథి మథన పటుభు
జాగ్ర పీఠిక భరియించె నబ్ధి కాంచి. 102

శా. అంతం గార్తిక శుక్లపక్షమున వింధ్యారాతి యేతించె భూ
కాంతుండు న్మునిసార్వభౌమునకు నర్ఘ్యం బిచ్చి. మాణిక్య సౌ

ధాంత స్థాపిత భద్రపీఠమున నధ్యాసీనుఁ గావించి శు
ద్ధాంత స్త్రీసహితంబుగా సవినయుండై మంజువాగ్వైఖరిన్. 103

గీ. ఆశ్వయుజమాసమున భవదాజ్ఞ నేను
భక్తిఁ జేసితిఁ బద్మనాభవ్రతంబు
తాపసోత్తమ ! యిఁక నేవ్రతంబు కార్తి
కమునఁ జేయుదు ననవుడుఁ గలశభవుఁడు. 104

శా. క్ష్మానాథా ! నయనీకృతేందు రవి తేజః పుంజ మంతర్ముఖం
బై, నైజోదర గుప్తలోకములు, సాంద్రాలోకముల్ చేయ ల
క్ష్మీనారీహృదయేశ్వరుండు, శయనించెన్ యోగనిద్రాను సం
ధానానందమునన్ మహాంబునిధిలో నారాయణాకారతన్. 105

గీ. అట్టి నారాయణునకుఁ బ్రియంబు గాఁగ
గార్తికంబున శుక్లపక్షమున దశమి
నాఁడు పూర్వప్రకారంబున నరుఁడు సము
చితవిధులు దీర్చి యేకాదశీదినమున. 106

వ. స్నానాది కృత్యంబులు జరపి సౌభాగ్యలక్ష్మి కర్ణకుండలంబైన మంటప మండలంబున శౌరి నారాధించి 'సహస్రశిరసే నమో'యని శిరంబును, 'బురుషాయ నమో'యని భుజంబులును. 'విశ్వరూపిణేనమో'యని కంఠంబును, 'జ్ఞానాస్త్రాయనమో'యని శంఖచక్రంబులను, 'శ్రీవత్సాయనమో' యనియురంబును 'జగద్గ్రసిష్ణవేనమో'యని యురంబును 'దివ్యమూర్తయే నమో'యని కటీరంబును, 'సహస్రపాదాయ నమో'యని పాదంబులును, విలోమప్రకారంబునఁ బాదాదిగా ననులోమప్రకారంబున నేతన్నామధేయంబులఁ బూజించి 'నారాయణాయ నమో'యని సర్వాంగంబులఁ బుష్పాంజలి సమర్పించి, తద్దేవతాగ్ర భాగంబున మీనవ్రతంబువలెం గలశంబులు నిలిపి మధ్యమకలశంబు మీఁద యోగనిద్రాముద్రిత లోచలంబైన యథాశక్తి కనకనిర్మితనారాయణప్రతిమం బ్రతిష్ఠించి షోడశోపచారంబులు సలిపి జాగరణంబుచేసి మఱునాఁడు సూర్యోదయావ

సరంబున గలశప్రతిమాదానంబులు గావించి ధరణిబృందారకులకుఁ బాయసాహారంబు సదక్షిణంబుగా నొసంగి భృత్యులుం దాను భుజించిన నభీష్ట ఫలంబులు సిద్ధించు, నిమ్మహావ్రతపుణ్యంబునఁ గృతార్థత్వంబునం బొందిన వారి వినుము. 107

క. కనియె భరతు శకుంతల గనియె కార్త
వీర్యు హైహయనామపృథ్వీధవుండు
కనియె మాంధాత యువనాశ్వజనవిభుండు
మరియు రాజులు భాగ్యసంపన్నులైరి. 108

సీ. శరధి నిమగ్నయై ధరణి గావించి వా
రిజనాభుచే నుద్ధరింపఁ బడిన
కతన నీ పంద్రెండు వ్రతములు గూడంగ
ధరణివ్రతం బనఁ దరఁగె నీ వ్రి
తములకు గనకప్రతిమల దానము చేయ
మత్స్య కూర్మాదినామముల మాస
నామంబులు వచించి నానాశ్రుతి పఠన
పారంగతుండైన బ్రాహ్మణునకు

గీ. నెంత విత్తంబు దానిచ్చె నంతియ ఫల
మర్థ వేదికి నిచ్చిన నందు రెట్టి
ఫలము పరతత్వ మెఱిఁగిన పాంచరాత్ర
కునకు నర్పించిన సహస్ర గుణఫలంబు. 109

సీ. ఆకారసంపద గైకొని కనుపట్టు
మోక్షలక్ష్మీకాంత మురువు గురువు
జ్ఞానవాసన వెదచల్లు నిర్మలతపః
ప్రమదవనీ వాటి పరువు గురువు

క్రోధాధి సకలదుర్గుణములఁ బెడబాపు
పరమశాంతిరసంబు కరువు గురువు
కరము విచిత్రంబుగా శాశ్వతైశ్వర్య
గరిమంబు లేతెంచు తెరువు గురువు

గీ. దురితమృగ శాబకముల నా గురువు గురువు
నీ పదాంబుజ యుగళ నిర్ఛిద్ర భక్తి
నతిపరాయణ శిష్యకామిత ఫల ప్ర
దానమున మించు నవకల్ప తరువు గురువు. 110

వ. కావున "నవిద్యోవా సువిద్యోవా గురురేవ జనార్దన" యను వాక్యంబు గలుగుటంజేసి గురువుల గుణదోషంబు లెంచినఁ బాతకంబుఁ బ్రాప్తించు సంసారసాగరోత్తారకుండైన గురువుం బూజింపక పరిహరించి యితరులఁ జేపట్టుట పేరోడ విడిచి వదరు వట్టుట ఇట్లగుట యెఱింగి మొదల గురువుల సంభావించి తదనుమతంబునఁ జేసిన దానాది కృత్యంబులు సఫలంబులగు నిమ్మహావ్రతంబు వినినఁ జదివిన నిహపరసౌఖ్యంబులు గలుగు నని దుర్వాసుండు సత్యతపునకుం జెప్పెనని వరాహ దేవుండు చెప్పిన వసుమతి తరువాతి వృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. 111

ఉ. ఆఢ్యనిజాభిధాన ! వివిధాజివినోద్య సుహృద్వ్యశః పయో
లేఢ్య సిలేలిహాన ! తరళీకృత సజ్జన చిత్త భాషణా
ప్రౌఢ్యవధాన ! దిక్తట కరంభిత సంతతదాన చాతురీ
రూఢ్య సమాన యౌవత గురుస్తన మర్దన హస్తపల్లవా ! 112

కం. సుశ్లోక ! సకల సుకవీం
ద్రశ్లాఘ్యప్రతాప ! గుణధురా దోరాలా
నాశ్లథ బద్ధజయేభ ! మ
ద శ్లక్ష్ణ స్థాసకీకృత కురంగమదా ! 113

మాలిని. బహుళజలరజో జంబాలితాకాశగంగా
విహృతి సమయ మజ్జద్వృత్రి భిద్దంతి ధావ
ళ్య హరణ కరణార్థాత్యంత సంరోధ శంకా
వహ సహజ మహో నిర్వాహ కీర్తి ప్రవాహా. 114

గద్యము. ఇది శ్రీ మదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంట నాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీవరాహపురాణం బను మహా
ప్రబంధంబునం దష్టమాశ్వాసము

శ్రీ

# వరాహ పురాణము

## నవమాశ్వాసము

—*—

శ్రీ వనితా వరభావన
పావనితాంతఃకరణ ! కృపా నిత్య ! వినా
భావనితాంత బలాఢ్య ! ప
రావనితాపకర ! యీశ్వరాధిపు నరసా ! 1

వ. అవధరింపు మవ్వరాహదేవుండు వసుధ కిట్లనియె నట్లు సత్యతపో ముని దూర్వాసువలన విచిత్రంబైన ధరణీవ్రత చరిత్రంబు విని ధన్యుండనైతి నని తదనుమతంబున హిమగిరి పరిసరంబునకు జని పుష్పభద్రాభిధాన ధునీ కనక సౌగంధిక గంధబంధురమంథర గంధవాహ సమాగమంబుల భద్ర నామధేయ వటవినిద్ర చ్ఛాయా విభ్రమంబులఁ జిత్రాహ్వయ శిలాస్థల విశ్రమంబుల జన నజ్ఞా నిదాఘపరిశ్రమంబు నడంచు నొక్క పుణ్యాశ్రమంబునఁ బరబ్రహ్మ విద్యానుసంధానపరుండై నిలిచె నతని చరితంబు లత్యద్భుత భరితంబు లవి మీఁదట నెఱింగించెద. 2

క. అనిన విని ధరణి వినయం
బునఁ గల్ప సహస్రములకు మునుపట నేఁ జే
సిన యీ సువ్రతము దలం
పునఁ బడియె భవత్ప్రసాదమున జగదీశా ! 3

ఆ. నాఁడు వసకుఁ బద్మనాభవ్రతము చెప్పి
తీర్థయాత్ర పోయి తిరిగి వచ్చి
నపు డగస్త్యు నేమి యడిగె భద్రాశ్వుఁ డ
మ్మౌని యేమి పలికె మానతిమ్ము. 4

మ. అనినం గైతవ పోత్రి ధాత్రి కను వింధ్యారాతి యేతెంచినన్
దన యుల్లాంద్రుఁడుఁ దాను నేమమున నానాపూజనల్ చేసి నూ
తన రత్నాసన మధ్యసీమమున నధ్యాసీనుఁ గావించి మె
ల్లన భద్రాశ్వనృపాలపుంగవుఁడు ఫాలన్యస్త హస్తాబ్జుఁడై. 5

కం. స్వామీ ! యే సత్కర్మము
చే మోక్ష ఫలంబు సిద్ధించును మూ
ర్తామూర్త ప్రతిపత్తుల
నేమిట శోకంబు లుడుగు నెఱిగింపుమనన్. 6

ఆ. ధరణినాథ ! మోక్ష ధర్మాఖ్యమైన యీ
ప్రశ్న మడగఁ జెప్ప బ్రహ్మకైన
నలవి గాదు చేరువై యుండు దవ్వగుఁ
గాన వచ్చియుండుఁ గాన రాదు. 7

మ. అజభధ్వంసక మిందుకుం దగు సుపాఖ్యానంబు నేఁ జెప్పెదన్
విశదీభూతముగాఁగ రేఁబఁ బగ లుర్వీముఖ్య భూతావళుల్
దిశ లద్రుల్ జలధుల్ దినేశ విధులున్ లేకుండు కాలంబునన్
బశుపాలుండను రాజు దాఁ బశువులన్ బ్రఖ్యాతిఁ బాలింపుచున్. 8

క. వేడుక నొకనాఁ డంబుధి
చూడం జని కుపిత హరికిశోర చపేటా
మ్రేడితకరి ఘీంకార
ప్రేషిత సంవర్త ఘనము వేలావనమున్. 9

సీ. విస్మయం బంది ప్రవేశించుచోఁ గొన్ని
పాముల నెనిమిది పాదపముల
నొక మహానదిఁ దిర్య గూర్ధ్వ ప్రచారుల
నేగురుపురుషుల నినసహస్ర
దేదీప్య మానంబు ద్విప్రకారము త్రివ
ర్ణాధారయుక్తంబు నధికతర వి
శాలంబునైన వక్షముతోడి చపలాక్షి
నొకతెను జూచుచు నొంటిఁ దిరుగు

గీ. చుండ నివి యిన్నియును భీతి నొక్కపై వి
నాశమునఁ బొందె నంత నా నరవరుండు
దొంగలకుఁ జిక్కితింక నే భంగి నాకు
విడుద తానని చింతించు వేళ నెదుట. 10

కం. ఎక్కడ పోయెద విఁకఁ
జిక్కితిగా కనుచుఁ గృష్ణ సితర క్తతనుం
డొక్కఁ డెదిరె వానివలన
నొక్కఁడు మహదాహ్వయమున నుదయము నొందెన్. 11

కం. వారిద్దఱు నారమణిని
రారమ్మని సన్నచేసి రయమున ముగురుం
జేరి పశుపాలు నొక్కనిఁ
గ్రూరత బైకొనిరి మఱియుఁ గొందఱు పురుషుల్. 12

చ. వడి నరి కట్టుకొన్న జనవల్లభుఁ డంబుద పజ్క్తి చేతిలోఁ
బడిన హిమాంశు మండలము భంగిఁ దిరోహితుఁ డయ్యెఁ జోరు లా
ప్పుడు బెడిదంపుఁ గైదువులు పూని పరస్పరలీనులైనచోఁ
బొడమె నృపాలు గేహము నభోమణి కోటి విభాసమానమై. 13

మ. మఱియుం గోటు లసంఖ్యలై ధవళసద్మంబుల్ విచిత్రంబుగా
నెఱి చూపె న్మరుదంబు వహ్ని వియదన్వితంబు లాయిండ్లలో

మెఱుఁగుంబోఁడి వసించె నోర్తు బహుకుంభీ బింబితార్కాకృతిన్
నఱకెం దద్గృహమస్తకంబులు మహీనాథుండు శీఘ్రంబునన్. 14

కం. ఆ పశుపాల నృపాలు భు
జాపాటవమును సమీక జయము మజ! భళీ!
బా పని త్రివర్ణపురుషుం
డాపోవక పొగడె సవినయాలాపములన్. 15

క. వెఱపింపఁ బోయి వెఱచిన
తెఱఁగున నే మేమ చిక్కితిమి నీచే నిం
దఱమును బరమేశ్వర! యి
త్తఱి నీ దేహమున నుండెదము పుత్రులమై. 16

వ. అనినఁ బశుపాల నృపాలుండు కృపాళుండై కర్ణామృతంబులైన వచనం బునఁ దత్త్రివర్ణపురుషు నాదరించి వత్సా! భవత్సాహాయ్యంబునం గదా నిర్లేపుండ నగుట తెగుటకుం బొడముటకు నిలుచుటకు నీవకర్తవై వర్తింపు మని నియోగించి నిజాత్మజత్వంబును బ్రసాదించి వారిలో వారిలోని తామరపాకు చందంబున నేమిటం బొరయక తిరుగుచుండె నంతటఁ ద్రి వర్ణపురుషుండు మహత్తను పేరిటివానిఁ దనవంటిపట్టి నొకనిం బుట్టించె నతని వలన బోధస్వరూపిణియైన కన్యక జన్మించె, నాలలన వలన విజ్ఞాననిగమంబైన మనంబు జనించె. నమ్మనంబు వలన నతి సౌమ్యు లేవురు పురుషులు సంభవించిరి, వారి వలన నక్షాభిధాను లుద్భవించిరి, వీర లిద్దఱు మున్నుపశుపాలు నాక్రమించిన చోరులు, తారు నిరాకారులైన బహుద్వారంబు నేక స్తంభాధారంబును జతుష్పదోదారంబును నదీ సహస్ర విహారంబు ననేక జలకూపాలంకారంబు నగు పురంబుం బ్రవేశించి యొక స్వరూపం బగుటయుఁ దక్షణంబ పశుపాలుండు మూర్తిమంతుండై పురంబు బ్రవేశించి సూక్తవాక్యంబులై వేదంబులు సంస్మరించి తదుక్త వ్రతాదికృత్యంబు లాచరించి కర్మకాండంబు నడిపి జడిసిన కతంబున. 17

క. అలయికతో నిద్రకు బడి
తలలు భుజాస్తంభములుఁ బదంబులు వేదం
బులు నాలుగేసి కలమె
చ్చుల బంగారంబువంటి సుతునిం గనియెన్. 18

క. అది మొద లా పశుపాలుఁడు
మదవత్కరివర శిరన్సమారూఢుండై
యుదధి వన తృణాదికములఁ
బెదరక విహరించెఁ బశువశీకర లీలన్. 19

ఉ. భద్రాశ్వక్షితిపాల చెప్పితి భవత్ప్రశ్నానురూపంబుగా
రుద్రాంభోరుహ గర్భ ముఖ్యులకు వ్రాకువ్వంగ రా కద్భుతో
న్నిద్రంబైన మహేతిహాస మిదియే నీయందు నాయందు స
ర్వ ద్రవ్యంబుల యందు, నొక్కసరియై వర్తించు నూహించినన్. 20

సీ. వినుమింక సంభూత వివరంబు, పశుపాలు
వలనఁ బుట్టిన చతుర్వక్త్రి దఖిల
వేదశాస్త్ర గరుండు వెడలెఁ దత్తనువున
సర్వనామధేయుండు సప్త మూర్తి
పూరుషార్థములు తత్ప్రోక్తంబు, లందులో
మొదటివినాల్గుకొమ్ముల వృషభము
రెండవ దర్థ, మూడండది కామ, మీ
మూడును లయమైన మోక్ష మనఁగఁ

గీ. బరఁగె నాసప్త తనుని ప్రభావ మెఱుఁగఁ
దలఁపు గలవారు వర్తింపవలయు వరుస
బ్రహ్మచారిత్వమున, ధర్మ పరత, భృత్య
భరణమున, "సోహమస్మి"యన్ భావమునకు. 21

వ మఱియు నాచతుర్ముఖుండు నిజాపత్యంబులైన నిత్యానిత్య స్వరూపంబుల సప్తస్వరూపంబులం జూచి పితృపుత్రపుత్రుండు పితామహనామధేయుండగునని వేదంబులు చెప్పు నిప్పుడు మా తండ్రి మహత్మ్య గుణంబులలోన నొక్కటియు మత్తనూజుల వలనం గానరాదు. నాదురంత చింత వాయ నుపాయంబు లేదని తమ తండ్రి దలంప నాక్షణంబ కర్మసాక్షి లక్ష దుర్నిరీక్షంబైన కాక్షేయకంబు సాక్షాత్కరించినం గైకొని రూక్షకటాక్షేక్షణుండై సమక్ష స్థిత స్వరంబు శిరంబు ఖండించిన, నది నారికేళఫలాకారంబునుం బ్రధాన బృహద్దశధావృతంబునై విజృంభించినం గని కృపాణంబునం డిల ప్రమాణంబుగా నఱికిన, దశాంశోనంబయ్యు నహంకరించె నదియునుం దునిమినం బదియవపాలు నిల్చి యేన భూతాది నని పలుక నలుక నేఁబది రెండవభాగంబు చిక్కం జక్కడంచె, నదియు "స్వావకాశః స్వావకాశ" యన్మైమోయ రోయక వ్రేయుటంయుం బదియవభాగంబు శేషించి కంప యామి యని ఘోషింప రోషంబును నదియును విదళించిన సౌమ్యంబు సూక్ష్మంబునైన తేజంబు గానంబడియె నదియు మథియింపం దదనంతరంబ. 22

ఆ. భూరుహంబు పొరలు పొరలుగఁ జెక్కినఁ
గానవచ్చు చేవ కరణిఁ గానఁ
బడియె నప్పుడు పశుపాలుండు ద్రసరేణు
మూర్తితోడ సుతుఁడు మోదమంద. 23

క. ధరణీనాయక ! యేత
త్స్వరము శరీరప్రవృత్తి, తచ్ఛిరము నివృ
త్తి, రహస్య మీకథ చరా
చరసృష్టికి మొదలు బోధ సంపద నొసఁగున్. 24

మ హా స్ర గ్ధ ర.

అనినం భద్రాశ్వుఁడా సంయమిపతికి మహాత్మా ! పరిజ్ఞాన మే దే
వునిఁ గొల్వంగల్గు నీ జీవుల కనఁడుఁ జతుర్వ్యూహుఁ బక్షీంద్ర వాహున్

వనజాక్షుం గొల్వ భయార్ణవతరణి వరిజ్ఞా సౌఖ్యంబు లబ్బున్
జననాథో త్తంస ! యీ ప్రశ్నమునకు నితిహాసం బెఱింగింతు నీకున్ 25

సీ. భవదూరపథమునఁ బరమభాగవతుల
మూఁకలు నడపించు మొత్తగాఁడు
ప్రోఢయై నూఱుతంత్రులవీణా వాయించు
సరిలేని జగజెట్టి జంత్రగాఁడు
పూసిగొండితనానఁ బోయి యెవ్వరికైన
గొడవలు గావించు కొండెగాఁడు
గానప్రభావాఢ్యులైన తుంబురు పర్వ
తులతోడి కూరిమి చెలిమికాఁడు

గీ. ప్రజల సంసారమను లేమి బసలి తన్ను
వేఁడు వారల కెల్లను విష్ణుభక్తి
సారథీ నారదుఁడు తనుచ్ఛవిగుఖుచ్ఛ
దుత శరన్నారదుఁడు నారదుండు మున్ను. 26

క. మానససరోవరమునకుఁ
దానం బాడంగఁ బోయి దరహాస వికా
సాననయాన విలాస ధు
రానతసారసల నప్సరసలం గనియెన్. 27

శా. ఆరామామణు లందఱున్ మహతికాయల్ మంజుశింజానతం
త్రీరావంబులచే నిజస్తనములన్ దీపింప లీలాగతిన్
జేరన్వచ్చి మునీంద్ర ! మాకు నెపుడున్ జేతోభవుంగన్న యొ
య్యారిన్ శౌరి వరించు వేడుకలు మల్లాడున్ మనోవీధులన్. 28

గీ. అబ్బునే మాకు నీ కోరిక నినఁ బడుచు
లార ! ప్రాయంపుమదమున మీరు నాకు
మ్రొక్కరైతిరి యీదోసమొక్క జాడ
వెఱచి పాఱెడు మురహరస్మరణమునను. 29

క. ఇప్పుడు మీకుం జెప్పెద
నప్పురుషోత్తముఁడు వరదుఁడై మిము నొకరిం
దప్పక వివాహ మగుటకుఁ
జొప్పడిన మహావ్రతంబు సులభముగాఁగన్. 30

వ. సకల సుమనో వికాసమయంబును మదనవిదళిత మానినీ సమయంబునైన వసంతసమయంబున విరహిజన విపక్షంబైన శుక్లపక్షంబున ద్వాదశీ దివసంబున నుపవసించి మరంద బిందు నిష్యంద శీతలంబైన పుష్పమంటప తలంబునఁ బరిస్తృత విచిత్ర వస్త్రికల్పంబైన తల్పంబున వెండిం జేసిన పుండరీకాక్షు లక్ష్మీయుతంబుగా నిలిపి షోడశోపచారంబులు సలిపి 'మనోభవాయ నమో'యని శిరంబును 'ననంతాయ నమో'యని కటీరంబును 'గామాయ నమో'యని బాహుమూలంబులుం 'గుసుమాస్త్రాయ నమో'యని యుదరంబును 'మన్మథాయ నమో'యని పాదంబులు 'హరయే నమో' యని సర్వావయవంబులు బూచించిపిదప నిక్షుదండంబులు నాలుగ ద్దేవుని నలుదిక్కులం బెట్టి ప్రదక్షిణపూర్వకంబుగా మ్రొక్కి హృద్యంబులైన నృత్తగీతవాద్యంబుల జాగరణంబుచేసి మఱునాఁడు సూర్యోదయావసరంబున నధీతవేదవేదాంగుండును సంపూర్ణ సకలాంగుడును విష్ణుభక్తిభాసురుండునునైన భూసురునకు దత్ప్రతిమ దానంబిచ్చి భోజన దక్షిణాదికంబుల బ్రాహ్మణులం దృప్తులం జేసినం గేశవుండు మీకు నధినాయకుం డగునిది యిట్లుండె మీరు నాకు నుద్దండంబున దండంబు వెట్టనికతంబునఁ గొండొకకాలమున నేతత్సరోవర తీరంబునం దపంబు సలుపు నీతి విశిష్టు నష్టావక్రమహామునిం బరిహసించి తచ్ఛాపంబున గోపాల బాలికలై భూలోకంబున మదనగోపాలునికిం గళత్రంబులుగాఁగలరని హరిభక్తి విశారదుఁడు నారదుం డానతిచ్చి చనియె నయ్యచ్చర లట్ల కావించి కృతార్థ లయి రిది యనంతద్వాదశీవ్రతంబు. 31

సీ. భద్రాశ్వభూపశుభవ్రతంబే నీకుఁ
జెప్పెద విను మార్గశీర్ష శుక్ల
పక్షంబునం బ్రతిప త్తిథి మొదలు ద
శమిదాఁక నేక భుక్తమును జరపి

నాఁటి మధ్యాహ్నంబు ననేశవుని భక్తిఁ
బూజించి తానొక్క ప్రొద్దు చేసి
ధరణివ్రతంబు చందమున సంకల్పోప
వాసంబు లొనరించి ద్వాదశి దిన

గీ. మునను గేశన నామమ్మునను సువర్ణ
సహిత తిలపాత్ర దానంబు సలుపవలయుఁ
గృష్ణపక్షంబు దినముల నిట్లు నడపి
దానమీఁదగుఁ గృష్ణాభిధానమునను. 32

మ. అవనీనాయక ! యిట్టు లాశ్వయుజ మాసాంతంబుగా నేక భు
క్త విధుల్ సల్పుచుఁ జైత్రమాసము మొదల్గా నాల్గు మాసాలు స
క్తు వు పాత్రఁబును శ్రావణాదికము లందున్ శాకపాత్రంబు వి
ప్రవరశ్రేణికి నిచ్చి కార్తికమునం బ్రాగ్వద్విధానంబునన్. 33

వ. శుక్లపక్షంబునం బాడ్యమిమొదలుగా నేకభుక్తంబుసలిపి దశమినాఁడు నేమంబున మాసనామంబున హరి బూజించి యేకాదశీదినంబున నుపవసించి సర్వబీజసమన్వితంబును బాతాళకుల పర్వతాంకితంబునుంగా యథాశక్తి సవర్ణంబునం జేసిన మహిప్రతిమ సితవస్త్ర యుగళంబునం బొదిగి హరి పురోభాగంబున నిలిపి పంచరత్నంబుల నర్చించి, జాగరణంబు చేసి మఱునాఁడు సూర్యోదయావసరంబున నేకవింశతి మహీసులకు నొక్కొక్క ధేనువును నొక్కొక్క పచ్చడంబును నొక్కొక్క గ్రామం బునుం గుండలాంగుళీయకగ్రైవేయక సహితంబుగా నుత్తముం డొసంగ వలయు, మధ్యముండు గ్రామవిరహితంబుగాఁ దక్కినవన్నియు నీవలయు నంతకంటెను దరిద్రుండు యథాశక్తి భూవస్త్ర భూషణచ్ఛత్రపాదు కాదులు సమర్పింపవలయు 'దామోదర ప్రీతోభవ'తని భూప్రతిమా దానంబిచ్చి షడ్రసాహారంబుల బ్రాహ్మణసంతర్పణంబు గావింపవలయు నేతద్వ్రత మాహాత్మ్యంబు వర్ణింపశక్యంబు గాదు మేదినీశ్వరా ! యిమ్మహావ్రతంబునకుఁ దగిన యితిహాసంబు చెప్పెద. 34

కం. నందనులు లేక మున్నృవ
లందనుఁ డనురాజు విధివలన నీవ్రత మా
నందంబున వినిచేయఁ బు
రందరవంద్యుండు శౌరి ప్రత్యక్షంబై. 35

మ. వినతుండైన నృపాలపుంగవుఁ గృపాన్వీ తీక్షణాబ్జంబులన్
గని నీకు న్వరమిత్తువేఁడు మనఁ బ్రఖ్యాతుం జతుర్వేదవే
ది నసంఖ్యాతవసున్ జిదాత్మకు సుతున్ దేహావసానంబునం
దనకున్ మోక్షము వేడఁగా నొసఁగి యంతర్ధానముం బొందినన్. 36

కం. ఉత్సాహంబున నా భూ
భృత్స్వామజుఁ డోలలాడ ప్రియసతి వలనన్
వత్సరము లోనఁ గనియెను
వత్సప్రియ నామధేయు వరసుతు నొకనిన్. 37

ఉ. ఆ తనయుం గ్రమోపగతయౌవనుఁ బట్టముగట్టి విశ్వధా
త్రీ తలమెల్ల నేలుమని దీవనలిచ్చి ఫలందనుండు ల
క్ష్మీతరుణీమనోహరు భజింపఁ దలంచి విరక్తుఁడై పురా
రాతియనుంగుమామ శిఖరంబునకేఁగి తపంబు చేయుచున్. 38

లయగ్రాహి.

అక్షర పురుష్టుత యధోక్షజ నిరాకృతి ర
ణక్షుభిత కేశిముఖ రాక్షస పయోజా
తేక్షణ జగత్త్రితయ రక్షక జనార్దన సు
లక్షణ ఖలప్రకర శిక్షక సమస్తా
ధ్యక్షయ కరస్మరణ కుక్షిగతలోక విజి
తాక్ష నిజభక్త సురవృక్ష మునిదేతా
ధ్యక్షనుత భాస్కర వళక్షకర బింబశక
లక్షసమ భాభారిత పక్షవరవాహ. 39

కం. సృష్ట్యర్థము మీనకమట
ఘృష్టాది శరీరములు. ధరించితి వింతే
దృష్ట్యాలక్ష్యమె కర ణా
వృష్టంబుద నీదురూపు వివరింపంగన్. 40

## ఛు రి కా బ ం ధ ము.

క. శ్రీహరి హరిహయనుత మహి
మా హిత హిమధామ భానుమండలనయనా
నా హృదయములో నిలువు స
మా హిత కృపనెప్పుడున్ మహాహిపశయనా. 41

చ. అనుచు ననేకభంగుల మహాద్రుమమహీజము క్రింద నుండి సు
స్వన శుకశారికల్ ఫలరసంబులు గ్రోలక ధారణా బలం
బున దనవెంబడిన్ జదువ ముమ్మరమై పులకాంకురావలుల్
తనువున మీఱ బాష్పసలిలంబులుగారనుతింపుచుం డగన్. 42

సీ. బ్రహ్మ మధ్యస్థుఁడై పరికింపఁ గుండలీ
శ్వరుఁ గ్రింద పఱచిన శాబ్దికుండు
బలిహరణపు వేళఁ బ్రాపించు విబుధుల
నరయు సంపన్న గృహస్థవరుఁడు
ధరకుఁ దానొకరుండ దాన పాత్రమనంగ
మఖము లీడేరించు మంత్రమయుఁడు
వేదవేదాంగాది విద్యలలోనన
పుట్టి పెరిగినట్టి గట్టియోగ్యుఁ

గీ. దతుల సాత్విక వర్తనుం డాత్మపాద
తీర్థములు చల్లుకొనెడి కృతార్థతతికి
జాహ్నవీస్నానఫలము లీఁజాలు పరమ
పావనుం డొక మఱుగుజ్జు బ్రాహ్మణుండు. 43

ఉ. వచ్చుటయున్ ఫలందనుఁడు వారిజనాభుఁడె మాయదారియై
యిచ్చటి కేగు దెంచెనని యిచ్చఁదలంచి నమస్కరింప వై
యచ్చర కామినీకర నఖాంకురలూన విలోల పల్లవా
త్యచ్చతరామ్ర భూరుహము దోఁచె రయంబున జానుదఘ్నమై. 44

గీ. అది గనుంగొని భూపాలుఁ డద్భుతమున
వేయు నేటికి నితఁడె నారాయణుండు
నిక్కువంబని చాగిలి మ్రొక్కి దేవ !
చూపు నీరూపు నాకింక దాఁపకనిన. 45

సీ. గడితంపు నీర్కావి మడుగుదోవతి కటీ
రస్ఫురత్పీతాంబరంబు గాఁగ
కురుమట్టమగు నూతకోల ధగద్ధగ
త్కౌమోదకీ గదోత్తమము గాఁగ
జలమునిండిన కమండలము ఘనస్వనా
డంబరకంబు రాజంబు గాఁగ
గుత్తంపు వట్రువ గొడుగు పరాక్రమ
క్రమ నిదర్శన సుదర్శనము గాఁగ

గీ. స్వస్తి ఫణితుల దీవింపఁ జాఁపుకరము
సకల కామిత వరదహస్తంబు గాఁగ
సరసిజాక్షుండు కరుణ సాక్షాత్కరించి
రాజ ! వేఁడుము వలయు వరంబు లనిన. 46

కం. జలధిసుతాధిప ! నీ కృప
గలిగిన సజ్జనుల కిజ్జగంబులు దలఁపం
దిల మాత్రము గాన వరం
బులు దక్కిన వడుగనొల్ల మోక్షము దక్కన్. 47

ఉ. నావుడు నట్లకాక జననాయక ! యేఁ ఇనుదేర నిమ్మహా
మ్రావనిజంబు కుబ్జతరమై కనుపట్టుట నింత నుండి యి

ప్పావస తీర్థరాజము ప్రభావము చూపుచుఁ గుబ్జకామ్ర ముం
ధావధమున్ వహించుఁ బ్రధితంబుగ విశ్వవసుంధరాస్థలిన్. 48

గీ. ఇచట జంతులలోపల నెద్దియైనఁ
బెద్దనిద్రకు ప్రాగన్ను వెట్టెనేని
దాని కబ్బు విమానశతంబు గొలువ
బ్రహ్మయోగీంద్ర లోకసామ్రాజ్యపదము. 49

క. అని పలికి శౌరి శంఖం
బున దేహము దిగ్గ విడిచి పోవుటయు ఫలం
దనునకు నప్పుడె మోక్షం
బొనఁగూడె మహామునీంద్రు లోహో! యనఁగన్. 50

కం. ప్రఖ్యాత కుబ్జకామ్రో
పాఖ్యాన మినోదయమునఁ బఠియింప వినన్
ముఖ్యంబులైన యిహపర
సౌఖ్యంబులు గలుగు నెట్టి జనులకు నైనన్. 51

వ. కావున మహానుభావుండగు నద్దేవు నీవును భజియింపు మనశ్వర భద్రంబులు గలుగు భద్రాశ్వనరేశ్వరా! యింక ధన్యవ్రతంబు వినుము. మార్గశీర్షాది మాసచతుష్టయంబున నుభయపక్షంబులం బాడ్యమినాటి రాత్రి రాత్రించరారాతి నారాధించి 'వైశ్వానరాయ నమో'యని పాదం బులు. 'నగ్నయే నమో'యని యుదరంబును. 'హావిర్భుజే నమో'యని వక్షంబును, 'ద్రవిణాయ నమో'యని భుజంబులు, 'సంవర్తాయ నమో' యని శిరంబును, 'జ్వలనాయ నమో'యని సర్వావయవంబులుం బూజించి తద్దేవు నగ్రభాగంబున నిర్మించిన కుండంబున నేతన్నామంబులన హోమంబు చేసి ఘృతయుక్తంబైన యవ భక్తంబున నక్తంబులు సలుప వలయుఁ జైత్రాదిమాస చతుష్టయంబున నట్ల పూజా హోమాదులు సలిపి సఘృత పాయసంబున నక్తంబు సలుపవలయు శ్రావణాది మాస చతుష్ట యంబున సక్తున నక్తంబ సలుపవలయు వ్రతసమాప్తి సమయంబున యథా శక్తి హాటకంబునం జేసిన కృపీటయోని ప్రతిమవస్త్రద్వయంబునం బొదిగి

రక్త పుష్పాను లేపనంబులం బూజించి సలక్షణ మనోహరాంగుం డగు విప్రపుంగవు రక్తవస్త్రయుగపుష్పానులేపనాదుల శృంగారించి ధన్యోస్మి యను మంత్రంబున దానంబిచ్చినధన్యునకు దుష్కరంబు లడంగి పుష్కల ధనధాన్యాదిసమృద్ధులు సిద్ధించు నేతద్వ్రతా చరణంబున మున్ను నార దునకు శూద్రత్వంబు మానె నీ కథ వినినఁ జదివిన వారలు ధన్యులగు దురు మహీకాంత ! యింకఁ గాంతి వ్రతంబు వినుము. 52

సీ. కార్తిక శుక్లపక్ష ద్వితీయారాత్రి
బలకేశవుల మంటపమున నిలిపి
బలదేవు పేరిటఁ బాదపద్మంబులు
శౌరి నామంబున జానువులుఁ బ్ర
లంబఘ్న నామధేయంబునఁ గటియుఁ గే
శిసిషూదనాహ్వయంబున నురంబు
కంఠభాగంబు సంకర్షణాఖ్య మహాభు
జస్తంభములు శార్ఙ్గి సంజ్ఞ శిరము

గీ. కేశవాహ్వ శరీరప్రదేశ మెల్ల
వాసుదేవాభిధానాన వరుసతోడ
నంగములఁ బూజచేసి తదగ్ర సీమ
రజత నిర్మిత వైష్ణవ ప్రతిమ నిలిపి. 53

మ. ప్రసవాద్యంబులచే 'నమో స్త్వమృత రూపా'యంచుఁ బూజించి వే
దసమర్థుండగు విప్రపుంగవునకుం దానంబుగా నిచ్చి గం
ధ సమేతంబుగ నర్ఘ్య మిచ్చి యవభక్తంబున్ ఘృతవ్యక్తమున్
వసుధానిర్జరు లారగింప వ్రతియై నక్తంబు చేయం దగున్. 54

సీ. కడమ మాసము లిట్లు కావించి ఫాల్గునా
దికమాసముల నెన్మిదింట నర్చ
నార్ఘ్య పాద్యాది కృత్యములు నిర్వర్తించి
నక్తంబు పాయసాన్నమున జరపి

యవలహోమము కార్తికాదికంబులరాజ
నములహోమము ఫాల్గున ప్రభృతుల
సలిలాన్నహోమ మాషాఢ ముఖ్యంబుల
సల్పుచు నొక్కవత్సరము నిండ

గీ. వెండిసోముని నిర్మించి వెల్లవస్త్ర
యుగళమునఁ జుట్టి చంద్రఖండోప మాను
లేపనాదుల ధాత్రీనిలింపనిభుని
భూషితునిఁ జేసి నియమితభాషణముల. 55

వ. "కాంతి మానస్మిన్ లోకేస్మి"న్నను మంత్రంబున దానం బొసగు సువ్రతుండు కాంతిమంతుండగు దక్షశాపంబున రాజయక్ష్మ పరిక్షీణ గాత్రుండగునత్రిపుత్రుండు మున్ని మహావ్రతంబు సలిపి కదా గదాధరుని కరుణా విశేషంబున నమృతకళ వడసి సోమత్వంబునం బొంది శర్వరీ సమయంబుల వెలుంగుచు సర్వౌషధి సార్వభౌమత వహించె నిట్టి సోముని కళ విదియనాఁ డాశ్వాసించు నాశ్వినేయులు ముఖ్యపక్షంబున విష్ణు విఖ్యాతి వహింపుదురు వారదేల యీలోకంబున విష్ణు విరహితంబైన దైవతంబు లేదు మేదినీశ్వరా! యింక మగవారలకు మగువలకు సకల సౌభాగ్యంబులు నొసంగు పరమ సౌభాగ్యవ్రతంబు వినుము. 56

కం. వెదఁగుదనంబున నీళ్ళ
న్నడుమడఁచిన రెండుగాని నలువున బలిభి
న్మృడు లెందు వేఱు గారని
విడువనివేలంబు చాటు వేదాంతంబుల్. 57

సీ. కలశపారావార కన్యకామణినాఁగఁ
గమ్మదమ్మివసించు గట్టుపట్టి
వడఁకుగుబ్బలిరాచవారికుమారి నా
సింగంబు నెక్కెడి సింధుతనయ

తెక్కలబొల్లని నెక్కువేల్పన శేష
శయ్యపైఁ బవళించు చంద్రధరుఁడు
బుడుతవెన్నెలపూవు ముడుచు దేవుఁ డనంగ
వాతాశనాహిత వాహుఁ డిట్లు

గీ. గా వనెడి వారివేదముల్ గావువేద
ములు, మతంబు లసమ్మతంబులు పురాణ
ములును గాథా పురాణముల్ దలఁపఁగృతులు
వికృతులని, గేలిగొందురు విమలమతులు. 58

సీ. అటుగాన నీరహస్య మెఱింగి ఫాల్గున
ప్రభృతి మాసోభయ పక్షములఁ ద
దియనాఁ డువపసించి నియమంబుతో నుమా
హరులనైనను రమాహరులనైన
నావహించి పదద్వయంబు గంభీరాఖ్యఁ
గటితటి సుభగాహ్వఁ గడుపు దేవ
దేవాహ్వయంబునఁ ద్రిణయనసంజ్ఞనా
ననము వాచస్పతి నామధేయ

గీ. మున శిరము రుద్రనామకమున సమస్త
తనువు బూజించి తత్పురస్థలమునందుఁ
దేనెయును గోఘృతంబును దిలలు మేళ
వించి 'సౌభాగ్యపతయే' యటంచు వేల్చి. 59

కం. క్షారము రసమునుఁ జమురును
గోరంతయు నాసపడక గోధూమమయా
హారములఁ జేయవలయుం
బారణ ధరణీతలంబె పల్లెము గాఁగన్. 60

గీ. యావకోదన మాషాఢ మాదియైన
నెలలు నాల్గింటఁ గార్తికాదులను మూటఁ

జామయి గిరికఁ బారణ జలిపి మాఘ
శుక్లపక్ష తృతీయ వచ్చుటయు నాఁడు 61

శా. క్ష్మానాథో త్తమ ! పార్వతీగిరిశులంగానీ రమావిష్ణులం
గానీ యోపినపాటి బంగరువునం గావించి నేమంబునం
దానంబీఁదగు దేనె నేయి గుడుముం దైలంబు సాముద్రమున్
ధేనుక్షీరము నున్న పాత్రములతో దేవద్వయప్రీతిగన్. 62

కం. ఈ సువ్రతంబు నియతిం
జేసిన మగవారికైనఁ జెలువలకైనన్
శ్రీ సౌభాగ్యంబులనా
యాసంబున సంభవించు నంటవుభవముల్. 63

వ. వాంఛిత సఫలతాలతావితానోపఘ్నంబును సకల కలుషోపఘ్నంబును నై విఘ్నవ్రతంబు వినిపించెద ఫాల్గునంబున మొదలైన నాల్గుమాసంబులం జవితి చవితిని నియతుండై శూర వీర గజానన లంబోదరైక దంష్ట్రాభిధానంబులు జతుర్థ్యంతంబుగా వినాయకుని బూజించి తిలాన్నంబున హోమంబు సలిపి నక్తంబు గావించి మఱునాఁడుపారణయుం జేయవలయు నైదవమాసంబున యధాశక్తి శర్మ నిర్మిత వినాయకప్రతిమం బాయస తిలపూరిత పంచపాత్రంబులతోడంగూడ దానం బొసంగవలయు నిమ్మహావ్రతంబు నడిపిన పుణ్యులకు నిరంతరంబును నిరంతరాయంబున మనోరథంబులు సిద్ధించు. 64

సీ. మున్ను దేవేంద్రుండు ముచ్చిలించిన యజ్ఞ
తురగంబు సగరభూవరుఁడు గనియె
నాకసంబునఁ బాఱు రాకేసుల పురాలు
ఫాలలోచనుఁ డవలీల గెలిచె
పతగేంద్రుఁ డమరపాలిత సుధాకలశంబు
సాధించి తల్లిదాస్యంబు మాన్పె
నేను నక్రభంకషంబైన వారిధి నిమి
షంబులో నాపోశనంబు గొంటి

గీ. మరియు నాదిమరాజులు మత్తవైరి
రాజి ఘోరాజిసీమఁ బరాజితంబు
చేసి నిష్కంటకంబుగా నా సముద్ర
భూమి యేలిరి యీనోము నోమిగాదె. 65

కం. క్షితినాయక ! విను శాంతి
వ్రతమిఁకఁ గార్తికము మొదలు వర్షావధిగాఁ
బ్రతి శుక్లపక్ష పంచమి
నతి నియమముతోడ రాత్రి హరి నహిశయనున్. 66

సీ. భక్తి నారాధించి పదముల నంతాయ
యంచు వాసుకి నేయటంచు బిఱుఁదు
తక్షకాయ యటంచు గుక్షి భాగంబు వ
క్ష స్థలి కర్కోటకాయ యంచు
పద్మాయ యని గ్రీవ బాహు శాఖలు మహా
పద్మాయ యని శంఖ పాలకాయ
యని మోము గుళికాయ యని మస్తకంబును
బూజించి వ్రతకర్త పులుసు చొరక

గీ. యుండ నక్తంబు చేసి పండ్రెండు నెలలు
నిండ నోపిన పాటి పసిండి చేత
నురగములఁ జేసి విప్రుల కొసఁగ మాను
సర్పభయము లఘంబులు శాంతిఁ బొందు. 67

వ. భద్రాశ్వ మానవేశ్వరా ! యింక గుమారవ్రతం బెఱింగించెద మాఘ మాసంబు మొదలుకొని ప్రతిశుక్లపక్షంబునం బంచమినాఁ డేకభుక్తంబు చేసి షష్ఠినాఁడు నిష్ఠాపరత్వంబున నారాయణుం బ్రతిష్ఠించి షడక్రి కృత్తికాసుత సేనాని కార్తికగుహకుమార స్కంద నామంబులం బూజించి హోమంబు గావించి ఫలాహారంబునం దద్దివసంబు గడపి సప్తమి నాఁడు శుద్ధోదనంబున భూసురసహితంబుగాఁ బారణ చేయుచు నొక్క సంవత్స రంబు నిండిన యథాశక్తికార్త స్వరనిర్మిత కార్తికేయమూర్తిని సర్వేకా

మాస్సమృద్ధ్యంతామను మంత్రంబున సయుగ్మకంబుగా దానం బొసంగి
యిష్టాన్నంబులవిప్రుల సంతృప్తులంజేసిన వారికిం గోరికలు ఫలించు. 68

కం. మున్ను నలచక్రవర్తి వి
పన్నత ఋతుపర్ణు నింటఁ బ్రచ్ఛన్నుఁడై
యిన్నోము నోమి సుమ్మీ
తన్ను జగము పొగడ మగుడ ధారుణి యేలెన్. 69

శా. ఆరోగ్యవ్రత మింకఁ జెప్పెద నృపాలా ! మాఘమాసంబు నం
బ్రారంభించి దృఢవ్రతుల్ నెలనెలన్ బక్షద్వయిన్ షష్ఠి నా
హారాస్వాదన మాచరించి మఱునాఁ డత్యంతశుద్ధాత్ములై
మారామారమణ స్వరూపురవి నామ్నాయత్రయీ వందితున్. 70

ఆ. నవ్యవేదిక పైని సనాతన ప్ర
భాకరాదిత్య భాస్కర భాను సూర్య
నామములు చెప్పి పూజించి నాఁటి కుపవ
సించి మఱునాఁడు పారణ చేయవలయు. 71

కం. ఈ విధమున నొక వర్షము
గావించిన వారికెల్లఁ గలుగు ధనారో
గ్యా వాప్తులిహంబునఁ బున
రావృత్తులు లేని మోక్ష మబ్బుం బిదపన్. 72

మ. అనద్యాత్మక! యిందుకుం దగు నుపాఖ్యానంబు వర్ణింతు ము
న్ననరణ్యుండను రాజు రోషశిఖి దగ్ధారి వ్రజారణ్యుఁడై
వనజాప్తేందు కులక్షితీశ్వరులు సేవల్ చేయఁగా దీవులే
డును బాలింపుచు నశ్వమేధమఖకోటుల్ సల్పె నత్యున్నతిన్. 73

ఉ. క్ష్మానుతుఁ డొక్కనాఁ డతఁడు మానసనామ సరోవరంబునం
దానము చేయఁగా నరిగి తారకమధ్య గతేందు లీల నా
నా నలినవ్రజాంతరమునన్ వికసించిన తెల్లదమ్మిలో
భానుసమాను నంగుటము పాటి ప్రమాణము వాని నొక్కనిన్. 74

మత్తకోకిల.

కాంచి యెంతయుఁ గౌతుకంబునఁ గర్ణికామణి పీఠిపైఁ
గాంచనంబు హసింపఁ గొంచెపుఁ గాయమున్ భుజయుగ్మమున్
మించుమానిసితోడి యాసితనీరజంబు ధరించి నే
సంచరించెదఁ గొంచు రమ్మని సారథిన్నియమించినన్. 75

గీ. వాఁడు నరదంబు డిగ్గి దేవరకుఁ బసిఁడి
గుబ్బ వెట్టినఁ దెలిపట్టు గొడుగు లీల
మెఱయ నాళంబు తోడనె పెఱికి తెత్తు
జలరుహం బంపు నావేల్పుకొలను సొచ్చి. 76

చ. కలశపయోధి కన్యకయొ ! గాదు పుమాకృతిఁ దాల్చెఁ గావునన్
నలువయొ ! కాఁడు వక్త్రములు నాలుగు వంకల లేవు గావునన్
జలజహితుండొ ! కాఁడు రథ సప్తహయంబులు లేవు గావునం
దలఁపఁగ నిట్టి సూక్ష్మతనుధారణ మీవెలిదమ్మి జాడయో ! 77

మానిని. అంచు మనంబున నద్భుత మందుచు నాసరసీరుహమంటినఁ గో
పించి ఘనాఘన భీకర గర్జల పెంపు నడంచెడు పెన్రవళిన్
గొంచెపుమానిసి కొంచ కదల్చిన గొబ్బున సారథి గూలఁగ నీ
క్షించి నృపాలుఁడు చేష్టలు దక్కి మషీసమదేహరుచి న్నిలువన్. 78

గీ. ముకిసి మురిసి రాలె ముఱివేళ్లు నఖముక్కు
చదుకఁ బడియెఁ జీము జాలు కొనియెఁ
దనువు మీఁద ముసరె దొన దొన నీఁగలు
వేగిరంబె పెద్దరోగమునను. 79

కం. కుష్ఠం బీగతిఁ బట్టఁ గ
రిష్ఠ మనోవ్యథల నాథరిత్రీరమణ
శ్రేష్ఠుం డచ్చట నిలిచి వ
సిష్ఠుఁడు చనుదేర మ్రొక్కి చేతులు మోడ్చెన్. 80

సీ. అమ్మని పుంగవుం డాశ్చర్యపడి మహీ
పాలక ! యిట్టి పాపంపు రోగ
మదరిపాటెట్లు నిన్నావరించె నటన్న
నారాజు నైజకృత్యంబు చెప్ప
కటకటా ! యేలపోకడమాలి బ్రహ్మోద్భ
వంబను పేరి దివ్యాంబుజమున
కెగ్గు దలంచితి వెట్టకేలకుఁగాని
పొడగానరాదు వేల్పులకునైన

గీ. శారదాధీశు ప్రాగవస్థా శరీర
మధివసించిన యీ ధవళాంబురుహము
నేను బనివడి దర్శింప నేగుదెంతుఁ
గాని నిచ్చట వెదకియు గానలేను. 81

వ. కైవల్యసామ్రాజ్య ధవళాతపత్రంబైన యీ బ్రహ్మోద్భవశత పత్రంబు మానససరోవరమధ్యంబున నాఱునెలలకు నొకమాఱు గాన వచ్చునని పెద్దలు చెప్పుదురు విన్నవారలే కాని కన్నవారలు లేరు భాగ్యవశంబునం జక్షుర్గోచరం బయ్యేనేని నాక్షణంబ జలంబునఁ గ్రుంకినవారు మోక్షలక్ష్మికి నధ్యక్షు లగుదురు సర్వదేవతాశ్రయంబైన యిమ్మహాకుశేశయంబు పరమపురుషవరశయంబగుకుట ననంశయంబు భూవల్లభా ! దీని నపహరింప దలంచిన యపరాధంబునం గృతార్థుండ వైతివి రోగంబు వేగంబ పాయు నుపాయంబు వినుమని మునిపుంగవుం డారోగ్యవ్రతంబుపదేశించినంజేసి రాజవరేణ్యుం డనరణ్యుండు భాస్కరుని కారుణ్యంబున నిగణ్యలావణ్యగేహంబగు దేహంబువడసె నింకఁ బుత్ర వ్రతంబు వినుము. 82

కం. నృప ! శ్రావణకృష్ణాష్టమి
నుపవాసంబుండి వారిజోదరుఁ బూజిం
చి పిదప దిలహోమము చే
సి పారణ హవిష్యమునన చేయఁగ వలయున్. 83

గీ. మాసములు పద్నొకం డీక్రమమున నడపి
మీఁద నాషాఢకృష్ణాష్టమీ దినమున
వ్రతి యథాశక్తిఁ గాంచనరచితమైన
కృష్ణమూర్తి ద్వయము దానమిచ్చెనేని. 84

కం. ఇద్ధరణిఁబుత్ర పౌత్రస
మృద్ధులు భువనప్రసిద్ధు లిహపర సుఖముల్
సిద్ధించు నిందుకుం దగ
బద్ధస్పృహతోడ విను ముపాఖ్యానంబున్. 85

శా. సహ్యాపత్యము సూరసేనుఁడను విశ్వక్ష్మావధూభర్త మున్
వాహ్యాళీగతి సర్వదిఙ్ముఖములన్ సాధించియున్ సంగర
ద్రుహ్యద్వైరులఁ గీటడంచియును బుత్రుల్లేని యీ సౌఖ్య మ
గ్రాహ్యంబంచుఁ దపంబు చేయ నరిగెన్ బ్రాలేయపుంగొండకున్. 86

కం. అరిగి తదగ్రస్థలమునఁ
బెరిఁగిన గహనంబులోన భీకరమృగముల్
మరిగి చరింప భవాంబుధి
తరి గిరిశు నుమాసమేతుఁ దలఁపుచు నుండన్. 87

సీ మిన్నుపైఁ బ్రాఁకువెల్లి ముత్యఁపుజల్లి
చలువల బచ్చు చెంగలువకచ్చు
పుటియల చౌకీలు పొలుపైన తడపాలు
పన్నగ విసరమ్ము బన్నసరము
బలుకుల బూది క్రొవ్వలపుల జవ్వాది
వేలిమి మెకము పిసాళి శుకము
చాఱలరెంటెంబు సన్నంపుగింటెంబు
భాను పండులదాలు పసిఁడినూలు

గీ. జముని శిరమును మణినూపురమును మెఱయ
మురువు గలిగిన తొడుకు వావురము నెక్కి

కరుణ నయనాంబుజంబులఁ గడలు కొనఁగ
నెదుటఁ గనుపట్టె నర్ధనారీశ్వరుండు. 88

కం. అప్పుడు మది నానందము
నుప్పిరిగొన నమక చమక ముఖమంత్రంబుల్
చెప్పుచు మ్రొక్కెడు భూవరు
నప్పరమేశ్వరుఁడు వరము లడుగుమటన్నన్. 89

మ. సుతులన్ వేఁడిన నా సుధాకరకళామూడుండు కృష్ణాష్టమీ
వ్రతమాద్యంతము నానతిచ్చి చనియెన్ రాజన్యుఁడున్ భక్తి సం
గతిఁ జేసెన్ దనకూర్మిరాణి వలనన్ గాంచెన్ జతుర్లోక స
న్నుత విశ్రాణన చాతురీదివిజధేనున్ వీరసేనున్ సుతున్. 90

సీ. అవనీశ ! వినుము శౌర్యవ్రతం బిఁక నాశ్వ
యుజ శుద్ధసప్తమి నొక్కప్రొద్దు
చేసి సంకల్పంబు చెప్పి తిలాన్న మ
ష్టమి నారగించి నవమిఁ జరాచ
రస్వరూపిణి మహాప్రభ మహామాయ మ
హాభాగ దుర్గాంబ నావహించి
ప్రతి, షోడశోపచారంబులు సలిపి బ్రా
హ్మణభోజనంబు నేమమునఁ బెట్టి

గీ. తాను శిష్టాశనముఁ గొని తప్పకిట్లు
యేఁడు గడిపి యథాశక్తి హేమ వస్త్ర
ములఁ గుమారీజనంబులఁ బూజచేసి
పడయు విద్యా పరాక్రమ ప్రాభవములు. 91

వ. మఱియు నతిసుకరంబులుం జతుర్విధపురుషార్థకరంబులు నైన సువ్ర
తంబులం జెప్పెదఁ గార్తికమాసంబు మొదలుకొని సంవత్సరంబుదాఁకఁ
బ్రతిశుక్లపక్షదశమి దివ్యరూపుం బురాణపురుషుం బురుషోత్తము నారాధించి

రాత్రి సమయంబున "సర్వాహవే షవధ్యత్వంమజన్మని జన్మని" యను మంత్రంబున సర్వదిఙ్ముఖంబుల శుద్ధబలి చల్లి పీతవస్త్ర కుసుమంబులవిప్రవర్గంబు నలంకరించి దధ్యన్నంబు మున్నుగా నిష్టాన్నంబుల నక్తంబు సలిపి సంవత్సరంబు నిండిన నోపినపాటి పసిండి నిర్మించిన దిక్ప్రతిమల దానంబొసంగిన, నమేయ సంపత్సమృద్ధియు దిగ్విజయంబునుంగలుగునిది సార్వభౌమవ్రతంబు రాజర్షభా ! మార్గశీర్ష మాసంబు మొదలుకొని వర్షపర్యంతంబు ప్రతిశుక్లపక్షంబున నేకాదశితిథిం గుబేర స్వరూపు శౌరి నారాధించి రాత్రి నక్తంబుచేసి వ్రతాంతంబునం గుబేర ప్రతిమాదానంబు చేసిన సంపత్పరం పరావాప్తిగలుగునిది ధనదవ్రతంబు; తన్మాసంబున మొదలుకొని సంవత్సరంబుదాక నుభయపక్షంబుల నేకాదశి నుపవసించి పంచశరగురుం బూజించి ద్వాదశినాఁడు పారణ సలిపి కడపట విష్ణుప్రతిమ దానం బొసంగిన సకలపాపనిర్ముక్తుండగు, నిది వైష్ణవివ్రతంబు; ఫాల్గునమాసంబు మొదలుకొని సంవత్సరపర్యంతంబు ప్రతిశుక్లపక్షంబునం, త్రయోదశినాఁడు ధర్మస్వరూపు మాధవు నారాధించి రాత్రి నక్తంబు సలిపి కడపట ధర్మప్రతిమాదానం బొసంగ సకల ధర్మంబులు సిద్ధించు నిది ధర్మవ్రతంబు. మాఘమాసంబు మొదలుకొని సంవత్సరంబుదాఁకఁ బ్రతిశుక్లపక్షంబునఁ జతుర్దశినాఁ డుపవసించి రుద్రస్వరూపు సముద్రశాయి నారాధించి మఱునాఁడు పారణచేసి కడపట రుద్ర ప్రతిమ దానం బొసంగిన ననశ్వరంబగు నైశ్వర్యంబు సంభవించు నిది రుద్రవ్రతంబు; తన్మాసంబు మొదలుకొని సంవత్సరంబుదాఁకఁ బున్నమ పున్నమ వెన్నెలతేనిరూపుం గైకొని వెన్నుని నర్ఘ్యాదుల బూజించి నక్తంబుచేసి యేడునిండిన వెనుకం గనక నిర్మిత సోమప్రతిమాదానంబుచేసినం గాంతిమంతులగుదు రిది సోమవ్రతంబు; నరేశ్వరా! ప్రతిమాసంబున నమావాస్యనాఁడు పితృదేవతల నారాధించినం బైతృకవ్రతంబు. 92

కం. ఈ నోములలో నొక్కటి
యే నియతిం జేయువారి కెన లే దనినన్
మానవనాయక ! యిఁకఁ బది
యేనుంజేసిన ఫలంబు లేమని చెప్పన్. 93

మ. అని వాతాపిహరుండు చెప్పవిని భద్రాశ్వుండు ముద్రాద్భుతం
బును సంతోషముఁ జేయు పూర్వచరితంబుల్ సృష్టిలో మీరు చూ
చినవైనన్ మఱివిన్నవైన జలరాశిప్రాశనా ! చెప్పు మ
న్నన నన్నన్ మునిరాజశేఖరుఁడు నానావైఖరీమౌఖరిన్. 94

కం. అద్భుతము లనిన సకల జ
గద్భరితుఁడు శౌరికథల కా కిలఁ గలవే !
చిద్భాసురుండు బ్రహ్మస
ముద్భూతుండు నారదుండు మున్నొకవేళన్. 95

శా. శ్వేతద్వీపము చూడఁబోయి యెదుటన్ శ్రీవత్సవత్సాఢ్యులన్
శాతాస్యంబుజ శంఖచక్ర కరులన్ దాపింఛరింఛోళి జీ
మూతచ్ఛాయ శరీరులర్, వికసితాంభోజాక్షుల్ బల్వురన్
చేతోజాతగురూపమా కృతులఁ జూచెన్ జూచి సాశ్చర్యుఁడై. 96

కం. వీరలలో నారాయణు
నేరీతి నెఱుంగువాఁడ నేనని సరిపెన్
శౌరి గుఱియించి తప మతి
ధీరతమై బహుసహస్ర దివ్యాబ్దంబుల్. 97

శా. అంత న్వారిధికన్యకావిభుఁడు ప్రత్యక్షత్వముం బొంది నీ
వెంతే ఘోరతపంబు చేసితి మునీ ! యే కోరికల్ గోరి పొం
దింతుం జెప్పుము. తత్సమీహిత మనన్ దేవా ! భవన్మాయ స
ర్వాంతర్వ్యాపిని నాకుఁ జూపు కృపతో నన్నం బ్రసన్నాస్యుఁడై. 98

గీ. మునికులాగ్రణి యీ నీట మునుఁగు మన్న
మునిఁగి లేచిన మాత్రలో మోహనాంగి
కాశిభూపాలకుని కూర్మికన్య చారు
మతి యనెడు పేరఁ బుట్టెఁ గ్రమక్రమమున. 99

కం. కొప్పును రోమావళియుం
గప్పెక్కెను మోవిఁ బాదకమలంబులఁ గెం
పుప్పతిలెఁ బిఱుఁదుఁ గుచములు
నప్పుడతికి మిగులఁ బొదలి యౌవనమైనన్. 100

సీ. వదరు మాటలుగాక వచ్చునే సరిచేయఁ
గిన్నరకాయ లీ చన్నుఁగవకు
పూదెమాటలుగాక పొసఁగునే సరిచేయ
బంగార మీ నిర్మలాంగమునకు
పూతమాటలుగాక పోలునే సరిచేయఁ
గర్పూర మీ తనూగంధమునకు
జల్లిమాటలుగాక చెల్లునే సరిచేయ
నవరంబు లీ కేశజాలమునకు

గీ. ననుచుఁ దనవిలాసంబును జనులువొగడఁ
జక్కఁదన మెల్ల నొకరాశి కెక్కె ననఁగ
రతిమనోహర భాగ్యదేవతయఁ బోలె
బాలికామణి కన్నులపండు వయ్యె. 101

కం. ఆసతిఁ గాశినృపాలకుఁ
డౌసీనరపతికి శిబికి నర్పించుటయున్
వాసంతసమయ కుసుమిత
వాసంతీమంటపముల వారు రమింపన్. 102

ఆ. వరుస నగ్నజిత్తి వప్రజిత్తి విచిత్తి
చారువక్త్రి చిత్ర సంజ్ఞులయిన
కొడుకు లేవు రధికగుణులు బలాఢ్యులు
శస్త్ర శాస్త్రవిదులు జననమైరి. 103

వ. వారు వైరిదుర్వారులై పెరుగుచు హరునకుం బంచముఖంబుల రీతి మరున్నకుం బంచశిలీముఖంబుల భాతిఁ బురందరునకుఁ బంచతరువుల కరణి శరీరంబులకుం బంచప్రాణంబుల సరణిఁ బెక్కుచందంబులం దనకు నానందంబుచేయ నమేయవైభవం బెక్క నొక్కనాఁడు దిక్కులు ప్రక్కదల జయపటహంబు చఱపించి సముద్దండవైరిమండలి మీఁద దండు వెడలి ఖండనంబు సలుపుట విని కాశిరాజు గజరాజులు గొలువ నల్లునకుం దోడుచని సంగరంబున జామాతృదౌహిత్రవర్గంబులతో వీర స్వర్గంబు చేకొనుటయుం జారుమతి శోకభీరుమతియై తలంపున. 104

కం. సతికిఁ బతిఁ దప్పినప్పుడు
సుతు లరయం గర్త లట్టిసుతులు బొలిసినం
బితకర్త యిపుడు నాకుం
బతి సుతపితృహీన కగ్నిపా లగు టొప్పున్. 105

కం. అని నిశ్చయించి సొదపే
ర్చి నిజేశున్ సుతులఁ దండ్రిఁ జేర్చి హుతాశం
బొనగూర్చి తాను దఱియన్
వనితారూపంబుమాని నారదుఁ డగుడున్. 106

కం. కలగంటినొ! భ్రమసితినో!
జలజేక్షణుమాయయో! నిజంబో! యని త
జ్జలమధ్యంబున మిక్కిలి
వెలవెల నగుమౌనిఁ జూచి వికవిక నగియెన్. 107

శా. ఆ నారాయణువక్త్రగహ్వరములో నంభోజగర్భుండు నా
నా నాకౌకసులు న్నిశాటవరసేనానాథులున్ మర్త్యులున్
భానుండున్ హిమధాముఁడుం దపసులున్ బాతాళభూముఖ్యలో
కానీకంబులు నాదిగాఁ గలుగు దృశ్యం బెల్ల గాన్పించినన్. 108

శా. ఆ సర్వేశ్వరు విశ్వరూపమున కత్యాశ్చర్యుఁడై హర్షబా
ష్పాసారంబుల మేనిపైఁ బులక సస్యం బుబ్బి నర్తింపుచున్

గాసారప్రభవాసనాత్మజుఁడు రంగత్తుంగ గంగాతరం
గా సంకోచ మహోర్భటీ సహచర వ్యాహార తారధ్వనిన్. 109

దండకము. శ్రీ మజ్జగన్నాథ! లక్ష్మీ మనోనాథ! ఖేలన్నిజామేయ మాయా సమాక్రాంత దిక్చక్ర! చక్రాసి కౌమోదకీ శార్ఙ్గదోస్తంభ జంభారి ముఖ్యామరస్తుత్య! నిత్యం బనిత్యం బనిత్యంబు నిత్యంబునౌ నీ మహామాయ కృత్యంబునన్ దేవ! నీ దివ్యదేహంబులోఁ బెక్కు బ్రహ్మాండముల్ వాహినీశప్రవాహంబులో బుద్బుదశ్రేణిచందంబునన్ హెచ్చు విచ్చుం బ్రపంచంబు నీగర్భగోళంబునం గంటి ముక్కంటివై బ్రహ్మవై నీవ వర్తింతు గాయత్రి నీమూర్తి పాదంబులన్ శారదా భర్త కుక్షిన్ హుతాశిన్ భుజాగ్రంబులన్ రుద్రు నున్నిద్ర నేత్రంబులన్ మిత్రునిన్ బంకజామిత్రునిన్ జూచుచున్నాఁడఁ గన్నాఁడ నౌకో యెవ్వఁడే నిట్టి నీ మూర్తి లోకత్రయీ వ్యాప్త రక్షస్తమిస్రావళీ ఘస్ర సాహస్ర జన్మాగత బ్రహ్మవిద్యా పరీపాకజానందమే నీవనన్ విందు ముందబ్ధిమధ్యంబునన్ నీవు మీనంబవై కావవై తే చతుర్వేద సంఘంబు తాఁబేలవై తేలవై తే మహాశైలమున్ మోచియున్ లీలఁ గోలమ్మవై చిమ్మవై తేవడిన్ మీఁదికిం గల్పవారాశిమజ్జన్మహీమండలంబున్ నృసింహుండవై చెండవై తే సముద్దండదైతేయునిం బొట్టివై మెట్టవై తే బలిన్ రేణుకాదేవికిం బట్టివై పుట్టవై తే మహాపట్టభద్రేశులన్ గొట్టివై నన్ రఘుక్ష్మాపవంశంబులో దిట్టవై కట్టవై తే దరుల్ముట్ట బెన్నీటి రామాభిధేయుండవై యుండవై తే సదా రేవతీ తుంగ వక్షోజపీఠంబుపై బోదవై చూడవై తే పురాధ్యక్ష రక్షోవధూ శీలభంగంబులన్ మావవై కావవై తే జగం బుద్ధత మ్లేచ్ఛులం జంపి దేవా! భవత్ప్రాభవం బాభవాంభోజగర్భాదు లంతంబుగా నెన్నలే రన్న నే నెంతవాఁడం బ్రశంసింప! నాభక్తి కై కొమ్ము ముక్తిం గృపాయుక్తిమై నిమ్మటంచున్ బ్రణామంబు గావించినన్ బద్మనాభుండు నే మెచ్చితి న్మౌనినాథా! వరం బిచ్చెదన్ వేడుమన్నన్. 110

సీ. ఇందిరాధిప నాకు నింక నొక్క విచిత్ర
రూపవిలాసంబు చూపుమనిన

తాపసోత్తమ నన్నుఁ దప్పక యించుక
వడిఁ జూడు మన మౌనివరుఁడు నట్ల
చూడంగ నద్దేవచూ డావతంసంబు
వి|శుతాననమున వెడలె నీరు
తజ్జలంబులు భూతధాత్రి యంతయుఁ గ్రోల
నేకోదకంబయ్యె నింతలోనె

గీ. దహన ముదయించి క్రోలెఁ దద్బహుళజలము
ననిలము జనించి తద్వహ్ని నాఱవిసరె
పవనము నడంచి పెనుబట్టబయలు దోఁచెఁ
దన్నభంబున నొక్క శబ్దంబు వొడమె. 111

కం. పరతత్త్వరాజు ముందట
మెరయు నకీబుల విధాన మ్రోయుచునుండెన్
ధరణి సలిలానలానిల
భరవిరహిత శుద్ధశూన్యభావమె నిలువన్. 112

గీ. కటకటా! సృష్టి చీఁకట్లు గవిసె నింది
రాధవుఁడు నైతమును గానరాక పోయె
ననుచు బ్రహ్మాండభాండ మధ్యమునఁ బ్రమసి
తిరిగి నారదముని మొగతిరిగె నపుడు. 113

కం. వినవచ్చె శబ్దము రవం
బున విసరె మరుత్తు గాడుపున వెలిఁగె హుతా
శన మనలంబునఁ బ్రవహిం
చె నీరు సలిలమున నొక్క చెలువ జనించెన్. 114

వ. కుంభినీధరకుచకుంభయుగళయు రత్నాకరమేఖలయు దూర్వాశ్యామలయు నగునత్తామరకంటి తొంటియట్ల దిశామండలంబులు నిండె మఱియు మెరయు శబ్దంబు వలన సితకృష్ణవర్ణలిద్దఱు ముద్దియలు

వెడలిరి వెండియు మెండుకొను శబ్దంబువలన శరదబ్దరుచిస్ఫూర్తియు నప్తమూర్తియునగు పురుషుండు సంభవించె నప్పటి విప్పగుశబ్దంబు వలన రెండుమేనులు నాలుమోములు బం[డెండుచరణంబులుం గల నరుం డొక్కరుం డవతరించె నతనివలన సంపన్నంబైన దాంపత్యం బహోరాత్రంబనం బరగె నిప్పగిది నెప్పటియట్ల తెప్పవెట్టిన యంత లోనన కానవచ్చు నచ్చరాచరంబునకు నచ్చెరువంది వంది చందంబున నరవిందభవనందనుండు గోవిందు నందంద పరమానందంబున వినుతించి పరమపురుష! నిమిషంబునన యిజ్జగంబెక్కడ నడంగె నెక్కడం బొడమె నానతిమ్మని విన్నవించినఁ [బసన్నుండై వెన్నుండన్నారదు విలోకించి తత్త్వంబులు పరమయోగుల చిత్తంబుల నడంగు భంగి మదీయ సంధాసమాధి సమయంబున జగంబులు నాయందు డిందు. నది మర్త్యామర్త్య [ప్రళయంబు [బహ్మరాత్రి ని[ద్రించువేళ నాకు జపసమయంబది యోగిక్లేశ సంక్షయంబగు మధ్యమలయం బనం బరగు [బహ్మకు వత్సరంబులు నూఱు నిండిన మహా[ప్రళయం బది ముక్తికాలంబు [బహ్మకు నొక్క యేఁడు నాకొక్క నాఁడు. మునీం[ద్రా! మున్ను నన్ను సప్త జన్మంబులనుండి యారాధించినాఁడవు గావున సంధ్యారూపంబున నతి రహస్యంబగు నామాయ నీకుం జూపితి నింతియ కాని నాకు నొక్క సంధ్యయు నుపాస్యంబు లేదు సకలదైవతంబులు నాయందుఁ బొడము నడంగు నేన శైవ వైష్ణవ కాపాలికాది మతంబుల వారిచేతం బూజ గొందు నీవు నా విరూపంబున బహుసహ[స వర్షంబు లనుభవించిన సంసారంబునుం జరాచరసృష్టి సంహారంబును నేకక్షణంబుననె చూపితి. నమేయ మదీయ మాయావృతులై [బహ్మపు[త్రా సు[త్రామాది దేవత లవిరత ద్వంద్వ పరాయణత్వంబునం గామ [క్రోధ బాధితులగుదు రట్టి నా మాయావిహారం బెఱింగిన పురుషుండు పరుషతర సంసారంబను కడలి వెడలి కడలేని కైవల్యం బనుభవించు ననిన మునివర్యుండు సాశ్చర్యుండై. 115

సీ. నారాయణా! నిన్ను నాల్గుజాతుల వారు
నేరీతి భజియింతు రెఱుఁగ నాన

తిమ్మన్నను గృపాసమేతుఁడై దేవుండు
ద్విజులకుఁ బురుషసూక్త జపనియతి
భజియింపఁదగుఁ దజ్ఞపంబ లబ్ధంబైనఁ
బాంచరాత్రమత ప్రపంచంబున భ
జింపంగఁదగుఁ జెవిఁజేర్పఁగా గాదు శూ
ద్రజనంబునకుఁ బాంచరాత్రమతము

గీ. నూట వేయింట నొకఁడు పుణ్యుండు గలిగె
నేని వానికి సిద్ధించు నీమతంబు
వాని హృదయంబులోనుండు వనధికన్య
చన్నుఁగవ నుండుకంటెను సమ్మదమున. 116

కం. కావున నీ మతమునఁ గా
నీ వేదప్రోక్త యజ్ఞనిర్మితిఁ గానీ
సేవించి నన్నుఁ గందురు
దైవతములు గానలేరు తక్కిన జూడన్. 117

గీ. అనుచు వచియించి దుర్లభంబైన పాంచ
రాత్ర శాస్త్రంబునకుఁ బ్రవర్తకుఁడు గాఁగ
నారదు నను గ్రహించి లక్ష్మీరమణుఁ డ
దృశ్యుఁ డయ్యె మునీంద్రుండు దివికి నరిగె. 118

మ. అని కుంభోద్భవుఁ డంబుజోదరుని మాయా విభ్రమా యామమున్
ఘననిధ్వాన గభీర వైఖరుల వక్కాణింప నాద్యంతమున్
విని భద్రాశ్వనృపాలుఁ డద్భుతరసోన్నిద్రాంతరంగాంబుజా
త నిరాఘాట కుతూహలప్రకటనోద్దామాంగ రోమాంచుఁడై. 119

కం. లోపాముద్రానాయక!
శ్రీపతి నారదమునీంద్రశేఖరు నెదుటం

జూపిన రూపము లెట్టివి
యో! పోలఁగఁ జెప్పుమన్న నూకొని మునియున్. 120

ఆ ధవళకృష్ణ వర్ణతనువులు గలిగిన
సతులు సత్యమన నసత్యమనఁగఁ
దగినవారు సప్తతనువులఁ బురుషుండు
సాగరమ్ము సుమ్ము జనవరేణ్య! 121

గీ. రెండు నిజదేహములును బంట్రెండు చరణ
ములును షడ్వస్త్రములు గల పురుషుఁ డాతఁ
డయనములు రెండు నెలలు రెండార్లు ఋతువు
లారు గలిగిన వత్సరం బనఁగఁ బరఁగు. 122

వ. ఇది నీ వడిగిన ప్రశ్నంబునకు నుత్తరంబు దురంతంబైన సంసార పారావారంబు నారాయణుం గొల్చికాని దాఁటరాదు కావున నీవు నద్దేవుని సేవింపుమనిన భద్రాశ్వుండు మునీశ్వరా! విశ్వంభరుని మహిమ నీవలన వినిన కతంబున గృతార్థుండ నైతి నింక యుగచతుష్టయ ధర్మంబులు వర్ణాచారంబులు సంక్షేపంబునం దెలుపు మనినఁ గుంభసంభవుఁ డిట్లనియె నాదియుగంబున నాదితేవ దైతేయులు వేదచోదిత మఖప్రతిపాదకులై మేదిని యేలుదురు త్రేతాయుగంబున మర్త్యులు నమర్త్యులు నిట్లె వర్తిల్లుదురు కృతత్రేతలు సాత్త్వికసమేతలు రాజసవ్యాపారంబగు ద్వాపరంబున ధర్మపుత్రుండను మహారాజు తేజోవిజృంభణంబునఁ గుంభిని యేలం గలవాఁడు తమోబహుళంబగు కలియుగంబున భూసురులు దోసంబున కోసరింపక వేదమార్గపరిత్యాగంబును నగమ్యాగమనానురాగంబును గన్యావిక్రయవ్యవహారంబును నసత్యవ్యాపారంబును మొదలైన దురాచారంబుల మెలంగుదురా కారణంబున దరిద్రులై శూద్రాదుల సేవింపుదురు బాహుజులు ధనలాభ లోభంబున బ్రాహ్మణాది హింసకు రోయక పాయక దురితంబులు చేయుదురు కోమట్లు తాకట్లు దక్కం దిరిగియు ధారణ దరపియు బేరసారంబులయెడఁ దఱుగ మొఱఁగు చేసియు నదనంబుగా ధనంబు గూడఁ బెట్టి యాఁగకుం గాటిక

పామునకుం బలిపెట్టక రట్టునకుం దిట్టునకు నొడిగట్టుకొని కట్టిఁడులై పొట్టలు పోసి కొందరు శూద్రులు పట్టభద్రులై ధనగర్వంబున సర్వ వర్ణంబుల ధిక్కరింపుదురు మఱియును. 123

సీ. కామ తత్పరవృత్తిఁ గాఁగాని పనిబూని
వర్తింతు రెప్పుడు వావిదప్పి
క్రోధించి సూక్ష్మాపరాధంబునకు నైనఁ
గావింతు రెప్పుడు జీవహింస
లోభులై బహువిత్తలాభంబు లాసించి
హరియింతు రెప్పుడు పరధనంబు
మోహపాశంబున ముడివడ్డకతమునఁ
దిరుగుదు రెప్పుడు దెలివిమాలి

గీ. మదముచే ధిక్కరింతురు మాన్యజనుల
మచ్చరమె కాని తలఁపరు మంచితనము
దోసముల కెల్లఁ దామె నివాస మగుచు
హెచ్చుదురు ధాత్రిఁ గలివేళ నెల్లజనులు. 124

కం. ఆలము విప్రులు చేయఁగ
హాలికులై రాజు లడఁగ నంత్యజులు బేహా
రాలాడం గష్టపుఁగలి
కాలంబున వర్తనములు గత్తరఁ గలయున్. 125

చ. పుడమి సమస్తవర్ణములపొత్తులు నీలువుదప్పి లంజెలై
పడిచి గడింతు రర్థములు బ్రాహ్మణ భూవర వైశ్యజాతిచే
నుడిగము గొంచు గర్వమున నుందురు శూద్రులు సత్యశౌచముల్
పొడ వడఁగున్ గలిం బరసి పోవు మహత్వము దేవకోటికిన్. 126

ఉ. ఈగతిఁ జెప్పితిన్ వసుమతీశ ! చతుర్యుగవర్తనం బగ
మ్యాగమనంబునందుఁ బరిహారము చెప్పెద నింక బ్రాహ్మణ

స్త్రీగమియింప రాజునకుఁ జెల్లదు కోమటి రాకుమారిసం
యోగము చేయరాదు కడునొప్పదు శూద్రుఁడు వైశ్యఁ బొందగన్.127

గీ. బ్రాహ్మణుఁడు నాల్గు జాతుల, రాజు మూఁడు
జాతుల, వణిగ్వరుఁడు రెండు జాతులను జ
తుర్థఁ డొకజాతి జెండ్లాడి తొయ్యలుల ర
మింపఁ దగు నట్లుగాక రమింపరాదు. 128

సీ. నాల్గుజాతులకు నీ నలువుర గాని త
క్కిన హీనజాతికామినులఁ బెండ్లి
యాడి కూడంగ భావ్యముగాదు విప్రున
కజ్ఞానమున నగమ్యాగమనము
ప్రాపించెనేని సప్రణవగాయత్రిఁ బ్రా
ణాయామశతము చేయంగ వలయు
సంకరాన్వయ వధూసంగతి పెక్కేండ్లు
నడిచె నేనియును దన్మంత్రమునన

గీ. వలయు. మున్నాళ్లు మాఱులు వరుసవాయు
ధారణముచేయ నీవాయుధారణమున
బ్రహ్మహత్యాది పాతకప్రకరమైన
దప్పు నుపపాతకంబులు చెప్పనేల. 129

కం. పరతత్త్వ మెఱింగి హరి సం
స్మరణం బేమఱక వేద జపతత్పరుఁడై
చరియించు బ్రాహ్మణుం డతి
విరుద్ధములు చేసియునుఁ బవిత్రుఁడె సుమ్మీ! 130

కం. అని మన్వాదులు విస్తర
మునఁ జెప్పిన ధర్మమర్మములు గొంచెమునన్
వినిపించిన భద్రాశ్వుఁడు
మునిపుంగవుఁ జూచి వినయమున నిట్లనియెన్. 181

గీ. దర్పితేల్వల వాతాపిదమన! మీరు
పెక్కు గాలాలు గడపిన పెద్ద లగుట!
గ్రొత్త లేమైన మీవంకఁ గొన్ని గలుగ
వలయునవి నాకుఁ జెప్పుడు తెలియ ననిన. 132

కం. నీవనిన యట్ల తప్పదు
భూవల్లభ! నా శరీరము దలంపఁ జిరం
జీవి బహు కౌతుకంబులు
గావించిన నందులో నొకటి వినిపింతున్. 133

ఉ. మున్నొక నాఁడు నే భువనముల్ చరియించుచుఁ బైఁడికొండ క్రో
ల న్నికటస్థలంబున నిలావృతవర్షము హర్షహేతువై
యున్న దదంతరంబునకు నొయ్యన పోయి సరోవరంబుఁ గం
టి న్నలినీ మరంద తటినీ పరిరంభ విడంబితాంబుధిన్. 134

శా. తత్తీరస్థ మహాకుటీరమున నత్యంతోపవాస క్రియా
యత్తుం గీకసచర్మశేషతను సంవ్యానీభవద్వల్కలున్
జిత్తేజోమయు నొక్క మౌనిఁ గని భాషింపంగ నూహించుచోఁ
జిత్తానందము సందడింప ననుఁ బిల్చెన్ శాంతవాక్యంబులన్. 135

కం. పిలిచినఁ జని కూర్చుండక
నిలిచిన నను మౌని గనుఁగొని ఘనధ్వనులన్
బిలిచిన హుంకృతి చేత న
దలిచిన ధరప్రక్కలయ్యెఁ దద్రంధ్రమునన్. 136

కం. ప్రియములపుట్టలనంగ వి
నయమణులకుఁ బెట్టెలనఁగ ననవిల్తుఁడు ది
గ్జయవేళ విరహిజనములు
భయపడఁ బట్టించుకొనెడి పడగ లనంగన్. 137

కం. చనుదెంచిరి యేగురు చం
దనగంధులు భోగయోగ్యతనులు సమీరా
శనకన్యలు కాముని మో
హనాస్త్రదేవతలలీల నాలేమలలోన్. 138

సీ. భాసమాన రవిప్రభా సమానంబైన
పెద్దరత్నపు గద్దెపెట్టె నొకతె
ధవళమరీచి కాంతపుగళంతియ వంచి
వాసితోదకములు వోసెనొకతె
కంకణంబులు మ్రోయఁ గరపల్లవంబులు
నడుగునెత్తమ్ములు గడిగె నొకతె
బంగారు చెఱఁగుల జెంగావి పావడ
నొయ్య నొయ్యన తడి యొత్తె నొకతె

గీ. దోర్లతామూలదీప్తులు దుళ్లగింప
జిలుగుఁబయ్యెదలోన గుబ్బలు నటింప
బహుళ నిజదేహ లేపన పరిమళములు
సోడుముట్టంగ నొక్కతె సురటి విసరె. 139

శా. ఓహో! విస్మయ మంచు నే మనసులో నూహింప నమ్మోని భూ
యోహుంకారము చేసినన్ సరసిలో నుబ్బెన్ మహావిస్తృత
గ్రాహం బొక్కటి, యోజనాయత సువర్ణ ద్రోణికావాహియై
సాహంకారతమంధరాద్రిధరమాయాకూర్మముం బోలుచున్. 140

కం. ఆపసిఁడి దోనెలో నవ
రూపవతులు సతులు పల్వురు సుమేరు నగేం
ద్రోపరి సానుస్థల ఖే
లాపరలగు నచ్చరలవిలాసము గెలువన్. 141

శా. దృగ్నిష్కంపతఁ జూచు నన్నుఁ గని తద్దివ్యర్షి యేతజ్జలో
న్మగ్నద్రోణిక యెక్కి వేగిరమె తానంబాడి రమ్మన్న నే
లగ్నాశ్చర్యముతోడ నెక్క మునిఁగెన్ లావూఁది నేఁద్రొక్క మున్
భుగ్నంబై చనువింధ్యశైలముగతిన్ మూర్ఛిల్లి నేనంతటన్. 142

కం. తెప్పిఱి కన్నులఱెప్పలు
విప్పిన నొకపురము దోఁచె వీధులలోఁ బే
రుప్పరిగలతోఁ గనకపు
జప్పర మాడుగులతోడ సరసులతోడన్. 143

వ. అప్పు డప్పురంబు గప్పురంబు చొప్పునం జల్లని పలుకులం బొగడం దగి గరుడపచ్చవిధంబున రతికి నెక్కి చేమంతిపూబంతికైవడిం బెక్కుదళంబుల విలసిల్లి తారకాచక్రంబు పగిది బగలు వాడముట లేక వియద్గంగ తెఱంగున మంచివారి తోడంగూడి వీణియగతిం బెక్కు సారెలం జూడ వేడుక పుట్టించి మందారంబు చందంబునఁ జక్కని కొమ్మలకు నిమ్మై తొలుకరికాలంబు లీల సకలదిక్కుల మించులు చూపుచు నడుసంద్రంబు వడువునం గడలు గానరాక రాకనెల చెలువునం దమోనిరాసంబును సకలకళావిలాసంబునుం గృష్ణా సారస ముల్లాసంబును నమర నమరపురంబు కరణి విజృంభమాణ రంభారామంబును సుధర్మాభి రామంబును సురభి విహార సమంబును ననఁగ ననంగ చాపంబు రూపంబున సదాళి గుణఘోషంబును మధురిమోన్మేషంబును సుపర్వ విశేషంబునుం దనర నరహరి సరణి హిరణ్యభవన స్తంభోద్భవప్రకాశంబును వైమల్య ప్రదేశంబునుం జిత్రావకాశంబును నగుచు నాకవైకుంఠాది నగరంబుల నగుచు నందమొంది మఱియును. 144

చ. పనివడి నిచ్చటం బరమభాగవతేంద్రులు తానమాడి పో
వునపుడు శౌరిమీఁది దరువుల్ సరసంబుగఁ బాడ సీధుపా
నవిభృత చంచరీక భరనమ్రములై తలవంచి యాలకిం
చినగతి మించు నప్పురముసీమకొలంకులలోని తామరల్. 145

గీ. విస్మయంబునఁ బాతాళవివరనిలయ
హాటకేశ్వరుఁ దప్పురి కోట పొదవు
చూడ నాతని తలచుట్టు వీడిపడియె
నదిసుమీ శేషపన్నగ మనఁగఁ బరగె. 146

ఆ. ఖంగు రనగ నాదికమఠంబు నడువీఁపు
దాఁకఁ ద్రవ్వి త్రవ్వ రాక మాని
రనుచుఁ బౌరజనము లాడుదు రింక న
ప్పురము పరిఘలోఁతు పొగడ నేల 147

ఉ. కమ్మని తేనియల్ దఱచు కాలువలై ప్రవహింప మీఁద ఝం
ఝుమ్మని మ్రోయు తుమ్మెదల జొంపము మళ్లనుసీళ్ల గట్టుచోఁ
బమ్మినవేడ్కఁ బాడు వనపాలక బాలకదంబకంబుచం
దమ్మునఁ నొప్పు నప్పురము నాలుగువంకలఁ బువ్వుదోఁటలన్. 148

శా. ఖావిద్వాపరవేళఁ దాఁ గపటగోపాలావతారంబునం
గావింపం గలధేనుపాలన మసంఖ్యాతాకృతుల్ దాల్చిర
క్షో విధ్వంసకుఁ డభ్యసించు కరణిం జూపట్టి తద్రాజధా
నీ వస్త్వస్థితి బాలకుల్ సురభులన్ మేపంగ వీక్షించితిన్. 149

మ. అలినీ ఝుంకృతి మంత్రపూర్వకముగా నాకాంతధాత్రీ సుప
ర్వులకున్ బల్లవపాణులం దొరుగు పువ్వుందేనె యన్నిటి ధా
రలు వోయున్నవమంజరీ పరిమళద్రవ్యంబు లవ్వీటఁ గ
ల్పలతల్ పౌరవధూవిలాసగరిమప్రాప్తి వ్రతాయత్తతన్. 150

కం. పురివిచ్చి మయూరము ల
ప్పురి సౌధ శిరోగృహాగ్రముల నటియించున్
బరిసర శయితవధూటీ
సురత శ్రమ మడఁగ విసరుసురటు లనంగన్. 151

కం. తమ మాటలతో సరియగు
నమృతరసమ్ము ముంచి యిత్తు రమరగ మణికుం
భములఁ బ్రపాపాలిక లని
శమము దత్పురరాజవీధిఁ జలిపందిళ్లన్. 152

వ. ఈవిధంబున నత్యద్భుతమహిమాకరం బగునప్పురంబుం గలయం దిరుగుచు ముందట బృందారక గంధర్వ సిద్ధ విద్యాధర ప్రముఖ దివ్య కన్యకానికాయ కేళీకోలాహల సంకులంబులైన కెలంకులం గలకొలంకుల లోన నొక్క సరోవరతీరంబున నే మున్నుచూచిన కుటియును జటియునుం గనంబడ విస్మయంబున డాయంబోయి సవినయంబుగాఁ బ్రణమిల్లి మహానుభావా! భానుసోమరుద్రా జమరుద్రాజాదిలోకంబులు చూచితింగాని యేలోకంబులనిట్టి క్రొత్తలు లేవు. నీ విలావృతవర్షంబున నుండి యిచ్చటికెట్లు విచ్చేసితి వనిన, నమ్మునీశ్వరుండు లేనగవు సెలవి మొలవం జలువచూపులం జూచి యీ చరాచరంబు జలరూపంబున నావరించి వరుణాభిధేయంబున మెలంగు నారాయణుండ, నీవు నన్ను సప్తజన్మంబుల నుండియు నారాధించిన ధన్యుండవు గావున దేవతలకు నగోచరంబైన యీ మదీయభవనంబు చూపితి నింక నేతద్దర్శన ఫలంబున నీకు నేకాలంబునం జేటు లేమ పొమ్మని పలుకు నవసరంబున నిద్రాముద్రితలోచనుండనై ధరాభాగంబునంబడి యించుకవడికికు మేల్కాంచి, కాంచనగిరిశిఖరంబున సప్తద్వీపకుల శైలవసుంధరా సమేతం బగునప్పురంబున మౌనిపుంగవుం జూచితి నాఁటనుండియు నచ్చిత్రకృత్యంబు మచ్చిత్తంబున నచ్చొత్తిన విధంబున నుండు మహీమండలాఖండలా! యేతద్రహస్యంబు నీకుం జెప్పితినని కుంభసంభవుండు భద్రాశ్వునకుఁ జెప్పెనని వరాహదేవుండు చెప్పిన విని ధరామధురాధర తరువాతి వృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. 153

ఉ. యుర్ఘుడితి ప్రయుక్తరిపు యూధ శిరోధి విరోధి ఖడ్గ పీ
తోర్ఘిత రక్తపూర మిళనోల్బణ విద్రుమకాంతి భృత్సర
స్వర్ఘురవర్ఘుళం ఝుళరవస్ఫుర దంగదభూష! రూపసం
పర్ఘుషకేతు సన్నిభ! సభాభవనాబ్జవనీ రవిప్రభా. 154

ప్రతిలోమానులోమ కందము :— ని రో ష్ఠ్య ము.

సారస నయనా ఘనఝఘ
నారచితరతారకలిక హరసార రసా
సార రసారహ కలికర
తారతచిర నాఘజనఘనాయన సరసా. 155

కందద్వయగర్భ భాస్కరవిలసిత వృత్తము.

పండిత కవిజన రక్షణ శౌండాభాస్కరవిలసిత సరసనవశ్రీ
ఖండ సురభి రమణీకుచ గండాగ్ర శ్రమజలకణ ఘనతరహారా
చండరాణ ఖురళి సామజ శుండాస్తంభగణదళన సులభ విహారో
ద్దండ భుజమలయజద్రుమ కాండాధార భయదభుజగదసి కఠోరా. 156

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంట నాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీవరాహపురాణం బను మహా
ప్రబంధంబునందు నవమాశ్వాసము



# వరాహ పురాణము

## దశమాశ్వాసము

—*—

 సదన ! దానమాన ధు
రా ! సద్భృశానేక సుకవిరక్షణ ! కవిర
క్షా సద్భృశకీర్తి యువతీ
ప్రాసాదిత భువన ! యీశ్వర ప్రభు నరసా ! 1

వ. అవధరింపు మవ్వరాహదేవుండు వసుంధర కిట్లనియె నట్లు కుంభ సంభవుండు విశ్వంభరు మాయావిజృంభణంబు చెప్పిన విని భద్రాశ్వుండు లోపాముద్రా మనోహర పురందరాది బృందంబు నకునైన దుర్లభుండగు నిందిరావల్లభుం డింత సులభుం డగుటకు మీరు చేసిన సువ్రత ధర్మ మర్మంబు లెఱింగింప నవధరింపు మనినఁ జనినరాజులలోన నీవు గదాగదాధరకథా సుధారస ధారా ధురీణాయమాన మానసుండవు; నీ వంటి సుజనునకు విష్ణుధర్మంబులు దెలుపుట సుక్షేత్రంబున విత్తులు నిలుపుట గావున మద్విరచిత హరి సమారాధన విధానంబు వచించెద సావధానంబుగ వినుము. 2

స్రగ్ధర. వర్షంబుల్ నూఱు వేదజ్వలన భుగ భుగ
ధ్వాన గర్జాజ్యధారా
వర్షంబుల్ మీఱ నేనధ్వరములు హరి సే
వాసమాసక్తిఁ జేయన్

హర్షోత్కర్షంబు తోడన్ హరిహయముఖనా
కౌకసుల్ తాపసుల్ ప్ర
హృర్షుల్ విచ్చేసి కోలాహలములు మఖవా
టాంతరాళంబు నిండన్. 3

కం. ఓహో! యనువారును బహు
ధాహవిరామోదములకుఁ దల లూచుచు దా
రాహా యనియెడువారలు
నై హేమమయాసనము ల నధివసియింపన్. 4

సీ. చండాంశుమండల సాహస్రదుర్నిరీ
క్షంబైన నంది దెక్కెంబు మెఱయ
మిన్ను ముట్టిన పాత్ర మినుకు నకీబుల
హుంకృతి దిగ్భిత్తు లురిలి పడఁగ
బాహాముహుర్ముహుర్భ్రమిత త్రిశూలంబు
మెఱుఁగు చూపఱ మిఱుమిట్లు గొలుప
దర్పిత త్రైపుర దైతేయ కోలాహ
లా! యని వీరకాహళము మెఱయ

గీ. సరయథా వత్ప్రమథ చమూసంచయముల
రవలి కుప్పొంగు తొడుకు సామ్రాణిఁ జిఱు దు
వాళి నెక్కుచు రుద్రుండు వచ్చి తనకు
మ్రొకు దివిజులఁ గూర్చుండ ముదల వెట్టి. 5

సర్కుటము. రహిగల రుద్రకన్యకల రాగములన్ వినుచున్
సహసితలీల భృంగిరిట నాట్యములం గనుచున్
ద్రుహిణ కపాలపాలికలు గ్రుచ్చిన గద్దియపై
మహిమ సుపర్వకోటి నడుమన్ గొలువై నిలువన్. 6

కం. త్రిసరేణు సమాన విమా
న సమారూఢుఁ డయి వచ్చి నగధన్వికి మ్రొ
క్కి సనత్కుమారుఁ డజు మా
నసపుత్రుఁడు నిలిచె నపుడునా మదిలోనిన్.

శా. మాహాత్మ్యంబులు తేజముల్ విభవ సంపత్తుల్ విమర్శింపఁగా
నోహో ! భేదము లేదు నిండుసభలో నొక్కింతమాత్రంబు హే
మాహేమీలు ఘటాఘటీ లతిరథుల్ మాంధాళు లీసాము లే
లా హీనాధికభావముల్ తడవ రాదంచున్ వితాకుండనై. 8

కం. రుద్రుండు భక్తలోకమ
రుద్రుం డీయర్థమునకుఁ బ్రోఁగేర్పఱుపన్
భద్రంబగు నా కనుచున్
దద్రాజకళా శిరోవతంసము తోడన్. 9

మత్తకోకిల. ఉగ్ర శంకర భక్తవత్సల సోమ యీమఖసీమలో
నగ్ర పూజ లొనర్తు నెవ్వని కానతిమ్మని పల్కె సా
నుగ్రహంబున నాసుమేరు ధనుర్ధరుండు సమస్త దే
వాగ్రగణ్యులు వింట మా కిడినట్లు నిల్వ ననున్ ననున్. 10

సీ. ఈ చరాచర మెల్ల నేదేవదేవుని
వలన మాటికిఁ బుట్టు నిలుచు నడఁగు
తెలిసి యే దేవు నుద్దేశించి పెద్దలు
గావింతురు మహామఖంబు లెపుడు
నే దేవు పాదనఖేందు చంద్రిక సుమ
స్తబకంబు శ్రుతివధూ కబరి కలకు
నద్వంద్వుఁ డయ్యెలీలార్థంబుఁ గాఁగ నే
దేవుండు దాల్చె మూర్తిత్రయంబు

గీ. సత్త్వరజములతోఁ గూడి సృష్టయై ర
జస్తమంబులఁ గూడి మత్సంజ్ఞుఁడై వి
శుద్ధ సత్త్వ సమృద్ధి విష్ణుఁ డయి నుతులు
గాంచు నే దేవుఁ డతనిఁ బూజించు మునుపు. 11

వ. కుంభసంభవా! మఱియు నొక్కరహస్యంబు వినుము సకలయజ్ఞఫల ప్రదానపరాయణు నారాయణుం గృతయుగంబువారు శుద్ధ సూక్ష్మ స్వరూపుఁడని భావింతురు. త్రేతాయుగంబువారు యజ్ఞమూర్తి యని యజింపుదురు. ద్వాపరంబువారు పాంచరాత్రమతంబున భజియింపుదురు. కలియుగంబువారు మత్కృత శాస్త్రమార్గంబులం గొలుతురు. పరం జ్యోతియగు జనార్దనునకు నాకు నాకుశేశయాసనునకు భేదం బాపాదించు నసత్యవాదులు పాపలతలకుం బాదులగుచు నరకంబునకుం బోదురు. వైదికంబుగాని భేదవాదంబు కలియుగంబునం బ్రబలంబగు దత్తెఱం గెఱిగించెద. మున్ను భూలోకవాసులు వేదోక్త యజ్ఞాది కృత్యంబుల వాసుదేవు నుపాసించిన ఫలంబున భువర్లోకంబునకుం జనుదురు. తల్లో కంబునం గేశవు భజించి స్వర్లోకంబునకుం జని క్రమక్రమంబున ముక్తు లగుదురు. 12

గీ. ఇవ్విధంబున నిశ్శంక నేసరేఁగి
యెల్లవారలు మోక్షంబు కొల్లగొనఁగ
జూడఁజాలక యింద్రాది సురలఁగూడి
కదలి వైకుంఠపతి సమ్ముఖమున కరిగి. 13

కం. ధరఁజాగిలి మ్రొక్కిన నా
హరి కరుణా పూరితేక్షణాంతంబుల ని
ర్జరవరులం గని యిచ్చటి
కరుదెంచితి రేటికన బృహస్పతి పలికెన్. 14

సీ. అనిశంబు వీఁడు వాఁడనక యెక్కఁగ వేల్పు
టేనుఁగునకు వీఁపు గూనువోయె

వరుసలువెట్టి దువాళింప సుడివడి
వెలిమావు మోపదు వెనుకకాలు
విడువని వేలంబు నుడిగంబులు గొనంగ
నిచ్చలు నిద్ర లే దచ్చరలకు
దుండగంబునఁ బూలు గుంటాడ వికలిత
వృత్తిఁ గల్పకవాటి వీఁటిబోయె

గీ. స్వామి గురియించి పెక్కు యజ్ఞములు సలిపి
భూమిప్రజలెల్ల నింద్రులై పోతరమున
గొడ్డిదము లిట్లు చేయంగ నడ్డపెట్ట
రాక బహునాయకం బయ్యె నాకపురము. 15

సీ. శ్రీ వైష్ణవుల పాదరేణువు తనువుపై
నొకయింత పడిన ధన్యుండు వీఁడు
పరమభాగవతులు పురుషసూక్తము చెప్ప
నొకమాట వినిన పుణ్యుండు వీఁడు
తులసీ వనీవాసనలు పయిగాలి రా
నొకనాఁడు చనిన సభ్యుండు వీఁడు
హరి తిరుమాళిగ గరుడధ్వజాంచలం
బొకకొంత గన్నపుణ్యుండు వీఁడు

గీ. వీరిఁదడవుట యెట్లని క్రూరవృత్తి
యముని దూతల నీబంట్లు సమయమోఁది
భూజనుల నెల్లఁ గైవల్యమునకు ననుప
నిర్జనంబయ్యె సంయమనీపురంబు. 16

కం. దేవా! క్రమ క్రమంబున
బావనులై సృష్టిఁ గలుగు ప్రజలీకరణిం
కైవల్యంబున కేగెడు
హావళిచే మాకు నడవ వధికారంబుల్. 17

శా. ఏలా వేయును విన్నవింపఁగఁ ద్రిలోకేశామహేంద్రాది ది
క్పాలైశ్వర్యము వెచ్చపెట్టుకొను మింకన్ సృష్టి నష్టం బగున్
వాలాయంబుగన నుంచు గీష్పతి సుపర్వశ్రేణి విజ్ఞాపనల్
పోలం జెప్పిన నాలకించి ధవళాంభోరాశిపర్యంకుఁడున్. 18

సీ. నను సంస్మరింప వచ్చినఁ జూచి నాతోడ
దివిజుల మనవులు దెలియఁ జెప్పి
త్రిపురసంహార ! యుగత్రితయంబున కాని
నాలవయుగమున నాదు భక్తి
తఱచు లేకుండఁగఁ దగిన మోహంబు పు
ట్టించెద నీవు గల్పించు తదను
కూల శాస్త్రంబులు గొన్ని స్వల్ప ప్రయా
సంబున నధికఫలంబు గలుగు

గీ. నంచు భ్రమయించు నట్లుగా ననిన నేను
బాశుపత నయసిద్ధాంత బౌద్ధ జైన
ముఖ్యమతములు చెప్పితి మునివతంస
నాఁడు మొదలుగ భూమిజనంబు లెల్ల. 19

కం. ఈశ్వర కథితము లనియు న
నశ్వర వేదానువర్తనములనియు వృథా
విశ్వాస విమోహితులై
శశ్వత్కర్మములు మిగుల జరుపరు సుమ్మీ. 20

వ. ఏఁగల్పించిన మతంబులలోపలం బాశుపతంబు వేద సమ్మతంబు గావున సకలలోకసమ్మతంబు వేదం బన మత్స్వరూపంబు తద్వేదబాహ్యులు నన్నెఱుంగలేరు. నాకు విష్ణువునకు బ్రహ్మకు భేదంబులేదు. మేము మువ్వురమును గుణత్రయంబును వేదత్రయంబును వహ్నిత్రయంబును లోకత్రయంబును శక్తిత్రయంబును సంధ్యాత్రయంబును వర్ణత్రయంబును

మొదలఁగాఁ ద్రిధాబంధం బగు సచరాచరంబు రూపున వర్తింపుదుము గౌణ ముఖ్యపక్షంబుల మమ్ము నొక్కటిగా నెఱింగి సోహంభావంబున భజించు సుజనుండు విష్ణుభక్తుండు ముక్తుండు ననం బరగునని యేతద్రహస్యం బాన తిచ్చిన రుద్రునకుఁ బ్రాచీన బర్హిర్ముఖ బహిర్ముఖులును సనత్కుమారాది యోగీంద్రులును మఱియునుం దక్కిన సభాసదులును నేనునుం బ్రణమిల్లి మధుమథన మథితమధురజలధి సముల్లోల హల్లీసక నిభార్భటి నిర్భరఫణితి సందర్భంబునం బ్రశంసించు నవసరంబున. 21

వనమయూరము ఓంకృతి మహోవనమయూర మగు నాయే
ణాంకధరుమేనఁ జతురాననుఁడు నుద్య
త్పంకజ హితాయుత సబాంధవరుచుల్ న
ల్వంక వెదచల్లుకమలావిభుఁడు దోఁపన్. 22

శా. ఆ మాహాత్మ్యముఁ జూచి యాజకఋషుల్ సాశ్చర్యులై ఋగ్యజు
స్సామంబుల్ పఠియింపుచున్ జయజ మోచ్చైర్నాదముల్ రోదసీ
సీమం బంతయు నిండఁగాఁ బొగడి, యోశ్రీమన్మహాదేవ ! నీ
నీమూర్తిత్రితయంబు దాల్చిన విధం బేలా నెఱింగింపుమా ! 23

గీ. అనిన వారలఁ జూచి యీ యజ్ఞవేళ
మీరు నాకిచ్చిన హవిస్సు మేము మువ్వు
రమును బంచి పరిగ్రహింతుము మునీంద్రు
లార ! మాయైక్యమిది మొదల్గా నెఱుఁగుఁడు. 24

గీ. అనిన వారు గృతార్థులమైతి మనుచు
మ్రొక్క దేవర చేసిన మోహశాస్త్ర
ముల నిమిత్తంబునుఁ బ్రవర్తకులను తెస్స
తెలియనానతి యిమ్మనఁ బలికె శివుఁడు. 25

సీ. మున్ను భారతవర్షమున దండకావన
వాటి గౌతమఋషివర్యుఁ డబ్జ
సంభవుఁ గూర్చి నిష్ఠాపరత్వంబున
బహుకాల ముగ్రతపంబు సలిపి
ప్రత్యక్షమైన తద్బ్రహ్మచే వి త్తిన
సస్యంబు లన్నియు జాములోన
పరిపాకమును బొంద వరము గైకొని వచ్చి
శతశృంగగిరి బర్ణశాలఁ గట్టు
కొని సమర్పించు గోటులకొలఁది మీఱ
వచ్చు నతిథులకెల్ల నవ్వారిగాఁగ
షడ్రసాన్నంబు వరలబ్ధ సస్యవృద్ధి
కలిమి నంతట నొకకొంత కాలమునకు 26

కం. రోషముతో నిజమహిమో
న్మేషము చూపంగవలసి మీనంబునకున్
బూషాత్మజుండు వచ్చిన
దోషంబునఁ జేసి కఱవు దోడనె రాఁగన్. 27

లయవిభూతి. విసరెఁ బెనుగాడుపులు మసలె జలదాగమము
పసిమిచెడె సస్యములు కసవు దిన లేమిం
బసరములు వట్టె నదు లిసుకలునుఁ జిప్పలును
మిసమిసమనన్ విగతరసగరిమి నింకెన్
వసుమతి పడం దివిసెఁ గుసుమఫలపత్రముల
పస దఱిగె భూరుహము లుసు రుడిగెఁ బ్రాణి
ప్రసరములు నొండొకటి మెసఁగఁ దొడఁగె గఱవు
గసిమసఁగె విశ్వమున వెస లయవిభాతిన్. 28

సీ. మిగుల భీకరవృత్తి మిన్నుముట్టిన ధూమ
కేతువె బిరుదుటెక్కెంబుగాఁగ
నోరంతప్రొద్దును హోరని విసరుచుఁ
గెరలు కరువలి నకీబుగాఁగ
చెట్టుచేమలు గారుచిచ్చునఁ గమరిన
పన్నని గిరులె యేనుఁగులుగాఁగ
నిప్పులుగ్రక్కుచు నెప్పుడుగాయు ని
బ్బరపుటెండలె ప్రతాపంబుగాఁగ
గీ. అనశనప్రాప్తి మృతమనుష్య ప్రతాన
మాంసభక్షణ దృప్తగోమాయు కాక
ఘూకబహు జంతువులు బంట్లగుంపుగాఁగ
రాజసంబున దుర్భిక్షరాజు మెఱసె. 29

కం. భూకాంత నీరువట్టుకుఁ
గాక వదన మిలుకరింపఁ గాన్పించిన పం
డ్లో కాకన వెలిపుచ్చలు
లోకములోఁ గాచె నిట్లు లోఁబడె జనముల్. 30

ఉ. అప్పుడు దేవదారు విపినాంతరసీమ వసించుసంయముల్
విప్పగుభూమి నన్నము ఫలింపక చెట్టులు నెండిపోయె వా
తప్పినఁ బోవుఁబ్రాణములు తప్పదు రండని మున్ను గౌతముం
జెప్పఁగ విన్నవారగుటఁ జేరిరి తచ్ఛతశృంగ శైలమున్. 31

కం. ఈ గతి వచ్చిన మునులకు
నాగౌతముఁ డెదురునడచి సాష్టాంగముగాఁ
జాగిలి మ్రొక్కుచు నేఁడు గ
దా గణనకు నెక్కె మత్ప్రయానం బనుచున్. 32

సీ. సంతసించుచు నిజాశ్రమమున విడియించు
కొనివారికెల్లను దినదినము న
హల్యప్రాణేశుఁ డహల్య శాల్యన్నంబు
వలసిన వారికి వలసినంత
ఘృత సూప ఫల దధి క్షీరయుక్తంబుగాఁ
దలఁచినప్పుడె పెట్టె దారునిత్య
మును భుజాభోజనంబులు చేసి చట్టుల
కరణి నందఱు ముచ్చెమురియ బలిసి

గీ. నెమ్మది సుఖింప వెడలెఁ బంద్రెండువత్స
రములు కఱవునుం దీఱె వర్షములు గురిసెఁ
జల్లఁబడె నేల సకలసస్యములుఁ బండెఁ
బుడమిధాన్యంబు పోకకుఁ బుట్టెఁమెమ్మి. 33

కం. అప్పుడు తపసులు దమలో
డెప్పరమా తీరె నేమిటికినిఁక నిచటన్
గుప్పలుపడి నిలువఁగ రం
డెప్పటి తావులనె పోద మిందఱు మనుచున్. 34

కం. గుంపులు గూడుకొని విచా
రింపఁగ శాండిల్యుఁ డది యెఱిఁగి గౌతముచే
నంపించు కొనక పోవఁ ద
లంపుట ఖావ్యంబె పెద్దలారా ! మీకున్. 35

కం. విపరీతపుఁగఱవున నే
యుపద్రవము నొందకుండ నోమినమునికిం
గపటింతురె "సపితాయ
స్తు పోషక "యటన్నమాట చూడఁగ వలదా ! 36

మ. అన బాభ్రవ్యుఁడు నిట్ల తప్పదన, నాహా కూటిమాత్రంబునన్
మన మే మమ్మొడు పోతిమో యితనికిం బాపంబు గాదంచు దు
ర్జన వృత్తిం జనువారలై మునులు నిస్రాణంపు గోవున్ సృజిం
చి నియోగించిరి గౌతమాప్తకలమ క్షేత్రంబు భక్షింపఁగన్. 37

తరళ. అరిగి తత్కపటంపు ధేనువు నల్లనల్లన మళ్లలోఁ
దిరుగుచున్ వడిగాలి గొట్టినఁ ద్రెళ్లుచున్ మరి లేచుచున్
దరళయై వరి యెల్లఁ జెల్లఁగఁ దక్షణంబున మేయఁగాఁ
బరమశాంతుఁడు గౌతముండును బాఱఁజూచి మనంబునన్. 38

శా. ధేనుగ్రాసము మాన్ప దోసమని సందేహించినన్ సస్య మెం
తే నష్టంబగు నైననేమి మఱియున్ విత్తంగ యామంబు లో
నౌ నన్నన్ మునులెల్ల మిక్కిలియు నేఁడాఁ కొందు రీధేనువుల్
దానో మానము దప్ప మేసినది యింతం దోలెదన్ మెల్పునన్. 39

కం. అని నిశ్చయించి హస్తం
బున జలములు పూని తల్లి పొమ్మని ప్రోక్షిం
చిన మాయగోవు పడుచుం
గనుగ్రుడ్లం దిరుగవేసి కాలము చేసెన్. 40

సీ. అపుడు బ్రాహ్మణులెల్ల నన్యాయ మన్యాయ
మనుచుఁ బేరెలుఁగున నార్చువారు
గోహత్య సిద్ధించె నోహో యితని యింటఁ
గుడువఁగా రాదని గొణుగువారు
నీ మహాపాతకి నేల చూచితిరి సూ
ర్యవిలోకనము చేయుఁ డనెడివారు
పిడికెడు పూరికై బెడిదంపు సాహసం
బెట్టు చేసితివని తిట్టువారు

గీ. నై డిసంతులు గొట్టుచు నమ్మునీంద్రు
గువ్వ కరిగొని కడువెత కుడువ( బఱచి
బట్ట గట్టితనంబున నట్టె గట్టి
గదల వారికిఁ బ్రణమిల్లి గౌతముండు. 41

మ. అకటా ! ధేనువు మీఁదఁ జేయిడితినో సామర్షవాక్యంబులన్
బెకలం దోలితినో బుభుక్షకుఁ దగన్ మేయంగ నీనైతినో
ప్రకటంబైన మదీయ పూర్వకృత పాపంబెట్టిదో కాక మి
న్నక గోహత్యకుఁ బాత్రమైతి ననుచున్ బాష్పాంబువుల్గాఱగన్. 42

కం. దైవికమున నొకనేరమి
గావించిన నిట్లు విడువఁగాఁ దగవౌనే
సేవకుని నన్ను మునులా
రా ! వలదా ! యింత కనికరంబైన మదిన్. 43

శా. ప్రాయశ్చిత్తము పంపుఁ డిందు కనినన్ బాభ్రవ్య శాండిల్యు ల
య్యో ! యీ సాధున కెట్టుగాఁ దగిలె నత్యుగ్రంపు గోహత్య కా
సీ ! యింకం బదివేలు నేమిటికి ? మౌనీ ! దీనిపై జాహ్నవీ
తోయంబుల్ ప్రవహింపఁ జేయు బ్రదుకున్ దోసంబు దీఱున్ దుదిన్. 44

సీ. మాకుఁ జూడంగ సొమ్మసిలి పడ్డదిగాని
తెగటారఁ జచ్చుట తెలియరాదు
కావున నీ పాతకం బసివోవు జా
హ్నవిఁ దెచ్చుటకు బ్రయత్నంబు నీవు
చేయు మేమును నింకఁబోయి వచ్చెదము కో
పించకుమం చూఱడించి మునులు
దేవదారుద్రుమవనీవాటి కరిగిరి
గౌతముండును శీతకర కిరీటు

గీ. ఘోర తపమున మెప్పించి కొంచువత్తు
గంగ నాకిది యెంతదుష్కర మటంచు
మగువ యుమ దాను శతశృంగ నగము డిగ్గి
కదలి చనుదెంచెఁ జనుదెంచి యెదుటఁ గనియె. 45

కం. అక్షుద్రపాతకానిల
భక్షణ పన్నగము బహుల బలభిన్నగమున్
వీక్షిణోన్నతి ధవళిమ
ఋక్షగణాసన్నగమును హిమవన్నగమున్. 46

కం. కని మనమునఁ గోరి కని
క్కని తాంతానంద వార్ధి గరుసెక్కఁగఁ జ
క్కని సతి నాశిఖరికి మ్రొ
క్కనియోగించుచును మ్రొక్కి కౌతూహలియై. 47

సీ. ధారుణీగవికి రత్నమహౌషధంబులు
చేపు పుట్టించిన క్రేఁపుఁ గుఱ్ఱ
కలకంఠునకుఁ గాళ్లు గడిగి గౌరీ కన్య
ధారవోసిన మహాదానపరుఁడు
మౌనికోటికి నెల్ల మన్నింపఁ దగిన మే
నా మానినికిఁ బ్రాణనాయకుండు
తనకూఁతుసవతి మందాకినీనదికి నా
ధారమై నిలిచిన తగవులాఁడు

గీ. సురధరిత్రీధరమునకు జోడుకోడె
వనధిసఖమైన మైనాకమునకుఁ దండ్రి
కాంత కన్నులవండువు గాఁగఁ జూడు
మంచు నమ్మంచుగొండ వర్ణించి మఱియు. 48

కం. ఈ మిహికాచలవరుఁడు గు
హాముఖసంచారి మారుతారావములన్
దా మించు నెపుడు ప్రాణా
యామంబును జేయుచున్న హఠయోగివలెన్. 49

గీ ఇందు విహరించు విద్యాధరేందుముఖుల
చరణ లాక్షాంకములతోడి చదుము లమరు
హరుని కృపఁ గలిసిన యోగివరులు ముక్తి
సతులు గ్రీడించు పల్లవశయ్య లనఁగ. 50

మ. తనదండం దప మాచరించి పురభిత్సారూప్యముం బొంది భ
క్తనికాయంబున కియ్యఁదాచిన సుధాధామార్థజాలంబు లా
గున నీశైలవిభుండు దాల్చు నెపుడుం గ్రొమ్మంచుపై నిండఁ బ
ట్టినఁ జూపట్టెడు శాక్వరేంద్ర ఖురకోటీ వక్త్రి చిహ్నంబులన్. 51

వ. అనుచు ననేకవిధంబుల నిజమనోరథ సాఫల్య సదానుకూల్యకు నహ
ల్యకు నాహిమవన్నగంబు మహిమ చెప్పుచు వచ్చి తన్నగ ప్రదేశం
బున నొక్కచోట సౌధాంధస ధేనుయూథపృథూదస్వైర నిస్రుత
దుగ్ధసమిద్ధ సిద్ధరసధారా ధునీతీర పారిజాత వనాంతర చింతామణి
స్థలంబున నేకపాదస్థుండై నిష్ఠాపరత్వంబున నిలిచి హుతాశన లోచ
నంబును లేలిహానహారంబును నీహారకర కిరీటంబునుంగల నన్ను
హృదయంబున నిలిపి శీతవాతాతపంబులకు జడియక నిలింపులు
చలింపనతిఘోరతపంబు చేయు నవసరంబున. 52

చ. కరినివహంబు రాచుకొనఁగా జలియింపదు బొద్దుబంటిగాఁ
బెరిగినపుట్టలో వెడలు భీకరభోగికులంబు ప్రాఁకఁగా
గురగుర గాదు గడ్డమున గూఁడులుపెట్టిన పక్షికోటి పెన్
మొరపమెఱుంగ దెట్లు మునిముఖ్యుని యా తనువంచుఁదాపసుల్. 53

సీ. బంధత్రయంబున బవనంబు మధ్యమ
నాళిమార్గమునకు నూలుకొలిపి
గంటు లాఉుఁ బగుల్పఁ గడు హెచ్చు వహ్నిచే
మీఁదికుండలికన్య మేలు కొలిపి
పరమచిదాకాశ భాగేందు మండల
స్రవదమృతరసంబు జాలుకొలిపి
నిరవధి కానందభరితమైన తలంపు
ఫాలలోచను మీఁదఁ గీలుకొలిపి

గీ. తమ్ము నేలిన మనసు లయమ్ము నొందు
టయును నతిభక్తియుక్తి నింద్రియగణంబు
సహజకృత్యంబు లుడుగ నిశ్చలసమాధి
విడువఁ డాహా ! యితఁ డనుచు వెఱఁగు తడిరి. 54

కం. ఈ రీతి నిఖిల విస్మయ
కారణమగు నుగ్రతపము గావించె నహ
ల్యారమణుఁడు నుతేఁడుల
పారకరుణ నంత నేను బ్రత్యక్షంబై. 55

నమశ్శివాయ పంచాక్షరీ సీసము.

యమ నియమాయామ శమనివేశన మనో
మౌనివశ్యాయ ! నమశ్శివాయ !
యానాయమాన నానా యన నవనవా
మ్నాయమమ యాయ ! నమశ్శివాయ !
వనయోని యామినీ వామేశ శశ్యంశు
మన్నయనాయ ! నమశ్శివాయ !
వ్యోమానుయాయి మా యామానవాశన
మాననాశాయ ! నమశ్శివాయ !

గీ. యని వినయమున ముని యనయమును విశ్వ
మను వనమ్మన నెమ్మినై నున్ననన్న
నెమ్మనమ్మన నమ్మిన నెమ్మినేను
నోము నీశాన ! యిమ్మన్నదేమి ! యనిన. 56

ఉ. నాకినికాయ వందిత ! పినాకి ! నిరంతభవజ్జటాటవీ
కేకిని మజ్జనోద్యమన కృజ్జనపాల ఫలాశనక్రియా
ధాకిని వారిబిందునిబిడత్సదనీకిని నాకునిమ్ము మం
దాకిని నంచు నమ్మని పునఃప్రణతుల్ ఘటియించ నిల్చినన్. 57

గీ. ఏను నొక్క జటాఖండ మిచ్చి వత్స !
యిందు నిందుకళామృతం బిందుకొన్న
తద్వియన్నది యున్నది తడయకిపుడు
పొమ్ము నీవన్న నమ్మునిపుంగవుండు. 58

మ. నను భావించుచు నప్పటప్పటికి నానందాశ్రువుల్ గాఱఁగాఁ
దనలోఁ జొక్కుచు నేగి దంభగవి మీఁదన్ దజ్జటాఖండ మొ
య్యనఁ బిండన్ విమలాంబువుల్వెడలె సంధ్యారాగ సంలిప్తనూ
తన శీతాంశు కళావినిర్గత సుధాధారాను కారాకృతిన్. 59

కం. ఆ నీరు సోఁకి మాయా !
ధేనువు తా నిద్రవోయి తెలిసిన పగిదిన్
మేను విదిలించు కొంచును
మోనులు వెఱగంది చూడ మగువ యగు తరిన్. 60

కం. ఉదకము చేతనె కపటపు
మొదవు మడిసె మొదల నుదకములచేన తుదిన్
బ్రదికె నుదకంబు ధరలో
నదిగాగ విషామృతాహ్వయంబులు దాల్చెన్. 61

వ. అని జగజ్జనంబులు పలుక నజ్జటాఖండ నిర్గత వారిపూరంబులు క్రమ క్రమంబునమహావాహినియై నిజావగాహంబు సలుపు దేహి సందోహంబుల పాపపంకంబు లిట్లు కడుగుదునన్నట్లు శతశృంగనగసంగత శిలాపంకం బులు గరంచుచు, స్వసమీపవాసుల మోహపాశంబు లిట్లు పెఱికి పేటాడుదు నను పగిది నిరుదరుల పొదలం బొదలిన వల్లికలం బెల్లగించుచుఁ, దనవారి గ్రోలినవారి జఠరగోళంబులం గల సకలరోగంబు లిట్లనుడి పఱతునను చందంబునం గందరాంతరంబులుచొచ్చి సింహశరభ శార్దూలాదిమృగంబుల నుడి వఱచుచుఁ దన్ను దర్శించు ధర్మపరుల కర్మంబు లిట్లు నిర్మూలంబు గావింతు నను భావంబున సమున్నతద్రు మంబులు వేళ్లతోన కూలంద్రోచుచు మీరుగదా నిజరమణ పారావార బంధన కారణంబులను వైరంబు దలంచి భేదించువిధంబున ధరణీ ధరంబులు దెగం బారుచుఁ దన్ను విస్మయంబునం గొనియాడు వైమా నికుల కోలాహలంబు లాలకించు వడువున నిట్టులుపొడుచుచు నేనదులుం దనకు సరిరావని నవ్వునురవున నురుగులు చూపుచు నానావర్తంబుల వడింబడి పరిభ్రమించు నుత్తుంగ కుడుంగంబులు శరనిధిం దిరుగు మందరంబు నందంబు వహింప నొక్కొక్కపట్టునం దొట్టిన తెట్టువలు విలయసలిలమధ్యంబునందేలు సముద్దండ ఘట్టితమధుకైటభ నిశాట మస్తక మస్తిష్కపరంపర ననుకరింప నతిరయంబున ననేకదేశంబులు గడచి జడవిభ్రమాలాపయు గలిత కంకణహంస కాదావయు మనోహర పులకాంకురయు వికీర్ణవేణియు విలులిత మకరికయు సమున్నతోత్క లికయునై సరిద్రమణ సంగమోత్సవంబు గైకొనియె నప్పుడు. 62

మ. అరరే! బాపురే! చాగురే! బళిరే! మేలాహా! మఝా! యంచు నం
బరమార్గంబునఁ జేరువ న్నిలిచి సప్తర్షుల్ విమానాంతరాం
తరడోలాయిత ఘంటికా ఘణఘణ ధ్వానార్భటీబంధ బం
ధుర వాగ్గుంఛ విడంబితాంబర ధునీదుర్వారగర్వోద్యమ్మలై. 63

మ. కలకాలంబును నన్నదాన మొసఁగం గాంక్షించి యామంబు లో
పలనే సస్యము విత్తి పండని తపఃప్రాధాన్యమే ధాన్య మి

ట్టల వోవం జదలేటి నీరు మృత మాయాధేనుపై దేని వా
ర లదే జీవన మంచుఁ దన్ను ఫణితి ప్రౌఢిం బ్రశంసింపఁగన్. 64

సీ. విని గౌతముండును వీరు మాయాధేను
వనిన కారణ మేటి దనుచు యోగ
దృష్టి విచారించి దేవదారు వనాం త
రాగత మునుల ధౌర్త్యంబు నిశ్చ
యించి చాకుండ రక్షించిన మఱవకుం
డంగ బొమ్మలఁబెట్టు భంగిఁ దమ్ముఁ
గఱవు కాలంబునఁ గాచిన నన్నెట్లు
గా నిట్టి గోహత్యగానిఁ జేసి

గీ. రనుచుఁ గటమర లదరంగ సౌడు గఱచి
బొమలు ముడివడ లోచనాంతములు జేగు
రింపఁ గోపంబు చెమట వర్షింప హస్త
మున వియద్గంగ సలిలంబు పుడిసిలించి. 65

మ. కలకాలంబుఁ గృతఘ్నులై కపటులై కైవల్యదూరాత్ములై
మలినీభూతమనస్కులై సుకృతకర్మభ్రష్టులై కష్టులై
తల లింగంబులు మేనబూడిదలు గంతల్ బొంతలు దాల్చి శా
స్త్రిల వేదజ్ఞుల సర్వదైవతములన్ దూషించు పాషండులై. 66

కం. పోవుదురుగాక ! దారువ
నీవాచంయము లటంచు నిష్ఠురతరవా
చావైఖరిని శపింపం
గా వైమానికులు మునులు గౌతము తోడన్. 67

కం. భట్టారక ! తన్మునులకు
నట్టే కావలెఁ గృతఘ్నులై యీ కరణిన్
వట్టి పెనురట్టు నీకుం
గట్టిన కట్టిడుల కైనఁ గారుణ్యమునన్. 68

వ. అస్మదీయ ప్రార్థనం బంగీకరించి, భీషణ భవదమోఘ రోషభాషణ ఫలంబుకలియుగంబున ననుభవించునట్లుగా వారలననుగ్రహింపుము, నీవు దెచ్చినది గావున నిమ్మహానది గౌతమీ నామంబును, వరదానంబున వచ్చి గోవుమీఁదఁ బ్రవహించుటం జేసి గోదావరీ నామంబును బూని, రంగత్తరంగ కోలాహల మిషంబున నీ కీర్తి ఘోషించుచు భువన పావనియై వర్తించుచునుండు, మహానుభావా మేము పోయి వచ్చెదమని, గౌతముని వీడ్కొని కైలాసంబునకు వచ్చి నాకు నుమాసమేతునకు మ్రొక్కి దేవా ! మా వంశంబువారలైన దేవదారువనతాపసులు గౌతముని శాపంబు కతంబునం గలియుగంబునఁ బాషండులు కాగలరు వారలకు నాధారంబుగా నొక్క శాస్త్రంబు గల్పింప నవధరింపు మన లక్ష గ్రంథ పరిమితంబును వేదసమ్మతంబునగు విశ్వాససంహిత గల్పించితి నేతదాధారంబునం గొందఱు దాంభికులు ధనలోభంబున లోకవంచకులై తారు వేరు వేరమతంబులు గల్పింపుదు రవివివేద బహిష్కృతంబులు మద్విరచిత విశ్వాస సంహితాను సరణ ప్రసక్తులు భక్తియుక్తులు నగు వారు ముక్తియుక్తులగుదురుగాని యితర మతావలంబనంబున మేమె రుద్రస్వరూపుల మనుకొను బైలాలికులకు ముక్తిలేదు తద్బైలాలిక ప్రకాదంబు వినుండు. 69

సీ. తొల్లి బృందారకద్రోహిసంహరణార్థ
మే మహాభైరవాకృతి వహించి
బెట్టుగా రణములో నట్టహాసము చేయ
దొరిఁగె నుచ్ఛిష్టబిందువులు నాము
ఖమునఁ దద్బిందు సంఘమున సురాసవ
ప్రియులు రుద్రులు పుట్టిన శతకోటి
సంఖ్యాకులే తదర్చకులు బైలాళిక
సంజ్ఞతో గౌతమ శాపదగ్ధ

గీ. మునులు కలికాలమునఁ బుట్టి మోహ శాప
బద్ధులయ్యెద రందుఁ బాత్రభవ్యశాండి

లాదు లల్పాగసులు గాన వేద మార్గ
పాశుపతదీక్షచే ముక్తి వడయగలరు. 70

కం. అనిచెప్పిన సప్తర్షులు
చనిరి నిజావాసములకు సంతోషమునన్
వినిపించితిఁ గుంభజముఖ
మునులకు ఘనమోహశాస్త్రముల గతిఁ దెలియన్ 71

మ. ధరణీనాయక ! యిట్లు మౌని పరిషద్వంద్యుండు రుద్రుండు సా
దర వాక్యంబుల నానతిచ్చుటయు నే తద్దివ్య దివ్యాంఘ్రి వా
రిరుహద్వంద్వ వినమ్రమస్తకుఁడనై మృత్యుంజయా ! మీరు ము
గ్గురు నేయే పనివేళఁ గర్త లది నాకుం జెప్పు మన్నం గృపన్. 72

కం. పరతత్వంబ విష్ణుడు
హరి యనఁగా హరుఁ డనంగ నజుఁ డనఁగఁ జరా
చరామేలు ననెదు వేదాం
తరహస్యం బెఱుఁగలేరు నరు లజ్ఞానుల్. 73

సీ. నిత్యుఁ డావిష్ణుఁ డాదిత్యుఁడై పదిపత్రా
రంబుల దేవకార్యంబు దీర్చు
యోగ మహైశ్వర్యయుక్తి నాతఁడు ప్రతి
ద్వాపరంబున మానవత వహించి
లోకోపకారార్థమై కొల్చినా చేత
వరములు వడయు నవ్వనజనాభుఁ
గృతయుగంబున నేను నుతియింతుఁ జతురాస్యుఁ
డెప్పుడు నను భజియించుచుండు

గీ. స్రష్ట నుతియించు శివనై సృష్టివేళ
నతఁడు మొదలైన సుర లెల్లఁ గృతయుగమున
లింగతనుఁడైన నన్నుఁ గొల్చి పడయుదురు
పరమశివయోగ సౌఖ్య సంపత్సమృద్ధి. 74

కం. వనజాసనాండకోటుల్ !
తనురుహరంధ్రంబులంగల సహస్ర శిర
స్కునిఁగా నారాయణుదే
వుని భావింతురు ముముక్షువులు చిత్తమునన్. 75

గీ. వేదమార్గ రహస్యైక వేత్తలైన
భూనిలింపోత్తములు యజింపుదురు బ్రహ్మ
యజ్ఞమున బ్రహ్మనెప్పుడు నట్టి బ్రహ్మ
నాఁగ వేదంబునుమ్మ వింధ్యప్రమథన. 76

గీ. వినుము శివుఁడనఁగా విష్ణుఁడనఁగ శంక
రుండనఁగ నాదినారాయణుం డనంగఁ
బూరుషోత్తముఁడన విశ్వపూర్ణమహిమఁ
బ్రస్తుతింపఁగఁబడుఁ బరబ్రహ్మ మెపుడు. 77

సీ. మఖములఁజేయు హోమ పశుహింసలు రౌద్ర
కృత్యంబు లందునే నెపుడునుందు
క్రమముతో నెఱుఁగుము కర్మవేదవ్రతం
బులు ఋగ్యజు స్సామములు ననంగ
మేము ముగ్వురము సుమీ ! సందియము లేదు
యోగంబులో విష్ణుఁ డుండు వేద
ములలో సరోజగర్భుఁడు నిల్చుఁ గర్మంబు
లో నే వసింతు మాలోన నిట్లు

గీ. వేఱు లేకుంట దెలియక కారులాఁడు
పక్షపాతులు నరక కూపానఁ గూలు
దురు విభేదంబు లేని పెంద్రోవ నడుచు
మంచివారికి మోక్ష సంపదలు గలుగు. 78

శా. కుంభీసంభవ ! యింక నొక్క కథ నీకుం జెప్పెదన్ మున్ను న
న్నంభోజాసనుఁ డీ చరాచరము జేయఁబంప నేతత్క్రియా
రంభప్రౌఢిమ చూపనోపక పరబ్రహ్మంబు భావించుచున్
గంభీరాంబుధిలో మునింగి తపమే కగ్రాహినై సల్పఁగన్. 79

కం. ఆలో నేకాదశ నరు
లాలోల ప్రళయ దహన హాళహాళి హేలా
ఖేలాత్మ దేహకిరణ
జ్వాలలచేఁ దజ్జలంబు సలసలఁగాఁగన్. 80

కం. దొడిదొడి వెడలుదు మీరె
క్కడ పోయెద రెవ్వరేమి కార్యంబని నే
నడిగిన నూరక దురదుర
నడిచిరి నా మాట వినివినని చందమునన్. 81

ఉ. అంతట వచ్చె నొక్కఁడు మహాకృతిఁ దాల్చిన పూరుషుండు క
ర్ణాంత విశాలనేత్రము లహర్ముఖ నిర్మల నీరజాతితోఁ
బంతములాఁడ నల్గడలఁ బర్వెడు దేహరుచుల్ తటిల్లతా
క్రాంతఘనాఘనచ్ఛవి పరంపరసొంపు నధఃకరింపఁగన్ 82

కం. వచ్చినఁగని నీవెచటికి
విచ్చేసెద ! వెవ్వరిపుడు వెడలిన పురుషుల్
నిచ్చలఁ బుఁగరుణ నామది
ముచ్చటదీరంగఁ జెప్పు ముదమున నన్నన్. 83

కం. కొండిక నగవుల వజ్రపుఁ
గుండలముల రుచులు పెనలుగొన నాతో మా
ర్తాండులు వారలు తత్ప్రవ
రుండగు విష్ణుండ నన్నెఱుం గవెరుద్రా ! 84

మహాస్రగ్ధర.

స్థూలాస్థూలప్రభావ శ్రుతిమకుట మణిస్తోమమై జీవపృద్వీ
కీలాలేంద్వజ మిత్రాగ్ని పవనసఖమై కేవలాత్మైక్య పాథా
రాలై పైతామహాండ ప్రసవ సముదాయస్రగ్ధకై దుగ్ధపైరా
దాలంబక్షోణి భృన్మోహనరుచియయి రుద్రా! భవన్మూర్తిమించున్. 85

కం. నీ సత్వ మెఱుంగవుగా
కీ సకలములోనఁ జూడ నే వేల్పులు నీ
తో సరియని బహువిధముల
నా సర్వేశ్వరుఁడు నన్ను నభినుతియింపన్. 86

కం. ఏను గృతాంజలినై పది
యేనుఁ బదియుఁ దత్వములకు నెక్కుడగుచు వే
యేనుల కై దువుచే న
య్యేనుగు రక్షించి నతని నిట్లంటి మునీ! 87

గీ. కోటి జిహ్వలు మోములు కోటి గలుగు
కోటి నలువలు దారొక కోటి యగుచుఁ
గోటి కల్పాలు పొగడ నీ గుణములోనఁ
గోటి కొకపాలు దెగదు వైకుంఠనిలయ! 88

గీ. శాంతులై నిన్నె నమ్మి నిశ్చలసమాధి
గలుగువారికిఁ దనుదానఁ గానవచ్చు
నాత్మనీమూర్తి శుద్ధ స్వయంప్రకాశ
తత్వమగు నీకు లేదు పృథగ్వ్యవస్థ. 89

ఏకాక్షరకందము. నానాననునిననూనున
నేను నిను ననున్ను నెన్న నీనీననిను
న్నానౌని న నోన్ని నానౌ
నేనే నను నన్ననాన నేనను నన్నన్. 90

మ. దయతోఁ జూచి రమాధినాయకుఁడు రుద్రా ! యెన్నఁగా భేదమిం
తయు లేదెప్పుడు, నీకు నాకు నిదితథ్యం బేమి గాంక్షించి వి
స్మయదంబైన తపంబు చేసెద వనన్ సర్వేశ ! నన్నున్ జగ
త్త్రయనిర్మాణము చేయ నంపెనజుఁ డేతత్త్రౌఢి నాకిమ్మనన్. 91

వ. నీవు సర్వజ్ఞుండవు సుపర్వసార్వభౌముండవు నీకు నీభూతనిర్మాణం బెంతటిపని యేతదర్థంబునకు నింత చింతింపవలవదు బలవదున్మద రక్షో విక్షోభిత దివిజ రక్షణార్థంబు మూర్తిమంతు డనై మర్త్యంబున నెప్పు డెప్పు డవతరించెద నప్పుడప్పుడు నిన్నారాధించి నీ చేత వరంబులు వడ పెద నది నిమిత్తంబున నీవు సర్వదేవపూజ్యుండ వని వరం బిచ్చినం గైకొని శ్రీవత్సలాంఛన! నా మీద వాత్సల్యంబు గలిగెనేని వత్సరశతంబు నాకు వాహనంబ వగుమనిన నద్దేవదేవుండు సానుకంపంబునం గంపమాన శంపాపరంపరంబును జృంభమాణ గంభీరగర్జితంబును భాసమాన పీతచ్ఛాయంబును లక్ష్యమాణసురాధ్యక్షచాపంబును వర్ధమాన జలౌ ఘంబునగు మేఘంబై నన్ను వహించి తజ్జలంబు వెడలి సముద్రంబున శయనించు నలవాటున నీరుగ్రోల వ్రాలుచు లక్ష్మీ కుచంబులపై నొరగు నలవాటునం గులగిరి శిఖరంబుల నొరఁగుచుఁ దనకు మహిళ యగు మహీలలనకు నెలమి పుట్టించు నలవాటునం దొలకరి చినుకుల నెలమి పుట్టించుచు నీలకంఠుఁడనగు నాకు నెక్కుడు ప్రియంబు సలుపు నప్పుడు. 92

మ. ఘనగర్జల్ నకిలింత లాశ్రిత బలాకల్ తెల్లజల్లుల్ సకం
పనశంపాలతికల్ పసిండిసగతుల్ మాహేంద్రచాపంబు మో
హనరత్నంబుల వాగెత్రాడు వడగం డ్లాస్యస్రవత్ఫేన మై
తనరం దజ్జలదంబు కైరఁడెగయున్ ధారావిహారంబులన్. 93

సీ. ఈరీతి నన్ను నూతేండ్లు వహించి మే
ఘత్వంబు మాని సాకారుఁడై స
రోరుహనాభుండు రుద్ర మున్నరుదెంచి
న పదు నొక్కండ్రు దినకరులకును

ప్రముఖుఁడై విష్ణునామము గల మామకాంశజుఁడు పంద్రెండవ చండభానుఁ
దవనిపై నుదయించు నతని నీవు భజింపు
మేనును నిను భజియించుతుననుచుఁ

గీ. బలికె నారాయణుండు తజ్జలములోన
లీనుఁడై యుండె నాతండు లేనిచోటు
లేదు తద్దేవు సరివేల్పులేదు వేఱు
లేదు నాకును నతనికి లేశమైన. 94

ఉ. వేదపురాణ సారమిది వింధ్యజిదాది మునీంద్రులార! సం
వాదము మాని యజ్ఞమున వారిజనాభుని కగ్రపూజ లిం
డీ దివిజాలికన్ మునులు కీసనకాదిక యోగికోటికన్
గాదనరాదు సమ్మతముగావున నాపలుకెల్ల వారికిన్. 95

కం. అని పలికిన రుద్రుని శం
భుని శాశ్వతు నజుని విశ్వమూర్తి లలాటా
క్షుని శూలపాణిఁ బొగడుచు
మునులు నుతులు చేసి వినయముకుళితకరులై. 96

శా. దేవా! దేవర దివ్యవాక్యములచేఁ దీఱెన్ మహాసంశయం
బీవాత్సల్యము మాపయి న్నిలిపి సర్వేలా ప్రమాణంబుఁ బా
రావారాద్రి నదీవనస్థితులు నీ బ్రహ్మాండ విస్తారముం
బ్రావీణ్యంబున నానతిమ్మనిన నారాజార్ధ కోటీరుఁడున్. 97

వ. నారాయణ స్మరణ దూరీ భవత్తములారా! తాపసోత్తములార! బ్రహ్మ
విష్ణు వాయు పురాణంబుల నతివిస్తృతంబగు నీభూగోళ ప్రపంచంబు
గొంచెంబున వినిపించెద మున్ను సకల వేదవేద్యుండు నాద్యంత రహి
తుండు నప్రమేయుండునగు నారాయణుండు యోగనిద్రాసుఖం బవధ
రింప నద్దేవు నాభీసరోవరంబున విమలంబగు నొక్క కమలంబు మొలచె

నందు నల్పేతర ప్రపంచ కల్పనా శిల్పియగు విరించి సంభవించి మొదల సనక సనందన సనత్కుమారాది పరమయోగివరుల నిర్మించి వెనుక స్వాయంభువుండను మనువును మరీచ్యాది దక్షాంతంబుగా నవబ్రహ్మలను సృజియించె. స్వాయంభువ మనువు ప్రియవ్రతోత్తానపాదులను తనయుల నిద్దఱిం గనియె తత్ప్రియవ్రతుం డగ్నీధ్రు మేధాతిథి జ్యోతిష్మంతు ద్యుతిమంతు వపుష్మంతు హవ్య సవనుం గని వారిలో నగ్నీధ్రు జంబూ ద్వీపంబున మేధాతిథి శాకద్వీపంబున జ్యోతిష్మంతుఁ గుశద్వీపంబున ద్యుతిమంతుఁ గ్రౌంచద్వీపంబున వపుష్మంతు శాల్మలిద్వీపంబున హవ్యు గోమేధద్వీపంబున సవనుఁ బుష్కరద్వీపంబునఁ బట్టంబుగట్టె నాసవనునకుంగుముదధాతకులను కుమారులు మహావీరు లిద్దరు జనియించి నిజనామంబుల ధాతకీషండ కౌముదషండంబులను దేశంబులు రెండు గోమేధద్వీపంబునఁ గల్పించుకొనిరి. శాల్మలాధిపతియగు వపుష్మంతు నకుఁ గుశల విద్యుతి జీమూతులను సుతులు మువ్వురు గలిగి తద్ద్వీపం బునం దమతమ నామంబులఁ గౌశలంబును వైద్యుతంబును జైమూతంబు నను దేశంబులు గల్పించిరి క్రౌంచద్వీపనాయకుండగు ద్యుతిమంతునకుం గుశల మనోనుగోష్ణవాచివరాంధకార కేతుముని దుందుభులను నందను లేడుగురు గలిగి తత్క్రౌంచంబునం దమతమ నామంబుల దేశంబులు గల్పించిరి. కుశద్వీప వల్లభుండగు జ్యోతిష్మంతున కుద్భిదుండును వేణు మంతుండును ద్విరథుండును లంబనుండును ధృతియును ప్రభాకారుం డును గపిలుండును నన నేడుగురు కొడుకులు గలిగి తమతమ నామం బులం గుశద్వీపంబున వర్షంబులు గల్పించిరి. శాకద్వీపనాథుండగు మేధాతిథికి నాభి నయన శిశిర శివక్షేమక ధ్రువులను తనూజు లాఱుగురు గలిగి తత్కుశద్వీపంబునఁ దమతమనామంబుల నాఱు వర్షంబులు గల్పించిరి ఇట్లు స్వాయంభువ మన్వంతరంబునఁ బ్రతికల్పంబున భు వనంబు సుప్రతిష్ఠితంబగు నగ్నీధ్రసంభవుండగు నాభికి నందనుండగు ఋషభువలన భరతుండు జనియించి జనకానుశాసనంబున హిమగిరి దక్షిణభాగంబున భారతవర్షంబు సకలలోకోత్కర్షంబుగా నేలె నతనికి. 98

సీ. పుట్టిన సుమతికిఁ బట్టియౌ తైజసు
వలనఁ బ్రదసుండను వాఁడు కలిగె
తత్సూనుఁడైన యింద్రద్యుమ్నతనయుండు
పరమేష్ఠి ప్రతిహర్తఁ బడసె నాత
నిసుతుండు నివితు కున్నేత జనించె వా
నికి నభ్యపాత జన్మించెఁ ద త్త
నయుఁడైన ప్రస్తోత నందనుండు విభుండు
పృథుఁ గాంచెఁ గయుఁ డుదయించె నతని

గీ. కతనికి నయుం దతనికి విరత నృపాలుఁ
డతఁడు గనియె మహావీర్యుఁ డతనివలనఁ
బొడమె ధీమంతుఁ డాతని పుత్రకుఁడు మ
హానుభావుండు తత్సూనుఁడైన త్వష్ట. 99

కం. కనియె విరాజుని నాతఁడు
గనియె రజోనాము నతఁడు గనియె మహాయో
ధనసవన సమయరిపు పశు
హననపరాయత్త చిత్తుఁడగు నరజిత్తున్. 100

తరళ. అతని కుద్భవమైరి నూఱు వురాత్మజుల్ విబుధావన
వ్రతులు వారల పుత్రపౌత్ర పరంపరల్ చతురబ్ధివే
ష్టిత వసుంధర యెల్లనిండిన సృష్టిలోఁ గల జంతు సం
తతులు వర్ధిలె నంతనుండియు నాఁడు నాటికి నీ క్రియన్. 101

కం. వలసెఁ బ్రసంగవశంబునఁ
దెలుపంగా నేకసప్తతి మహాయుగముల్
నిలిచిన స్వాయంభువ మను
తిలకము వృత్తాంత మెల్ల ధీనిధులారా ! 102

ఉ. నేరెడు దీవి నెల్లెడల నిల్చిన తీర్థములున్ వనంబులున్
వారిధులు న్నదుల్ గిరులు వర్షములున్ మొదలైనవాని వి
స్తారము శీత భాను రవి సంచరణంబులు భూతమానముల్
మీరు నితాంతకౌతుక సమీహిత బుద్ధి వినుండు చెప్పెదన్. 103

కం. యోజన లక్ష పరిమితం
బాజంబూద్వీప చక్రమందుఁ గడలఁ బై
డౌజసమణి నేమి కరణి
రాజిల్లును లవణజలధిరాజం బెపుడున్. 104

కం. ఆ దీవికిఁ బ్రాగుత్తర
మేదిని హిమహేమకూట మేరుశిఖరముల్
పాదుకొని పూర్వపరమ మ
హోదధులం దటిసి మెఱయు నుర్వీధరముల్ 105

కం. ఆ గిరులలోన మేరువు
ప్రాగుత్తర దక్షిణాపరదెశలఁ దెలుపున్
జేగురు హళఁదియు నలుపును
నైగుఱుతుగఁ దెలుపు బ్రాహ్మణాదికజాతుల్. 106

సీ. వరుసతో హరినీల వైడూర్య శుక్ల హి
రణ్మయశ్వేత బర్హిద్విరేఫ
శాతకుంభ ప్రభాన్వితంబు లహియక్ష
సిద్ధచారణ దివ్య సేవితములు
సాహస్రనవక యోజన విస్తృతాంతర
విష్కంభములు పృథివీధరములు
క్రేవల నిలువ నిలావృతాహ్వయ వర్ష
మాలవాలాకృతి నాచరింప

గీ. నడుమఁ జతురస్రసవృత్తమై నాటు గలిగి
ధగధగాయిత కనకరత్న ప్రతాన
కిరణముల నాలుకలు గ్రోయు కీలకముగ
సురనగంబు విధూమాగ్ని కరణి మెఱయు. 107

చ. యతివరులార ! నీలనిషధాద్రులు తక్కిన వర్ష భూధర
ప్రతతులలోన మిక్కిలియుఁ బ్రస్తుతి గన్నవి లక్ష యోజనా
యతములు వీనిగూర్చి కిరుదైనవి చాపున హేమకూట ప
ర్వతమును మంచుగొండయును ద్వాదశవింశతి యోజనంబులన్. 108

సీ. వర్ష పర్వత మధ్యవర్తి నానావిధ
జనపదస్థలులు వర్షంబులయ్యె
నవి తొమ్మిది పరస్పరాగమ్యములు సరి
ద్ఘోరకానన జంతుపూరితములు
వీనిలో నాలుగు విలువంక లోడవం
కలు నాల్గు చతురస్రకం బిలావృ
తంబు మేరువునకు దక్షిణోత్తరముల
నుండు నెన్మిది చుట్టినుండు నొకటి

గీ. యాయిలావృత వర్షంబు హత్తి యెడమ
వంకఁ గుడివంక నీలపర్వతము నిషధ
పర్వతమునుండు నీరెండు పర్వతముల
నడుమఁ గనుపట్టు మాల్యవన్మహిధరంబు. 109

చ. అలఘు సువర్ణకూటమగు నగ్గిరికిన్ ద్విసహస్ర యోజనం
బుల పొడవున్ వెడల్పు మఱి ముప్పది నాలుగువేల యోజనం
బుల నిడు పవ్విధంబు నిడుపుం బొడవుంగల గంధమాదనా
చలము తదద్రిపశ్చిమదిశన్ నిలుచున్ వినుఁడింకఁ జెప్పెదన్. 110

సీ. కలిగె నవ్యక్తంబువలన నారాయణా
త్మకమైన సలిలంబు తజ్జలమున
నడుమ నెన్బదివేలు నాల్గు యోజనముల
యౌన్నత్యమును బదియాఱువేలు
యోజనంబుల పాతు నొగినంత వలమును
వలమున కినుమడింతల వెడల్పు
........................
........................

గీ. కలిగి కర్ణిక వలెనున్న కనకగిరికిఁ
గేసరాకృతి భద్రాశ్వ కేతుమాల
భారతోత్తర కురువర్ష పర్వతములు
నిలుచుఁ గెళవుల లోకవర్ణితములగుచు. 111

చ. మునివరులారా! తత్కుధర మూర్ధమునం బదునాల్గువేల యో
జనములఁ జూడ నొప్పు సమచౌకపు నెత్తము నిండి రత్నకాం
చనమయ తోరణావరణ సౌధవిలాసముచేతఁ జాల వ
ర్ణనమున కెక్కునొక్క నగరంబు మనోవతి నాఁగఁ దత్పురిన్. 112

సీ. సకల జీవులయందు సమబుద్ధులగువారు
సత్యసంధత్వంబు జఱపువారు
వెన్నిక రణములో విగతాసులగువారు
వివిధాధ్వరములు గావించువారు
పితృ మాతృ వచనంబు లతకరింపనివారు
దాన పరాయణులైనవారు
బ్రహ్మ విజ్ఞాన తత్పరతఁ గల్గినవారు
నిజకులాచారంబు నెఱపువారు

గీ. నాదిగాఁగల పుణ్యులు నమరయక్ష
గరుడ గంధర్వ కిన్నర ఖచర దైత్య
సిద్ధ సాధ్యులు తన పాదసేవ చేయ
మహిమఁ గొలువుండు నెపుడు తామరసభవుఁడు. 113

వ. ఇవ్విధంబున బ్రహ్మచర్య నిర్వికల్పులు ననల్ప విజ్ఞానాకల్పులు శ్రీ శూద్ర సంకల్పులునై పరమయోగిపుంగవులు పూజానమస్కారాదికంబులం గొలువనున్న నలువకు రాజధానియైన మనోవతీనగరంబు దనకు మణికిరీటంబుగా మెఱయు మేరు నగరాజంబునకు రెడ్డికంబునుంబోలె నొడ్డునం బదివేలయోజనంబులు పొడవున ముప్పదివేలయోజనంబులునై చుట్టి వచ్చి వియచ్చరగవి కఠోరఖురకషణ విశేషిత పరాగపద్మరాగ ద్యుతి ద్విగుణశోణ మకరంద కందళిత మందార హరిచందన ప్రవాళం బగు చక్రవాళంబున సూర్యాదిగ్రహంబులు సంచరించు నన్నగంబు తూరుపు నెత్తంబున మత్త నక్తంచర దురవగాహంబును మణిమయగేహం బును రంభాది నటీ నాట్యశాలా మృదంగ దింధిమధ్వని సంపూర్ణంబును విమానశత సంకీర్ణంబును ధగధగాయత ధ్వజపట ప్రసూత బహుసహస్రా రావతియునగు నమరావతీపురం బంద మందు నందు నడుమ వజ్రవైడూర్య మయవేదికాసీనులైన సర్వదేవయోనులు సేవింప సుధర్మాస్థానంబున నాఖండలుండు నిండుగొలువుండు రెండవదిక్కున దాదృశగుణ విరాజితం బైన తేజోవతీపురంబున సర్వదేవ నమస్కృతుండై శిఖాశతసహస్రదుర్ని రీక్షదేహుండు హవ్యవహుండు వెలుంగుచుండు మూఁడవదిక్కున సకల సౌభాగ్యకోకిలంబులకు నామని సంయమని శమనుం డధివసించు నాలవ దిక్కున నఖిల నగరవిజిష్ణుగుణ కృష్ణగుణ కర్బురుండేలు నేనవదిక్కున సాధ్యసిద్ధపతి వరుణుండు పరిపాలించు నాఱవదిక్కున విరచితసర్వనగర గర్వకుట్టణంబు గంధవతీపట్టణంబునం బ్రభంజనుండు విజృంభించునేడవ దిక్కున నిరవధిక నిధి సమూహోదయ నక్షత్రవిభుండు యక్షవిభుం డధ్యక్షించు నెనిమిదవదిక్కున మూర్తాపవర్గంబు స్వర్గం బీశానుండు శాసించు యిది మేరుకర్ణికామూల ప్రకారంబు. 114

కం. హరిదష్ట పర్వముల నం
బరచుంబిశిఖరములైన మర్యాదా భూ
ధరరాజము లెనిమిదిగల
వరయఁ దదాధారమునఁ గదా ! మహి నిలుచున్. 115

గీ. మందరము తూరుపున గంధమాదనంబు
దక్షిణంబున విపులభూధరము పశ్చి
మమునను సుపార్శ్వగిరి యుత్తరమున నుండు
శాతకుంభాద్రి కిట్టి విష్కంభగిరులు. 116

కం. శృంగములు నాల్గు తరువుల
భృంగశుకములువలె దైత్యబృందారకులు
తుంగ కుసుమ ఫలవాంఛా
సంగతిఁ దము గొలువ మెఱయు సర్వర్తువులన్. 117

మ. తరిగొండన్ గలశప్రమాణ కుసుమోద్యద్గంధముల్ భూనభోం
తరసీమంబున వేయి యోజనములన్ దాటంగ భద్రాశ్వ వ
ర్షరమాకేతనమై కదంబ ధరణీజం బొప్పు నాచెట్టు చ
క్కఁ రమించున్ హరి సర్వకాలము హయగ్రీవావతారంబునన్. 118

సీ. గంధమాదనమునఁ గలదల్లొ నేరేడు
దంతుల యంత లందలిఫలములు
పక్వంబులై రాలి పగులఁ దద్రసమున
జంబూ తరంగిణి సంభవించె
నాయేటిసలిలంబు లమృతపూరము కంటెఁ
జవియని క్రోలు నిర్జరగణంబు
లచట జాంబూనదం బను పైఁడిఁ జేసిన
తొడవులు ధరియింపుదురు దివిజులు

కి. భారతాహ్వయవర్ష శృంగార మగుచుఁ
ప్రబలి సర్వర్తు ఫలపుష్ప భరితమైన
దాని మహిమంబు వర్ణింపఁ దరమె పేరు
కలిగె నీ దీవి కాచెట్టు కతనఁ గాదె. 119

చ. విపులధరాధరాగ్రమున వేలుపుమూఁకలరచ్చరావి ది
వ్య పరిమళంబుతోఁ గడవలంతలు పండుల విఱ్ఱవీఁగు నా
కిపతి పయోధిఁద్రచ్చునెడఁ గేతువుపై మణిమాల చేర్పఁ జే
రు పడియెఁ గేతుమాల మన రూపగువర్షము దానిపేరిటన్. 120

సీ. వినుఁడు సుపార్శ్వ పృథ్వీధరంబున మధు
స్రావి విశాలపత్రములతోడ
శతయోజనాయత శాఖాశిఖాలంబ
మానప్రసూన దామములతోడ
నమృత సంపూర్ణ విద్రుమ కుంభ పరిమాణ
పరిపక్వ ఫల్ల పరంపరలతోడ
గంధర్వ సురబాలికా డోలికాకేళి
కారణ ఘన శిఫాగ్రముల తోడఁ

గీ. జాలఁ గను పట్టు నొకవటక్ష్మారుహంబు
నలువ మానససుతులు సనత్కుమారు
లనుజు లేడ్వురు కురుసంజ్ఞలందు నిలువఁ
గలిగె నుత్తరకురుదేశమునకుఁ బేరు. 121

వ. ఇది విష్కంభవర్ణనం బింక మందర గంధమాదన విపుల సుపార్శ్వ పర్వత ప్రాంతంబులంగల వనంబుల వనంబులలోనిసరోవరంబుల సరోవరంబుల దరులంగల గిరుల నెఱిఁగించెద మందర పరిసరంబున సర్వర్తు వర్తమాన ఫలపుష్ప పల్లవాస్వాద మోదిత శుక చంచరీక పిక పత్రరంథబగు చిత్రరథంబను వనంబు మెఱయుఁ దదుద్యాన మధ్యంబున

మరందరసమదాంధ పుష్పంధయ బంధుసౌగంధిక గంధజనిత గంధర్వవినోదంబగు నరుణోదంబను కాసారంబు తీరంబున సితాంతః కుముద కరవీర మహానీల కుజ్జ శిబిబిందు కుముద వేణుమత్సు మేఘ నిషధవేద పర్వతంబులనం బదునొకండు కొండ లుండు గంధ మాదనసవిధంబున రక్షోయక్ష సిద్ధ విద్యాధరాది కాహ్లాదనంబగు గంధ మాదనంబను వనంబు గనుపట్టుఁ దాదారామసీమంబున నిజాధీనాయత దివ్యమౌనిమానసంబగు మానసంబను కొలని కెలంకునఁ ద్రిశిఖర శిబిర కపింగ పిశంగ రుచక సానుమత్తా్రితభ విశాఖ శ్వేతోదర సుమూల వసుధాధర రత్నధార రైకశృంగ మహామూల గజశైల విశాఖ పంచ శైల కైలాస హిమవంతంబులనం బందొమ్మిది నగంబు లందమొందు విపులాచల సమీపంబున నిరంతర విహరమాణ చరమ కకుభ్రాజంబగు వైభ్రాజంబను వనంబు విలసిల్లు తత్కాంతారాంతరంబునం బరిహృత మజ్జనగజ్జన మనస్తోదంబగు సితోదంబను సరోవరంబుదరిఁ గపిల పింజర భద్ర సురస మహాబల కుముద మధుమ దంజన మకుట కృష్ణ పాండుర సహస్రశిఖర పారియాత్ర శృంగవజ్జారుధులనఁ బదియేను సానుమంతంబులు గానంబడు సుపార్శ్వ పార్శ్వంబున సంతత వసంత కంతు భవనంబగు సవితృవనంబు శోభిల్లుఁ దదాక్రీడా క్రోడనంబున డిండీరమండల ప్లవ రిరంస హంససంసత్పరిహసిత సముద్రంబగు మహాభద్రంబను కమలాకరంబు నకాశంబునం బెక్కుశైలంబులు నిలుచు నీ నగంబులం యెడనెడలం గల కొలంకులుం గోనలు వనంబులు బయల్లను సవిశేషంబుగా నెఱింగించెద వినుండు. 122

గీ. కుముదశైల సితాంతాచలముల నడుమ
నూఱు యోజనములును మున్నూఱు యోజ
నములు వెడలుపు నిడుపునై విమల మగును
శ్రీ సరోనామ సరసి ప్రసిద్ధి మెఱయు. 123

శా. ఆకాసారములోన పద్మవన మధ్యంబందు నక్తందివ
వ్యాకోచంబయి కోటిపత్రసహితంబై బాలభాను ప్రభం

బై కానఁబడు నొక్క కతామర సుగంధాలోల రోలంబ మం
దే కాలంబు వసించులక్ష్మి సురయోగీంద్రుల్ తనుం గొల్వఁగన్. 124

సీ. తచ్ఛ్రీ సరస్తీర ధరణి నిన్నూఱు యో
జనముల నిడుపు యోజన శతంబు
వెడలుపు గలుగు మారెడుతోఁట విలసిల్లు
శ్రీవనంబనఁగఁ బ్రసిద్ధమగుచు
నందలి తరులు క్రోశార్ధోన్నతములు శా
ఖా సహస్రచ్ఛన్నఖస్థలములు
వాని పువ్వులు ఫలావళులు భేరి ప్రమా
ణము లమృతోపమానములు తొడిమ

గీ. లూడి తొటతొటఁ దఱుచుగా నుర్వి రాలి
పడఁగఁ బ్రవహించు రసనదీప్రకరముల వి
హారములు సల్పు సురసిద్ధ యోవతంబుఁ
దాను ననవరతంబుఁ బద్మావధూటి. 125

గీ. ఇంక మణిశైలమునకు వైకంకమునకు
నడుమ బిల్వవనం బంత నిడుపు వెడలు
పునను గనుపట్టుఁ బంకజవనము దాని
చెట్టులకు నెల్లనర గూకవెట్టు పొడవు. 126

శా. వ్యామగ్రాహ్యము లుజ్జ్వలత్కనక తుల్యచ్ఛాయముల్ సౌరభ
వ్యామోహీకృత చంచరీకము లపూర్వంబుల్ ప్రసూనంబు లా
భూమీజంబుల నెల్లకాలముల నొప్పుం దద్వనీవాటికం
బ్రేమం గశ్యపుఁడుండు దైత్యసుమనోబృందంబు సేవింపఁగన్. 127

సీ. ఉండు మహాసిల కుండలగిరుల మ
ధ్యమున సుఖానది తత్తటమున
ముప్పది యోజనంబుల వెడలుపును నేఁ
బది యోజనంబుల పరపుఁ గలిగి
తాళీవనము మించుఁ దఱచు నున్నతమునై
పెరిగి యందలి నల్ల బేటిపండ్లు
కస్తూరికాలిప్త ఖచరాంగనా ఘన
స్తనకుంభ సఖ్యంబు సలుపు నెపుడు
గీ. సిద్ధ చారణ గంధర్వ సేవ్యమైన
యావనంబునఁ దిరుగు నైరావణంబు
స్వాదు ఫలరసగంధంబు స్వప్రథాప్ర
భూతదానంబు గంధంబు ప్రోదిచేయ. 128

కం. శతయోజన విపులము దశ
శతయోజన దీర్ఘమగుచుఁ జెట్టొకఁ డైరా
వత దేవశైల మధ్య
క్షితిఁ గనుఁగొన నొప్పుఁ జిలుప చిలుప జలముతోన్. 129

చ. శ్రుతబహుపాదపం బయిన రేగడినేల మహాపతంగ ప
ర్వతశిఖరాద్రిమధ్యమున రంజిలుచుండు నుదుంబరద్రు సం
తతి శతయోజనాయతము తత్ఫలముల్ కమఠోపమానముల్
సతతము వాని తేనియలు జాలుకొనున్ బహునిమ్నగాకృతిన్. 130

కం. పండిన తద్వనిఁ దేజ
శ్చండాంశుఁడు కర్దమ ప్రజాపతి ఫణభృ
త్కుండల పూజాపరుఁడై
యుండు మహామహిమ దేవయోనులు గొలువన్. 131

వ. మఱియునుం బతంగ తామ్రాభ శైలంబుల నడుమ శతయోజన విస్తృతంబును ద్విగుణాయామంబును సముద్దండ పుండరీక మండల మండితంబును ననేక దేవగంధర్వాధ్యుషితంబునగు మహాసరోవరంబు గలదు. తదంతరాళంబున రత్నమయంబు ననేక ధాతువిచిత్రంబు నగు మహామహీధరంబు నూఱుయోజనంబుల నిడుపున ముప్పది యోజనంబుల వెడల్పున నుండు నక్కొండమీఁద వివిధమణితోరణ ప్రాకార గోపురంబగు పురంబున నపరిమిత విద్యాధరసహస్రంబులు గొలువఁ బులోముం డధివసించు విశాఖశ్వేత పర్వతంబుల నడుమనున్న సరోవరంబు తూర్పుతీరంబున శాతకుంభ కుంభప్రమాణ పరిపక్వఫల రసానిశపింగ పిశంగీకృత శుకశారికా కిశోరకాననంబైన సహకార కాననంబున సుగంధి గంధవహ మదాంధ పుష్పంధయ గానంబులతోడ నిజగాంధర్వంబు సలుప గంధర్వులు విహరింతురు. సమూల వసుధార ధరాధర మధ్యంబున ముప్పది యోజనంబులు వెడలుపు నేఁబది యోజనంబుల నిడుపునుం గల బిల్వవనంబు మెఱయు, నందు నున్న మద్రుమవిద్రుమమద్యుతి ఫలద్రుమంబుల జొత్తిల్లిన మత్తికపదతలంబులం గ్రొత్తలత్తుక తెఱంబున హత్తుకొన, సంచరించు గుహ్యక మత్త కాశినుల మొత్తంబులు మగలచిత్తంబులు మదనరసాయత్తంబులు చేయు, వసుధార రత్నధార వసుధాధరంబుల నడుమ ముప్పది యోజనంబుల వెడల్పు నూఱు యోజలంబుల నిడుపునుం గలిగి సతతవికసిత కుసుమ సౌరభంబు శతయోజనంబుల సోడుముట్ట సిద్ధాధ్యుషిత జలాశయంబులు గనుపట్ట నుండు కింశుకవనంబునం బ్రతి మాసంబును వాసరేశ్వరుం డవతరింపనిలింపకింపురుషాదులు సేవింపుదురు. పంచకూడ కైలాస శైలంబు నడుమ సహస్ర యోజనాయామంబును శతయోజ విస్తారంబును హంసపాండురంబునైన భూమండలంబు గలదు. కపిలశిఖ శిఖర మధ్యంబున నూఱు యోజనంబుల వెడలుపు నిడుపునుం గల హేమశిలా తలంబున నడుమ వింశతి యోజన విస్తీర్ణంబును శతయోజనా యతంబు నగు వహ్నిస్థానంబున సకలలోక క్షయకారియగు సంవర్తక జ్వాలనుండు నిరంతరంబు నింధనంబు లేకయు వెలుంగుచుండు వెండియు. 132

కం. ఘన మాతులుంగ వనమం
జన కుముదాద్రులకు నడిమిచక్కిన్ దశ యో
జన మితము జంత్వగమ్యము
ననిశము సురగురున కిరవునై విలసిల్లున్. 133

సీ. సురపింజర నగాంతరమున బహుశత
యోజనాయతము సీరేజకుముద
సందోహ మకరంద నందదిందిందిర
శ్రేణియునగు సరోద్రోణి నడుమ
గలదు యోజన పంచక ప్రమాణంబైన
వటవృక్ష మొకటి తద్విటము క్రింద
చంద్రవర్ణుండు సహస్రముఖుండు నీలవా
సుండునైన వాసుదేవుండు నిలుచు

గీ. కుముద సాహస్ర శిఖర మధ్యమున నేబ
దియును ముప్పది యోజనాలయిన నిడుపు
వెడలుపును నైనయొక దివ్య వృక్ష వాట
మమరు నింద్రుని కాశ్రయం బగుచునెపుడు. 134

కం. వెలయుఁ బెనుబైలు నిషధా
చల కూటమునందు నడుదెసన్ సురభి శ్రీ
ఫలనిభకాకోలములన్
నల పుష్కర సోమదత్త నాగాస్పదమై. 135

గీ. నాగశైలక పింజరాంతరములందు
మీఁఱు జదరపునేల యిన్నూఱు యోజ
నములనిడువున శతయోజనముల విరివి
ఫలిత ఖర్జూర గోస్తనీ లలితమగుచు. 136

మ. అఱచేయుం బలె మేఘపుష్కర మహా హర్మ్యాంతరాళంబునం
దఱవైయోజనముల్ వెడల్పును శతాయామంబునుం గల్గి య
త్తఱి వీరు త్తర శూర్ప్యమైన బయ లందం బొందు నన్నేల కుం
డఱిచె నల్గడలం గొలంకులనుఁ గాన ల్మించుఁ జిత్రంబుగన్. 187

వ. మౌనిపుంగవులారా యింక నానాగిరిప్రదేశంబులం బ్రకాశించు దేవతావకాశంబులు వర్ణించెద నాకర్ణింపుఁడు సంతత విహరమాణ ఖచరకాంతా పరివృతంబగు సితాంతంబను పర్వతంబున మహేంద్ర విహార ధామంబైన పారిజాతారామాభిరామంబగు నక్ర్కాంతదండ నుండు కుంజరంబను శైలంబుమీఁద దానవపురంబు లెనిమిది గానంబడు, వజ్రాంకంబను పర్వతంబునఁ గామరూపులైన నీలకులను రక్కసుల పురంబులు పెక్కులు గలవు మహానీలంబను శైలంబున హయముఖ నగరంబులు పదేనుఁ గిన్నరనగరంబులు పదేనునుం గల వప్పురంబులు సౌవర్ణంబులు సబిల ప్రవేశంబులునై విలసిల్లు నందులకు దేవదత్త చంద్రాదులు రాజులు చంద్రోదయంబను పర్వతంబున ననేకగణభూతకోటిసహస్ర పరివారుండగు మహాదేవుండు పరమయోగి పుంగవులు సేవింప ననవరతంబును విహరించుచుండు వసుధారంబను వసుధాధరంబున వసువుల పురంబు లెనిమిది గొనియాడం దగు రత్నధారంబను కుధరంబున సప్తర్షి పురంబు లేడు చూడనొప్పు నేకశృంగపర్వతంబునం జతుర్ముఖ బ్రహ్మ వసియించు గజపర్వతంబున మహాభూత పరివృతయైన యాదిశక్తి యనురక్తి విహరించుచుండు నాదిత్యవసు రుద్రులకుం బొత్తులయిరవైన వసుధారంబను గిరివరంబున మహాప్రాకారతోరణంబులైన దివ్యపురంబు లెనుబది గల వందు సత్యవర్తన నామధేయులు నాయోధనసగర్వులునైన గంధర్వు లధివసింతురు వారలకు రాజు రాజరాజు. సునగరంబున రాక్షసులకుఁ బంచకూటంబున దానవులకు శతశృంగంబున యక్షులకుఁ దామ్రాభంబున దక్షునకుఁ బురంబులు నూజేసి గలవు విశాలంబున గుహ్యకులును శ్వేతోదయంబున గరుడపుత్రుండగు సునాభుండును హరికూటంబున హరియును గుముదంబునఁ గిన్నరులును నంజనంబున మహోరగులు నుందురు కృష్ణంబున గంధర్వ విద్యాధరుల పట్టణంబులు

పదేడు గలవు సహస్ర శిఖరంబున నుగ్రకర్మలైన దైత్యులు వసి యింపుదురు హేమమాలియందు దివ్యపురుష సహస్రం బజస్రంబును వెలుంగు నివి మొదలైన విశేషంబులన్నియును మేరువుమీఁది పకా నెఱుంగుఁడు. మఱియును. 138

గీ. దేవఋషి చరితయుతమౌ దేవకూట
మనెడు పొలిమేరగుబ్బలి యందు నూఱు
యోజనంబులు గరుడునియునికి పట్టు
రత్నరుచి నొప్పు దాని పార్శ్వంబునందు. 139

కం. బలవంతులైన యాజ్ఞే
యులనెడు గంధర్వవీరు లుండెడు పురముల్
గలవేడు నిడుపు వెడలుపు
నలువది ముప్పదియు యోజనము లందులకున్. 140

కం. ఉండుం ద్రిశద్యోజన
మండలమై సింహికా కుమారుల పుర మ
క్కొండచఱిఁ గాలకేయులు
నుండుదురు సుధామ మనెడు నొకపురమందున్. 141

కం. అప్పర్వతంబు యామ్యక
కుప్పనఁ బురి కామరూప కోటుల యిరవౌ
ముప్పది నలువది రెండును
నప్పురికిని యోజనంబు లగలముఁ జూపున్. 142

ఆ. అన్నగంబు నడుమ హాటక మయమైన
శిఖరమందు మఱ్ఱిచెట్టుగలదు

దాని మూలమున సదానిల్చు శ్రీ మహా
దేవుఁ డభినుత ప్రభావుఁ డెలమి. 143

రగడ. వినుఁ డికఁ గైలాసాంబునఁ గలిగిన వివిధ విశేషంబులు వివరించెద
నొనరఁగ నగ్గిరి చదుమున నొకసభ యోజన శతవిస్తృతమై వెలుఁగును
అందుఁ గుబేరున కధివాసంబై యలరు విమానము పుష్పక మనునది
అందముగ మహాపద్మాదికనిధు లగ్గిరివరమున ననిశము నుండును
పాకశాసనప్రముఖులగు దిశాపాలకులందరు నందు వసింతురు
శ్రీకరముగ నిగ్గిరి మందాకిని సెలయేత్తై యనిశము ప్రవహించును
కనకయు నందయి మొదలగు నదు లగ్గట్టుకుఁ జుట్టును గలవెన్నేనియు
కనుపట్టును దచ్ఛైలము తూర్పున గంధర్వుల నగరంబులు నలువది
యోజనశతవిస్తారము గలయాయూళ్ల సుబాహుఁడు హరికేశుండును
భ్రాజిష్ణుండగు చిత్రసేనుఁడును బ్రముఖులైన దొర లేలుచు నుందురు
పడమట యక్షులపట్టణములు నలువదియును నేఁబదియును యోజనముల
వెడలుపు నిడుపును గల వెన్నే నవ్వీళ్లకు మణికర్ణాదు లేలికలు
దక్షిణమునఁ గిన్నరపుర శతకము తళుకొత్తు విచిత్రత నవ్వీళ్లకు
ప్రక్షీణారులు సుగ్రీవద్రుమ భగదత్తాదులు నూర్గురు రాజులు
హరునితోడ విరహంబునఁ బార్వతి యప్పర్వతమునఁ దప మొనరించెను
పురహరుఁడు గిరాతాకృతిఁ గైకొనెఁ బూర్వంబున నాభూధరమందును
జంబూద్వీపముఁ గలయఁ గనుంగొని శంకరుఁ డచ్చట గిరిజాయుతుఁడై
యంబుజము ఖులచ్చరలకు నిరవై యలరు నుమావన మగ్గిరి నొక్కటి
యావనవాటికలోఁ బరమేశ్వరుఁ డర్ధనారిరూపముఁ గైకొనియెను
దేవసేనపతి గుహ శరవణమును దేజరిల్లుచున్నది యచ్చోటనె
క్రౌంచపుష్కర చిత్రాంతరమునఁ దత్కార్తికేయునకు బట్టము గట్టుట
కాంచు సిద్ధముని గణసంచారము కాలాపగ్రామం బా తూర్పున. 144

కం. తుహినగిరి మీఁద మెఱయును
మహిమ భృగుగుద్దాలపులహ మార్కండేయ
ద్రుహిణ తనూజులు మొదలగు
మహర్షి పుంగవుల యాశ్రమ సహస్రంబుల్. 145

సీ. మరియు మేరువు మడమట నున్న నిషధాద్రి
మధ్యకూటము హరి మనికిపట్టు
తద్గిరియుత్తరతటమున విలసిల్లు
ముప్పది యోజనమ్ముల విరివిని
రాక్షసేంద్రుల నగరంబు లంబాఖ్యమౌ
శైలంబు దక్షిణస్థలి బ్రవేశ
పురమును బశ్చిమంబున దేవసిద్ధాది
పురములు మెఱయునా ధరణిధరము

గీ. శిరసుపై దివ్యమగు సోమశిల వెలుంగు
నందు బ్రతిపర్వమున సోముఁ డవతరించి
బ్రహ్మ యాకొండయుత్తర పార్శ్వమందు
నుండు నొకచోట సాకృతి నుండువహ్ని. 146

మ. కనకక్షోణిధరంబు నుత్తరమునం గాంతిన్ వెలుంగున్ ద్రిశృం
గనగం బగ్గిరి తూర్పు శృంగమున వేడ్కన్నిల్చు నారాయణుం
డనఘుం డబ్జభవుండు మధ్య శిఖరం బందుండు విశ్వాంతరా
త్మ నవీనేందు కళాధరుండు మెలంగు బాశ్చాత్య కూటంబునన్. 147

కం. ఇంగిలికము మణి శిలయున్
రంగుగ వైడూర్య రత్న రాజియుఁ దనలో
నం గల త్రిశృంగనగమున
సంగడి శోభిల్లు యక్ష సాధ్య పురంబుల్. 148

కం. ఈ సరవి సిద్ధలోకా
వాసములగు కేసరాద్రివర్గంబులచే
భాసిల్లు మెఱుఁపు గర్ణిక
గా సరసిజలీలఁ బృథ్వి గడు నొప్పారున్. 149

వ. ఈ భూగోళ ప్రకారంబు సకలపురాణసాధారణం బిటమీఁద నదుల నామధేయంబులు జన్మంబులు నెఱింగించెద వినుండు మొదల సోమాఖ్యంబగు నాకాశసముద్రంబు వలన నాగాశగామినియగు నది యుదయించె నది యింద్ర గజక్రీడా స్థానంబై చతురశీతి యోజన సహస్ర యోజనోన్నతంబైన మేరువునకుఁ బ్రదక్షిణంబు చేయుచు నమ్మేరునగోన్నత శిలల వలన జాఱి నాలుగు పాయలై యిఱువదివేలయోజనంబులు నిరాలంబనంబునఁ బ్రవహించుచు సితాలకానందాచక్షుర్భద్రాభిధానంబులు నాలుగు ధరియించియనేక సహస్రముఖ ప్రవాహంబుల భూధరంబులు వ్రక్కలించుచు ముప్పదివేల యోజనంబుల నిడుపునం గేతుమాల వర్షంబున గంగయను పేరం బ్రవహించుచుండు నింక గంధమాదన పార్శ్వంబుననేక త్రింశత్సహస్రయోజన ప్రయాణంబున బ్రవహించు వరగండిక వర్ణించెద వినుండు. 150

ఉ. ఆ వరగండికాతటములం దిరువంకలఁ గేతుమాలదే
శావళియొప్పు నందుగల యంగన లుత్పలమేచకాకృతుల్
పూవిలుకానిఁ బోలుదురు పూరుషులందఱు కృష్ణవర్ణు ల
ప్పావనభూమిలో నిలుచుఁ బాయక బ్రహ్మసుతుండు నెమ్మదిన్. 151

కం. ఇదిచిత్ర మచటి పనసల
మదిరిన షడ్రస ఫలాళి మధురస సేవన్
ముదిమియుఁ దెవులును నెఱుఁగక
పదివేల్సంవత్సరములు బ్రమకుదురు ప్రజల్. 152

సీ. మాల్యవద్గిరి హర్మ్య మహిఁ బూర్వగండికా
నది ప్రవహించు ముప్పదియు నొక్క
వేల యోజనముల విరివి తన్నదితట
స్థలముల భద్రాశ్వజన పదములఁ
గాలాబ్దరుచిభద్ర సాలవనం బొప్పుఁ
దద్దేశ జనులెల్ల ధవళరుచులు
దశ సహస్రాయులై తనరారుచుందురు
భామినులందరు పద్మగంధు

గీ. లందుగుల పర్వతేంద్రంబు లైదువాని
చుట్లఁ గలిగిన కొండలు కోట్ల సంఖ్య
లచటి జనపద సీమలయందు గలుగు
నదులు చెప్పెద సావధానమున వినుఁడు. 153

సీ శతాంశువాహినీ శతమహా వక్ర
చక్ర పద్మావతి చంద్రమత్త
శతభద్ర హంస హంసావతి వనమాల
పంచవర్ణ సువర్ణ బ్రహ్మభాగ
కావేరి సరస శాఖాపతి హరితోయ
యింద్రనంది హిరణ్య కృష్ణతోయ
యరుణావతి సువప్ర యంగారవాహిని
క్షీరోద మణివప్ర శివ సుదంతి

గీ. స్కంధవతి సోమవతి ధనుష్కృతి వసుమతి
నాశవతి మణితల మహానది పదాద
విమల పుణ్యోద వామోద విష్ణుపదియు
మొదలుగాఁ గొన్ని పెదపెద నదులు గలవు. 154

కం. ఈ నదులన్నియు నాగం
గాన సరి పూర్వజన్మకలుషము లెల్లన్
మానుపునట సంస్మరణ
స్నాన తటస్థాన దర్శన స్పర్శములన్. 155

కం. మఱియుం గోటుల సంఖ్యలు
చిఱుతనదులు గలవు వాని శీతలజల మ
క్కఱఁ గ్రోలి సహస్రాయువు
కఱకంఠుని మీఁద భక్తిఁ గాంతురు మనుజుల్. 156

వ. ఇట్లు కేతుమాల భద్రాశ్వవర్ష విశేషంబులుం గొన్ని చెప్పితి నింకనిష ధాచతేంద్రంబునకుం బడమట విశాఖకంబళ కృష్ణజయంత హరి శోక వర్ధమానంబులను కులాచలంబు లేడు గలవు వానికిం బ్రత్యంత పర్వతంబుల సంఖ్యంబు, లప్పర్వతమధ్యంబునం గల జనపదంబు లప్పర్వత నామంబులన చెప్పబడు నివియుత్తరగ్రామ సురాశ్రవణ కంకటక సమూలకూట క్రౌంచ కృష్ణాంగమణి పంచకూట సుపర్ణతట కుంకుభ శ్వేతాంగ కృష్ణపాద వందక సానుమత్కర తాళమహోత్కట శూక నదీ పల్లవ ప్రముఖంబులు తత్పర్వతంబులం బుట్టిన మహానదులు ప్లక్ష మహోజల కదంబ మానసిశ్యామ సుమేఘ బహుల వివర్ణశంఖ మరాళ దర్భవతి భద్రానది శూకనది పల్లవ హిమప్రాభంజన కదంబ కుశావతి విశాల కుంభక మహా మాయమానుషి యివి యొక్కొక్క దేశంబున కొక్కొక్కనది యేర్పడినవి మఱియును. 157

ఉ. ఆతతశీల రమ్యక సమాహ్వయమైన వనంబు సొంపగున్
శ్వేతము నుత్తరంబునను నీలగిరీంద్రము దక్షిణంబునం
బ్రీతిదలిర్పఁ దద్వపిన వృక్షఫల ద్రవమాను మానవుల్
ప్రోతురు దేహముల్ దివిజరూపములం బదివేల వర్షముల్. 158

సీ. దేవాద్రి యుత్తర దిగ్భాగమునను ద్రి
శృంగ శైలంబు దక్షిణమునందు
రమణీయమైన హిరణ్యకవర్షంబు
నడుమ హిరణ్యకనది తటమున
నలరు జంబీరము లభ్రలిహములు త
త్ఫలములు షడ్రస బంధురములు
ప్రాణులా రసమాని పండ్రెండు వేలునే
నూతేండ్లు బ్రదుకుచుండుదురు కామ

గీ. రూపవంతులు సమర విరోధి యూథ
మథన నిర్మిద్ర పృథువిక్రమ ప్రసిద్ధ
భుజ బలాఢ్యులునగు యక్షపుంగవులు ని
రంతరమచట నుందురు సంతసమున. 159

కం త్రొత్తై త్రిశృంగ శిఖరము
నుత్తర శృంగమ్మునకును నుత్తరపు దిశన్
హత్తుకొని కడలి దాఁకను
నుత్తర కురుభూము లమరు చుండును మహిమన్. 160

ఉ. పాలునుఁ దేనెయుం గురియు బాదపముల్ మఱికొన్ని వృక్షముల్
చేలములున్ హిరణ్యమణి చిత్రవిభూషలు నీఁ జూడు న
న్నేల సువర్ణవాలుకల నిర్మల రత్నములంజెలంగు వి
ద్యాలలితుల్ త్రయోదశ సహస్ర సమాయువులందు మానవుల్. 161

వ. ఇట్టి యుత్తర కురుదేశంబులయందు స్వర్గచ్యుతులైన పురుషులు వసి యింపుదురు తదుత్తరకురుప్రాంతంబున నతిరమణీయంబులు సమంబులునై కనుపట్టు చంద్రకాంత సూర్యకాంత పర్వతంబుల నడుమ ననేక వృక్ష సమాకులయైన చంద్రనది ప్రవహించునట్టి కురువర్షంబు

నుత్తరపార్శ్వంబున నైదువేలయోజనంబులు సముద్రంబు నతిక్రమించి సహస్రయోజనపరిమండల విస్తారంబున దేవలోకపర్యంతంబు చంద్ర ద్వీపం బమరు నందునడుమ నూఱుయోజనంబుల విరివియును బొడ వునుం గల యొక్క పర్వతంబునం జంద్రావర్తయనునది వొడమెఁ దద్వీపంబు చంద్రున కధిస్థానం బందలి ప్రజ లందఱుం జంద్రదైవత్యు లుంబ్రబ స్తబ్ధకర్ణులు దశసహస్రాయువులునట్టి చంద్రద్వీపంబునకుం బశ్చి మంబున నాలుగు వేల యోజనంబులు సముద్రంబు నతిక్రమించి దశ సహస్రయోజన పరిమండలంబైన భద్రాంతర నామధేయద్వీపంబు గలదు తద్వీపంబున ననేక రత్నశోభితంబైన భద్రాసనంబున వాయు దేవుండు సాకారుండై కొలువుండు నచ్చటి పురుషు లందఱుం గాంచన వర్ణులుం బంచసహస్రవర్షజీవులు నింక నవభేదంబగు భారతవర్షంబు వర్ణించెద నింద్రకశేరు తామ్రపర్ణగభస్తి నాగద్వీప సమ్యా గాంధర్వ వారుణ భారతంబులనం బఱఁగిన యీఖండంబు లొక్కొక్కటి వేయేసి యోజనంబులు. 162

కం. కలవా భారత వర్ష
స్థలమున నొకయేడు ఋక్షసహ్య మహేంద్రం
బులు వింధ్య పారియాత్రం
బులు మలయము శుక్తిమంతమును గులశిఖరుల్. 163

సీ. మందరశైలంబు మైనాకకుధరంబు
పాండురాచలము శ్రీపర్వతంబు
గోమంతము చకోరకూటకబు సురసంబు
వైద్యుతాహార్యంబు వాతభవము
రైవతకంబు శారదము జయంతంబు
కృష్ణ మహేంద్రంబు బూష్యకంబు
కోలాహలము చిత్రకూటము శైకృత
స్థలము తుంగప్రస్థ ధరణిధరము

గీ. నసఁగ నివియుఁ బ్రసిద్ధంబు లైనగిరులు
మఱియు నుపపర్వతంబులు దఱచు గలవు
వీని యవకాశములయందె వెలయు నార్య
జనపద మ్లేచ్ఛజనపద సంచయమును. 164

వ. ఈ జనపదంబులం బ్రవహించి కులపర్వతంబులం వలనంబుట్టిన ప్రధాన నదులు చెప్పెద-గంగ సింధు సరస్వతి శతద్రు చంద్రభాగ సరయు యమున యిరావతి చక్షుర్లౌహిత్య వితస్త విపాశ దేవిక ఋభు గోమతి భూతపాప బాహుద దృషద్వతి కౌశికి నిశ్చిర గండకి యివి హిమవంతం బునం బుట్టినవి-వేదస్మృతి వేదవతి తృణఘ్ని సింధువర్ణ నంద సదార రోమహి పరచర్మణ్వతి లయ విశద దేవత్రయ యవంతి యివి పారి యాత్రంబునం బ్రభవించినవి-శోణ జ్యోతిరథ సురక ర్తృహ మందాకిని దాశార్ణ చిత్రకూట పిప్పల కరతోయ విశాఖిక చిత్రోత్పల విశాల వజ్రవాలుక వాలుకావాహిని నక్రవతి ఋజ్వీకిరి త్రిదివ యివి ఋక్ష్య పర్వతంబున జనియించినవి-మణిజాల శుభ పయోష్ణి శీఘోద వేణువార వైతరణి పీచివారి కుముద్వతి క్రోధ దుర్గ యంతశ్శిల యివి వింధ్య పాదంబున నవతరించినవి - గోదావరి కృష్ణవేణి భీమరథి మలప్రహారి తుంగభద్ర కావేరి హేమ లక్ష్మణ కపిల యివి సహ్యంబునం బ్రాదుర్భ వించినవి-తామ్రపర్ణి యుత్పలావతి యివి మొదలైనవి మలయపర్వతం బున సంభవించినవి - త్రిసామ ఋషికల్య త్రిదివ లాంగలిని వంశవర మహేంద్రతనయ ఋషిత ద్యుతిమతి మందమందగామిని నీలపిశాచిని యివి శుక్తిమంతంబునం గలిగినవి మఱియున్నవి యన్నియును క్షుద్ర నదులుగా నెఱుంగుఁడు. 165

కం. ఈ జంబూద్వీపమునకు
యోజనములు లక్షయెప్పు నుదధియు నంతే
యోజన్ శాకద్వీపం
బీజంబూద్వీపమునకు నినుమడి విరిలిన్. 166

సీ. ఇట్టి శాకద్వీప మిరువంక లవణాబ్ధిఁ
దిరిగి వచ్చినది యీ దీవిలోని
ప్రజలు దుర్భిక్ష జరా రుజ లెఱుఁగరు
కులపర్వతము లేడు నిలుచు నచట
రెండేసి పేళ్ల నా కొండలు విలసిల్లు
నుదయసౌ వర్ణాఖ్య లొక్క గిరికి
జలధరంబును నింద్రశైలంబు నొక్కటి
రైవతకంబు నారదము నొకటి

గీ. శ్యామ దుందుభు లొక్కటి సోమరజత
కంబులొక్కటి కేసరి యాంబికేయ
మనఁగ నొక్కటి క్షేమ మహాద్రుమంబు
లనఁగ నొక్కటి యిట్లు వర్షాహ్వయములు. 167

కం. నారదమను పర్వతమున
నారద పర్వతులు పుట్టి నా రింద్రగిరిన్
నీరు గొనివచ్చి యింద్రుఁడు
సారెకు వర్షించుచుండు జగములయందున్. 168

గీ. అందును గుమారికా చారి నంద వేణి
ధేనువు గభస్తి యిక్షుమతియు ననంగ
నదులు గల వేడు వీనికి నామకములు
కలవు రెండవ యవియుఁ గొండలకు వలెనె. 169

కం. ఇనుమడి శాకద్వీపం
బునకుఁ గుశద్వీప మదియుఁ బుండ్రేక్షురసాం
బునిధిపరీతం బందును
గనుపట్టును నామయుగము కలసప్తగిరుల్. 170

సీ. కుముదపర్వతము విద్రుమమును నొక్కటి
హిమశైలమును వలాకమును నొకటి
ద్యుతిమద్గిరీంద్రంబు ద్రోణంబునొకటి చి
త్రశిలయుఁ బుష్పవంతంబునొకటి
కకుదంబును గశేయకంబును నొక్కటి
హరియును మహిషంబు ననఁగ నొకటి
మందరంబును గకుద్మంతంబు నొక్కటి
యందులో మహిషాగ్ని యగ్ని యిరవు

గీ. ధూత పాపయోని తోయధి శివ పవి
త్రాఖ్య కృష్ణ చంద్రహ్లాదిని మఱి
శౌక్లి విద్యుతాఖ్య చండ విఖావరి
మహతి ధృతి ద్వినామ మహిత నదులు. 171

కం. ఇందుఁగల పర్వతంబుల
యందమున ద్వినామయుతములగు వర్షంబుల్
క్రందుకొనియుండు మహిమఁ బు
రందరలోకమునకంటె రమ్యము లగుచున్. 172

కం. విద్వత్తిలకములార ! కు
శద్వీప ద్విగుణమై ప్రశస్తింగనుఁ గ్రౌం
చద్వీప మిక్షురస వా
ర్ధి ద్విగుణ సురాంబునిధిపరీతం బగుచున్. 173

సీ. క్రౌంచ విద్యుల్లతాఖ్యాలది యొక్కటి దేవ
వత్సరాపాహ్వాల వెలయు నొకటి
వార్షిక వామనా హ్వయముల నొక్కటి
యంధకారచ్ఛాద నాభిధేయ
విదిత మొక్కటి దేవ వింద కాంచన శృంగ
ములను పేళ్ల దొకటి పుండరీక
తోయాశనానామధేయాల దొకటి విం
దంబు గోవిందంబు నాఁగ నొకటి

గీ. క్రౌంచమునఁ గల కులభూధరంబు లనఁగ
సన్నుతికి నెక్కె నీయేడు జమిలిపేళ్ల
వర్షముల నిట్లు నామకద్వయము చేతఁ
బొదలు నీదీవిలో నేడునదులు గలవు. 174

కం. గౌరీ కుముద్వతీ సం
ధ్యారాత్రి మనోజగలును ఖ్యాతియు మిగులన్
బేరుగల పుండరీకయు
నారంజిలుచుండు సప్తనదు లాదీవిన్. 175

కం. మహి నీనదులకు సుమనో
వహయును నాతామ్రవతియు వలశిరయు సుఖా
వహయును క్షిప్రోదయు గో
బహుళయు మజతాపగయును బర్యాయంబుల్. 176

కం. క్రౌంచద్వీపము నినుమడి
యెంచఁగ శాల్మలను దాని ఘృతవారిధి వే
ష్టించి కనుపట్టు నచ్చటఁ
గొంచెంబులు గాక యేడుకులగిరు లమరుల్. 177

వ. పీతశాతకుంభ సర్వగుణ సౌవర్ణ రోహిత సుమనస కుశల జంబూనదం బులను నామధేయంబులు పర్వతంబులకుంగల వంవలి వర్షంబులకు నదులకు నివియె నామంబులు. క్రౌంచద్వీ పద్విగుణంబును దధిసముద్ర పరివృతంబు నైన గోమేధంబను నాఱవ దీవియందుఁ ద్రామరసంబునుం గుముదంబు నను ప్రధానకులపర్వతంబులు రెండు ధాతకి షంత కుముద షండంబులను దేశంబులు రెండు గోకుధ ద్వీపంబునకు నినుమడియును దుగ్ధవారిధి వేష్టితంబును నగు పుష్కరద్వీపంబునకు వర్షంబులు రెండు. క్షీర నీరసముద్రంబులనడుమ శ్వేతద్వీపంబు దీపించుఁ బాలసముద్రం బునకు రెట్టియైన తియ్యని నీటిసముద్రంబునకు నవ్వల లోకాలోక పర్యం తంబు దానికి నవ్వలం గటాహంబు నదియ పంచాశత్కోటి విస్తీర్ణంబైన భూచక్రంబునకుం గడసీమ భువర్లోకాది సత్యలోకపర్యంతంబైన యూర్ధ్వలోకంబు లాఱునుం గూడి పంచాశత్కోటి పరిమాణంబు అట్లు బ్రహ్మాండగోళంబు శతకోటి విస్తారం బిట్టి బ్రహ్మాండంబుల సంఖ్యం బులు ప్రతికల్పంబున నేకోదకమగ్నంబులైన బ్రహ్మాండంబుల నారా యణుండు వరాహరూపంబున రసాతలంబు తలన నుద్ధరించి మున్నటి యట్ల నిలుపుచుండు మహాత్ములారా! యిట్లు భూగోళప్రకారంబు చెప్పితి; మీకు భద్రంబౌనని రుద్రుండానతిచ్చి వియచ్చరు లచ్చెరుపడ సపరివారం బుగా నదృశ్యుం డయ్యె నని కుంభసంభవుండు భద్రాశ్వునకుం జెప్పె. నని వరాహదేవుండు చెప్పిన విని రసాసారసాన తరువాతి వృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. 178

మ. ప్రకటీ భూతచమూసమూహ రభసాక్రాంత ప్రతీపక్షప
క్ష్మకవాటద్వయవత్పురా ర్యశిక దృక్ర్పాకార సంలీన పా
వకలజ్జావహదోహ ప్రతాపగరిమ వ్యాప్తాఖిలాశాంతరా
శ ! కరాశాహిశయాన శౌరి సుఖతల్ప స్వాంతనీరేరుహా. 179

కం. ఆరట్ట తురంగమధా
టీరేణు పరంపరా ఝుదితి శోషిత వీ
రారి వధూజన కరిమక
రీ రచనా సంగతాంగ శృంగారాబ్ధీ. 180

పృథ్వి. తత్సరుస్థ కనకచ్ఛవిస్థగన జాత రూపాంబుజ
స్ఫురత్కర కృపాణికా దళిత శూర పృథ్వీతలే
శ్వరౌఘకృత భేదన శ్రమభవభ్రమ ప్రస్ఖల
త్తరాంశునికటావలంబన నిధాన దండధ్వజా. 181

గద్యము. ఇది శ్రీ మదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంటనాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీవరాహపురాణం బను మహా
ప్రబంధంబు నందు దశమాశ్వాసము.



# వరాహ పురాణము

## ఏకాదశాశ్వాసము

—*—

శ్రీరామానఘగుణ ల
క్ష్మీరామా రమణభక్త కీర్తి జితహిమా
నీ రామాహిప మందా
రారామా ! యీశ్వర క్షమాధిపు నరసా. 1

వ. అవధరింపు మవ్వరాహదేవుం డచల కిట్లనియె నట్లగస్త్యుండు తనకు రుద్రుం డానతిచ్చిన కథలు చెప్పి భద్రాశ్వనరేశ్వరు నాశీర్వదించి నిజాశ్రమంబునకుం జనియె నింక నేమి వినవలతు వనినఁ బుడమి వినయావనతయై. 2

కం. కొందఱు శంభుని బ్రహ్మం
బందురు మఱికొంద ఱిందిరాధిపుఁ బరమా
త్మందురు కొందఱు చతురా
స్యుం దత్త్వం బందు రాదిసూకరనాథా ! 3

కం. ఎప్పుడు నీ సందేహము
ముప్పిరిగొను నాదు చిత్తమున నిది దెలియం
జెప్పు మనఁ గపటకిటివరుఁ
డప్పుడమికి నానతిచ్చె నతివిశదముగాన్. 4

శా. శ్రీనారాయణుఁ డాద్యుఁ డిందరికి నీరేజాతగర్భుండు త
త్సూనుం డాతని కుద్భవించె నిటలాక్షుం డమ్మహాదేవుఁ డ
జ్ఞానధ్వంసి తదీయవర్తనము లాశ్చర్యావహంబుల్ ధరి
త్రీ ! నీకు న్వినిపింతుఁ గొన్ని విను నిర్ణిద్రానురాగంబునన్. 5

కం. తొల్లి యొకనాఁడు మురభి
ద్భల్లుఁడు కైలాసశిఖరిపై గిరిజయుఁ దా
నెల్ల జగంబులు గొలువఁగ
ముల్లోకము పారుపత్యము విచారింపన్. 6

కం. తలఁచుట యెఱింగి చతురుఁడు
శిలాదసుతుఁ డాయితంబు చేయించె సము
జ్జ్వల రత్న తోరణాదిక
ముల వెలుపటి కొలువుమేడఁ బురహరుఁ డంతన్. 7

సీ. భువనమోహనమైన పువుదండ చల్లని
గాడ్పులు జడలతోఁ గడలు కొనఁగ
ధాతుమించిన మంచి తమ్మంట్లరాగంబు
శ్రవణభాగంబుల సందడింప
ప్రమదాస్పదంబైన పట్టురెంటెము కటీ
రస్థలిఁ గరము విభ్రమము చూప
తనువుపైఁ జిట్లు గంధము సౌరభంబులు
సరిలేని రతివిలాసములు నెఱప

గీ. కొండరాయనిముద్దులకూతు కరము
నిజకరంబునఁ గీలించి నిగమవేత్త
హస్త హుంకృతి ముందట నంబరస్థ
లంబు దాఁకంగ నాహజారంబు చొచ్చి. 8

శా. ఓహో ! భైరవ ! నీల ! రుద్ర ! నిలు సాహో వీరభద్రేశ కుం
బాహూ రాకు నికుంభ యంచు వడి సమ్మర్దంబు వారించుచున్
బాహూత్తంభిత వేత్రవల్లి గదలన్ దండప్రభుం డుద్ధత
వ్యాహారంబులచే బరాబరులు చేయన్ రత్నవేదిస్థలిన్. 9

సీ. విజయాకరాంబుజ వ్యజనానిలంబులఁ
దూలు కుంతలములు దువ్విదువ్వి
ప్రమథుల వికృతవేషములు చూడు మటంచుఁ
జెవి చేరి మెల్లనె జెప్పి చెప్పి
పగిడి బింగన్న కోడిగములు వీక్షించి
హాసంబుతోఁ జెయి వ్రేసి వ్రేసి
తనచేత నుండక వెనకయ్య గినిసిన
నెత్తుకొమ్మని చేతి కిచ్చి యిచ్చి

గీ. చిత్త మిగురింప వేడ్కలు బిత్తరింప
నవయవంబులఁ బులకంబు లంకురింప
శైలకన్యయుఁ దానును సరసగతుల
మేల మాడుచు నొకగద్దెమీఁద నుండి. 10

వ. గండక పుండరీక శుండాల గంధభేరుండముఖులును రుక్షచక్షుశ్శ్వో హర్యక్ష తరక్షు సదృక్షముఖులును శరభ కరభ సైరిభ సన్నిభ ముఖులును గాకఘూకకోక సూకరభీకరముఖులును గుక్షిముఖులును వక్షోముఖులును హస్తముఖులును మస్తముఖులును బశ్చాన్ముఖులునుం దిరశ్చీన ముఖులును మొదలైన ప్రమథులును జేగురింపు జడలును నిరులు కవియు మెడలును జలివెలుంగు తునుకలుఁ బ్రామినుకులదొర పునుకలు జేసి చూపులు ముమ్మొనల చేవ్రాపులు మలకల పేరులు వలపుల నీరులుం గల సారూప్యధారులు నగస్త్య పులస్త్య శాండిల్య మాండవ్య రైభ్య బాభ్రవ్య ప్రముఖనిఖిలసంయములు గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాదిదేవయోనులు సముచితప్రకారంబున సేవింప వారల

నాదరింపుచుఁ బేరోలగంబుండు నవసరంబునఁ బురుహూత ప్రభృత దేవతా వితాన సమేతుండై విధాతయేతెంచిన యథావిధానంబున బహూకరించి కరుణారసవిభూషితంబులగు భాషితంబులం బితామహా ! యీ మహేంద్రాది బృందారకు లందఱుం గందిన ముఖారవిందంబులం గుందిన డెందంబుల నున్నవారు తారు దైతేయ వీరులచేతఁ బరాభూతులు గాదుగదా ! వీరలిచ్చటికి వచ్చిన నిమిత్తంబు చెప్పుమనిన వనజభవుండు వినయంబున. 11

శా. దేవా ! రక్కసుఁ డొక్కరుం డతిబలోద్రేకంబునం దాడి రా
ధావద్ధంతి విహస్తబస్తము పతద్వాహారి మొహన్నరం
బావల్గ న్మకరంబు భీతమృగ మార్తాశ్వంబు భగ్నోక్షముం
గా వైకల్యము బొందు నింద్రముఖ దిక్పాలాలయ గ్రామముల్. 12

కం. ఈకరణి సార్వకాలము
రాకాసి మదంబు కవిసి రాకం బోకం
జీకాకు పఱుప వేసరి
నాకౌకసు లెల్లవచ్చి నాకెఱిఁగింపన్. 13

సీ. ఎల్లభక్తులకును గొల్లగా వేఁడిన
వరము లీఁగల వ్యయవాదికాఁడు
సచరాచరప్రపంచమ్మును బాలించు
దాచఱికమ్ము కాణాచికాఁడు
మిక్కిలి కనుమంట మింటఁ బాఱుపురాలు
భస్మంబు చేసిన పంతగాఁడు
కోలాహలాభీల హాలాహవిజ్వాల
మెడబంటి మెసఁగిన మేతకాఁడు

గీ. శంభుఁ డుండంగ మనలకీ శంకయేల !
రండు పోద మటంచు నాఖండలాది
సురలఁ దోడ్కొని యేను దేవరకుఁ దెలియ
విన్నవించుటకై పని వింటి నపుడు. 14

ఉ. నిత్యము నిర్వికల్ప మతినిర్మల మీ భవదీయమైన దాం
పత్యము కన్నులారఁ గనుభాగ్యము మా కొనఁగూడెఁ గాన సం
స్తుత్యము నేటివాసరము సోమ కళాధర ! నీకు గౌరికిం
గృత్యము లోకరక్షణము క్రీడలు రాక్షసశిక్ష నెప్పుడున్. 15

సీ. జ్ఞానంబు నీవు మోక్షంబు దాక్షాయణి
ఫలము నీవు తపంబు భద్రకాళి
మంత్రంబు నీవు సామర్థ్యంబు చండిక
ప్రాణంబు నీవు దేహంబు దుర్గ
ప్రామినుకులు నీవు ప్రణవంబు పార్వతి
చవియునీ వమృతంబు సకల జనని
భక్తియు నీవు విరక్తియు శాంభవి
యర్థంబ నీవు వాక్యంబు గౌరి
గీ. శక్తిలో నీవు నీలోన శక్తి యెపుడుఁ
బాయకుందురు భాస్కర ప్రభలు వోలె
నీ రహస్యంబు మదిలోన నెఱుఁగ లేక
మొత్తు లాడుదురు రూఢక మత్తిగాంధ్రు. 16

కం. అని యిట్లు పెక్కు భంగుల
వినుతించి విరించి తన్ను వీక్షించిన నా
కనకాచల కోదండుఁడు
వనజోదరుఁ దలఁప వచ్చె వారలు ముగురున్. 17

శా. ఏకీభావముతోడ నొక్క రొకరిన్ వీక్షింప నా చూపులన్
రాకాచంద్రనిభాస్య కోకకుచ నానారత్న భూషాంగి ది
వ్యాకారంబున నొక్కకన్య జననం బయ్యెన్ దనుచ్ఛాయలా
శాకాశావని మండలిన్ దిమిరసంధ్యాచంద్రికల్ చల్లఁగన్. 18

సీ. ఆమూఁడు వర్ణాల లేమ కోమలహాస
భాసమానకపోలభాగ యగుచు
హరిహర బ్రహ్మాది సురల విలోకించి
కలకంఠకల కుహూకార చారు
భూషణంబుల నీ ప్రపంచంబు సర్వంబు
గన్న మహామాయ నన్ను మీర
లెఱుఁగరే ! మీ కోరి కేమైనఁ దీర్చెదఁ
జెప్పుఁడటన్న నా చెలువఁ జూచి

గీ. నలువయును వెన్నుఁడును జలివెలుఁగుఁ గాల్పు
నో మహాశక్తి ! వినుము నీ నామకంబు
త్రికళ యిటమీఁద నీ చేయు ప్రకట విక్ర
మముల మఱియును బెక్కు నామములు గలవు. 19

వ. ఇంక నొక్క కారణంబు గలదు భవదీయ దేహ వర్ణత్రయంబు విభజించి మూర్తిత్రయంబుఁ గల్పింపు మనిన నద్దేవతామతల్లి పింఛతాపింఛ రింఛోళి నీలిచ్ఛాయంబగుచు నొక్కకాయంబును సంధ్యారాగ సౌగంధిక బంధూక బంధురుచి ప్రవాహంబగు నొక్కదేహంబును హార కర్పూరతారనీహార గౌరంబగు నొక్క శరీరంబును వహించె; నందులో ధవళవర్ణయు వీణా పుస్తకపాణియు బ్రహ్మశక్తి చరాచర వ్యాపకత్వంబు గోరి తపంబుచేయ వలసి ధాతచేత ననుజ్ఞాతయై శ్వేతపర్వతమునకుం జనియె రక్తవర్ణయు శంఖచక్రపాణియు లోకపాలినియు విష్ణుమాయాభిధానయునగు విష్ణుశక్తి ముకుందునిచేత ననిపించుకొని మందర కందరంబునకుం దపంబు సలుప నరిగె; నీలవర్ణయు శూలపాణియు దంష్ట్రాకరాళి నామధేయము జగత్సంహారకారిణియు నగు రుద్రశక్తి నీలకంఠునకుం జెప్పి నీలశైలంబునకుం దపంబు చేయనరిగె నప్పుడు హరివిరించి ప్రముఖ నిఖిల గీర్వాణులు దుర్వారపూర్వగీర్వాణగర్వ సముద్రంబు లింక నింకునని సంతసించుచు నుమామహేశ్వరుల వీడుకొని, తమ తమ నివాసంబులకుం జనిరంతటం గొంతకాలంబునకు. 20

కం. గిరిశుఁడు తన సర్గం
బౌరీతిఁ బ్రయాసపడ్డ నీడేరక ని
ష్కారణకు హానిఁ బొందఁగ
సారెకుఁ గావించి మిగుల సదమద మగుచున్. 21

గీ. నీటిప్రాలకరణి నేటికిఁ దోడ్తోన
సృష్టినష్టమయ్యెఁ గష్టమనుచు
జ్ఞాన దృష్టిఁ జూచి నైజశక్తిఁ దపంబు
సలుప శ్వేతగిరికిఁ జనుటఁ దెలిసి. 22

ఉ. ఆ గిరికేఁగి చూచెఁ బరమామృత మాకృతిఁ దాల్చి నిల్చెనో
నాఁగ వెలుంగుచున్ గరమునం జపమాలిక పూని లీల నే
నేగతిఁ బద్మజాండము లనేకము లెప్పుడుఁ ద్రిప్ప నేర్తు నన్
బాగునఁ ద్రిప్పుచున్న తనప్రాణపదంబగు సృష్టిదేవతన్. 23

సీ. కాంచి కల్యాణి యేకాంక్షఁ గావించెదు
నిష్ఠురతప మతినిష్ఠ నీవు
మెచ్చి వరంబులీ వచ్చితి నడుగుము
నా బ్రహ్మసృష్టి యిన్నాలువతోడ
నొక వంకనడఁగి యేనుండఁగ నోప స
ర్వాగతత్వ మిమ్మన్న స్రష్ట దద్వ
రం బిచ్చి తనశరీరంబున నా దేవి
జలముఁ బాలును వోలెఁ గలసి కొనియె

గీ. నది మొదలు సృష్టి వర్ధిల్లె ననలుఁ గొనలుఁ
బాఱి బ్రహ్మకు మిక్కిలి నూఱటయె
శక్తి గలిగిన కతన నశక్తులైన
వారిచేఁతలు కొనసాఁగి వచ్చునెట్లు. 24

కం. వనజభవుఁ డపుడు సంతస
మున దనశక్తిం దలంచి పొగడఁ దొడంగెం
గనకగిరి శృంగ రంగ
త్ఘనదీఘన దీర్ఘలహరికాఘుమఘుమికన్. 25

రగడ. శ్రీవాగీశ్వరి ! సృష్టి వ్యాపిని ! భావితనిగమ ప్రకారాలాపిని !
తార తారకా ధవధవళాంశుక ! సారసమృదుకర సంభృత సితశుక !
శరణాగత జన సర్వ సిద్ధికర ! సనకాదికహృత్స్వాధ విహారిణి !
సర్వభూతమయి! సర్వాక్షరమయి! సర్వతత్త్వమయి ! సర్వసిద్ధిమయి !
జగదంబ ! సరస్వతి! విద్యేశ్వరి ! సగుణ నిర్గుణాశ్రయ! పరమేశ్వరి !
యేకాక్షరయుననేకాక్షరయును ! నాకాశామృతమ మృతాక్షరయును
జ్ఞాననిధియుఁ బరశక్తియు నను నభిధానము లెప్పుడుఁ దాల్చుచుఁ గడునభి
రామ రూపయగు బ్రాహ్మివి నీవని! కామజనని రక్తచ్ఛవి పావని!
అపర యనెడు నారాయణి నీవని! విపుల తనుద్యుతి విజితోత్పలయని
శబలుని కిశాశక్తియు నీవని ! ప్రబల పరాపర రౌద్రివి నీవని
సృష్టియు నీవని స్థితియును నీవని! తుష్టియు నీవని తుదియున్నీవని
ప్రణవము నీవని బ్రహ్మము నీవనిఁ యణురేణు తృణాద్యంబులు నీవని
యెఱిఁగిన వారికి నిహపర సుఖములుఁ దఱుగవు తొలఁగును
దవ్వుల నఘములు
వేల్పుల కొలకై వివిధాకారము దాల్పఁగ నీకిది దగిన విహారము
క్రొన్నెల తాలుపుఁ గొలిచిన భక్తులు నిన్నెఱింగి సంధింతురు ముక్తులు
స్వస్తికారిణీ ! చాఁగులు నీకునుఁ బ్రస్తుత సద్గుణ ప్రణతులు నీకును
మంత్రాకార ! నమస్కృతి నీకును తంత్ర ఫలప్రద దండము నీకును
చిదమృతసారమ ! జేజే నీకును మొదలిదైవతమ మ్రొక్కెద నీకును. 26

కం. ధాత్రీ ! ధాత్రీరితమగు
నీత్రికళా స్తవము చదివి ఋతుమతులమృగీ
నేత్రలఁ గూడినఁ గలుగుఁ బ
విత్రులకుం బుత్రపౌత్ర విభవ సమృద్ధుల్. 27

మ. వినుమింకన్ముపు మంధశైలమునకున్ విచ్చేసి తద్రమ్యసీ
మనిరూఢామర భూజవాటమునఁ గౌమారవ్రతాసక్తి నుం
డిన నారాయణి రాజసప్రకృతితో నిష్ఠం దపం బాచరిం
చె ననేకాబ్దము లంత నయ్యబల రోషించెన్ బ్రయాసంబునన్. 28

వ. ఇట్లు రోషమందర క్షుభితంబైన తద్దేవి దివ్యచిత్తంబను దుగ్ధసాగరంబు నకు నచ్చరలై స్వయంప్రభ విద్యుత్ప్రభ చంద్రప్రభ సూర్యప్రభ చంద్రకాంతి సూర్యకాంతి చారుకేశి సుకేశి మంజుకేశి యూర్వశి గంభీర విభావరి చారుముఖి చారుకన్య ధన్యహాలిని శీలమండన దేవగీతి యపరా జిత జయ విజయ జయంతి గిరిసుత ఘృతాచి విశాలాక్షి పీనపయోధర మొదలైన కుమారికలు పాశాంకుశంబులు కరంబుల మెఱయఁ గోట్ల కొలఁదు లుద్భవించి యేటి ముత్తముల తమ్ములగు కురులు కలుపల వలపించు కలికిచూపులు పులుకడిగిన ముత్యంబులతోడి పవడంబుల డంబు లడంచు దరహసిత లసితాధరంబులుధరమ్ముల గౌరవమ్ము వమ్ముచేయు వలిగుబ్బలు బలుజోదుమరుని కోదండంబు దండంబులిడు నడుములును ములుబంతుల పరుసునం బరుసనగు కరికరంబులకు నౌన్నత్య ప్రసిద్ధి సిద్ధించిన నిజజఘనభాగములు గములుగూడి వచ్చినం గదలి కదలికల కలహము సరకుఁగొనని మనోహరోరుస్తంభంబులు భంబులు చూపురుచులు చులుకజేయు పాదనఖంబులుం దనర మత్తిల్లి విరహుల ముత్తములం దుత్తుమురుగా మొత్తు చిత్తజుని కత్తిహత్తిన నెత్తు రులతోడం బొత్తెత్తుచేయు మెత్తనిచరణంబుల క్రొత్తలత్తుకల మంద మందగమనంబు నందంబు నందంద పొగడు వంది బృందంబు చందం బునం గ్రందుకొన మొఱయు నందియల దట్టంబుగాఁ బొడుపుగట్టు మిట్టల పట్టులంబట్టిన బాలాతప ధట్టంబులై చూపట్టు నెటివట్టి గట్టి పిఱుం దులం గట్టిన కెంబట్టుపుట్టంబుల శంబరారి యను దొంబరి విడంబం బునం దూర నంబరంబునం బన్నిన వలయంబులనం బొలుచు నవ లగ్నంబులవిలగ్నంబులగు నొడ్డియాణంబుల శృంగార తరంగ రంగంబు లగు యౌవనవన సముత్తుంగ కుడుంగంబుల తెఱంగున రంగుమీఱు మెఱుంగుఁ జనుంగవలం గిసలయ భృంగ సంగీత ప్రసవభంగి నంగీక

రించు నీలమాణిక్య మిశ్రిత మౌక్తికహారంబుల నిచ్చలంపు వలవుల మచ్చుచల్లి విచ్చలవిడి నిచ్చలు నిచ్చరాచరంబు మోసపుచ్చు పచ్చవిలు తుని మెచ్చులవల్లెత్రాళ్ల నచ్చట నచ్చటం గ్రుచ్చిన పలువన్నెకుచ్చుల యచ్చున హెచ్చు కరమణి కేయూర కంకణాంగుళీయకంబుల వెక్కసపు టక్కజంపుఁ దెలుపునం జుక్కలజేని నెక్కసెక్కెమాడి తళుక్కు తళుక్కుమనుచు నొక్కటఁ బిక్కటిలు వజ్రకుండల రుచుల పెక్కువతో మక్కువ సలుపు మిక్కిలి చక్కని చెక్కులకాంతిలహరికలోని మకరి కల విప్పుగల నాచుకుప్పల నడిమి వగడంపుఁ దీగెల చొప్పందప్పునట్టి కప్పులఁ దెప్పలగు కొప్పులనొప్పు చందిరంపుఁ బాపటల ప్రభాపటలంబు లినుమడించు దేహంబుల విలసిల్లుచు నలుగడల సేవించి నిలిచినం జూచి రజోగుణ ప్రధానయు నపరాభిధానయునగు తన్నారాయణి యాకుమారికా సహస్రంబులకు నాకునుం దగిన నగరంబు గల్పింతునని సంకల్పించిన దత్ప్రభావంబున. 29

సీ. పరిభూవలోకన ప్రాప్తాపరాంబుధి
భ్రమపతిష్ఠ బ్రధ్నరథ హయంబు
నిక్షిప్తమణిమిళ న్నక్షత్రమండల
ధ్యాసిత వప్రమధ్యస్థలంబు
సౌధవీధీ మహోత్సేధ వీక్షోద్గ్రీవ
మైరవ శిఖరగామరపురంధ్రి
త్రైవిక్రమాంఘ్రి నిర్దళద జాండ స్రుతా
వరణాంబు విభ్రమ ధ్వజపటంబు

గీ. ప్రమదవనజాత మందార పారిజాత
మధుర మధురస గంధాంధ మధుపగీత
గుణిత విద్యాధరీ పాణిమణి విపంచి
వాదనము నగునొక పుట భేదనంబు. 30

కం. హాటకమెం గవ్వపు గుబ్బలి
నడుమ నెత్తము మీఁదఁ గుందనపుఁగొండఁ జెలం
గెడు వేల్పుపికిడిచెలువము
తడకట్టఁగఁ జాలు నొప్పిదంబుల తోడన్. 31

కం. ఆ రాజధాని సీప
ష్మారుహవృత కల్పవృక్షమధ్యస్థితచిం
తా రత్నసౌధవీధిక
నారూఢ మృగేంద్రపీఠయై మహిమమునన్. 32

సీ. శ్రుతులాకృతులు దాల్చి నుతులు గావింపంగ
నానాసిలింపులు నతులు చేయ
మునులాగమ రహస్యములఁ బూజనములు సల్ప
నప్సరస్త్రీలు నాట్యంబు చూప
కిన్నరాంగనలు సంగీతంబు వినిపింప
సనకాదియోగులు జయలు వెట్ట
విద్యాధరలు రుద్ర వీణలు వాయింప
గరుడోరగము లూడిగముల మెలఁగ

గీ. నిజకుమారీ కరాంబుజ వ్యజనచలిత
వక్రచికురాళి శృంగారవార్ధి సుళ్లఁ
బోల విష్ణుని శక్తి పేరోలగమున
నుండ నారదమునిపుంగవుండు వచ్చి. 33

మ. తనదే హచ్చవిలోనఁ గన్యకలుఁ దత్కన్యాతనూదీప్తిఁ దా
నునుఁ గానంబడి వారికిం దనకు నెందున్ భేద మొక్కింతలే
దని సూచించిన రీతిఁ గన్నులకు విందై నిల్చు నవ్వైష్ణవం
గని భక్తిం బ్రణమిల్లి తత్ప్రచిత సత్కారంబులం బొందుచున్. 34

శా. ఆలాపంబులఁ బెక్కు నేమముల తాయంబుల్ ప్రయోగంబులున్
దాళంబుల్ మొరయంగ రాగముల నానాతానమానంబులన్
డాలున్ రక్తియు రేఖయున్ సరళియున్ రాణింపఁ దద్వైష్ణవీ
లీలా చిహ్నిత గీతముల్ మహతిఁ బల్కించెన్ విచిత్రంబుగన్. 35

మ. అపుడానందజమందహాసములు గండాభోగముల్ నింద న
య్యపరాశక్తి మునీంద్ర ! వచ్చితివి కార్యంబేమి గాంక్షించి నా
విపులా నాగనివాస నాకముల సంవీక్షించి వైధాత్ర రౌ
ద్ర పురంబుల్ గని దేవి ! నిన్నిచట సందర్శింప నేతెంచితిన్. 36

చ. హరు నెఱగంటఁ గ్రమ్మందిన లతాంతశరున్ భవదీయమైన బి
త్తరి కడగంటి చూపులు సదా సృజియించు ననేకమూర్తిగా
హరిహరరూపుఁ ద్రాయము ననన్యవధూ సులభంబులైన నీ
కరణి విరక్తి చిత్తమునఁ గైకొని నిల్చుట చోద్యమెంతయున్. 37

సీ. అని ప్రశంసించి సాష్టాంగంబుగా మ్రొక్కి
తద్దేవి వీడ్కొని ధాతృసూనుఁ
డభ్రమార్గంబున నరుగుచు మదిలోనఁ
గలహంబునకు సందుగలిగె నింత
కాలంబునకు నంచు గంతులు వైచుచు
సంభ్రమంబునఁ బోయి జలధి నడుమ
భర్మ నిర్మితమైన పట్టణంబున రమ్య
హర్మ్య సీమమున సింహాసనాధి

గీ. రూఢుఁడై యున్న మహిషాసురుని సమీప
మునకుఁ జని తత్కృతాతిథ్యములకు మెచ్చి
రదనములు పిన్నవెన్నెల వెదలు చల్ల
నానిశాచరమండలాధ్యక్షుతోడ. 38

కం. దానవనాయక ! నీకుం
గానుకగా మేలువార్త గలిగినఁ జెప్పం
గా నరుదెంచితి నది విను
మా ! నిన్న వినోదమునకు మందరగిరికిన్. 39

చ. అరిగి తదగ్రభాగమున నబ్జభవాండముతోడ ద్రాయు ను
ప్పరిగలఁ జూడనొప్పు నొకపట్టణమున్ గనిచొచ్చి తత్పురిన్
సురమణిమంటపంబున మనోహరమూర్తి ననేకకన్యకా
పరివృతఁ జొక్కపుంగొమరుప్రాయపుఁ జక్కనిలేమఁ జూచితిన్. 40

కం. ఆ చెలువ రూపసంపదఁ
జూచిన మిము బోటులెల్లఁ జొక్కుట చిత్రం
బా ! చిన్మయులగు తపసులు
చూచినఁ బరవశతఁ బొంది చొక్కుదు రనినన్. 41

గీ. దేవగంధర్వ దానవాధికులు భక్తిఁ
గన్నుసన్నలఁ దనకూడిగములు చేయ
నెపుడుఁ బేరోలగం బుండు నేమిచెప్ప
నాకురంగాక్షి మహిమంబు లసురనాథ ! 42

ఆ. సిద్ధయువతిమస్త సిందూరమంటు త
త్కన్యకాలలామ కాలిగోరిఁ
బోల నోపఁ డుదయపూర్ణేందుఁ డింక నా
బాలనెమ్మొగంబుఁ బోలుటెట్టు. 43

కం. కుందనపుఁ గాహళంబులు
పొందెఱుఁగక యెన్నిబిరుదములు పలికినఁ ద
మ్మం దదుకు లనుచు నాలిక
నిందీవరనయన జంఘ లీరస మాడున్. 44

గీ. కర్కశంబులు నలుపులు కంపమాన
ములు సదా ధూళిధూసరములు కరాళ
ములు కరికరంబు లాపుప్పఁబోడి మోహ
నోరువులఁ బోలు ననుట వక్రోక్తిగాదె. 45

గీ. ఆ మృగాక్షి ఘనకటీమండలంబుతోఁ
సరికిఁ బెనఁగ వచ్చు సైకతముల
గౌరవంబు గుట్టు గానంగ వచ్చుఁ బో
తెలియ నేరుపాటు గలిగెనేని. 46

కం. అతనుఁడు చుట్టిన శైశవ
లత దివిచిన చోటితరుల లాగున లావ
ణ్య తరంగితమైన వళి
త్రితయము దీపించుఁ దత్సతీమణి నడుమన్. 47

ఆ. వదనచంద్రికా ప్రవాహంబు దిగజాఱి
సందులేని ఘనకుచముల నడుమ
నరుగరాక తొట్టె నన మించు నాచకో
రాయతాక్షి తారహారతతులు. 48

కం. పలుచని నాతో సరియె
దళమగు లేమావి చిగురు దా నని నగు నా
లలనాధరము పరిప్రతి
ఫలిత లలిత దంతరుచి నెపంబుగ నెపుడున్. 49

కం. ఏచిన తన నిడువాలు వి
లోచనముల చెలువమునకు లొంగి జలజముల్
కైచెఱ యిచ్చె ననం గే
లీచాలితనలిన మాకలికి ధరియించున్. 50

కం. ఇన్నియుఁ జెప్పఁగ నేటికి
మిన్నక జఘనావలంబి మేచకవేణీ
పన్నగ ఫణమణులన నా
కన్నియ కురులం గదంకళికలు చెరువున్. 51

గీ లలితలావణ్య తారుణ్య లక్షణముల
నపరలక్ష్మియటంచు నయ్యబల మీఁద
నలిననాభుండు కనువేసినాఁడు గాన
కోలు ముందుగ నీవ చేకొనఁగ వలయు. 52

శా. ఆ కాంతామణి కంకణావళులు మ్రోయన్నీదు వక్షంబుపై
నాకాంక్ష న్నఖరక్షతాంకములు చేయన్ నూతనాలిప్త లా
క్షాక్రాంఘ్రిహతిన్ శిరంబునకు రక్తచ్ఛాయ పుట్టింపఁగాఁ
జేకొమ్మా ! విషమాస్త్ర కేళికలహశ్రేయోభవానందముల్. 53

సీ. మెప్పించినాఁడవు మితిమేరలేని త
పో మహత్వమున నంభోజభవుని
నొప్పించినాఁడవు నుగ్రనూచములుగా
బలభేదిముఖ్య దిక్పాల బలము
తెప్పించినాఁడవు త్రిభువనంబుల నపూ
ర్వములైన వివిధ సువస్తు లెల్ల
కప్పించినాఁడవు గాఢతరప్రతా
పానలచ్ఛటలఁ జరాచరంబు

గీ. నిట్టి భాగ్యంబునకుఁ దలకట్టు గాఁగ
రాక్షసేంద్ర ! "శుభస్య శీఘ్రం"బనంగఁ
గట్టు దేవేరిపట్ట మా కమలవదన
కంచు నెగపోసి నారదుం డరుగుటయును. 54

కం. బలభేది ఛిదురధారకుఁ
దలకని తనమానసంబు దర్పకబాణం
బుల నీతలాతలైనం
దలకొను తాపమున మహిషదానవుఁ డాత్మన్. 55

సీ. ఆసక్తి నా లేమ యౌవనవనములో
నెన్నండు విహరింతు నేసరేఁగి
లీల నాకోమలి పాలిండ్ల కస్తూరి
రొంపిలో నెన్నంతు బ్రుంగు డౌదు
లేవ నాజవరాలి లావణ్యసరసిలో
మునుఁగుదు నెన్నండు మునవు దీఱ
నీహ నామోహిని బాహుపాశంబులఁ
దడయక యెన్నండు దగులు వడుదు

గీ. నంచు జింతించు సుస్సురటంచుఁ బొరలు
మరులుకొని రణభోజనమౌని వచన
రచన మారణ మంత్రాక్షర ప్రభూత
ఘోర విరహ భూత మహావికారమునను. 56

వ. ఇవ్విధంబున నంతకంతకు వలవంత బలవంతంబైన సైరింపలేక సైరి భాసురుం డొక్కనాఁడు విఘన ప్రఘన విభావసు విద్యున్మాలి సుమాలి శంకుకర్ణ కృతపర్వతాభిధానులం దన ప్రధానుల రావించి వారి నాలోకించి నాఁడు నారదుం డెఱింగించిన మందరపర్వత స్థితకన్యకా వతంసంబు నామనంబునం బాయనికతంబునఁ బునఃపున రుద్భూత విరహసంజ్వరభరంబున మిగుల నొగిలితి నింక నిశ్శంకంబున వేలుపుల పొంక మింకింపక తత్పంకరుహముఖిం బరిగ్రహింపరాదు. దీనికి నుచితం బగు నుపాయంబుఁ దలంప వలయు ననిన వారిలోనం బతిహిత సమేత నీతి చాతురీధురీణుండు ప్రఘనుండు సభాసదులం గలయం గనుంగొని పేరెలుంగున మీరెఱుంగుదురో యెఱుంగరో కాని తదంగన సామాన్య కన్యకా

మాత్రంబుగాదు జగత్త్రయ ధాత్రియగు విష్ణుశక్తి కాని హానికి మూలంబు సుమీ యీ నెలఁతకు నట్టు దలంచుట విశేషించియు గురుభృత్యస్త్రీ సామంతకాంత లగమ్యలు విష్ణుండు సర్వలోకగురుండు తత్పత్నీహరణ ప్రయత్నంబు కొఱగాదు. వాదులు ప్రోదులు చేయు మునిముచ్చు బోధలు వినం బనిలేదని చెప్ప నప్పుడు విఘనుండు మహిషాసురు విలోకించి దేవా! ప్రఘనుండు నిజంబ విన్నవించె నైన నమ్మానవతి మొదల సామవాక్యంబులం బ్రార్థించి యిష్టవస్తువు లొసంగి భేదం బాపాదించినం గైవసంబుగాదేని పిదప బలాత్కారంబునఁ దోతెంత మనిన విని తక్కిన మంత్రు లందఱు నిది వివరంబగు ననిన విఘనుం బ్రశంసించి శస్త్రశాస్త్ర విశారదుండును శౌచశౌర్యసమన్వితుండును మాయాకోవిదుండునగు విద్యుత్ప్రభుండను వాని నద్దేవి కడకు దౌత్యంబునకుం బనిచి, తారును కురుశైలంబునకు దాడివెడలం దలంచి పడవాలు విరూపాక్షు నీక్షించి ఫౌఁజు లాయితంబు చేయు మనిన నాఁడును హజారంబు వాకిట నిలిచి సంవర్తఘస్మర ఘనాఘన ఘటాఘోష భీషణంబుగా జైత్రయాత్రానకంబు చఱపింప నప్పురంబు నలువంకల. 57

హరిణి. అభినవ ఖరప్రభశ్యచ్ఛేషోత్తమాంగ శతాంగముల్
రభసవిరస త్రైస్నోర్యదస్యత్తరంగ తురంగముల్
క్షుభితకుల భూభృత్తుంగ త్వాంగశోభ మదేభముల్
ప్రభృత కనకోదంచచ్చాపక్షుర ప్రభట ప్రభుల్. 58

కం. వెడల నగరంబు వెలుపటఁ
బడవా లేర్పఱచి పెక్కుఁ ఫౌజులు చేసెన్
గడ లేక వెల్లి విరిసెన్
గడ లేకతమున నటంచు ఖచరులు బెదరన్. 59

ఉ. అప్పుడు కామరూపి మహిషాసురుఁ డేనుఁగు నెక్కి సన్నడో
ల్చప్పుడు వేఁగకుప్పలు చలాచలిఁ బొందఁగ దాడివెట్టి వా
తప్పక నాకపట్టణ ముదగ్రత దగ్గఱఁ జూచి వేలుపుల్
ముప్పదిమూఁడుకోటు లొకమూఁకయి వెల్వడి మోహరించుచున్. 60

కం. దివిజేంద్ర ప్రభృతుల దం
త్యవి మహిష నృమకర హరిణ హయ వృషములపైఁ
బవిశక్తి దండ ఖడ్గ గు
ణవీజన గదా త్రిశూల నర్తనకరులై. 61

స్రగ్ధర. యుద్ధక్రుద్ధాక్షి నిర్యద్ధుతవహములతో నుద్ధురాహంక్రియా సం
బద్ధక్ష్వేళా సమిద్ధార్భటి పటిమముతో బాహుదర్పంబుతో స
న్నద్ధ స్వస్వధ్వజిన్యంతరముల నిలువన్ దైత్యు లుద్రిక్తులై సం
విద్ధౌరంధర్యవృత్తిన్ వెసం గవిసిరి గర్వించి రీవేల్పు లంచున్. 62

కం. వ్యూహద్వయంబు నీగతి
సాహసమున నెదుర హేమశైల రజస్సం
దోహంబు నిండి కాండక
టాహము చెంద్రంబు బుఙ్డాలు వహించెన్. 63

సీ. దంభోళి సంరంభ కుంభినీధర భేది
యవిగర్హిత విజృంభణార్హ బర్హి
దావపావక మహాప్రాపీణ్య శమనంబు
బర్బర వార్వాహ కర్బురంబు
దుర్ధరవాహినీ వర్ధిష్ణువార్ధిపం
బారావ ఘోర సమీరణంబు
ప్రోద్యదుద్దామ విద్యుద్విభాసి శ్రీద
మూర్జితగర్జి తానార్జవోగ్ర

గీ. మైనదైవతసైన్య ఘనాఘనంబు
గురియు శరవర్ష మొక్కింత సరకుగొనక
మోరత్రోపుఁ దనంబున మోఱకించి
తాఁకె నెనుపోతురాకాసి నాకవిభుని. 64

వ. మఱియు నంజనుండు నీలకుక్షి మేఘవర్ణుండు వలాహకుండు ఉలూకాక్షుండు ప్రఘసుండు తారాక్షుండు స్వర్భానుండు ననుదనుజు లెన మండ్రు వసువుల నసువులతోన పట్టెదమని చుట్టుముట్టిరి స్తబ్ధకర్ణుండు శంకుకర్ణుండు రక్తాక్షుండు భీమాక్షుండు విద్యున్మాలి విద్యుజ్జిహ్వుండు కృతాంతుండు వజ్రకాయుండు మహాకాయుం డతికాయుండు దీర్ఘకాయుండు భీమదంష్ట్రుండునను మనుజాశనులు పన్నిద్దరాదిత్యుల మృత్యువశులం జేసెదమని రేసి వేయేసి నిశితాశుగంబు లేసిరి కాలుండు కృతాంతుండు రక్తాక్షుండు క్షోభణుండు మిత్రహుండు యజ్ఞహుండు బ్రహ్మఘ్నుండు గోఘ్నుండు స్త్రీఘ్నుండు సంవర్తకుండనిలుం డను పెను రక్కసులు వదునొక్కండ్రు రుద్రుల నుక్కడంతుమని యెక్కిరి తక్కిన దైత్యు లొక్కొక్కవేల్పునొక్కరుండు చిక్కించుకొనిరి యిక్కరణి నెక్కటెక్కటిం బోరు సురాసురసైన్య సమూహమ్మున ముమ్మరమ్ముగా సకల కకుమ్ముఖమ్ములం గ్రమ్మ పెనుదుమ్ములో నెడనెడం బొడము మిణుంగురులు ఘోరాంధకార విద్యోతమాన ఖద్యోతకటంబులం బోల ఖడ్గాఖడ్గి నలుకులాడువారును సందష్టాధరోష్ఠులై ముష్టాముష్టి గ్రుద్దులాడి మూర్ఛపెల్లున రక్తప్రవాహంబున గుభుల్లునం ద్రెళ్లునప్పుడు దాశరథి బధ్యమాన మహాశరధి మధ్యపాతిత గిరి పరంపర ననుకరించువారును విలయ సమయ ఝుంఝా ఝంపా సంపాత కంపన సమావేల్లితశాఖాంబులై వేళ్లతోన పెల్లగిల్లు సముత్తాల సాలంబుల పోలిక బాహాబాహిం బెనంగి మ్రొగ్గుచు నేలవ్రాలువారును శరాశరీ సమరజనితోరు విపరనికర పతితశరీరులై సోలి భైరవ స్వర్ణకారుండు కలనను కమఠంబు నికటంబునం బెట్టిన కమ్మచ్చుల యచ్చునం గనుపట్టువారును నైరి తదవసరంబున సుర లసుర విసరశరనికాయ జర్జరితకాయులై విఱిగి పంతంబుల సంతఁబెట్టి బిరుదులు వదలి కడిమి విడిచి వాసి పెడఁబాసి మానంబుమాని గుట్టు గట్టిపెట్టి ప్రాణరక్షణ పరాయణత్వంబునంగకావికలై పఱచి మొఱవెట్టుచు బ్రహ్మకడకుం జని తమ దురవస్థ విన్నవించి రటమున్న మహిషాసురుండు పంపిన దూత విద్యుత్ప్రభుండనువాఁడు మందరగిరి కరిగి తదీయ శిఖరోపరిగత మహానగర

మధ్య విభాసమాన సభామంటపంబున మనోహరాకార కుమారికా సహస్ర
పరివృతయై పేరోలగంబున్న వైష్ణవిం గని ప్రణమిల్లి సవినయంబుగా
నిట్లనియె. 65

కం. జననీ ! యే విద్యుత్ప్రభుఁ
డను వాఁడగు మహిషదానవాధీశ్వరు పం
పున నీ సమ్ముఖమునకుం
బని వింటిని నాదు విన్నపము వినవలయున్. 66

సీ. ఆదిసర్గంబున నబ్జభూసుతుఁడు సం
వత్సరుండను ఋషివరుఁడు గనియెఁ
బార్శ్వాఖ్యు నాతండు పడసె గంభీరిమ
సింధు ప్రతాపాబ్జ బంధు సత్య
సంధు సింధుద్వీపచక్రవర్తి నతఁడు
మాహిష్మతీపురి మహిమ నేలు
చుండఁ దన్మేదినీమండలాధిప రూప
విభ్రమంబులు విని విప్రజిత్తి

గీ. తనయ మాహిష్మతీకన్య మనసిజాత
కరగృహీత ధనుఃప్రోత సరయ పాత
శాతశర జర్జరీభూతచేతయగుచు
నాతురతఁ బొందఁ గూర్మివయస్యలపుడు. 67

కం. పాటలఁ బుష్పిత పాటల
వాటుల గందంపురొంపి వాటుల సరసీ
కోటులఁ జల్లని చోటులఁ
యాటలఁ దనువడక విరహ మాటోపింపన్. 68

ద్వ్యక్షరకందము. కాకలికా కలకలకల
కోకిలకులలీల కలులకులుకుల కలుకే
కై కోకు కేలి కొలఁకుల
కోకాళీకేళి కులికి కొంకకు కలికీ. 69

మ. ననవిలాసాన్విప్రతాప మెల్ల నుడుప న్మాహిష్మతీ నీదు నా
ధుని రాజన్యకుమారశేఖరుని సింధుద్వీపుఁ డోర్తెత్తు మం
చు నిరాలస్యతఁ బోవుచో నతఁడు వాస్తోష్పత్య హంకార భం
జనదక్షున్ సుతుఁగోరి కానలఁ దపస్యావృత్తి మై నుండఁగన్. 70

కం. కని మనసు చివుకు రన వ
చ్చిన పని గాదయ్యె నింకఁ జెలితో మనమే
మనువార మనుచుఁ గ్రమ్మఱి
చని మాహిష్మతికి నతనిచందంబెల్లన్. 71

ఆ. తెలియఁ జెప్పి వినుము చెలియ తపస్వులఁ
బేరి విరహవార్త చెప్పఁ జనదు
దాననేమి దప్పె దైవికంబున నీకుఁ
జేరుఁ జేరువనె మనోరథంబు. 72

చ. అని బహుభంగులం దనవయస్యలు చెప్పినఁ ద్రిప్పరాని వే
దనఁబడి విప్రజిత్తి వరదానవ కన్యకవారుఁ దాను గా
ననములఁ ద్రిమ్మరం దొడఁగె నాటిన కామశరానలంబునన్
దినదినమున్ దనూలతిక నిగ్గునుఁ జెల్వము నింకనింకఁగన్. 73

కం. ఈ రీతి సదారణ్యవి
హారిణియై వచ్చి మందరాద్రి ద్రోణిన్
గోరకిత కుసుమిత ఫలిత
భూరుహముల నొప్పు నొక్క పుణ్యాశ్రమమున్. 74

మ. అవలోకించి వయస్యలార ! కడురమ్యంబైన యీ తోటలో
న వినోదింతము గొన్నినాళ్లిచటఁ బెంట ల్వెట్టు నీ పాపిగాం
ద్రవృథాసందడి గాసిఁబొంద మనకేలా ! పాఱిపోవంగఁ జే
యవలెన్ బేటన పెట్టి యంచు నెనుపెంత్రై భీకరప్రక్రియన్. 75

సీ. హోమగుండములపై కుఱికి కొంకరకోఱ
కొమ్ములఁ గోరాడుఁ గొంతతడవు
దేవపూజా వితర్దికలకై లంఘించి
గొరిజల నురుమాడు గొంతతడవు
పసిడాలుగల వరి పచ్చలపైఁ బడి
గొదగొని భక్షించుఁ గొంతతడవు
కమలాకరములపైఁ గవిసి నీరు గలంచి
క్రోలుచు బుసకొట్టుఁ గొంతతడవు

గీ. గోంద్రుగోంద్రని గర్జించుఁ గొంతతడవు
గోరచూపుల వీక్షించుఁ గొంతతడవు
గునుకు పరువునఁ దిరుగాఁడు గొంతతడవు
కొయ్యతనమునఁ గోపించుఁ గొంతతడవు. 76

కం. అయ్యెడఁ దాపసకన్యలు
దయ్యముగా కెనుముగాదు తథ్యంబనుచున్
బయ్యెదలు జాఱఁ బాఱఁగఁ
జయ్యన మునిపుంగవుండు శంబరుఁ డాత్మన్. 77

కం. మాయామహిషీతనుఁద్రై
తేయాధిపకన్య యగుట దెలిసి పటుక్రో
ధాయత్తత శపియించెను
హాయన శతమిట్లు మహిషివై పొమ్మనుచున్. 78

ఉ. ఈ కరణిం దపస్వి శపియింప భయంపడి దైత్య కన్యల
య్యా ! కడుఁ గల్లచేసె నిది యైన సహింపవలెన్ మది న్మహి
ష్యాకృతిఁ దాల్పవచ్చునె శతాబ్దము లంచుఁ గదుష్ణబాష్పధా
రాకులనేత్రలై నిజపదాంబుజయుగ్మము మీఁద వ్రాలినన్. 79

గీ. వినుఁడు పడచులార ! వృథవోదు నామాట
తనయు నొకనిఁ గన్నదాఁక నేత
దాకృతిఁ జరియించు నంతట నిజమూర్తిఁ
జెందు ననుచు నవధిఁ జెప్పుటయును. 80

సీ. శంబరాశ్రమ వనస్థలము వెల్వడి కొన్ని
దినములు మాహిష్మతీకుమారి
నర్మదాతీరకాననముల విహరించు
చుండ నచ్చోట నత్యుగ్రతపము
సలుపు సింధుద్వీపజనరాఘుఁ డొకనాఁడు
విద్యున్మతీనామ విబుధవైరి
కన్యకవస్త్రంబుఁ గట్టక జలదంబు
బాసిన క్రొమ్మించు పగిది మెఱసి

గీ. యెదుట జలకేళి గావింపఁ దదఖిలాంగ
ములు నిరీక్షించి గిలిగింతవోవు మనసు
నిలుపలేని కతంబున నిర్గమించెఁ
జరమధాతువు శైలనిర్ఝరమువోలె. 81

చ. అదియుఁ దపోమయాంగభవమైన కతంబున దివ్యసౌరభా
స్పదమును జంద్రమండలవిభాసియునై పవనాతపంబులన్
జెదరక నిల్చెనంత మహిషీతనుధారిణియైన విప్రజి
త్తిదనుజకన్య తన్నికటదేశమునం జరియించుఁ గావునన్. 82

కం. పసివడి మాటికి మాటికి
వసుధాస్థలి మూరుకొనుచు వదనాంచల మా
కసమున కెత్తుచుఁ జవిగొని
యిసుమంతయుఁ జిక్కకుండ నింతయుఁ గ్రోలెన్ 83

గీ. క్రోలిగర్భంబు వహియించి కొడుకుఁ గాంచి
యెనుప మేను దొఱంగె మాహిష్మతీకు
మారి యీరీతిఁ బుట్టిన మహిషదైత్య
వల్లభుఁడు బ్రహ్మవంశవివర్ధనుండు. 84

చ. హరిహయముఖ్యదిక్పతుల నందఱ వెఃపరలాడి వాఱలం
బురములు వెళ్లఁ ద్రోలి కలమూలధనంబులు కొల్లవెట్టి ని
ర్భరభుజవిక్రమస్ఫురణ రాజ్యము చేయుచు నెప్పుడున్ భవ
చ్చరణ సరోజసేవ నలు సల్పఁ దలంచుచునుండు గావునన్. 85

కం. మానిని ! యద్దానవపతి
ప్రాణేశ్వరివగుచుఁ గాపురము చేసితివే
నానాభువనంబుల నీ
కానయు సుకరంబు చెల్లునని పలుకుటయున్. 86

కం. పకపక నగె నవ్వైష్ణవి
వికచానన గహ్వరమున వివిధాజాండ
ప్రకరంబులు విచ్చినశు
క్తికలో ముక్తాఫలముల క్రియఁ గానఁబడన్. 87

ఆ. అట్టి మహిమఁ జూచి యాశ్చర్య భయసంభ్ర
మముల మూర్ఛఁబొంది మహిషదూత
తెప్పిఱి వినఁబల్కె దేవిచిత్త మెఱింగి
విజయ యనెడు పేరి వేత్రహస్త. 88

కం. ఏమును నీ జగదంబయుఁ
గౌమారవ్రతల మిందొకరిఁ బురుషులకున్
గామింపరాదు దానవుఁ
డా మదమున మమ్ము నడుగ నర్హుండనినన్. 89

కం. ఈ మాటకు నెదురుత్తర
మేమైనను నియ్యవలయునేనని తలఁపరం
గా మహిషదూతఁ జూచి జ
యామానిని రోషకంపితాధర యగుచున్. 90

కం. ఓరి ! దురాత్మక ! కౌమా
రారామలతోడ నీవరచు పల్లరువుల్
సైరించితి మింక నూరక
నోరెత్తితివేని మిగుల నొత్తువు సుమ్మీ. 91

మ. అని భర్జించినఁ బుల్లసిల్లి విముఖుండై పోయె విద్యుత్ప్రభా
ఖ్యనిశాటాధము డంతనారదుఁడు గయ్యం బింతటం గల్గెఁ బోఁ
గనుఁగో నాకనుచున్ సుమాళమున జంకల్ వేసికొంచున్ వడిన్
వినువీధిం జనుదెంచి మ్రొక్కి నిలిచెన్ విశ్వేశ్వరీ సన్నిధిన్. 92

చ. నిలిచినఁ జూచి వైష్ణవము నీవదనంబు చెమర్ప నిట్లు రా
గలిగిన కార్యమేమనుచు గండతలంబుల లేతనవ్వుని
గ్గులు మొలవంగఁ బల్కి సురకోటులు సంగరమండలంబులో
నల మహిషాఖ్యు చేవిఱిగి పాఱి విరించికిఁ జెప్ప నాతఁడున్. 93

శా. ఓసర్వేశ్వరి ! దృప్తుఁడై మహిషదైత్యుం డష్టదిక్పాలసే
నా సందోహముఁ దోలి నిన్నుఁ జెనకన్ సన్నద్ధుఁడై వచ్చె మా
కా సామర్థ్యము లేదు వాని గెలువంగా నీవె దిక్కంచు నా
చే సర్వంబును విన్నవించి పనిచెం జేకొమ్ము తత్ప్రార్థనన్. 94

వ. అని చెప్పి నారదుండు సఫలమనోరథుండై గోళ్లు నాకుచు నాకసంబున నదృశ్యుండై చనియె నిచ్చట మహిషాసురుండు నిజదూత కథితావమాన భాషణ శ్రవణ జనితరోషదూషితస్వాంతుండై బలవంతంబున వైష్ణవిం బరిగ్రహింతునని మందర కందరాంతర ప్రతిధ్వన దమంద దుందుభి ధణంధణ ధ్వానంబును సముద్ధురధ్వజినీ ముఖధావద్దయ ఖురస్ఫురద్ధ రోద్ధూతధూళీ సమూహవలాహకవలాకాయమాన బిరుదకేతనంబును రంగదుత్తుంగ మతంగజ ఘటాఘోర భంగుర భుజంగ పుంగవ ఫణో త్సంగ విలోకన వ్యాకుల భోగిభీరు హాహాకారపూరిత రసాతలంబునుంగా నుద్దవిఁడి నేతెంచు కోలాహలం బాలకించి కించిదంకురిత భ్రూభంగ భీషణ ఫాలభాగయగు నమ్మహాభాగ చిత్తం బెఱింగి రింగులు వాఱఁ గట్టినపట్టు పుట్టంబులు మాని మానితమణి మయూర్ధోరుకంబులు ధరి యించి యొడ్డాణంబులు బిగియించి మంచిక్రొమ్మించు మించువలిప కంచెలు మాని వజ్రకవచంబులు దొడిగి పులుగడిగిన ముత్తియంపుం బాపటలతోడి పిల్లకొప్పులు మాని జకచొళ్లెంబులు వైచి కళాచికాచమర వాల తాలవృంతాదికంబులు మాని వివిధాయుధంబులు పూని శాలీన కోకిలాలాపంబులు మాని దానవాసహ్య సింహనాదంబులు సేయుచు, శరన్నదులు వర్షానదులైనకరణి మందానిలంబులు ఝుంఝూనిలంబు లైన చందంబున మెఱుంగులు పిడుగులైన తెఱంబున శృంగారమనోహారి శరీరలైన కుమారికలు దారుణాకారలై నిజాంగరోమకూపంబులం దమ వంటివారి ననేక కోటికుమారికలం బుట్టించుచు నిలింపరిపు సైన్యపరంప రలఁ మీఁదంరిగవిసి బారిసమరు నప్పుడు వియచ్చరు లచ్చెరుపడి యీ కుమారికలు కలికికన్నుల చెలువంబునన కాదు జవంబున హరిణంబులఁ గెలిచిరి గాని యన గొంటరిదైత్యుల నంటం దఱుముచు నీ కన్నియ లన్నువనడుముల సన్నదనంబునన కాదు పరాక్రమంబులను హరికిశో రంబులను గెలిచిరి గాని యనఁ బ్రఖరనఖరంబుల రక్కసుల వ్రక్క లించుచు నియ్యిందుముఖులు మందగమనంబు నందంబునన కాదు సత్త్వంబునను మత్తగజంబులఁ గెలిచిరి గాని యన దానవులంబట్టి చట్టలు చీరుచు నీలేమలు రోమరేఖలన కాదు క్రౌర్యంబునను గాల

సర్వాంబులను గెలిచిరి గాని యన దేవారి జీవానిలంబులు గ్రోలుచు
నెమరులేక రణవిహారంబు సలిపెవ రని ప్రశంసించి మఱియును. 95

సీ. ఉయ్యాలలూగుచో దయ్యాలతాంగు లీ
పగిది వాహనములఁ బఱపుటెట్లు
చిలుకల ముద్దాడవలయు బింబోష్ఠులీ
రీతి శంఖములు పూరించుటెట్లు
సరస యానముల వేసరు ఘనశ్రోణు లీ
లేవ దైత్యుల వెన్నడించుటెట్లు
సుమనవ్వు నవ్వఁగోపని మృదుస్వన లిటు
వలె నట్టహాసము ల్సలుపు టెట్లు

గీ. నెమ్మొగంబుల తావికిఁ గ్రమ్ము తేటి
మూఁక లీలాబ్జములఁ జోపలేక బడలు
బాలపల్లవహస్త లీభంగి వాఁడి
పట్టెసముల వివుత సేనఁ గొట్టుటెట్లు. 96

చ. అని వినుతింపఁ గన్యక లలన్యసమాన భుజాపరాక్రమం
బున మహిషాసురాధిప చమూభటుల న్నఱకంగ నిల్చి న
ద్దనములు సల్పు మొండెములు వ్రాలిన పుల్గుల నద్భుతంబుగాఁ
గని నికృతంబులైన తలకాయలు క్రమ్మఱ వచ్చెనోయనన్. 97

కం. అతిముఖి గుమారికలు గొం
డఱు దానవభటుల తలలు నరములతోడం
బెఱికిరి కరిణులు వెఱికెడు
తఱచుమృణాలములతోడి తమ్ములఁ బోలెన్. 98

గీ. కన్యకాకఠోరకరవాలధారలు
కంఠమూలములకుఁ గత్తరింప
రణధరిత్రిఁ ద్రెళ్ళి రాకాసి తల లావ
రించె దీర్ఘనిద్ర ముంచుకొనఁగ. 99

చ. తునిమిన వైరిమస్తములతో రుధిరార్ద్రిముల్లై విహాయసం
బున కెగయం గుమారికల మొత్తమువైచిన శాతచక్రముల్
గనుఁగొన నొప్పెఁ బస్ఫుట గళంక సమంచిత మధ్య పూర్ణిమా
దిన విరమోదయత్తుహినదీధితిబింబ విడంబనాకృతిన్. 100

మ నమయ జ్యోతిషికుండు వీరదనుజ స్వరోషి దుద్వాహసం
బ్రభమలగ్నంబు ఘటింపఁ బెట్టు గడియారం బిట్లనన్ రక్తపూ
రమునం దేలెఁ గుమారికా కరధనుర్జ్యావల్లి నిర్ముక్త శా
త ముఖార్ధేందు శరక్షతంబులగు తద్రక్షః కపాలావళుల్. 101

కం. ఈ రీతి నెదురు లేకకు
మారిక లుగ్రాహవమున మారి మసఁగుచో
జీరంబు విడిచిపాఱె సు
రారాతి బలంబు తెల్లహాహా యనుచున్. 102

సీ. అది కనుంగొని మహిషాసురుఁ డేమికా
రణమున మనఘౌఘ రణములోన
భగ్నమయ్యె నటంచుఁ బలుకఁ గుంజరదేహుఁ
డైన యజ్ఞహరాఖ్య దానవుండు
దేవ ! యిప్పుడు కుమారీ విసరించుచే
విఱిగె నీఘౌజంచు విన్నవింప
నద్దిరా ! మదియించి రాఁడంగు లందఱిఁ
జపియఁ గొట్టెద నంచు గద ధరించి

గీ. దేవ గంధర్వ కిన్నర సేవితాంఘ్రి
కమలయై మందరో పత్యకాస్థలమున
నిలిచి నిజ కన్యకా కోటి గెలుచుచూచు
చున్నవైష్ణవి మీఁదికి నుఱికెనపుడు. 103

కం. ప్రఘన క్షోభన దుర్ముఖ
విఘన త్రిశీర్షాది దైత్యవీరులు సంవ
ర్త ఘన ఘనాఘన ఘోరా
ప ఘను లయోఘన ధనుః కృపాణీధరులై. 104

వ. మిక్కిలి మొక్కలంబున దిక్కులు వగుల నార్చుచు చెక్కుమ్మడిం గవిసినం గినిసితద్దేవి నిర్నిద్రరౌద్రరసోద్రేకంబునంబునం పునఃప్రనర్న త్రిత భృకుటీ భీషణాభిరామయైన శరశరాసన డమరు ముద్గర శతఘ్ని శూల కరవాల భిందివాల ముసల ముసుండి దండ పుండరీక శక్తి పాశాంకుశ ధ్వజ ఘంటికా చక్ర గదా కుంత భీకరంబు లయిన వింశతికరంబులు ధరించి విరించి ప్రముఖ నిఖిలదేవతావితాన జయజయాలాపంబు లాదరించి సంచారించి పంచారించిన పంచాననంబునెక్కి ముక్కంటిం దలంప నతండుం గ్రక్కున నంది పెక్కెంబుతోడుత ముందట నిలిచిన సవినయంబుగా బహూకరించి దేవా! సకల భూతసంహారకారివైన నీ పంపున నిలింపారి పరంపరల వెంపరలాడెదం జూడ నవధరింపు మంచు ధనుర్గుణంబు సారించి వెక్కసంబుగ నాకసంబున నాడు రాకాసి తూఁపుఁ దూనీఁగలకుం దగ వాలంపవాన గురిసె నప్పు డసుర విసర కిరీటంబుల వలన రాలు హీరశకలంబులు వడగండ్లు వడుపున మెఱసె నీరీతి నమరారాతి నికాయంబును నమ్మహామాయయు నేయు సాయకంబులు నిండి తోయజభవాండంబు నూదులక్రోవిపగిదిం గనుపట్టె శరపంజరంబునడుమ నడంగి పొడగానరాని భానుబింబంబునకుం బతంగ నామంబు సార్థం బయ్యె దేవీమతల్లికాభల్ల ముఖోల్లూనంబులైన దైతేయ కేతనంబులు వారలకీర్తులువోలె నేలంగూలి మాలిన్యంబు వహించె నారా యణికరచక్రధారా విదారితైకోరువులై విల్లూతఁ గానిలిచిన నిశాచర వీరులు సురాంగ నాపరిష్వంగసుఖంబుగోరి యేకపాదస్థులై తపంబు సలుపు చందంబు వహించిరి మహాశక్తి శక్తిభిన్న హృదయులై నిజ వాహనంబుల నిలువరింప లేక తల్లకెడవుగాఁ ద్రెళ్లు యాతుధాన పుంగవులు రణరంగంబునం బిల్లమెఱుములు వ్రేయుతెఱంగులు దాల్చిరి వైష్ణవి విడిచి వాటు వైచిన కుంతంబులతోడన రక్తసిక్త వసుంధరం

బొరలు నక్తంచరులు రణభైరవవ్యాఘుండు నిప్పుకలపయిం ద్రిప్పు
కలుకట్ల కరణిం గైకొనిరి మాధవీ ముసలఘాత పతద్రదనవదనులై
దనుజులు దంపునప్పుడు చెకరిపడు ప్రాలతోడి మహోలూఖలంబులం
బోలిరి చండికాసముద్దండ పాశంబునం దగులువడి గింజుకొను మను
జాశనులు పన్నిన వలలంబడి తన్నుకొను మన్నుబోతుల రీతి నుండిరి
లోకమాత చేతి లవణి పెట్టుచేతం జెల్లాచెదరగు పసిండి చిప్పల జోళ్లతోన
గులగులలైన శరీరంబులతోడ సోలు కీలాలపులు సంబెటనడచిన వెడలు
మిడుంగురులతోడి యినుపకట్ల చుట్టంబులైరి పంకజగేహిని బహు
పాశాంకుశంబునం గ్రుచ్చి యెత్తిన వ్రేలు వేలుపుంబగ రర గిట్టి
గాలంబులతోడి దొంగలభంగి నంగీకరించిరి ఇవ్విధంబున నపరాభూత
విక్రమంబున నపరాశక్తి విజృంభించినం గని సంరంభంబునం గుంభి
రూపధరుండగు యజ్ఞహరుండను మహాసురుండు తొండంబునం జుట్టపట్టి
కొండలు రువ్వుచు నసహ్యవదన గహ్వర బృంహితంబుల గహ్వారివిహా
యసంబులు చలియింప సముత్తాల కర్ణతాల వాతూలంబుల నూర్ధ్వ
లోకంబు లుత్థూతలూగ వీంగనిచలంబున నెదురు నడచిన. 105

మ. ఇరువై పంబ శరంబులేసెం గపటేభేంద్రంబు నా బాణముల్
కరకాండంబునం బుచ్చివైచికొనంగా గంట్లౌ సమస్తాస్త్రముల్
దొరుగుం దెల్లని మేనితోడ నొరగెన్ ఘూర్ణిల్లుమన్ లోక భీ
కర జంఝూనిల భజ్యమాన సగవాక్షవ్రాత సౌధాకృతిన్. 106

మ. మహిషం డప్పుడు జన్యభూమిం దనకుం బ్రాపైన బల్వీరు య
జ్ఞహరుం జంపినం జూచి మండిపడి దోస్తంభంబునం ద్రిప్పి దు
స్సహభంగిన్ గదవైవ దేవి నిశితాస్త్రం చేసినన్ దానిచే
మహిం గూలెన్ శకలంబులై గద గరుత్మల్లూన సర్పంబనన్. 107

మ. అవలీలం బరిమార్తు నంచు వరలబ్ధాఖిలచక్రంబు దా
నవుం డెత్తెన్వడి నేలంగూలె నదియున్ సర్వేశ్వరీ హుంక్రియా
రవనైష్ఠుర్య మహానుభావమునం దద్రక్షః కులస్త్రీ జన
శ్రవణ స్థాపిత హేమరత్నమయ పత్రభ్రంశ సంసూచియై, 108

సీ. ఈ రీతిఁ బెనఁగుచో నింద్రారి వైష్ణవి
కఱకుటంపర చూచి వెఱచి పఱచు
పఱచి వెండియు సిగ్గుపాటించి భీకర
సైరిభాకృతిఁ దాల్చి చేరవచ్చు
వచ్చి పంచానన వాహనాహేతి ని
ర్భగ్నుఁడై పెక్కురూపములు చూచు
పెక్కు రూపములు చూపి ముహూర్త మాత్రంబు
పోరాడి మాయమై పోవు మరియు

గీ. దవులఁ బొడకట్టుఁ దన్నంటఁ దఱుము నపర
చేతఁ జిక్కియుఁ జిక్కక చెంగిపోవుఁ
గాని మడలోన గెలుపాస మానఁ డయ్యె
నెవ్వనికి మాన్పఁగా వచ్చు నేనుపమరులు. 109

ఉ. ఈగతి వేయివత్సరము లెక్కటిఁ బోరి త్రిలోకమాత చే
తోగతరోష భేదములతో హరి డిగ్గి త్రిశూలపాణియై
వ్రేఁగుఁ జనుంగవ న్నడుము వీఁగ సతాండవకుండల ప్రభా
భోగ విభాసి కోమలకపోలయుగంబు చెమర్పఁగా వడన్. 110

శా. కంటిం గంటి నటంచు నార్చి శతశృంగక్ష్మాధరాగ్రంబునన్
వెంటాడించి కరాళకీలపటల క్ష్వేళాశ్రయార్చిశ్ఛటా
లుంటాక ప్రతిఘాభరారుణ దృగాలోకంబు సంధిల్లఁ గా
లంటం ద్రొక్కి లులాయదానవుని వక్షోగ్రంబు శూలంబునన్. 111

కందగర్భ మణిగణ నికరము.

డమరుక సరభస డమడమ
సమ విభ్రమములయి మొరయ సమణివలయముల్
గమకపుఁ జనుఁగవ గదలఁగ
సమర శ్రమఫలము గలుగ సరగునఁ బొడిచెన్. 112

చ. పొడిచియుఁ గోపహూటక నభోగత దివ్యులు పుష్పవర్షముల్
జడిగొలుపన్ భుజాకలిత శాతకృపాణ కఠోరధారచే
మెద దునుమంగ జాతె గిరి మీఁద దదస్రము వానిమోహపుం
బడతుల గుబ్బలం దొరుగు బాష్పపరంపరతోడఁ గూడగన్. 113

చ. అతని కళేబరంబున మహాపురుషుం డొకరుండు నిర్గమిం
చి తరణి బింబడంబర విజిత్వర దివ్యశరీర కాంతి సం
తతులు దిగంత రాళములు దారుకొనంగ విమాన మెక్కి దై
వత పురికేగె దేవికరవాలమునన్ మృతుఁ డయ్యెఁ గావునన్. 114

చ. అపుడు చతుర్ముఖాదికమఖాశను లందఱు నద్భుత ప్రమో
దపులకితాంగులై వరుస దండమువెట్టి నుతింపఁ జొచ్చి ర
య్య పర పరాక్రమ క్రమము లాగమశాస్త్ర పురాణ మూల భూ
త్యుపనిషదర్థగర్భిత సముజ్జ్వలవైఖరి మిన్నుముట్టఁగన్. 115

దండకము శ్రీమన్మహాదేవి ! విద్యా ! యవిద్యా ! మహాభాగ ! గంభీరజంభారి ముఖ్యామర ద్రోహివాహారి దైతేయ బాహాంతర స్థాపిత స్థూల శూలాప హేలాచల త్కింకిణీ కంకణ క్రేంకియారావవాచాలతాశాంత రాళా ! కరాళా ! మరాళాధిరూఢా ! విరూపాక్షి యిజ్యా ! జగజ్జాల పూజ్యా ! మహోంకారచాపజ్యా! సర్వేశ్వరీ ! శుద్ధసత్వా ! శివా ! బుద్ధి శుద్ధిప్రదా ! వీతశోకా ! ధ్రువా ! సువ్రతస్థా ! కృత స్థైర్య సిద్ధాంత దుర్దాంత పాపావళిధ్వాంత విధ్వంసనా హస్కర స్వీయదివ్యాభిధేయా ! మహామాయ ! బోధస్వరూపా ! సుధా స్రావిణీ ! భీమసందర్శనా ! వేదశాస్త్రాది విద్యామహోద్యాన పద్యా మయూరీ! రయోరీకృతో గ్రాహనారంభ శుంభద్దశద్వంద్వ దోస్తంభ నారాయణీ ! శాంకరీ కింకరీ భూతభూతేశ్వరా ! విశ్వమాతా ! పరిక్షోభితాంతర్జలా ! కాళరాత్రీ ! త్రినేత్రీ ! సురద్వేషి తాటంకినీ గర్భనిర్భేది ఘంటాపణాత్కార విశ్వప్రపంచాంత సంభూత హేతూ కృతో ఛ్వాసనిశ్వాస లీలాచమత్కార నైజార్భకీభూత నీరేజగర్భాది

పీతామృత స్తన్య చైతన్యమూర్తీ ! నినుం గొల్చు ధనుల్ గదా లోక
సన్మాన్య లాకల్పకీర్తుల్ విధూతార్తు లంభోజనాభుండు మన్నించు
భక్తుల్ సముక్తుల్ మహాశక్తి ! యీ తావకస్తోత్ర మెవ్వారికిన్
బాఠమౌ వారికిన్ ఘోరకారాలగచ్ఛృం ఖలాబంధముల్ వీడు
మోమోడు భూపాలుఁ డాలంబులో వైరిసంఘంబులోడున్ విషాం
భోనల క్రూరచోరాదిసంత్రాసముల్ లేవు దైన్యామయాపద్దశల్
రావు నీ వైభవంబుల్ ప్రశంసింప మాబోంట్ల శక్యంబె యీలీల
మాపాల నెల్లప్పుడుం గల్గి రక్షింపుమంచున్ బునర్వందనంబుల్
ఘటింపం బ్రసన్నాస్యయై. 116

కం. మెచ్చితి మీ కోరిన వర
మిచ్చెద నడుగుఁ డన డినిజు లీస్తోత్రంబుల్
నిచ్చలుఁ బఠించు వారికి
నిచ్చఁ గలుగు కామితంబు లిమ్మని పలుకన్. 117

కం. అంగీకరించి వైష్ణవి
గంగాధర ముఖ్యసురనికాయంబుల నం
పెం గడువేడుకఁ దాశత
శృంగనగోత్తుంగ శృంగసీమన నిలిచెన్. 118

గీ. వార్ధిరశన ! రెండవదియైన యీ శక్తి
సంభవంబు వినిన సజ్జనులకు
నబ్బు నిక్కమపునరావృత్తి శాశ్వత
బ్రహ్మలోకసౌఖ్యపదవిభూతి. 119

చ. వినుమిక నీలశైలవనవీధికిఁ బోయిన రౌద్రి విశ్వపా
లన మొనరింతు నేనను తలంపునఁ బంచహుతాశిమధ్య సీ
మ నిలిచి యోగనిశ్చల సమాధిఁ దపం బొనరించె హల్లకం
బునడుమ నున్న సీధురసమోదిమదాళిని భంగి నత్తఱిన్. 120

సీ. అబ్ధి మధ్యమున రక్తాక్షకంబను పట్ట
ణము రాజధానిగా నమితకోటి
దానవసేనలు తన్నుఁ గొల్వఁగ నున్న
వనరుహాసనలబ్ధవరుఁడు వరుఁడు
నా నొక్క దైత్యుండు నముచి పాకపులోమ
బలుల మించిన భుజాబలము కలిమి
గర్వించి సర్వసుపర్వ సామ్రాజ్యంబు
గైకొందునని దండుగదలఁ దలఁని

గీ. ఘుమఘుమారంభ సంరంభ ఘూర్ణమాన
కలిల సలిలంబుతో వార్ధికడల వెడల
కాద్రవేయుల కన్నులు గాతుకలఁగ
భీకర జయానకము చఱపించుటయును. 121

వ. మహాహవ సన్నాహ సముత్సాహంబున వాహినీ సమూహంబు లంభోధి గర్భంబు నిర్భరగతి వెడలునప్పుడు వెండిచిప్పల జోళ్లతోడి పదాతులు తిమింగిలంబుల భంగి నింగికిం జౌకళించిరి ఇంతకాలమునకుం దమపగ సాధింప దిక్కు గలిగెనని రక్కసులఁగూడి వజ్రపాణి మీఁద వచ్చు ఱెక్కలతోడి కొండలరీతి సచామర శుండాలంబులు గగనమండలి కెగసె; నురుగులతోడి తరంగంబులకరణి సఫేనముఖతురంగఘట్టంబులు మిన్నుముట్టె; దినముఖోదయ దినకరస్యందనంబు నాందోళిత ధ్వజ పటధాళధళ్యమిషంబునం బరిహసించు నరదంబు లంబరంబునకు లంఘించె నవ్విధంబునం గటాక్షిత ప్రతిపక్ష లక్ష్యంబులైన మహారథ లక్షలును శతకోటి జిత్వరంబులైన కరిఘటా కోటులును గంభీర హేషా వధీరితశంఖంబులైన హయశంఖంబులును వీరలక్ష్మీనివాసపద్మంబు లైన సుభటపద్మంబులుం గల దండనాయకు లనేకులు గొల్వ నసుర వరుండగురుచుండు సముద్రంబువెడలి నిర్మిద్రపరాక్రమంబునదాడివెట్టినం గని దేవతలు గోపించి యెదిరించి కవిసి రప్పుడిరువాగు రణలక్ష్మి డోల ననుకరించె నింద్రాదినిర్జరు లసురశరజర్జరితాంగులై వెఱచి పఱచు

వాటు ముందట నీలగిరి శృంగంబునం బంబాగ్నిమధ్యంబు నన్నిలిచి యెలమావి చిగురుజొంపంబులోని కోయిలవిధంబున విద్రుమకుడుంగంబునడిమి తమాలవల్లిక పగిది సంధ్యారాగాంతరాళంబునం గనుపట్టు మేఘరేఖసరణి నరుణకమలవనాభ్యంతరంబుననున్న నీలోత్పలిని తెఱంగున రురుదానవ వధోచిత క్రోధవశ పరివృతంబైన తమోగుణంబు ఘనీ సప్రయాసంబునం దపంబు సలుపుచున్న కాళరాత్ర్యభిధానము సంహారకారిణియునగు రుద్రశక్తిం గని దగదొట్టిన యెలుంగులతోడ నో జగన్మాత ! ధాతవరంబునం గ్రొవ్వి రురుండను దానవుండు మమ్ము సమరంబునం బరాజితులం జేసివాఁడె వెన్నాఁడి వచ్చుచున్నాఁడు వాని బారిం బడకుండ రక్షింపుమని మొఱవెట్టిన నద్దేవి పెద్ద యెలుంగున వెఱవకుండు వెఱకుండని పలుకుచు నట్టహాసంబుచేసినం దదాననగహ్వరంబున. 122

కం. ఉఱిమెడు కాదంబినిలో
గుబుకఁ బిడుగుసంగములు వెడలుగతిఁ గ్రైదువు ల
న్నెఱుఁగులతో నుదయించిరి
జొఱజొఱ మిడుగుఱులు రాలుచూపుల శక్తుల్. 123

ఉ. వారలసంఖ్య కోటులనివారిత విక్రమలీల వాలి పా
ఖోపహ గర్వసర్గము వధూమయమయ్యె ననంగనిండి దే
వారి చమూ సమూహముల నాజిఁ బడల్పడఁ గొట్టి నెత్తురుల్
వారలు వట్టి రప్పుడు బలక్షయమైన రురుండు దెంపునన్. 124

కం. హరిహయముఖ సురసేనా
పరివృతమగు రుద్రశక్తి పరివారముపై
సరభసరౌరవ మాయా
కర సమ్మోహన మహాశుగం బేయుటయున్. 125

సీ. సవ్యాప సవ్యముల్ శరములేయుట మాని
నెఱఁకులు విఱుగంగ నిలుగువారు
చటుల తరాట్టహాసములు చేయుట మాని
బెట్టిగా గుఱకలు పెట్టువారు
శస్త్రులఁ దలయూచి జంకించుటలు మాని
కూర్కుపాటులఁ దూగి కూలువారు
సింహనాదంబులు చెలఁగి చేయుట మాని
ముంచుతంద్రల నావలించువారు

గీ. నై మహేంద్రాది సురలు దైత్యాధినాథ
మాయ జోకొట్టెనని నిద్రవోయి కలవ
రింతు రిదెవచ్చె రురుఁ డని కొంతతడవు
కొంతతత వాదమఱచి నిద్రింతురపుడు. 126

మ కఠినక్ష్వేళలతోడ రౌద్రి జయశంఖం బొత్తెసన్ జన్యభూ
లురదింద్రాదిక దేవతాపరివృఢుల్ మోహవ్యపేతాత్మతన్
హత సంప్రాప్త వివేకులై జయజయ వ్యాహారముల్ సల్పఁ గా
శతు నద్దానవుఁ జంపె శాంభవి భుజస్తంభ త్రిశూలంబునన్. 127

కం. ఆవేళ రౌద్రి శూలము
స్రావిన దైతేయశోణితము ఘనమైనం
దా వాంతి చేసెనోయనఁ
గా విగళద్రక్తయుత ముఖంబుల నొప్పెన్. 128

గీ. రురునిచర్మంబు ముండంబు సరభసముగ
రెండుగాఁ జేసి రౌద్రి చాముండి యనెడు
నామధేయంబు వహియించె నాఁడు మొదలు
సకల మంత్రాంగ మౌసుప్రశస్త ముగను. 129

సీ. అప్పుడు దైత్యరణాయాస ఖిన్నలై
శాంభవి బరివారశక్తులెల్ల
నాఁకలి దీఱ మాకాహార మిడు మన్న
మానసంబున వగగాన లేక
తననాథు రుద్రునిఁ దలఁప వచ్చినఁ జూచి
దేవ ! యీ పరివారదేవతలకు
భుక్తికిఁ దోవ చూపుమటన్న వారిలోఁ
గొందఱితోడ నా యిందుధరుఁడు

గీ. నూత్నగృహములఁ దోటల నూతులం ద
టాకములఁ జేలఁ జెట్ల బంటల వసించి
ప్రజలు వానికిఁ బెట్టెడు బలుల వలనఁ
దృప్తిఁ బొందుఁడు మీరని దెలిపి మరియు. 130

సీ. పరవధూటుల మైల పరిధానములు గట్టు
చూలాండ్రఁ గొందఱు సోఁకుఁడనియు
యంత్ర మంత్రౌషధాద్యముల రక్షితగాని
బాలెంతఁ గొందఱుఁ బట్టుఁ డనియు
నెప్పుడు గలహించి యేడ్చుచుండెడు శర
స్త్రీలఁ గొందఱు ప్రవేశింపుఁ డనియు
నెడరైన చోటున నేమఱుపాటుగా
శిశువులఁ గొందఱు చెందుఁ డనియు

గీ. కోరి నిలువుండు పురిటింటఁ గొంద అనియు
నందఱికి సన్నిగతుల నాహారవిధులు
పంచిపెట్టి రణక్షోణిఁ బడిన రురునిఁ
గాంచి తన శక్తిమహిమ నుతించఁ దొడఁగె. 131

మాత్రాసమక తాళము.

జయ జయ చాముండి ! వికరాళి ! మహాకాళి ! శివే !
సిద్ధ్యే! వేద్యే! భీమాక్షి! మహామాయి! క్షుభితే! కాళి! కరాళి! శవయానస్థే!
ప్రేతాసన భేది విభీషణే ! భూత భయంకరి ! సకల క్షేమంకరి !
సర్వహితే బాలే ! నృత్త గీతవాద్య విలోలే ! కాలాపహారిణి !
కాంక్షే ! కాంతే ! సర్వదేవతారాధ్యే ! భోధ్యే ! కాళరాత్రి !
మహితాభ్యుదయే ! భూతాపహారిణి ! జయే ! పాశాంకుశహస్తే
జ్వాలాముఖి ! ఘనశృంగే ! తీక్ష్ణదంష్ట్రికే ! ఫాలలోచనే ! త్రిశిఖ
ముఖదళిత రురుదనుజ తనుజనన సమయ సముదిత ఖచరకర
గళిత సురవిటపికుసుమ విసర పరిమిళిత రుధిర మధుర మధు
రసరసన సమదనటన పరిజనే ! పటుమహిమజనే ! 132

కం. అని వినుతించిన శాంభవి
విని మెచ్చి త్రినేత్ర! వరము వేడుము నా నే
జనుఁ డీ భవదీయ స్తుతి
విను జదువును వాని కిమ్మ వివిధేప్సితముల్. 133

గీ. ఇదియ నేవేడు వరమని యిందుశేఖ
రుఁడు తిరోహితుండయ్యె నారుద్రశక్తి
బ్రహ్మ శక్రముఖామర ప్రతతిననిపి
జగము లేలుచునుండె నచ్చటనె తాను. 134

వ. తమోగుణ ప్రధానయుం బరాపరాభిధానయు సంహారకారిణియు నగు రుద్రశక్తికి నవకోటి భేదంబులు గలవు. రజోగుణప్రధానయు లోకస్థితి కారిణియు నగు విష్ణు శక్తికిం బదునెనిమిది కోట్లు భేదంబులు గలవు.

సత్త్వగుణ ప్రధానయుఁ బరాభిధానయు సృష్టి కారిణియు నగు బ్రహ్మ శక్తికి లెక్కింపరాని భేదంబులు గలవు వీరికినిందరికిని నిన్నిరూపంబులం బతియై రుద్రుండు రమింపుచుండు. వీరి నారాధించు మాంత్రికులు రుద్రు నికి నమ్మిన భక్తులు బ్రాహ్మియు వైష్ణవియు రౌద్రియు ననం బరఁగిన యీత్రికల నవసిద్ధాంత గామినియై త్రిశక్తి నామంబులును సర్వవేదాంత గామనియై జ్ఞానక్రియాశక్తి నామంబులును వహించు లోకోపకారంబుగాఁ బరమపురుషుండు మూఁడుమూర్తులు దాల్చిన యట్లు యేకస్వరూపయగు నిమ్మహాశక్తియు మూర్తిత్రయంబు వహించె నింతియెకాని భేదంబులేదు మహారహస్యంబుగ నీ దేవీమాహాత్మ్యం బష్టమింగాని నవమింగాని చతుర్దశింగాని కృతోపవాసుండై పఠియించి నృపాలుండు సంవత్సరంబు లోపల లబ్ధరాజ్యుండగు నేతదుపాఖ్యానంబు వినినవారికి సకలకామితంబులు ఫలియించు నది వ్రాసిన పుస్తకంబు పూజించు వారి గృహంబున ధన కనక వస్తు వాహన సమృద్ధియుం బుత్ర పౌత్రాభివృద్ధియుం గలుగు. నగ్నిచోరాది బాధలు లేవని వారాహదేవుండు చెప్పిన విని ధరిత్రీహరిణ నేత్ర తరువాతి వృత్తాంతం బానతిమ్మని విన్నవించిన. 135

మ. భవదీయోరుభుజా వినిర్మిత మహాభారవ్యపాయోచితో
ద్భవనిశ్వాస వితర్కదాయక గుహోద్యద్వాత గోత్రాదిమ
స్త వినిక్షిప్త సమస్త దిఙ్ముఖ జయస్తంభౌఘ ! తుళ్యాన్వవా
యవతంసా ! పరిషద్విరంస కవి సంఖ్యావత్ప్రియంభావుకా. 136

కం. ధరణినుత దేవకీపుర
వరనిలయ శ్రీగిరీశవర సంపన్నే
శ్వర విభుతనయా సాళువ
నరసింహన్నృపాల దండనాయక తిలకా ! 137

శిఖరిణి వరాసేవా హేవాకి జనధరణీ వాసవగవీ
కరా లోకాలోకాగ్ర విధుమణి రాకాశశి యశో
భరా ! చాపాటోపార్జిత బహుయశోపాయ నపరం
పరా ! రంభా పుంభావ సుభరిపు సంభార వినుతా! 138

గద్యము. ఇది శ్రీమదుమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంట నాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీవరాహపురాణం బను మహా
ప్రబంధంబునం దేకాదశాశ్వాసము.

శ్రీ

# వరాహపురాణము

## ద్వాదశాశ్వాసము

—*—

శ్రీకార సదృశ కర్ణ
స్వీకృత కవితా ప్రవాహ ! సితఫేన గుళు
చ్ఛాకార మౌక్తిక స్వ
చ్ఛా కల్పా ! యిశ్వరక్షమాధిపు నరసా. 1

వ. అవధరింపు మవ్వరాహ దేవుండు పృథివి కిట్లనియె నట్లు రుద్ర మహిమో ద్యోతకంబైన శక్తిత్రయ చరిత్రంబు చెప్పితినింక సకలపాతక నివారణ ప్రభావంబైన రుద్రవ్రతావిర్భావంబు చెప్పెద. మున్ను మూఁడవ సృష్టి సమంబున నలువ తనవలన జన్మించిన పింగళాక్షుండును నీలలోహితుం డును నైన రుద్రునిం జూచి ముద్ర సావేశంబున నిజస్కంధ దేశంబున నిలిపి కపాలిరుద్ర నగ్నకేదార సువ్రతాదికంబులైన భవిష్యన్నామంబులు గలుగు నానాధర్వణ మంత్రంబుల చేత నైదవ ముఖంబునఁ బ్రహసించి జగద్రక్షణంబు గావింపు మనిన నీలలోహితుండు తన్ను ననుచితంబైన కపాలినామంబునం బిలిచిన కతంబున. 2

కం. కలుషించి విరించి భుజ
మ్ములు ద్రొక్కి తదూర్ధ్వ శిరము పుడికెఁ గరరుహాం
చలమునఁ దరుశాఖలపై
నిలిచి ఫలము చిదుము రీతి నిర్ఘృణ వృత్తిన్. 3

కం. నిష్ఠుర హరనామ కరాం
గుష్ఠ నఖవిలూనమస్తకుండైన సుర
జ్యేష్ఠుని నప్పుడు చూచి గ
రిష్ఠాద్భుత భయములన్ మరీచి ప్రభృతుల్. 4

కం. తనువున గళమున మస్తక
మున భీకర భిన్నవర్ణములు గల యందుం
గని యెఱుఁగని విపరీతపుఁ
దనయుని జన్మంబు తండ్రి తలఁపై వచ్చెన్. 5

మ. అని భాషింపఁగ స్రష్ట శిష్ట చతురాస్యంబైన దేహంబుతో
ననిలక్రూర నిపాతభగ్నశిఖరంబై నాల్గుగంబాలతో
దనె కన్పట్టెడు పైఁడిమేడవలె నుండం దత్పయోజాతగ
ర్భుని మూర్ధంబును సంతతక్షరదసృక్పూరాతి ఘోరాకృతిన్. 6

చ. హరునరచేతిలో మొలచినట్లు దృఢంబుగ నంటి నిల్చె ని
ర్భరగతి నాహరుండు తనపాణి విదల్చి నులింద గదల్చెఁ
చ్చిరసిజముల్ కుదించి తివిచెన్ జరణంబునఁ జుట్టిపట్టి ని
ష్ఠురగతి మేదినీస్థలిఁ బటుక్కు పటుక్కునఁ గొట్టె నప్పుడున్. 7

గీ. ఊడి పడకున్నఁ జూచి పయోజభవుని
తోడ నోపరమాత్మ! యిందులకు నింక
నేమిచేయుదు! నీపాప మేకతమునఁ
దొలఁగుఁ జెప్పుమటన్న రుద్రునకు నజుఁడు. 8

మ. క్షితిఁ బంద్రెండు సమల్ చరింపు హిమరోచిర్భూషకాపాలిక
వ్రత మాచారయుతంబుగా నది జగత్ప్రఖ్యాతమై సాఁగు దు
ష్కృతము న్నీకుఁ దొలంగు నన్న హరుఁ డేగెన్ వే మహేంద్రాద్రికిన్
భృతచింతామణి కల్పకాద్యములచే హేమాద్రికిన్ మాద్రికిన్. 9

కం. అచ్చోటి బరణి మూకుఁడు
పుచ్చినగతి నజుని శిఖరముపునుక నడిమికిన్
ఋచ్చె వలచేతి నఖమున
ద్రవచ్చి యెడమచేత సగముద్రవక్కc నిలువఁగాన్. 10

కం. అ మీఁదిద్రవక్కc తునుకలు
గామొత్తి జటాంతరములఁ గట్టి తదంత
స్సీమ మణితోడ విద్యు
ద్దామ శిరోజముల జన్నిదంబులు చేసెన్. 11

సీ. ఇట్లు కాపాలికాకృతి ధరియించి స
ప్త ద్వీపవృతధరాస్థలములోనఁ
గలుగు తీర్థములెల్లఁ గలయంగఁ డిరుగ సం
కల్పించి మొదల సాగరజలమున
స్నానంబుచేసి గంగానదిఁ గ్రుంకి స
రస్వతీ యమునా శరావతీ క
వేర కన్యా కృష్ణవేణీ వితస్తాది
నానానదుల మజ్జనంబు సలిపి

గీ. రుద్రకానన కేదార భద్రవటము
లాదిగాఁ గల సకల పుణ్యస్థలములు
ద్రొక్కి చూచి గయకుఁ బోయి రుద్రపాద
ముల యథావిధి పితృపిండములు ఘటించి. 12

ఉ. అచ్చటువాసి వేగమున నాఅవయేట ధరిత్రిఁ గ్రుమ్మరన్
బచ్చనివింటివాని రిపుపచ్ఛదమున్ రశనాకపాలమున్
గచ్ఛదముం దొలంగె నదిగైకొన కెప్పటియట్ల తీర్థముల్
నిచ్చలుఁ జొచ్చిచొచ్చి పలునీళ్ల మునుంగఁగ నెన్మిదేండ్లకున్. 13

కం. అంటలు గట్టుచు నొకటియు
గెంటక తలబోడిగాఁగఁ గేశము లూడన్
మింటికి నెగసెడి రవిపై
నొంటక చనుసైంహికేయు నుగ్రతఁ గూడెన్ 14

కం. అంతటఁ ద్రిలోచనుండు హిమ
వంతంబునఁ దిరుగుచో నవమసమఁ జలి మే
నెంతయుఁ బగిలి మదవ
ద్దంతావళ బిందు బభ్రుతాయుత మయ్యెన్. 15

కం. వెండియుఁ జతురంత మహీ
మండల మధ్యస్థ తీర్థ మజ్జనరతి రు
ద్రుండు చరియించె మఱిపం
డ్రెండవ సంవత్సరంబు నిండెడువేళన్. 16

సీ. ఢుంఠి బృంహిత వాటోపంబెకాని సం
వర్త ధారాధరధ్వనులు లేవు
గదళికావనవాటిఁ గదలు గాడ్పులెగాని
ప్రళయ ప్రభంజనారభటి లేదు
గోపుర సౌవర్ణకుంభకాంతులె కాని
తీవ్ర క్షయాదిత్య దీప్తి లేదు
విశ్వేశ మజ్జన విమల వాఃపూరంబె
కాని కల్పైకోదకంబు లేదు
గీ. క్రోశపంచక పరిమిత క్షోణికలిత
మైన యేపట్టణంబున నట్టికాశి
కరిగి గంగానదీ స్నాన మాచరింప
హరుని చేనుండి మహి జాఱె నజుని పునుక. 17

కం. కమలజు శిరమీ కైవడి
దెమలి మహిం బడిన వేళఁ ద్రినయనహస్తం
బమరె నపేత మరాళా
క్రమణంబగు వికచరక్తకమలము భంగిన్. 18

కం. ఈ నిఖిలంబునఁ గలిగిన
ప్రాణుల పాతకము సంస్మరణ మాత్రమునన్
మానుపు మలహరుదురితము
మానిపె నీ వారణాసి మహిమం బసదే ! 19

చ. అని సవిధస్థితుల్ పొగడి రప్పుడు బ్రహ్మ సమస్త దేవతల్
దనుఁ గొలువంగ వచ్చి హిమధామశిఖామణిఁ జూచి ఫాలలో
చన ! భవదీయహస్తమున జాఱెఁ గపాలము లోకముల్ నుతిం
ప నిచట దాల్చి నీస్థలి కపాలవిమోచన తీర్థనామమున్. 20

వ. మఱియు వినుము మొదల నీవు కపాలపాణివై సకౌపీనంబుగా వసుం
ధరం బరిభ్రమించుట మహావ్రతంబనం బరఁగు నా వెనుక నగ్నత
వహించి తిరుగుట నగ్నకాపాలికంబనం బరఁగు నందు పిదప బభ్రుత
వహించుట బభ్రుకపాలికంబనం బరఁగు నిప్పుడు గంగానదీ స్నానంబున
దేహశుద్ధి వహించుట శుద్ధశైవంబనం బరఁగు బ్రహ్మహత్యకు మునుపు
నీలత్వ సహితుండవగుట కైదారవ్రతంబనం బరఁగు సకలపాపక్షయ
కరంబులైన యేతన్మహావ్రతంబులకుఁ దగిన శాస్త్రంబులు మత్పరోగము
లయిన వేల్పుగములకు బావికాలంబున నుపదేశించి సకలలోకాచరణ
యోగ్యబులు చేయుమని పలికి బహువిధంబులం బ్రస్తుతించి విరించి
నిజలోకంబునకుం జనియె రుద్రుండును మహేంద్రాది బృందారకులు
జయజయాలాపకోలాహలంబులతో నుభయపార్శ్వంబుల సేవింప
గోచరంబుగాని మహిమంబునరజతాచలంబునకు విజయంచేసి చరా
చరంబులేలుచుండె మేదినీవేదరహస్యంబైన యీ రుద్ర మాహాత్మ్యంబు
చెప్పితి నింక నేమి వినవలతు వడుగులనిన. 21

మ. అవనీకామిని ఫాలభాగమున హస్తాంభోజముల్ చేర్చి ది
వ్యవరాహాధిపుఁ జూచి దేవ ! మునుదుర్వాసోముని స్వామిచే
వివిధశ్రీశ మహత్త్వముల్ విని హిమోర్వీభృద్వరాభ్యర్ణ పు
ణ్య వని న్నిల్చిన నాటి సత్యతపుఁ దేమయ్యెం గృపం జెప్పవే. 22

సీ. నావుడు నాకుహనావరాహుండు కా
శ్యపికి నిట్లనియె నా సత్యతపుఁడు
భృగువంశజుండైన పృథ్వీసురుండు యౌ
వనవేళఁ బ్రాప్తదుర్వ్యసనుఁ డగుచు
జారుఁడై నిజకులాచారం బుడిగి పాప
పరత వర్తింపుచు నరుణిమౌని
కారుణ్యసంపద గలిగిన విజ్ఞాన
మెఱిఁగి దుర్వాసోమునీంద్రు వలన

గీ. హరిచరిత్రంబువిని తుషారాద్రి యుత్త
రమునకును బోయి పుష్పభద్రాతరంగి
ణీ తటమ్మునఁ జిత్రశిలాతలమున
భద్రనామక వటపాదపంబు నీడ. 23

కం. కడు నియతిఁ దపము చేయుచు
నడవికి నొకదినమునందు నరిగి సమిత్తుల్
కొడవంటఁ గోయు నురవడిఁ
దడఁబడి తనవామహస్తతర్జని దెగినన్. 24

గీ. కైకొనక సమిధలు తొంటికరణిఁ గోయు
చుండె ఖండితతర్జనిగుండ నెత్తు
రెముక మొదలుగ లేదయ్యె నించుకైన
భూతియెవెడలె నేర తపోవిభూతి, 25

కం. నేలఁబడియున్న తునుకయు
త్రేలం దనుదానె తొంటిక్రియనంటె నతం
డాలోన హోమసమిధలు
చాలం గోసికొని పర్ణశాలకు వచ్చెన్. 26

చ. ఇరవగునట్టి భద్రవట వృక్షము కొమ్మలమీఁద నున్నకి
న్నర మిధునంబు నెమ్మనమునన్ గడువిస్మయ మందుచున్ మునీ
శ్వరుమహిమంబు గన్గొని దివంబునకేగి సమస్తదేవతా
పరివృతుఁడైన యింద్రుని సభాభవనంబున నుండ నత్తటిన్. 27

కం. బలభేది కొలువువారల
గలయం బరికించి మీరుగనిన వినిన క్రొ
త్తలు చెప్పుఁడనిన వినతాం
జలియై కిన్నరయుగంబు సవినయ ఫణితిన్. 28

గీ. సత్యతపుని వ్రేలు సమిధలతోఁగూడ
దెగిన విధము భస్మమెగయు విధము
ధరణి బడ్డ తునుక తనుఁ దానె కీల్కొన్న
విధము దెలియ విన్నవించుటయును. 29

ఉ. ఇంద్రుడు విస్మయంబున నుపేంద్రునితో నిదిచూడ నామదిన్
సాంద్రకుతూహలంబు కొనసాఁగుచు నున్నది పోయివత్తమ
న్నం త్రిజగద్విభుండును ఘనాఘనగర్జిత ఘుర్ఘురంబుతోఁ
జంద్రికళా వినిర్మల విశంకటదంష్ట్రిలతో వరాహమై. 30

సీ. తనదేహ విస్తారమున ముజ్జగమునైన
నాక్రమింపదె యీమహైకలంబు
తనలావు కలిమి గోత్రిమహీధరములైన
లీల నెత్తదె యీకరాళఘోణి

తన భయంకరమూర్తిఁ బెనురక్కసులనైన
వెఱపించు కొనదె! యీవికట దంష్ట్రి
తనపాదహతి ఫణీంద్రఫణభాగములైన
నలియఁ ద్రొక్కదె యీమదాంధ పోత్రి

గీ. యసదృశంబగు తనగతి .కొసలఁ గన్ను
గలుగునంతటి బలువేటకాని సార
మేయములకైనఁ బట్టీక మీటు మిగిలి
చనదె యీ ఘోరభూదార మనఁగ నపుడు. 31

మహాస్రగ్ధర.

తఱియున్ వేశంతముల్ ముస్తలు నమలుచుఁ బో
త్రింబునం ధాత్రిఁ గ్రొచ్చున్
మెఱుఁగారుం గోఱ జిమ్మున్ మిడుఁగఱ లెగయన్
మేదినీ భృద్రుషత్తుల్
కుఱుమట్టంబైన తోఁకన్ గొని విసరు వెసం
గూలఁగా సాలపంక్తుల్
పఱచుం దాటించు దౌడల్ పయికొను నెలయున్
బల్మఱున్ గల్లు పెట్టున్, 32

శా. ఆవేశన్ సురవల్లభుండు మృగయుండై వెంబడిన్ రోయుచున్
దావింటం దెగఁగొన్నకోల గరికర్ణవ్యస్త పింఛంబు సం
భావింపం గుఱుబోదజుంజురు చలింప న్వచ్చి తన్మోనితో
దేవా! యిచ్చటి కేటువడ్డ కిటి యేతెంచె న్నిరీక్షించితే. 33

కం. బడలితి నెంతయు నేనుం
బడుచులు నేఁడెల్ల వెళ్లఁ బడుమము దానిం
బొడగంటివేని నీకుం
గడుపుణ్యము చూపుమనిన గరుణాపరతన్. 34

గీ. పందియును వచ్చె నిచటికిఁ బ్రాణభీతిఁ
బొంది శరఘాతవేదన బొంది తూలి
యెటుకు నాఁకలి గొన్నవాఁ డేమి సేతు
ననుచు డోలాయమానుఁడై మనసులోన. 35

కం. ఒకవెరవు దోఁచుటయు లు
బ్ధక! విను కనునేత్రములకుఁ బలుకంగా నా
లుక లేదు మఱి పలుకు జి
హ్వకు జూడఁగ లేవు కన్నులన హరి శకుత్రిల్. 36

తరళ. అతని సత్యము సర్వ జీవదయాపరత్వము మెచ్చి దం
ష్ట్రితయు భీషణభిల్లభావము డించి చక్రము వజ్రమున్
బతగవాహము దంతియానము పద్మనిర్మల నేత్రముల్
శతదళేక్షణముల్ వెలుంగ నిజాల రూపులు చూపుచున్. 37

మ. మునికంఠీరవ! మెచ్చినారము వరంబుల్ వేడుమన్నం జనా
ర్దన! సంక్రందన! మీరలిద్దరును బ్రత్యక్షత్వమున్ బొందివ
చ్చినకంటె న్వరమింక నొండుగలదే! చింతింప నక్షైననే
జను లేతత్కథ సర్వకాలముల సంశ్లాఘింతు రవ్వారికిన్. 38

కం. నెలనాళ్లలోనఁ జేసిన
కలుషము దొలగంగ వరము గరుణింపుఁడు నా
కిలలో జీవన్ముక్తియుఁ
గలుగఁగ జేయుఁ డన నట్టకాకని వారున్. 40

స్రగ్ధర. అంతర్ధిం బొందిరా సత్యతపుఁ డచట బ్రహ్మత్వ సంయుక్తితో న
త్యంత శ్రీవిష్ణుభక్తిం దపము సలుపుచోఁ దద్గురుస్వామి దాసో
హంతోద్దీప్త ప్రభావుం డరుణిమునివరుం డబ్ధివేలాపరీతా
నంతం దీర్థంబు లాడ న్వలసి తిరుగును న్వచ్చి శీతాద్రి చెంతన్. 41

సీ. దీనిపండుల తేనెసోనలు గూడియో
మాధవశయ్యాబ్ధి మధుర మయ్యె
నీరంధ్ర మగు దీని నీడనె పెరిఁగియో
మలయజద్రుమవాటి పలుకఁబాఱె
దళమైన దీనియూడలు దూఱిపో నోప
కో యినుఁ డపరాద్రిఁ గ్రుంకు నెపుడు
నుఱుతలు మొగడలు గఱవంగ దీనిపా
ల్దొరిగియో తెలుపయ్యె హరునిశైల

గీ. మనఁగ నాలుగుదిక్కులుననలు గొనలుఁ
బాఱి విస్మయకరలీలఁ బ్రబలినట్టి
విపులశాఖలు గలిగిన విహరదబ్జ
భవరథ మరాళవరటము భద్రవటము. 42

వ. కదిసి వికంకట కోటర కుటీరంబుల దాఁగురుమ్రుచ్చులాడు కిన్నర కన్యకల మోహనంబులగు తమకంబులు నేర్చుకొనెడు చిలుకల యెలుంగులు ప్రతిధ్వనుల జాడమొరయ నాడకాడకు నీడలం గుంపుగూడి పాడు గంధర్వబాలికలఁ ద్రాసులం ద్రూఁచు బంగారుప్రతిమల విధంబున నూడలం బెనచిన యుయ్యాలల నొయ్యొయ్యన తూఁగు యక్షయువతుల నిజమధురాధరంబుల దత్ఫలంబులం గల్గు నారుణ్యంబుల తారతమ్యంబుల నొండొరుల నడుగు ఖచరకుమారికలంజూచి విస్మయ పడుచు శేష వాసుకి ముఖ్య మహానాగంబుల ముళ్లువేసి చుట్టినంగాని దీని మొదలి వలముకొలవెట్టరాదు త్రివిక్రమదేవుండు చక్క నిక్కి చూచినం గాని దీనికొనగొమ్మలు గానరావు మహాతాండవంబు సలుపు కుండలికుండలుండు సాఁచిన సముద్దండ బాహామండలంబుగాని తక్కినవి దీని విస్తృతశాఖా నికాయంబులకు సరిగావు. దీని ప్రతిబింబంబుచూచి సుమీ ! లోకులు చందురునందు మఱ్ఱి గల దందురు. దీని విశాలపలాశంబులు చూచె నే నాదినారాయణుండు నిరంతరంబు బాలకత్వంబు వహించి పవ్వళింప వేడుకపడు; దీనిదండ నధివసియించి శిష్యులకు నుపనిషద్రహస్యంబులు

వక్కాణించుచు సంయములు దక్షిణామూర్తి ననుకరించుచున్నవారు; పాతాళంబునకు దిగిన దీని మూలంబులు దిగ్గజాలానలీల వహించుచున్నవి; హిమవన్నగంబు దీనిక్రింద నెండకన్ను నీడకన్ను నెఱుంగక నెమ్మది నున్న ముక్తికన్యక విహరించు చంద్రకాంతపుటరుంగు తెఱంగున నున్నదిగదా! యని బహుభంగుల బ్రశంసించుచు నెదుటఁ జిత్రశిలా తలంబున బ్రహ్మవర్చసం బొలుకులువాఱ నతినియతిం దపంబు సలుపు చున్న సత్యతపునిఁ గని తాను మున్ను దేవికాతటంబున "మాశకటం భక్షయ"యను మంత్రం బుపదేశించిన శబరుండు తపోమహత్త్వంబునఁ గల్మషంబులఁ దొఱంగి జీవన్ముక్తుం డగుట యెఱింగి సంతసించుచు నతని చేత నభ్యుత్థాన ప్రణామార్ఘ్య పాద్యగోదానాది పూజలు వడసి కుశాసనా సీనుండై. 43

సీ. తన శిష్యవదనంబు తప్పక వీక్షించి
మామీఁది భక్తి సంపత్తి యెపుడు
వదలక "నాస్తి తత్త్వం గురోః పర"మను
తెలిసి నీవు దపంబు సలుప "యాదృ
శీ భావనా యత్ర సిద్ధి ర్భవతి తాదృ
శీ" యను వాక్యంబు సిద్ధమయ్యె
నిట్టి నీదృఢభక్తి యెఱుఁగక నాటికి
నేటిదో యొకపాటిమాట చెప్పి

గీ. నార మిఁకియ కుండమంటప విధాన
సాంగపద్ధతి దీక్ష చేయంగ లేదు
తత్ప్రకారంబు విను సావధానబుద్ధి
నెవ్వరికినైన నుపదేశ మియ్యరాదు. 44

కం. ఒకయేఁడు జాతి శౌచా
దికములు శోధించి భక్తి దృఢమౌట యెఱిం
గి కరుణ భూసురన్నప వై
శ్యకులుల కుపదేశ మిచ్చు టర్హం బగుటన్. 45

సీ. శిష్యుండు వత్సరసేవచే సంతుష్టుఁ
డైన దేశికుని పాదాబ్జములకు
మ్రొక్కి నాకైహికాముష్మిక సౌఖ్య ప్ర
దాయి మంత్రముఁ గృప చేయవలయు
నని పల్క దేశికుండును నర్హుడము చూచి
కార్తిక శుక్ల పక్షమున ద్వాద
శీ దినంబుననుఁ బ్రసిద్ధ లగ్నంబున
హరిమందిరంబులో నలికి ముగ్గ్రు

గీ. మొదలుగాఁగల శృంగారములు రచించి
యష్టదళమైన నవనాభమైన షోడ
శారమైన లిఖించి తదంతరమున
విష్ణుదేవుని శాస్త్రోక్త విధి యజించి. 46

చ. కనుఁగవ ధౌతవస్త్రములఁ గట్టిన శిష్యులఁ బుష్పహస్తులం
దన నికటంబునన్ నిలిపి ద్రవ్యము లంటిన కీడు మేలునున్
గని మఱి మంత్రి మీవలయుఁ గావున నీవును నట్ల చేయు మం
చు నరుణిమౌని సూనృతవచోనిధి సత్యతపోమునీశ్వరున్. 47

కం. పలికిన నాతఁడు విహితాం
జలియై గురునాథ యిమ్ము శాస్త్రోక్త విధం
బుల నుపదేశము నాకన
ఫలకుసుమ సమేతమంటపమున నరుణియున్. 48

వ. సత్యతపోమునికి శాస్త్రోక్తప్రకారంబున శ్రీమదష్టాక్షరీమంత్రం బుప
దేశించి మహానుభావా ! తొల్లియు నీవు కృతార్థుండవు విశేషించియు
నిప్పుడు దీక్షామంటపమధ్యంబున ధౌతవస్త్రపరిచ్ఛన్న లోచనుండవై
శుభద్రవ్య సంస్పర్శనంబు గావించితివి గావునఁ దపస్సిద్ధుండవై
బ్రహ్మభూయంబు నిదె పొందెదవు మనకిద్దఱకు విష్ణుసాయుజ్యంబుఁ

బొంద నిదియ మంచిసమయం బని తాను నతండును నిశ్చలధ్యాన నిమీలితాక్షులై సాక్షాత్కరించిన నారాయణుం గలసిరి. యేతదుపాఖ్యానంబు వినిన వినిపించిన శుద్ధాత్ములకు గయాశ్రాద్ధఫలంబు సిద్ధించు వసుంధరా! యింక మానవులకు నిహలోకంబున రోగదారిద్ర్యాది దోషంబులు దొలఁగి సంతతారోగ్య సంపత్తి పుత్రపౌత్రాభివృద్ధి దొరకువిధంబు చెప్పెద వినుము - కార్తిక శుక్లపక్షద్వాదశింగాని సంక్రమణ సోమసూర్య గ్రహణాదిపుణ్యకాలంబులంగాని శృంగారిత మంటపాఖ్యాంతరంబున నెనిమిది తేకుల పద్మంబువ్రాసి యెనిమిదివిదళంబుల నెనిమిది కలశంబుల నడుమ నొక్క కలశంబును యథావిధానంబున నిలిపి నడిమి కలశంబుమీఁద లక్ష్మీసమేత వామభాగు నారాయణుని నిలిపి షోడశోపచారంబులు సలిపి యింద్ర యమ వరుణ కుబేర దిగ్దళంబుల భద్ర పద్యుమ్నానిరుద్ధ వాసుదేవుల నర్చించి యీశా నాగ్ని నిఋతి వాయు దిగ్దళంబుల శంఖ చక్ర గదా పద్మంబుల యథాక్రమంబున నర్చించి మఱియు నీశాన భాగంబునముసలంబును దక్షిణభాగంబున గరుడునిం బూజించి శరశరాసన కృపాణ శ్రీవత్స కౌస్తుభంబులు దేవుని పురోభాగంబునం బూజించి వైష్ణవకలశంబున ముక్తికాముని నైంద్ర కలశంబున సంతత శ్రీకాముని నాగ్నేయకలశంబునఁ బ్రతాపకాముని యామ్యకలశంబున మృత్యుంజయ కాముని నైరృతి కలశంబున దుష్ట ప్రధ్వంసకాముని వారుణ కలశంబున శాంతికాముని వాయుకలశంబునఁ గల్మషనాశకాముని గౌబేరకలశంబున సంపత్తికాముని నైశానకలశంబున సుజ్ఞానకాముని దత్తన్మంత్రంబులతో నభిషేకంబు సలిపిన వారివారి కోరికలు సిద్ధించు నింక నవకలశంబుల నభిషిక్తుండైనదన్యుం డిహలోకంబున విష్ణుసత్రుశుండై సకలసామ్రాజ్యసౌఖ్యంబు లనుభవించి నివ్విధంబున మదుక్తప్రకారంబున శోషణ దాహన ప్లావనంబులఁ దత్త్వశోధనంబున "నోన్నమో భగవతే విష్ణవే" స్వాహా యనుమంత్రంబునఁ జేసిన హోమంబునవిష్ణుసూక్తంబు చెప్పుచు శంఖోదకంబునం జేయునభిషేకంబునగురుని చేత దీక్షితుండైన సమయం బెఱిఁగి గురువుల హస్త్యశ్వ రథగ్రామ భూషణాదికంబుల యథాశక్తి సంభావించి దక్షిణాయుక్తంబుగా బ్రాహ్మణులకు భోజనంబువెట్టి సాత్వికుండై సకల దేవబ్రాహ్మణ వేదనిందలం

దొలంగి వర్తించు పుణ్యుల మాహాత్మ్యంబు చెప్ప నశక్యంబు వైష్ణవ దీక్ష గైకొని యెవ్వరేని యేతద్వ్రతాచరణప్రకారంబు విందురు వారికి సంక్రమణ గ్రహణ విష్ణు వాసరాది పుణ్యకాలంబుల దేవహ్రద కురుక్షేత్ర పుష్కర వారాణస్యాది పుణ్యతీర్థంబుల వేదపారాయణంబు చేసిన ఫలంబు దేవతలును భారతవర్షంబున జన్మించి వైష్ణవదీక్ష వడసి వారాహంబు విని కార్తికమాసంబునఁ జేయు వారాహయాగంబుసూడ నెన్నఁడు గలుగునో యని కోరుచుందురు విశ్వంభరా ! యేతత్ప్రకారం బెఱింగి మదుక్త సర్వాభీష్టప్రద లక్ష్మీనారాయణమండలంబు చూచిన మానవుండు రెండవవిష్ణుండగు నింకనేమి వినవలతు వడుగు మనిన. 49

శా. స్వామీ ! మున్ను సరోరుహాసన తనూసంభూత గాయత్రి వే
త్రా మర్త్యారి వధించి నంద యను నాఖ్యం జెంది తద్రబహ్మచే
భీమాజిస్థలి భావివేళ మహిషు న్వేధించి సర్వామర
స్తోమత్రాసము మాన్పఁ బంపువడి మంచుంగొండపై నున్నతిన్. 50

కం. నిలిచె నటంటివి యిప్పుడు
జలజాక్షుని శక్తి మహిషుఁ జంపెను సమర
స్థలి నంటివి యీ మర్మము
తెలుపుము నాకన వరాహదేవుఁడు ధరతోన్. 51

కం. తన్వీ ! విను సింధు ద్వీ
పాన్వయజుఁడు మహిషదానవాగ్రణి దోర్ద
ర్పాన్వితుఁడు స్వాయంభువ
మన్వంతరవేళ విష్ణుమాయాహతుఁడై. 52

కం. ధర వైవస్వతమన్వం
తరమున వెండియును బుట్టి నందాశక్తిన్
దురమున వింధ్యక్షోణీ
ధరసీమ నెడిర్చి చచ్చెఁ దచ్ఛూలమునన్. 53

ఆ. జ్ఞానశక్తి యనఁగ సావిత్రి యనఁగ వై
ష్ణవి యనంగ వివిధ నామకముల
నున్న మాయలీల లెన్నంగ రా దర్ణ
వములయిసుక యెన్నవచ్చుఁ గాని. 54

సీ. వసుధా! నవగ్రహవ్రతములు వినుమింక
సంయుక్త హస్త నక్షత్రమైన
భానువారంబునఁ బ్రారంభ మొనరించి
క్రమమున భానువారంబు లేడు
నక్తంబు నియతితో నడపి యేడవ వార
మున యథాశక్తి జాంబూనదమున
రవిఁ జేసి రక్తవస్త్రద్వయంబును జుట్టి
నేత మజ్జనమార్చి నిష్ఠఁ బూజ

గీ. చేసి గొడుగును బావాలుఁ జేలమును వి
భూషణంబులు మొదలుగా భూసురునకు
నిచ్చి బ్రాహ్మణ భోజనం బిడిన సువ్ర
తునకు నారోగ్యసంపదల్ దొరకు నెపుడు. 55

వ. చిత్తానక్షత్ర సహితంబైన సోమవారంబు మొదలుకొని యెనిమిది సోమవారంబులు పాయసంబున నక్తంబు సలిపి యెనిమిదవ సోమవారంబున నోపినపాటి వెండి నిందుమండలంబు చేసి ధవళవస్త్రయుగంబునం బొదిగి కాంస్య భాజనంబున నిలిపి పాదు కాతపత్ర దక్షిణాసహితంబుగా విప్రపుంగవునకు నొసంగి బ్రాహ్మణభోజనంబు వెట్టిన సువ్రతులు కాంతిమంతు లగుదురు. స్వాతినక్షత్రసహితంబైన భౌమవారంబు మొదలుకొని తొమ్మిదిభౌమవారంబులు నక్తంబు సలిపి కడపటి వారంబున యథాశక్తి సువర్ణంబున నంగారకప్రతిమం జేసి రక్తవస్త్రద్వయంబున బొదిగి తామ్రభాజనంబున నిలిపి దక్షిణాలంకార పాదుకాఛత్ర సహితంబుగా భూసురున కిచ్చి బ్రాహ్మణభోజనంబు వెట్టిన ధన్యులకు

సకల శుభంబులుగలుగు నిట్లి నక్షత్రానుక్రమంబునం దక్కిన గ్రహంబుల వారంబు లేకోత్తరవృద్ధిగా నక్తంబు సలిపి తత్తద్గ్రహోచిత వర్ణలోహ వస్త్రాదికంబుల నుద్యాపనంబు చేయు ననవద్యులకు నవగ్రహానుకూల్యంబు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులుం గలుగు నీ నవగ్రహకల్పంబు వినిన వారికి నిష్టఫలంబులు గలుగునని చెప్పిన విని ధరిత్రి కపటపోత్రి నాలోకించి. 56

ఆ. దేవ ! మున్ను నీవు దెలిపిన ద్వాదశీ
వ్రతము పూని చేయ వర్ష సాధ్య
మది నిరంతరాయమై సాఁగు టరిది త
త్ఫలము సులభవృత్తి గలుగు వ్రతము. 57

ఉ. ఆనతి యిమ్మటన్న వసుధా ! వినిపించెద నీకు నే నుపా
ఖ్యానము ము న్నిలావృత సమాహ్వయవర్షవిభుండు శ్వేతుఁ డం
భోనిధిమేఖలావలయముద్రిత సర్వవసుంధరా నృపా
స్థాన నమస్కృత స్వభుజశాసనుఁడై జగమెల్ల నేలుచున్. 58

సీ. తన పురోహితు వశిష్ఠునిఁ జూచి మునికులో
త్తమ ! సహస్రాశ్వమేధములు చేయ
వలె విప్రులకు నన్నజలదాన మొసఁగుట
యెందులో నిది యింక హేమకాంస్య
రత్న భూషాంబర గ్రామ గజాశ్వాదు
లొసఁగుదు విరహితానోన్నదకముగ
నని లిఖితాత్మశాసన హేమపట్టికా
సహితఫాలములైన జవనహరుల

గీ. వరుస విడిపించె నవియు దుర్వారలీల
వారణ తురంగ రథభట వాహినీ ప
రంపరలు వెంటరాఁ జొరరాని చోటు
లెల్లఁ జొచ్చి జయించె మహీస్థలమున. 59

చ. హరిదవధిక్షమారమణు లాతురగాళి నుదుళ్ల పట్టముల్
తరువుల రాయసంబుల విధంబునఁ గన్గొని శ్వేతమానవే
శ్వరునకుఁ దెచ్చి యిచ్చిన సువస్తుపరంపర లెక్కఁ గూడు పె
న్వైరసుల రీతిఁ దత్పవనవీతిఖురాంకము లుండు నుర్వరన్ 60

సీ. ఆజ్యవేదన లోర్వ కనలుండు జలధిలోన
బాడబాకృతిఁ దాల్చి నేఁడు నుండు
మందాగ్నిదోషంబు మానుటకై సదా
వ్యాయామ మొనరింతు రర్కవిధులు
కరిముఖుం డెప్పుడు కడుపుబ్బ డిగ్గని
కతన లంబోదరాఖ్యకుఁ డయ్యె
నటుగమి వుట్టి యింద్రాదిదేవతలకు
నెన్నఁడు వంటకం బింపుగాదు

గీ. శ్వేత భూతలభర్త వశిష్ఠమునిపు
రోధగాఁ జేసిన తురంగమేధమఖ స
హస్రములఁ గల్గు కమ్మని హవ్య తతులు
మీటు మిగులంగ మెసఁగిన నాఁటనుండి. 61

ఉ. శ్వేతుఁడు నశ్వమేధములు వే యొనరించి సమస్తభూత ధా
త్రీతలమెల్ల నేలి తనతేజము గీర్తియు నుష్ణభాను జై
వాతృకు లట్టు సంతతము వర్తిలఁ జేసిన పిమ్మటన్ బలా
రాతియుఁ బోలె నాకనగర స్థితి గైకొని పుణ్యసంపదన్. 62

కం. తుంబురు నారదముని గీ
తంబులు రంభోర్వశీమృతాచీకృత నా
ట్యంబులు సిద్ధతపస్వికృ
దంబస్తోత్రములు సమ్మదం బొనరింపన్. 63

గీ. వివిధ మహిమ లనుభవించుచు నుండియు
మందు జఠరవహ్ని మాన్పరాని
దప్పి తోడఁగూడి నొప్పింపఁ గన్నులు
మేను దిమ్మ దిరిగి మిడికి పడుచు. 64

ఉ. ఆలలనావతంసముల నమ్మునులం గని జాఠరానల
జ్వాళభరంబు నేత్రములఁ జీకటిఁ గొల్పఁగ నాటలేల యీ
యాలతు లేటికిం జెవుల నంతకు పల్కులుపోవ నిన్నియుం
జాలును "దుఃఖితే మనసి సర్వ మసహ్య" మటం చెఱుంగరే ! 65

సీ. అని పల్కి శ్వేత భూపాగ్రగణ్యుఁడు శ్వేత
ధరణీధరంబున కరిగి తనదు
బొంది మున్నాకొండ పొంత ఖండించిన
చోటి శల్యము లతిక్షుద్భరమున
నమలె "క్షుధాతురాణాం నరుచి ర్నయో
గ్య" మటన్న పల్కు తథ్యంబు గాఁగ
నపుడు వసిష్ఠసంయమి వచ్చి ధర్మాత్మ
కటకటా స్వాస్థి భక్షణము నీకు

గీ. నుచితమే ? యన్న; నేమి చేయుదు మునీంద్ర !
యిన్ని నీకైన వంటకం బించుకైనఁ
దొల్లి దానంబు చేయని దుష్కృతమున
నిర్భరక్షుత్పిపాసలు నిలువ వనిన. 66

కం. ఇత్తటి నేమనఁ గలదు నృ
పోత్తమ ! మున్నన్నదాన మొనరింపవు "నా
దత్త ముపతిష్ఠ"తని వి
ద్వత్తిలకము లాడుకొనెడు వాక్యము వినవే ! 67

వ. రత్నహేమాదిదానంబు చేసిన వారలవియ కలవారగుదురు. సకల ప్రాణ సంతర్పణంబగు నన్నదానంబు చేసిన వారలకు నన్నిదానంబులుం జేసిన ఫలంబులు గలవు. తాదృశప్రభాసంపన్నంబగు నన్నదానంబు నీవు చేయ నెఱుంగ వైతివనిన భట్టారకా ! నాకు నాఁడు పట్టిన ధనగర్వం బట్టిది; యిట్టి దురవస్థ యెట్టు దొలంగు. మున్ను పెట్టని జలాన్నంబుల ఫలంబు లిప్పుడు నాకుం గలుగు నుపాయంబుచేయ నవధరింపు మనిన భూవరా ! నీవలెనే తొల్లి సునీతుండను మహారాజు నర్వమేధాధ్వరంబులు సల్పుచు నన్నదాన విరహితంబుగా విప్రులకు సకలదానంబు లొసంగి శరీరావ సానంబున నాకలోకభోగంబు లనుభవింపుచుండియు నాకట నన్నంబున కేఁకటపడి సకలలోకంబులం బరిభ్రమింపుచు నిజకళేబరంబు దహించిన మాయాపురి పరిసరంబున భృగుమహామునింగని వినయంబున దనవృత్తాం తంబు విన్నవించిన నమ్మహానుభావుండు సునీతు నవలోకించి నీకు నేత ద్దౌస్థిత్య నివారణ కారణంబగు నొక్క మహావ్రతంబు చెప్పెద వినుము. కార్తికమాసంబునంగాని మార్గశిరమాసంబునంగాని శుక్లపక్షదశమి నేక భుక్తి సంకల్పంబు లొనరించి యేకాదశినాఁ డుపవసించి నాటి రాత్రి శృంగారిత మంటపాంతరంబున ధరణీవ్రతంబు చందంబున నాలుగు కలశంబులు నిలిపి తన్మధ్యంబున బ్రహ్మ విష్ణు మహేశ లోక పాలాది దేవతలను సర్వౌషధీరసాన్విత భూచక్రంబును వహించిన కాంచన విరచిత బ్రహ్మాండ భాండంబును నిలిపి తదుపరి స్థలంబున నారాయణు భావించి కార్తికోక్త మంత్రంబులంగాని మార్గశీర్షోక్తమంత్రంబులంగాని పాదాది కేశాంతంబును గేశాది పాదాంతంబుగాఁ బూజించి జాగరణంబు ద్వాదశి నాఁడు సూర్యోదయావసరంబున వేదవేదాంగ పారంగతులైన విప్రపుంగ వులు నలువురకు నాల్గు కలశంబులు దానంబు చేసి నడిమి బ్రహ్మాండ కలశంబు కుటుంబియు శాంతుండును నేతత్కథావిధిజ్ఞుఁడునుం నగు నాచార్యునకు సాంగంబుగా సమర్పించిన ధన్యు లనేక యుగంబులు విష్ణు లోకంబున సుఖంబుండి ముక్తికాములు ముక్తులగుదురు. భుక్తికాములు భూమిం జనియించి సకల సామ్రాజ్య సుఖంబు లనుభవించి పిదప ముక్తులగుదురు. 68

కం. కావున నేతద్దానము
నీవును గావింపు మనసు నిగుడుదువన భూ
షావితతులు గరఁగించిన
సౌవర్ణముచేత నంబుజభవాండంబున్. 69

కం. చేయించి భృగున కిచ్చెను
మాయాపురిలోన శ్వేత మహివర ! నీవుం
జేయుమన జేసి తా ని
శ్రేయస సౌఖ్యములు గనియె శ్రీహరి కరుణన్. 70

కం. ధరణీ హరిణీ నేత్రా !
ధరణీ వ్రత సదృశమైన దానం బిది శ్రీ
హరిభక్తులకుం గాని యి
తరులకు సిద్ధింప దెవ్విధంబున నైనన్. 71

సీ. ధుత సర్వపాపసందోహమీ వారాహ
మాదినారాయణుం డాన తిచ్చె
గమలసంభవున కా కమలసంభవుఁడును
దనపుత్రునకుఁ బులస్త్యునకుఁ జెప్పె
నాపులస్త్యమునీశ్వరాగ్రణి వలన భా
ర్గవరాముఁ డెఱిఁగె నారాముఁ డాత్మ
శిష్యుఁ డుగ్రునకు వచించె నయ్యుగ్రుండు
మనువున కిచ్చె గ్రమమునఁ బూర్వ

గీ. కల్పకథ యిది యిప్పటి కల్పవేళ
వింటి సర్వజ్ఞుచే నేను విశదముగ మ
హీసతీ ! నీకుఁ దెల్పితి నింక మీఁదఁ
గపిలముఖ్యమునీంద్రులు దపము చేసి. 72

కం. నీచేఁ దారాద్యంతము
నేచుకొనం గలరు వరుస నిఖిల పురాణ
ప్రాచుర్య కరణ లీలా
వాచాలుఁడు వ్యాసుఁ డెఱుఁగు వారల వలనన్. 73

గీ. అతని ప్రియశిష్యుఁడగు రోమహర్షణుండు
సత్ర యాగాంతరంబున శౌనకాదు
లకు సమస్తంబుఁ జెప్పఁ గలఁడు పరాశ
రసుతుఁ డష్టాదశపురాణ రచనకర్త. 74

వ. దురితశర నివారణ వజ్ర తనుత్రాణంబును రసవదద్భుత వివిధ కథా సుధాధురీణంబును నారాయణభక్తి శరీరప్రాణంబును బోధరతోన్నత్తే జనంబును జనిత సకలకల్యాణంబును నైనయీ వారాహపురాణంబు కార్తికమాసాది పుణ్యకాలంబులందు నియమంబుతోడ భక్తియుక్తంబుగా వినినవారికి వాజపేయాశ్వమేధాది యాగంబులును గంగాదిక పుణ్యతీర్థ స్నానంబును హిరణ్యగర్భ తులాపురుషాది మహాదానంబులును జేసిన ఫలంబును నాయురారోగ్యైశ్వర్యంబులును విష్ణు సాయుజ్యంబును గలుగు నీ పురాణంబు శబ్దార్థరస భావబంధురంబుగా వినిపించువక్త మాతృపితృ వంశ్యుల నిఱువదియొక్కతల ంబువారి నుద్ధరించి పరాశరాత్మజుని చందంబున సకలలోకమాన్యత వహించి యిహంబున దైన్యవిరహిత జీవనుండై సకలవిద్యాసంపత్తి నెదురులేక మెలంగి పునరావృత్తిరహిత శాశ్వత బ్రహ్మలోకసౌఖ్యంబు లనుభవించునట్టి వాచకులవలన విినినట్టి వారలు వాచకునకు గజతురగ గ్రామచిత్రాంబర ఛత్రచామరాందోళికాదు లొసంగవలయు నశక్తులు విత్తశాఠ్యంబుచేయక పూజింపవలయు నిట్లు చేయక లోభంబునంగాని గర్వంబునంగాని వాచకు ననాదరణంబు చేసిన దురాత్మకు లేడుజన్మంబులదాఁక మూఁగలు వెఱులునై పుట్టుదురు. వాచకునిఁ బూజించు ధన్యులగృహంబునందు లక్ష్మీనారాయణుండు సుప్రతిష్ఠుండై యుండునని వరాహదేవుండు ధరావరారోహ కానతిచ్చె. 75

మ. నరకంఠీరవ ! చండబాహుబల శుండా నాశికాశీకర
స్ఫురణాష్ట ద్విపసార్వభౌమ తుహినాంభోజన్త్రికాధారవ
ద్ధరదీశాన సదానుభూత భువన ద్వ్యాప్తా ! ప్రతాపోష్మ సం
భర ! ధాత్రీ సురకారితా ధ్వరహవిర్మాద్యద్దివౌక స్తుతా ! 76

కం. రామానుతతనుమారా !
తామరసాతతకరాకతతసారమతా
శ్రీ మహిమహమహిమ శ్రీ
రామ సమ సరాగసాగరాసమ సమరా ! 77

జాతివృత్త హరిణి. తరుణ హరిణీ నేత్రాచేతోజ దాన ధురంధరా !
నిరుపమ కళావైయాత్యాస్థాన నీతియుగంధరా !
నిరతవిసరద్దాన స్రోతస్వినీ తనుజార్పణా !
దరణ చతురంతోదన్వత్కూకుదోద్బల సింధురా ! 78

గద్యము. ఇది శ్రీ మదూమామహేశ్వర ప్రసాదలబ్ధ సారసారస్వతాభినంది
నంది సింగయామాత్యపుత్ర మల్లమనీషిమల్ల మలయమారుతాభి
ధాన ఘంటనాగయప్రధానతనయ సింగయకవిపుంగవ
ప్రణీతంబైన శ్రీవరాహపురాణం బను మహా
ప్రబంధంబున సర్వంబును
ద్వాదశాశ్వాసము